# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

## పదుమూడవ సంపుటము

## ధర్మోపన్యాసములు - ద్వితీయభాగము

ప్రకాశకులు

**శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము**

**శ్రీవ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు పాఠకలోకానికి సుపరిచితాలే ఈ గ్రంధాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంధాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంధాలుగా ముద్రింపబడివున్నాయి వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంధ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంధావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది ఇంచుమించు ఆగ్రంధాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంధ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు






శ్రీ మలయాళ సద్గురు గ్రంధావళిలో ఇది పదుమూడవ సంపుటము శ్రీవారి రచనలలో ధర్మోపన్యాసములు ఇంతకు ముందు ఐదు సంపుటాలుగా ముద్రింపబడ్డాయి అందులో నాలుగు సంపుటాలు మొదటి సారిగా 1949,1953, 1960,1961 సంవత్సరాలలో శ్రీవారి కాలములోనే క్రమంగా వెలువడ్డాయి మాతృశ్రీ చోడే వెంకటరమణమ్మగారి కృషి ఫలితంగా ఐదవ సంపుటం 1990 లో వెలువడింది మొదటి నాలుగు సంపుటాలు పలుసార్లు పునర్ముద్రణ పొందాయి

ఈ సంపుటాలలో శ్రీసద్గురుదేవులు సనాతన వేదాంత జ్ఞానసభ, సాధుమండలి, ఓంకారసప్తాహము, ముక్తిసోపానయజ్ఞము మొదలైన కార్యక్రమాలలోనూ, పర్యటన కాలములో వివిధ ప్రదేశాలలోనూ చేసిన ఉపన్యాసాలు, ఉపదేశాలు మరియు కొన్ని ధార్మిక సంస్థలకు పంపిన సందేశాలు, స్వయంగా వ్రాసిన వ్యాసాలు చోటు చేసుకొన్నాయి

పలు సందర్భాలలో శ్రీవారు కావించిన ప్రసంగాలకు గ్రంధరూపం కల్పించిన రచయితల వివరాలు ఈ గ్రంధావళి పండ్రెండవ సంపుటము తొలిపలుకులో పేర్కొనడం జరిగింది

ఈ గ్రంధావళి ప్రచురణ ప్రణాళికలో ధర్మోపన్యాసాలు ఐదు సంపుటాలలోని రచనలతో పాటు 1950 లో వెలువడిన రజతోత్సవ సంచికలోని శ్రీవారి వ్యాసాలను కూడా చేర్చడమైనది ఈ ముద్రణ క్రమములో మొత్తం ధర్మోపన్యాసాలను నాలుగు సంపుటాలుగానే ప్రచురించడం సముచితమని భావించి అలా చేయడం వల్ల ఈ సంపుటాలు ఒక్కొక్కటి ఇంచుమించు 500 పుటలకు విస్తరించాయి

ఇపుడు ఈ క్రింది విధంగా పూర్వముద్రిత సంపుటాలు క్రోడీకరింపబడ్డాయి

| పూర్వ సంపుటాలు | క్రొత్త సంపుటాలు<br>శ్రీమలయాళ సద్గురు గ్రంధావళిలో |
|---|---|
| అ) ధర్మోపన్యాసాలు మొదటి సంపుటము మరియు రెండవ సంపుటములోని తొలి 138పుటలు | 12సంపుటము ప్రధమభాగము |
| ఆ) రెండవ సంపుటములోని తక్కిన భాగము మరియు మూడవ సంపుటములోని తొలి 244 పుటలు | 13వ సంపుటము ద్వితీయ భాగము |
| ఇ) మూడవ సంపుటములోని తక్కిన భాగము మరియు నాల్గవ సంపుటము పూర్తి | 14వ సంపుటము తృతీయ భాగము |
| ఈ) ఐదవ సంపుటము మరియు రజతోత్సవ సంచికలోని శ్రీవారి వ్యాసావళి | 15వ సంపుటము చతుర్ధ భాగము |

ఈ పదుమూడవ సంపుటములో చిత్తూరుజిల్లా శివగిరి ఆశ్రమములో జరిగిన సాధుమండలిలోనూ, పశ్చిమ గోదావరిజిల్లా నాయుడుగూడెములో జరిగిన ముక్తిసోపానయజ్ఞములోనూ శ్రీ సద్గురుస్వాములవారు కావించిన ప్రబోధాల తోపాటు శ్రీవారు స్వయంగా రచించిన వ్యాసాలు కూడా కలవు

భక్తియోగము అనుశీర్షిక క్రింద రెండు చోట్ల ఈ సంపుటములో ప్రచురింపబడిన అంశములు విభిన్న విషయములతో కూడియున్నవని పాఠకులు గమనించగలరు

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ శుభసందర్భంలో శ్రీవారి రచనలను ఇలా సంపుటాలుగా ప్రచురించే సదవకాశం కలగడం శుభావహం ఆత్మోన్నతిని ప్రసాదించే ఈ గ్రంధావళిని భక్తులు ఆదరంతో పఠించి కృతకృత్యులై శ్రీ గురుదేవుని అనుగ్రహానికి పాత్రులగుదురుగాక!

శ్రీవ్యాసాశ్రమము　　　　　　　　　　సముద్రాల లక్ష్మణయ్య
16-7-2000

# విషయ సూచిక



# ధర్మోపన్యాసములు

## ద్వితీయభాగము

### మహావాక్య రత్నములు

(చిత్తూరుజిల్లా శివగిరి ఆశ్రమమునందు 21-3-1943 వ తేదీనుండి జరిగిన సాధుమండలి సమావేశములో శ్రీసద్గురు మలయాళస్వాములవారు లోకమునకు ప్రసాదించిన మహావాక్యరత్నములు )

1 (అంతఃకరణ దోషములగు) (1) మల, (2) విక్షేప, (3) ఆవరణములలో (1) మలదోషము, పుణ్యకర్మలు వగైరా చేయుట చేతను (2) విక్షేపదోషము భగవదుపాసనవల్లను, (3) ఆవరణదోషము గురువు సద్బోధమువల్లను పూర్తిగా తొలగవలసియున్నది

2 శ్రీ భగవద్గీతయందు నిష్కామకర్మమునకు 3 వ అధ్యాయమున్నూ, ధ్యానయోగమునకు 6 వ అధ్యాయమున్నూ, భక్తియోగమునకు 12 వ అధ్యాయమున్నూ, జ్ఞానయోగమునకు 14 వ అధ్యాయమున్నూ ప్రధానములై యున్నవి

3 రామకృష్ణ పరమహంసలవారిని ఒక్క రీలాగున అడిగిరి "భగవంతుడు అందరిలోను సమానముగా ఉంటుండగ, భేదమునకు కారణమేమి? " "అందరున్ను భగవంతునియందు సమానముగానుండుట లేదు అదే కారణ"మని వారు వచించిరి

4 మహాత్ములవలె గొప్పవారును, కీర్తిగలవారును, పూజనీయుల్లును కావలయునని చాలా మంది కోరికలు కలిగియుందురు కాని అట్టివారు కాకపోవుటకు

కారణము అట్టివారు ఆచరించులాగున ఆచరించకపోవుటయే

5 శ్రీ రామకృష్ణ భగవానులవారి మహావాక్యము - “ఒకడు తన మెడను మాత్రము తెగకోసుకొనగోరిన ఒక చిన్నకత్తి చాలును కాని యుద్ధములోనికి వెళ్ళి అనేక మందిని జయించవలెనన్న పెద్దకత్తులు మొదలగు ఆయుధములు కావలయును ” అట్లనే తన అజ్ఞానమును మాత్రము పోగొట్టుకొన తలచిన వానికి గురువాక్య మొక్కటి చాలును కాని యితరుల అజ్ఞానమును పోగొట్టకోరిక గలవానికి శాస్త్రసాధనకూడా కావలయును అందుకు ప్రధానముగా, గీతలలో శ్రీ భగవద్గీతయున్నూ, యోగశాస్త్రములలో శ్రీ పాతంజలి యోగశాస్త్రమున్నూ, ఉపనిషత్తులలో శ్రీ కఠోపనిషత్తున్నూ అర్థము, ఆచరణతో సహా కంఠస్థము చేయవలయును

6 బుద్ధివికాసమునకుగాను ఇతరులను ప్రశ్నించుటకు ముందు అట్టి ప్రశ్నలకు సమాధానము నిమిత్తము స్వంతముగా ఆలోచించుట మంచిది

7 పుస్తకమును చదువుటకు ముందు మస్తకమును చదువుట శ్రేయోదాయకము

8 ఆలోచనకు ప్రాణాయామము అత్యధిక సహాయము చేయును

9 ఆకలి తీరు వరకు మాత్రమే భుజించుట అన్నింటికి మంచిది ఆలోచన చేయువారికి, ప్రాణాయామము చేయువారికి ఇది విధి

10 నేలమీద మాత్రమే (చాప ఉండవచ్చును) పరుండుట పై విధులను పాటించుటకు చాలా సహాయకారి

11 ఈ నియమములను శీలించుటకు శరీరశక్తి చాలనిచో క్రమేణ అభ్యాసము చేయవలయును

12 సర్వలోకమునకు గురుడై సమస్త వేదాది శాస్త్రములు బోధించిన బ్రహ్మము బుద్ధిసాక్షియై ప్రతివారియందును ఉన్నది అట్టి బ్రహ్మము నడిగినచో అన్ని ప్రశ్నలకు సమాధానము రాగలదు అట్టి మహాశాస్త్రములను బోధించిన బ్రహ్మము మీ ప్రశ్నలకు జవాబు చెప్పక పోదు

13 ముముక్షువులు వారివారి సంస్కార బలము ననుసరించి అవసరమయినంత కాలము గురుకులవాసము విధిగా చేయవలసి యుండును

14. అన్నింట శ్రద్ధ అవసరము, సోమరితనము పనికిరాదు

15 పరిశ్రమలేనిదే పవిత్రుడు కాజాలడు

16 సాధన లేనిదే సాధువు కాజాలడు

17 పుణ్యస్థలములలో, పుణ్యకాలములలో అన్నప్రదానము చేయునపుడు పాపాత్ములకు పెట్టినను, పుణ్యాత్ములకు పెట్టినను ఫలితము వచ్చును ఆ సమయములో వారిమనసు పవిత్రముగా నుండుటయే అందులకు కారణము

18 ఇతరులకు బోధించునప్పుడు ఎంత శాంతము కరుణ కలిగి ఉండునో వారియందు అంత ఫలితము కలుగును

19 ప్రతివారు చేయు తప్పుపనిని, వారికి తెలియక చేయుచున్నారు అని తెలియునప్పుడే మీరు బోధనాపరులగుదురు

20 అట్టి బోధనాపరులు శక్తి గలిగి ఎక్కడనున్నను బెల్లమువద్దకు చీమలు చేరునట్లు శిష్యులు వగైరాలు అక్కడికే వచ్చి చేరుదురు

21 పుస్తకము చదువుటకు ముందు మస్తకము చదువువారు పుస్తకము చదువునప్పుడు గాని, గురుబోధ వినునప్పుడుగాని చక్కగా గ్రహించుశక్తి గలిగియుందురు

22 అర్హతగల సన్న్యాసులు అయినవారే యితరుల మీద ఆధార పడవలయును గాని, మిగతా వారు ఇతరులకు పెట్టియే తినవలయును

23 బాగుగా పరిశ్రమ చేసి తక్కువగా భుజించునప్పుడే సరిగా నిద్ర పట్టును

24 స్వంతశ్రద్ధ అనుష్ఠానములు లేనిచో గురువు ఎంతగొప్ప వాడైనను ఉపయోగము లేదు అయినను గురుసన్నిధిలో ఉన్నచో వారి సహాయమువల్ల అట్టి

శ్రద్ధ, అనుష్ఠానములు అలవర్చుకొనుటకు వీలు కలుగును

25 శ్రీరామతీర్థులవారివద్దకు వారి అత్తగారు, వారిభార్యగారిని తీసుకువెళ్ళి "యీ అమ్మాయిని గురించి ఎప్పుడైనా తలంచినారా" అని అడుగగా, " అట్లు నేను తలంచుటకు నా కంటే వేరు వస్తువు ఉంటే గదా? యని వారు చెప్పినారట

26 మహాగ్రంధములకు సామాన్యుల వ్యాఖ్యానములను చదువరాదు

27 ధ్యానమునందు మనస్సు నిలచినంతసేపే ఉండి పిమ్మట నిష్కామకర్మము చేయుట మంచిది

28 ధ్యానానంతరము సద్గ్రంధ పఠనము చేయుట మంచిది అప్పుడు నిప్పునకు వాయువు తోడైనట్లుండును బుద్ధి శుద్ధముగా చైతన్యము గలిగి దైవపరముగా నుండును

29 జ్ఞానికి కర్మమే లేదు, ప్రారబ్ధము కూడా లేదు గీత అ 4 శ్లో 37 చూడుడు కొందరు ప్రారబ్ధము జ్ఞానికికూడ పోదు అని చెప్పుదురు కాని భగవంతుని ఈ వాక్యానికి ఏమి సమాధానము చెప్పుదురు? అది సామాన్యులు చెప్పేది అందువల్ల మూలమే అన్నివిధముల మెరుగు అది వాఖ్యానములకంటే కూడా తేలికగా తెలియును

30 పంచదారయందు ఇష్టమేగాని దాని తీపియందు నాకు ఇష్టము లేదు అనినచో ఎట్లుండునో భగవంతునియందు ప్రేమకలిగి ఉండి భగవంతుని వాక్కులయందు నమ్మకము లేకయుండుట అట్లుండును భగవంతుని వాక్కు ప్రకారము నడచిన చాలును భగవంతుని చూడవలయునని కోర్కె అవసరము లేదు సనకసనందన తీర్థములో శ్రీ వారు ఉండుకాలములో "శ్రీ వేంకటేశ్వరస్వామివారిని ప్రత్యక్షము చేసుకొను నిమిత్తమా, మీ తపస్సు?" అని ఒకరు వారిని ప్రశ్నించగా "కాదు, భగవంతుడు గీత మొదలగు వాటిలో చెప్పినట్లు నడచిన చాలును ఒకవేళ భగవంతుడు ప్రత్యక్షము అయినా అంతియే గదా చెప్పును" అని వారు సమాధానము ఇచ్చిరి

31 మహావటవృక్షము క్రింద పరున్న ఒక పాంధుడు ఇట్లు తలంచెను

"కాయ చిన్నది వృక్షము పెద్దది, గుమ్మడికాయ పెద్దది చెట్టుచిన్నది దేవునికి ఎక్కువ తెలివి లేదు" కొంత సేపటికి ఒకకాయ కంటిమీద పడినది అప్పుడు వాడు దేవుని మహిమ బాగా తెలుసుకొన్నాడు అట్లనే మన చిన్నబుద్ధిని సృష్టికర్తకు కూడా కొందఱు ఆపాదించుదురు

32 ధర్మాత్ములకు కష్టములు ఉండవచ్చును కాని అప్పుడును వారి శాంతి గలిగియుందురు, అధర్మాత్ములకు దరిద్రము లేకపోవచ్చును, కాని అసూయ మొదలగు దుఃఖములు తప్పవు

33 అరబ్బీదేశములో ఇద్దరు మహమ్మదీయ సాధువులు స్నేహితు లుండిరి ఒకడు భక్తుడు రెండవవాడు జ్ఞాని భక్తునకు ఒక దేవదూత ప్రత్యక్షము అయి భక్తుల జాబితాలో వారిపేరు అగ్రమున నుండుట కన పర్చినారట జ్ఞానికి మరొక దేవత ప్రత్యక్షము అయి భగవంతుడు ఎవరికి భక్తుడుగా ఉన్నాడో వారి జాబితాలో వారి పేరు అగ్రస్థానములో ఉండుట కనపరచినారట

34 శ్రీ కబీరుదాసుగారు జ్ఞాని వారి యందు అసూయ గలవారు వారియింటికి అనేకమందిని అనేక వేళల భోజన నిమిత్తము పంపగా వారి నందరిని తగిన రీతి గౌరవించు నిమిత్తము శ్రీ రామచంద్రులవారు వారికి పంటపనులు వగైరా సహాయములచే దాస్యము చేసిరని విందుము

35 అట్లనే శ్రీ సక్కుబాయిగారు పండరినాథుని సేవకు పోగా ఆమెకు బదులుగా భగవంతుడే వంటలు వగైరా పనులు చేసెనని తెలియచున్నది

36 అధమము ఉదయ సాయంకాలముల యందైనను ధ్యానము చేయనిదే గొంతులో నీరైనను పోయరాదను నియమము కలిగియుండవలెను లోక గురువులు అయినను శ్రీ బుద్ధదేవుడు, శ్రీ యేసుక్రీస్తులవారు, శ్రీ మహమ్మదులవారు మొదలగువారు కడవరకు అట్లే యుండువారు నిర్వాణము పొందియు శ్రీ బుద్ధదేవుడు అట్లనే చేయువారు ఇప్పటివారు అనేక మంది "మా మనసు తయారు అయింది, ధ్యానము వగైరాలు మా కవసరము లేదు" అందురు అందుచే వారు క్రమేణ చెడిపోవుచున్నారు

37 ఒక సమయములో కోయిలూరు మఠాధిపతిగా నున్నవారికి శాస్త్రము దెలియదు గాని ధ్యాని, యోగి, ఆత్మవేత్త అయి ఉండువారట ఇతరుల ప్రోత్సాహముమీదట శాస్త్రములు చదువదలంచి ఒక గ్రంథమును చదువుచుండగా అందు ప్రారంభములో "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను భావమును తెల్పుభాగము రాగా ఆనందించి గంతులు వేసినారట కాని అందే మరి ఒకచో అవిద్యయే అన్నింటికి సృష్టిహేతువు అని వినగానే విచారపడి క్రిందపడి పొరలి శాస్త్రము నాకు వద్దు అన్నారట

38 భక్తికి దీనభావము, జ్ఞానమునకు ధైర్యము లక్షణము

39 ధ్యాననిష్ఠ చేయుట వల్లకూడ అన్నము జీర్ణమగును అందుచే ధ్యానముకూడా చేయనిరోజున అన్నము అరుగదు నిద్ర సరిగా పట్టదు

40 స్వధర్మము అని గీత చెప్పిన వాక్కునకు సరియగు అర్థమేమన ఏ దేశములో, ఏ మనుష్యుడు, ఏ కాలములో , ఏ పని చేయ నిశ్చయించినాడో దానిని చేయవలసిన విధిగా శ్రద్ధతో చేయుటయే

41 శ్రీవారి జన్మస్థానములో ఒక శ్రీమంతుడు సాలుకి ఒక్కరికి మాత్రం ఒక్క రూపాయి ధర్మము చేయువారట ఇతర ధర్మములు ఇంకేమియు చేయువారు కారు భోజనముకూడ ఎవరికి పెట్టేది లేదు అట్టివారు ఒకతూరి పొరుగూరికి ఒక ఉత్సవము దర్శించే నిమిత్తము వెళ్ళినారట అక్కడ వారికి వేళకు ఆహారము ఎచ్చటను దొరకలేదట, అన్ని ప్రయత్నములు చేసి విఫల మనోరథులయి విచారపడుచున్న సమయంలో వారివల్ల రూపాయి ధర్మము తీసుకొనువారు కనబడి వారిని ఆదరించి భోజనము పెట్టించినారట అప్పటినుండియు వారు ఎక్కువ త్యాగము కలిగినవారై అన్నిధర్మములు ఎక్కువగా చేయు మొదలిడినారట

42 వృత్తులు మూడు విధములు అవి - (అ) మీనవృత్తి -చేప నీటియందు మాత్రమే ఉండగలదు, అట్లనే కొంతమంది బ్రహ్మనిష్ఠులు ఏకాంతమున మాత్రమే ఆత్మసాధనలు సాగించగలరు, (ఇ) మృగవృత్తి - మృగములు భూమి మీదమాత్రమే చరించగలవు, కొంతమంది జనమధ్యమందే బ్రహ్మ నిష్ఠ సాగించగలరు (ఉ)

కూర్మవృత్తి - కూర్మము జలమందు, భూమి మీదగూడా చరించగలదు అట్లనే కొందరు ఏకాంతమందును, జనమధ్య మందునుకూడా బ్రహ్మ నిష్ఠను సాగించగలరు ఈ తెగవారు సమర్థులు

43 సోమరితనమును గురించి శ్రీ వివేకానందులవారు కాశిలోని పండితులకు ఇట్లు చెప్పిరి- "ఓ పండితులారా! మిమ్ములను చూచిన నాకు నిద్ర వచ్చుచున్నది మా గురువులవారిని చూచిన శవములు కూడా లేచి పరుగెత్తును" మెదడునందు చదరపు అంగుళమునకు 10 కోట్ల జీవాణువులుండును సామాన్య మనుష్యులకు అందు 3 మాత్రమే వికసించును గొప్పవారికికూడా 20 పనిచేయును కాని శ్రీ వివేకానందులకు అన్నియు వికసించినవట

44 నిద్రకోసరము పరుండువాడు సంసారి నిద్రవచ్చినప్పుడు పరుండువాడు సన్న్యాసి తినవలయునని తినువాడు సంసారి ఆకలిబాధ మాన్పుకొనుటకు తినువాడు సన్న్యాసి

45 "మనజ్ఞాన ధనమును అంతయు పగలు భోజనము అనే దొంగయు, రాత్రి నిద్ర అను దొంగయు అపహరించుకొని పోవుచున్నారు" అని శ్రీ మహమ్మదుగారు చెప్పినారు వారు రోజుకు రెండుగంటలు మాత్రము నిద్ర పోవువారట వారు చనిపోవుముందు జబ్బుచేసినప్పుడు కూడా సమాజుకాలమునకు ఇద్దరి శిష్యుల భుజముల నాధారముగా గైకొని నిలబడి నమాజు చేసినారట

46 యోగము, జ్ఞానము రెండును నిరతిశయానందము ననుభవించుటకు అవసరము ఒక లైటుకు గ్లాసుమాదిరి యోగము, లోన వెలుగు వత్తిమాదిరి జ్ఞానము

47 యోగము, ప్రాణాయామము మొదలగునవన్నియు మితముగా శీలించవలయును మితము తప్పిన అనేక నష్టములకు కారణములగును యోగము రోగముగా మారవచ్చును

48 అన్ని ముద్రలలోను భద్రమే గొప్ప ముద్ర

49 శ్రద్ధను గురించి గీత 17 అ 3 శ్లో ॥ ను పఠించవలెను

50 చేసినకర్మ సరిగా చేయువలయును లేనిచో భగవంతుని తలంచుకొనుచు ఒకచోట కూర్చొనుట మంచిది అంతేగాని కర్మ చేయుచూ మనసే ప్రధానము అనరాదు మనసే ప్రధానము అనువారు ధ్యానమునందు కూర్చొనుట తప్ప మరేమియు చేయరాదు కర్మ చేయునప్పుడు మనసుతో కాక అవసరమగు మిగతా ఇంద్రియములు వగైరాలు వినియోగించుచు సరిగా చేయవలయును

51 ఆశ్రమములు నదుల వద్దగాని, కొండలవద్దగాని, రెండు నున్నచోటగాని నిర్మించుకొనుట మంచిది

52 శ్రీ రామకృష్ణ పరమహంసలవారు ఇట్లు శెలవిచ్చిరి - లోకములో అనేక వస్తువులు అనేక విధముల ఉపయోగపడునటుల భగవంతుడు ఏర్పాటు చేసియున్నాడు నీవు వాటిని సంస్కరణము చేయజాలవు చేయవలదు ఒక అడవిలో ప్రయాణము చేయునపుడు నీసౌకర్యము కోసరము అడవినంతయు ఛేదించి భేదింతు వగైరా యత్నములు చేయవద్దు నీవు సుఖముగా అరణ్యమును దాటుటకు కాళ్ళకు చెప్పులు వేసుకొనుట వగైరా సౌకర్యములను మాత్ర మవలంబించుము

ఈ సందర్భములో గీత అ 2 శ్లోకములు 14, 15 గమనించ వలసినది

53 ఒకరాజు కొంత భక్తి కలవాడు అయనకు కళ్ళకు జబ్బుచేయగ వైద్యుడు వారిని ఎప్పుడూ పచ్చరంగు గలవాటినే చూచుచుండవలసినది అని ఔషధముగా చెప్పినారట అందులకారాజు ఇంటినిండా పచ్చని చెట్లు రంగులు ఏర్పాటు చేయించినారట తన నగరమంతటయు కూడా పచ్చరంగులు వేయించినారట అయినను అట్టి రంగు లేనిచోట్లు చాలాఉండుటటే రాజునకు వ్యాధి శమించలేదట అప్పుడు రాజుగారు వారి గురువుగారిని సలహా అడుగగా కళ్ళకు పచ్చ అద్దముల జోడు పెట్టవలసినది అని చెప్పినారట, ఇట్టిదే గురు కీలకం

54 ఒక రాజుగారికి ముగ్గురు అల్లుండ్రు గలరు. అందు ఒకరు అజీర్తి వల్ల బాధపడుచూ ఔషధము సేవించుచుండగా కొంతవరకు వ్యాది రహితము అయినది పథ్యము ఇంకా చేయుచునే ఉన్నాడు ఇట్లుండగా ఒక తూరి ముగ్గురు అల్లుండ్లు అత్తవారింటికి ఒకేతూరి వెళ్ళగా అందరికి కలసి ఒక పంక్తిలో భోజనములు ఏర్పాటు

చేసినారు తినకపోతే యితరులు ఏమనుకొనెదరోయని అజీర్తిగల అల్లుడుగారుకూడ అన్ని పదార్థములు భుజించగా తిరిగి అజీర్ణము హెచ్చు అయి విరేచనములు ప్రారంభించినవి అట్లనే భవరోగము పూర్తిగా రహితము కానిదే ధ్యాననిష్ఠ వగైరాలు మాని విషయముల సేవించిన ముముక్షువులు తిరిగి అధోగతి పాలగుదురు

55 ఆపదలు, ఇంద్రియములకు చలనము కలుగజేయు విషయములు సంప్రాప్త మయినప్పుడు చలనము పొందక యుండువారే గొప్పవారు

56 ఒక తత్త్వవేత్త చాలాగొప్ప పండితులుకూడాను ఉపనిషత్తులు అన్నియు చదువుచూ అందుకొన్ని పదములు దిద్దుటకు ప్రయత్నము చేయుచుండువారట కాని గీతకు మాత్రం ఎచ్చటను ఒక అక్షరం పొల్లుమార్చి చెప్పలేక పోయినారట

57 ప్రకృతి మధ్యనుండియు ధైర్యముగా దానితో పోరాడి నెగ్గగల వాడు ధీరుడు అట్లు జయించ లేనివాడు దానికి దూరముగా నుండుట మంచిది

58 గీత అ 2 శ్లో 72 అంత్యకాలమునందు మనస్సు భగవంతుని యందు నిలిపినను ముక్తి కలుగునని ఈ శ్లోకము చెప్పుచున్నది కాని అట్లు మనసును నిలుపవలయునంటే అంతకు ముందు సాధన, అభ్యాసము అవసరము అయిఉన్నవి పరీక్షకువెళ్ళు విద్యార్థి సంవత్సరము అంతా చదివిన ఎట్లుండునో చదువకయున్న ఎట్లుండునో అను విషయము ఇచ్చట గమనించతగినది

59 శ్రీ ముకుందమాల (కులశేఖరాళ్వారుగారిది)లో 32 వ శ్లోకమును బట్టిచేయుట మంచిది

60 పంచశీలములను నిత్యము విధిగా పాటించునది

61 విధిని మతిచే జయించవచ్చును అందుకు పాణిని, మార్కండేయులు మార్గదర్శకులు

62 మనసులో ఎట్టి కోరికలు లేకుండా ఖాలీగా ఉంచు సమర్థత మనము సంపాదింప గలిగినచో అన్ని కోరికలు తీరును సౌకర్యములన్నియును మన సన్నిహితమందు సిద్ధముగా నుండును

63 ఎప్పుడును చెయ్యి క్రింద ఉండరాదు (ఇతరులను యాచించరాదు పైననే యుండవలయును) ఇతరులకు ఇచ్చుచుండ వలయును అట్లున్న లోకమంతయు వశమై పోవును పాండిత్యము మొదలగు గొప్పలు అవసరము లేదు సత్యము, బ్రహ్మచర్యము, శాంతము మొదలగు గుణములు కలిగియుండిన చాలును దొరకినది భుజించి ఊరకుండవలెను మనకు పెట్టిన పవిత్రుల మగుదుము అని యితరులకు తోచులాగున సంచరించవలెను

64 లోకసేవ చేయవలెనని చింతవలదు గీత 8 అ 8 శ్లో॥ చూడుడు

65 యోగసాధన చేయుచున్నను సాధ్యమయినంతవరకు అన్న దానము, ధర్మము, భక్తి, భజన, పారాయణాదులన్ని ఉండుట మంచిది అన్నింటికి వేరువేరు ఫలితములుండును అన్ని దానములు చేసినను కర్ణుడు అన్నదానము చేయలేదు అందుకే స్వర్గములో వారికి అన్నియు సంప్రాప్త మయినను అన్నమునకు కరువు గల్గెను

66 మూడు దానములు ప్రధానముగా నుండవలెను జ్ఞానదానము చేయువారికి జ్ఞానమున్నూ, ఆరోగ్య సంబంధదానముచేసిన వారికి ఆరోగ్యమున్నూ, ఆర్థిక సంబంధ దానములు చేసినవారికి ఆర్థిక సంపత్తియున్నూ కలుగును

67 వైరాగ్య బోధోపరతులు ఒకరికే కలుగుట ఎంతో పుణ్యభాగ్య విశేషమున గాని జరుగదు

68 భాగవతమునందలి ఈ దిగువ పద్యమును శ్రద్ధతో గమనించునది

**కమనీయ భూమి భాగములు లేకున్నవే**
**పడియుండుటకు దూదిపరుపు లేల**
**వల్కలాజిన కుశావళులు లేకున్నవే**
**కట్ట దుకూల సంఘంబు లేల**
**గొనకొని వివసింప గుహలు లేకున్నవే**
**ప్రాసాద సౌధాది పటల మేల**

**సహజంబులగు కరాంజలులు లేకున్నవే**
**భోజన భాజన పుంజ మేల**

**ఫలరసాదులు గురియవే పాదపములు**
**స్వాదుజలములనుండ వే సకలనదులు**
**పొసగ భిక్షంబు పెట్టరే పుణ్యసతులు**
**ధనమదాంధుల కొలువేల తాపసులకు.**

అజినము అంటే ఒక విధమగు చెట్టుబెరడు అతి పలుచనగా నుండి వస్త్రమువలె ధరించుటకు అనుకూలముగా నుండును హృషీకేశము వగైరా ప్రాంతములలో నుండును పండ్లు మైసూరు ప్రాంత అరణ్యములు మొదలగు చోటులలో దొరుకును దుంపలు తిరుపతి కొండ ప్రాంతముల దొరుకును

69 ధ్యానములో ధ్యేయమును ప్రధానముగా మూడు విధముల భావన చేయవలెను

(ఎ) ప్రణవ ధ్యానము చేయునప్పుడు ప్రకాశమును భావన చేయుట అట్లు చేసిన భావశుద్ధి అయి అన్ని పాపములు హరించి పోవును

(బి) అన్ని జీవులను స్వస్వరూపముగా భావించుట

(సి) ప్రకృతితో సహా అంతయు పరమేశ్వరుడే యని భావించుట

ఈ స్థితులు ఒకటి కంటే ఒకటి గొప్పది కడపటిది తురీయావస్థ. నిరతిశయ నిత్యానందదాయకము

70 జపధ్యానలయములలో ఒకటొకటిగా దాటి వెళ్ళినను క్రిందివి పూర్తిగా విడువరాదు ఏరుదాటి తెప్ప తగుల బెట్టరాదు ఇతరుల కైననది ఉపయోగపడును

71 శివజీవైక్యమును గురించి సనకసనందనాదులకు కలిగిన సందేహమును తీర్చుకొనుటకు సత్యలోకమునకు వెళ్ళి బ్రహ్మను దర్శించగా వారు సరస్వతీ అమ్మవారితో సహా ఉండగా చూచి మీరును సామాన్య సంసారులవలె నున్నారే అని అడిగిరట అట్లుండుట మా ఉద్యోగమునకు అవసరము, అది మా ప్రారబ్ధము అని

బ్రహ్మదేవుడు చెప్పగా వీరు మనకు గురువుగా నుండుటకు పనికిరారు అని వెడలిపోయిరట పిమ్మట వైకుంఠమునకు వెళ్ళి మహావిష్ణుదేవుని చూచి అట్లనే తిరిగి వచ్చిరట పిమ్మట కైలాసమునకు వెళ్ళుచుండగా ఈ విషయమును ముందుగనే శ్రీశంకరులు గ్రహించి పార్వతి అమ్మవారిని వారియందు లీనము చేసుకొని శ్రీదక్షిణామూర్తి స్వరూపధారియై ఒక చెట్టు మొదట కూర్చొని ధ్యానము చేయుచుండగా సనకసనందనాదులు వారిని దర్శించి సంతసించి, వారు తమకు తగిన గురువులని వారి నాశ్రయించి వారి సందేహమును తీర్చుకొనగలిగిరట

72 పవిత్ర హృదయులకు సమస్త శాస్త్ర విషయములు వాటంతట అవి వచ్చి చేరుచుండును చదువకుండా శ్రీశుకుల వారిలో నాలుగు వేదములు, జ్ఞానము వచ్చిచేరునట్లు

73 నాలుగు యోగములయందు అభిమానము గలవారు లేరు సంగ్రహముగా తెలియ గోరువారు గీత 18 వ అధ్యాయమును చదువుట మంచిది

74 ఆత్మస్థితి యను ఫలము శాస్త్రముల నుండి గ్రహించ వలెననుట నీటి యందు ప్రతిఫలించు పండ్లను తీసుకొనుటకు యత్నము చేయుటవంటిది

75 అతిధి యన అందరు కాదు 10 మైళ్ళ పైనుండి వచ్చియుండ వలయును పాదచారియై వచ్చినవారుగా నుండవలెను చేత ధనము లేనివారును, దైవ భక్తులుగా నుండవలెను అట్టివారికి తప్పక గృహస్థు ఆతిధ్యము ఇచ్చి తీరవలయును లేనియెడల పాపము కలుగును

76 విధినిషేధములు లేని స్థితిని గూర్చి తెలుసుకొన శుకపంచకమును చదువవలెను

77 గీత 3 అ 37 వ శ్లోకమునుండి 43 వ శ్లోకము వరకు 7 శ్లోకములు ముముక్షువును గురించిన్ని, 2 అ 55 శ్లోకమునుండి కడ వరకును మోక్షము నొందిన వారిని గురించిన్ని తెలుపును

78 అభ్యాసమువల్ల ప్రమాదముల నీ క్రింది కథ తెలియ జేయును ఒక పల్లెవాడు సన్న్యాసివేషమును వేసుకొని కాశిలో బ్రాహ్మణసత్రములో భోజనమునకు

13 వెళ్ళినాడు భోజనము చేయు సమయంలో రొట్టె గట్టిగా ఉన్నందువల్ల నోటితో కొరకి తినుచుండెను అట్టి అభ్యాసము అక్కడ నియమవిరుద్ధముగా నున్నందువల్ల అక్కడ యజమాని సంఘములో వారు ఒకరు అట్లు ఎందుకు చేయుచున్నావు అని వానిని ప్రశ్నించగా ఎండు చేపవలె గట్టిగా ఉన్నది అందువల్ల కొరకవలసి వచ్చినది అని జవాబు చెప్పగా వాడు శూద్రుడు అని గ్రహించినవారై శిక్షించి వెడలగొట్టినారట

79 శ్రీ యేసుక్రీస్తుల వారికి గుణింతముకంటే ఎక్కువ రాదు శ్రీ మహమ్మదులవారికి చేవ్రాలు కూడా రాదు కాని బ్రహ్మజ్ఞానమను శక్తికలదు బ్రహ్మజ్ఞానములేని శాస్త్ర పాండిత్యము విద్యుచ్ఛక్తిలేని విద్యుద్దీపముల వంటిది

80 ధ్యానమువల్ల పొందిన ధ్యేయ వస్తువునుండి మనసు జారిపోవుట కలదు అందువల్ల ఏ పని చేయువారైనను మధ్య మధ్య అప్పుడప్పుడు ధ్యానమును చేయుచున్నచో కొన్ని దినములకు అభ్యాసమువల్ల మనసు ఎల్లప్పుడు ధ్యేయమునందే నిలువగలదు

81 లేని మహిమలు చెప్పుకొన్న రాబోవు మహిమలు కూడా రాకుండా పోవును

82 శ్రీ శంకరులవారి"ఆత్మబోధమును", 'వేదాంత డిండిమమును' కంఠస్థము చేయుట లేనిచో శ్రద్ధగా చదువుటయైనను చేయుట ముముక్షువులకు మంచిది

83 మనము ఎప్పుడు చనిపోవునది తెలియదు ప్రతివారును నూరేండ్ల వరకు జీవించగలమను ధైర్యముతో నుండవలెను సంస్కృతమును అభ్యసించుటకు కాలము తీరిపోయినట్లు ఎవరును ఎంచవద్దు

84 జననమునకు పూర్వము జననీజనకుల యొక్క శ్రద్ధ కృషివల్లను, పిమ్మట బాల్యమందు పోషించు వారి యొక్కయు అటు తర్వాత తన యొక్కయు శ్రద్ధవల్లను సరియగు ప్రయత్నము చేసిన ప్రతివారును 100 ఏండ్ల నివసించులాగున చేసుకొను అవకాశములు గలవు

85 ఆహారము శుద్ధముగాను, సాత్త్వికముగాను ఉండవలెను అంతియే

కాదు అవి వచ్చిన మార్గము కూడా న్యాయమయినదిగా నుండవలెను సంపాదించినవారుకూడా ధర్మబద్ధముగా సంపాదించి నదియై యుండవలెను లేనియెడల దానియందు కల్మషము ఉండి ముముక్షువులను బాధించును

వాల్మీకులవారి తల్లిదండ్రు లిద్దరు చాలాపవిత్రులు కాని అపవిత్ర ప్రవర్తనగల కుమారుడుగలుగ, అందుకు హేతువు విచారించగా వారికి వచ్చిన ఆహార పదార్థము అన్యాయ మార్గమున సంపాదించిన వారివల్ల ఈయబడు చున్నందున ఆ దోషము ఈవిధముగా పరిణమించినదని తేలెను కాని ఋషుల ఆశీర్వచన ప్రభావము చేత వాల్మీకులవారు పూర్వాశ్రమమందలి వారి దుష్ప్రవర్తనను విడిచినవారై పవిత్రులై నారదమహామునుల వారి ఉపదేశమున వెయ్యి సంవత్సరములు తపస్సు చేసి ఋషి అయినారు

86 పాతకమును హరించుటకు జపము తపము అవసరము

**"తపసా కల్మషం హంతి"**
**"జపతో నాస్తి పాతకం, కృషితో నాస్తి దుర్భిక్షం"**

అను వాక్కులు గమనించునది

87 సాధువులు అయిదు వస్తువులను మాత్రము ఎప్పుడును విడువకుండా దగ్గర ఉంచుకొనవలెను , జపమాల, విభూదిడబ్బీ, గొంగళి(లేక అట్టి అనుకూల ఆసనమునకు పనికివచ్చునది), అత్యవసరమగు వస్త్రములు, భగవద్గీత (లేక అట్టి ప్రాముఖ్యము గల ఉపనిషత్తు)

88 శ్రీ భర్తృహరిగారు వైరాగ్యము గలిగి తలంచిన విషయములు మంచముకంటె భూమి విశాలము, అన్ని దీపములకంటె చంద్రుడు పెద్ద దీపము గాలి పంకాలకంటె వాయువు చాలా గొప్పది ఒక రాజ్యములో ప్రజలేకాక యతిరాజు అయినచో అన్ని రాజ్యములలో ప్రజలు మర్యాద చూపుదురు

89 శ్రీ వేమనయోగిగారు వైరాగ్యము గలిగిఉన్న దశలో ఒక నాడు వర్షములో ఒక చెట్టు క్రింద కూర్చుని యుండగా ఇంకా సంసారిగా ఉన్నవారి సోదరుడు వారిని చూడవచ్చి కన్నీరు కార్చినారట ఆ సోదరుని చూచి వేమనయోగిగారు కూడా కన్నీరు

కార్చినారట సమస్తభోగముల విడనాడి ఇట్లవస్థ పడుచున్నాడే అని వేమనసోదరుడు విచారపడగా, తన సోదరు డింకను బద్ధుడై దుఃఖములకు లోనై యున్నాడేయని వేమనగారు విచారపడినారట

90 యతి ముఖ్యముగా ఆరులోటులు లేకుండా చూచుకొన వలెను "ఆసనం పాత్ర లోపశ్చ సంచయః శిష్యసంగ్రహః " అను శ్లోకము ప్రమాణము

శిష్య సంగ్రహః అనగా తగని శిష్యులను గలిగిఉండుట ఎక్కడైనను ఏదో విధంగా కూర్చొనుట ఆసనలోపము తగిన అర్హత గలిగిఉండకపోవుట పాత్రలోపము ధనము మొదలగువాటిని నిల్వచేయుట సంచయము దివాస్వాపః అనగా పగటినిద్ర, వృధాలాపః అనగా వృధా ప్రసంగము అను ఆరులోటులు

91 సార, వెదురు, కొయ్య, మట్టిపాత్రలు నీరుత్రాగుటకు మంచివి భోజనమునకు మట్టిపాత్ర కూడదు

92 సాధు లక్షణములు - నాలుక ఉండికూడా లేనట్లుండవలెను (మౌనము, రుచి కోరకుండుట) మంచి యవ్వనములో ఉండియు నపుంసకుడుగా నుండవలెను కన్నుఉండి కూడా లేనివానివలెను, చెవిఉండికూడా చెవిటివానివలెను ఉండవలెను అట్టివారు ముక్తులగుదురు

93 కామమును జయించిన కామధేనువును, సంకల్పములను జయించిన కల్పవృక్షమును, నిశ్చింత గలిగిన చింతామణియు సన్నిహితమందే నిలచియుండును

94 తపః ఫలమువల్ల చేయగలిగిన పనులకు వ్యాసాశ్రమము మొదలగునవే ఉదాహరణము

95 నిష్ఠ క్రమక్రమముగా చేయుచుండవలెను, గీత 6 అ 25 వ శ్లోకము "శనైశ్శనైః . " ఇందుకు ప్రమాణముగా గైకొనునది

96 పులగము - అన్నము మంచి సాత్త్వికాహారము, పెసరపప్పు నెయ్యి బియ్యం కలిపిన వంట అందులో కూరగాయలు కూడా వేసుకొనవచ్చును దానితో

పాటు పండ్లు తినవచ్చును అది పరిపూర్తి యగు ఆహారము ఇతర వస్తువులు తినవలసిన అగత్యము ఉండదు

97 ఆహారమును తగ్గించదలచిన వారుగాని, హెచ్చింప దలిచిన వారుగాని క్రమేణ చేయవలయును అట్లయిన ఆరోగ్యము చెడదు వర్చస్సు తగ్గదు జీర్ణకోశము చెడదు ఒకరు చందనపు తవ్వ చేయించి దానితో బియ్యం కొలచి తినుచూ ఆ తవ్వతో పూజకు రోజు చందనము అరగదీయు చుండువారు తగ్గించుటకు అట్టి సాధన మంచిది హెచ్చించుటకు కూడా అటువంటి సాధనలే అవలంబించవలెను ఇందుకు చాంద్రాయణ వ్రతమును ఉదాహరణకు తీసికొనవలసినది ఆ వ్రతము పూర్ణిమ రోజు ప్రారంభము సామాన్యముగా కార్తికము, మాఘము, వైశాఖము వగైరా పూర్ణిమలలో ప్రారంభించవలయును

98 పాపాత్ములు గీతను అంటరాదు అని కొందరందురు గీత 4 అ 36 శ్లోకమును చూడుడు

99 దేహరోగుల వద్దకు వెళ్ళునప్పుడు వైద్యులు అట్టి రోగములు తమకు అంటకుండా ఉండునట్లు చేసుకొనుటకు ఎట్లు సాధన సామగ్రులు గలిగియుందురో, భవరోగులవద్దకు వెళ్ళు సాధుసన్న్యాసులు కూడా అట్టి సాధన సామగ్రులు గలిగి వెళ్ళవలెను లేనిచో వారికి అంటుబాధ తప్పదని జ్ఞాపకముంచుకొనవలెను

100 ఒకచోట ఉండు దేవునికంటె సమస్త చరాచర వస్తువుల యందు వ్యాపించియుండు దేవుని ఉపాసించుట మంచిది అదే సాత్త్విక జ్ఞానము గీత 18 అ 20 వ శ్లోకమును చూడుడు

101 విశుద్ధ జ్ఞానము అంతకంటే గొప్పది పైదానిలో రెండువస్తువులు అనగా ఉపాసించువాడు ఉపాసింపబడునది, అను రెండు వస్తువులు ప్రతిపాదింప బడుచున్నవి ఆ రెండు ఒకటిగా నుపాసించునది విశుద్ధ జ్ఞానము

102 విద్య, ధనము, కులము, పదవి మొదలగు వాటియం దభిమానములు మోక్షమునకు శత్రువులు ముముక్షువులు వాటిని విడువవలయును

103 రెడ్డిరాజుల కాలములో ఒకచిన్న గ్రామంలో నారాయణ రెడ్డిగారు

అని ఒక అవధూతగారు ఉండేవారు ఒకసారి శంకరపీఠాధిపతి ఆ గ్రామము వెళ్ళి వారి సంగతి తెలుసుకున్నవారై వారిని చూడనెంచి తన పదవియొక్క అభిమానమువల్ల తాను వారిదగ్గరకు వెళ్ళక వారిని తన వద్దకు తీసుకురమ్మని శిష్యులకు ఆజ్ఞయిచ్చినారట వారువెళ్ళి అవధూతగారితో ఈ విషయము చెప్పగా 'కబురుపంపువాడు ఒకడు, వచ్చువాడు ఒకడు ఉన్నాడా'యని ప్రశ్నించినారట అందుపై తిరిగివచ్చి తమ గురువుగారికి తెలియజేయగా వారు ఎవరు లేని సమయంలో చీకటిలో వెళ్ళి వారిని దర్శించవలయునని వారి సమీపమునకు రావచ్చునాయని కబురు పంపినారట రావచ్చునుగాని ఒక్కరే మాత్రం రావాలి అని అవధూతగారు చెప్పినారట అందుపై పీఠాధిపతి తానుఒక్కడే వెళ్ళి చెరువుగట్టుమీద చిన్న గుడిసెలో ఒకఅద్దము ఒక దీపము మాత్రము ఉంచుకొని ఉన్న అవధూత గారిని దర్శించినారట 'ఇదేమి మీరు ఒంటరిగా రమ్మంటే యింతమందితో వచ్చినారు ఏమి' అని అవధూతగారు మందలించినారట 'లేదు స్వామి! నేను ఒక్కడనే వచ్చితిని గదా'యని పీఠాధిపతి అనగా 'ఆ అద్దములో చూడవలసినది అని అవధూతగారు చెప్పినారట ఆ అద్దములో మఠాధిపతి ప్రతిబింబమే కాక వారు పరివార సమేతముగా ఉన్నట్లు కనబడినదట వారి అంతః కరణములోని వృత్తులన్నియు ఆ విధంగా ప్రతిఫలించుట చూచి పీఠాధిపతి అవధూతగారికి సాష్టాంగ నమస్కార మాచరించి వెంటనే సన్న్యసించి పీఠము మరియొకరికి అప్పజెప్పి అరణ్యమునకు తపము జేయు నిమిత్తము వెడలిపోయినారట

104 కర్మయోగాభ్యాసములో కర్మను విధిప్రకారము సరియగు వేళకు చేయవలయును అంతేగాని జ్ఞానయోగమును అందుతో కలిపి మనస్సే ప్రధానము అని మధ్య మధ్య చెప్పుచూ కర్మ క్రమమును తప్పించి నడువరాదు

105 భుక్తిఉద్యోగస్థులే అంతవేళకు పనిచేయుచుండగా ముక్తి ఉద్యోగస్థులు ఎంత జాగ్రత్తగా నుండవలయును! రోగమని, శ్రమయని సాకుచెప్పి కార్యక్రమమును తప్పించరాదు

106 రాత్రిపూట ఎంత తక్కువ భుజించువారు అంత తేలికగా చీకటితో

లేవగలరు

107 నిష్ఠచేసుకొనుటకు చీకటితో మూడు గంటలకు లేచువారు ఉత్తములు

108 ధ్యానము ఉదయము మూడుగంటలు, సాయంతనము మూడు గంటలు చేయుట మంచిది

109 సూర్యభగవంతునకు అరుణోదయ సమయమందు అర్ఘ్య మివ్వవలయును

110 సోమరితనము దరిజేరనీయరాదు నశించిన యోగము పునరుద్ధరింపబడు కాలము వచ్చినది అందరును శ్రద్ధావంతులై యుండవలయును

111 ఏ గొప్ప విషయము వ్రాసినను ముందు మాతృభాషలో వ్రాసి తదుపరి తర్జుమాసంగతి విచారించుట మంచిది భావములు చక్కగా తెలియపరచ నను వుగా నుండును శ్రీ టాగూరు మొదలగు పెద్దలందరు ఆ మార్గమునే అనుసరించిరి

112 శిష్యులు 16 వ వంతుకూడా నడువలేని ఆచరణ గురువులు కలిగిఉండవలెను శిష్యులు గురువుగారికంటె 16 రెట్లు ఎక్కువ ఆచరణ కలిగియుండవలెనని ప్రయత్నించవలెను

113 అఖండ బ్రహ్మమును ఒకేసారి పొందలేము క్రమముగా చేరవలెను నిప్పును ఒక్కసారే పెద్దదిగా ప్రజ్వలింప చేయజాలము! క్రమేణ చేయవలసి యుండును కట్టెలుకూడా ఒక్కసారి వేయరాదు నిష్ఠకూడా అంతే

114 ఒకకుప్పకు నిప్పుపెట్టినచో అనుకూలమగు గాలికూడా ఉన్నయెడల బాగుగా ప్రజ్వలించును అట్లనే గురుబోధ కలిగినను అంతఃకరణ వృత్తులు కూడా దానినే అనుసరించి యుండినయెడల బ్రహ్మజ్ఞానాగ్ని ప్రజ్వలించును

115 గురువునే అడిగి అన్ని తెలుసుకొనుట సాధ్యము కాదు లోన ఉన్న గురువును అడుగవలెను లోన గురువు మీద ఆధారపడువాడే గురువగును ఇతరులను ఎపుడు అడుగునో అప్పుడు బానిస అయిపోవు చున్నాడు ఎప్పుడు

అట్లనే అడుగువాడు అటులనే ఉండిపోవును

116 జ్ఞానము కలిగితే పాపము లేదు కాని పాపము వదలిన గాని జ్ఞానము రాదు

117 ప్రపంచములో అందరికీ భగవంతుడు అనేక విధముల భోజనము పెట్టు చుండగా బ్రహ్మనిష్ఠులకు ఆహారము తక్కువ చేయునని భయపడవలదు అయితే ఒక సమయములో తక్కువ దొరకినచో అందుకు కారణము ఉండును శరీరారోగ్యమును కాపాడుటకో లేక నిష్ఠ కాపాడుటకో అట్లు చేయును అందువల్ల అన్నివిధముల లాభమేగాని నష్టము లేదు సంతసింపవలెనేగాని విచారింపరాదు

118 కడపునిండుగా గాని ఉబ్బరముగా గాని ఉన్నచో ఆసనములు కుదరవు లేక ఉపవాసముగాని లేక ప్రాణాయామముగాని ఉండవలయును

119 నరములు వగైరాలు బాగా వశముకావలయునంటే మితాహారముగాని లేక ఉపవాసముగాని లేక ప్రాణాయామముగాని యుండవలయును

120 లోన కోపము ఉండినపుడుకూడ ఎల్లప్పుడు ముఖమును ప్రశాంతముగా ప్రసన్నముగా నుంచుకొనుటకు ప్రయత్నించినచో మనస్సు వశమగును

121 భగవద్ధ్యానము భజన మొదలగు వాటికి ఏ విధముగాను ఆటంకము కలిగించరాదు, ఒక జమీందారునికి ఒక్కడే కుమారుడు, పెద్ద వాడై విద్యలనుబాగా నభ్యసించినవాడు ఒక తూరి ఆ జమీందారుడు వారి యింటియందు శ్రీ గౌరాంగులు లేక శ్రీ కృష్ణచైతన్యులవారి భజన ఏర్పాటు చేయించినారు, అప్పుడు జమీందారు కుమారునికి టయిఫాయిడు జ్వరము చాలా హెచ్చుస్థితిలో ఉన్నతరుణము అయినను భజనకు ఏ విధముగాను భంగము కలుగకుండులాగున వారి పరిచర్యకు అన్ని ఏర్పాటులు రహస్యముగా జరిపించినారు చికిత్సలకు లొంగక ఆ వ్యాధివల్ల కుమారుడు భజనసమయమందే ప్రాణము వీడినారు! అప్పుడుకూడా ఆ జమీందారుగారు భజనకు ఏ విధముగాను భంగము కలుగకుండులాగున ఆ

గదికి తాళము పెట్టించి ఆ విషయమును రహస్యముగా వుంచినారు భజనపూర్తి అయిన పిమ్మట నీ విషయము శ్రీ గౌరాంగదేవుల వారికి తెలిసి వెళ్ళి చూచి భగవంతుని భజన జరుగుచుండగా ప్రాణము తీసిన దూతలను కోపగించి చనిపోయినవారిని లేచిరావలసినదిగా పిలువగ ఆయనను అట్లే పునర్జీవితుయైనారు, కాని స్వర్గసుఖము విడిచి యిక్కడ ఉండుట నాకేమి లాభము అని తిరిగి మృతజీవి యైనారట

122 నిత్యసన్న్యాసిగా ఉండవలెను గురుకులములో ఉన్నను, ఏ సభలలో నున్నను, గ్రామములో ఎచ్చట నున్నను, ఒంటరిగా ఉన్నను, ఒకేవిధమగు ఆచరణ కలిగియుండవలెను అనిత్య సన్న్యాసము పనికిరాదు ఇతరులు చూచునప్పుడు చాలా నిష్ఠగా నుండి ఒంటరిగా నుండగానే నిష్ఠ మానరాదు అట్లుచేయుట ఆత్మవంచనము, ఈశ్వరవంచనము భగవంతుడు లేని చోటు కలదా! అట్టి వారి వంచనము ఎప్పుడో ఒకప్పుడు తప్పక బయటపడును వారు వృద్ధిలోనికి రారు

శ్రీ మధ్వాచార్యులవారి శిష్యులలో కనకదాసు అనువారు ఒకరు వారు జన్మవల్ల శూద్రులు అయినను ప్రతిదినము ఆచార్యులవారు వారికే ముందు తీర్థ ప్రసాదము లిచ్చువారు అగ్రజాతివారు పండితవరులు అగు మిగతాశిష్యులకు అసూయగలిగి ఆచార్యులవారిని ఒకతూరి ఆ విషయమై ప్రశ్నించినారు ఆచార్యులవారు అందరికి ఒక్కొక్క ఫలమునిచ్చి ఎవ్వరు లేనిచోట భుజించి రేపు రావలసినదని చెప్పినారు మరునాడు కనకదాసు ఫలము తినకుండనే తీసుకు వచ్చినాడు మిగత శిష్యులు వివిధ విధములుగా రహస్య ప్రదేశములో తిన్నామని తెలిపినారట నీవెందుకు తినలేదని ఆచార్యులవారు కనకదాసుగారిని అడిగినాడు "స్వామీ! రహస్య ప్రదేశము నాకెచ్చటను కనుపించలేదు అన్ని ప్రదేశములలో భగవంతుడున్నాడు అందుచే తిరిగి తెచ్చినాను" అని ఆయన చెప్పినాడు అందుపైన మిగతవారందరికి సద్బుద్ధి కలిగినది కనకదాసు అపరోక్షజ్ఞాన పండితులు ఇతర శిష్యులు పరోక్ష జ్ఞానపండితులు

123 పరిపక్వస్థితి కలుగనివారు ఇల్లు విడువరాదు ఒక గృహస్థుడు సోమరి భార్య సంపాదించి భోజనము పెట్టుచున్నను, అన్నీ పేచీలు పైగా నేను విరోబా

సన్న్యాసి వద్దకు లేచి పోతానని తరచు భార్యతో బెదరింపులు ఇట్లుండగా భార్య ఆ విరోబాస్వామివద్దకు వెళ్ళి ఈ విషయములో చెప్పి గత్యంతరము తెల్పగోరినదట! ఈతూరి విరోబావద్దకువెళ్ళుతానన్నప్పుడు నీవు బ్రతిమాలకుండా 'సరే అట్లేచెయ్యి' అని చెప్పమని ఆమెకు సలహాయిచ్చి పంపినారట ఆమె అట్లుచేయగా బెట్టుకోసరము తప్పనిసరిగా ఆ భర్త విరోబా ఆశ్రమమునకు వెళ్ళినారట అప్పుడు శీతాకాలము, గొప్పచలి మంచు, కప్పుగుడ్డ ఉండరాదు , సరికదా! వున్నగుడ్డలు తీసి కౌపీనము పెట్టవలసివచ్చినది అదిగాక చీకటిలో మూడుగంటలకు చన్నీళ్ళ స్నానము చేయవలెను భోజనము లేదు పచ్చికాయల ఫలహారం మాత్రం, అదిన్నీ 12 గంటలకు, ఈ లోపులేదు రాత్రికి అసలే ఉపవాసం ఇట్టి నియమములు పాటించలేక వణకిపోయి నాకు బుద్ధి వచ్చినది స్వామి నేను యింటికి వెళ్ళతానని చెప్పినారట పోయి భార్యతో అనుకూలముగా ఉండవలసినదని మంచి బుద్ధి చెప్పి పంపినారట

124 జ్ఞానము ఒక లాంతరులోని జ్యోతివంటిది యోగము గ్లాసువంటిది యోగమువల్ల జ్ఞానమును కాపాడవలయును

125 తన దేహమాంసమును ఇతరులు కోసుకుతింటే వూరుకొనువాడు ఇతర మాంసమును తినవచ్చును

126 దేహములో ఆత్మోదయము లేక ఆత్మజననము కలుగుటయే ద్విజులలో రెండవజన్మ, దేహముపుట్టు మొదటి జన్మ అట్టివారే ద్విజులు

127 మనము ఎప్పుడైన చనిపోవచ్చును అనుతలంపు నిత్యము కలిగి ఉండవలెను, కాని తప్పకుండా తొందరలోనే పోతాము అని కూడా తలంచరాదు అదిన్ని చెప్పలేము

128 సాధువులకు అహంకారము కూడదు కాని దీనభావము కూడా ఉండరాదు

129 కర్మలో అద్వైతము కూడదు భావాద్వైతము ఉండిన చాలును వేదాంతాభ్యాసమువల్ల ఈ ప్రమాదము రాకుండా చూచుకొనవలెను

130 'నాప్రారబ్ధము ఏమి చేస్తాను', అనుకుంటే వాడు పతితుడే, విధిని

మతిచేత అతిక్రమించవలెనని తీవ్రబుద్ధి గలిగి ఆత్మ శక్తివల్ల స్వప్రయత్నపరుడై యుండవలెను

131 ముక్తిని పొందినది లేనిది మన ఆత్మవల్లనే తెలియును ముక్తుడయినవాడు అట్టివాడినే అని అతను తలంచును కానివాడు నేను కానని తలంచును అట్లు కాగలనని తలంచువాడు అట్లేయగును రోగము ఉన్నవాడు లేదన లేడు లేనివాడు ఉన్నదనడు ముక్తి విషయము కూడా అంతే నిత్యమయిన పవిత్రమయిన ఆచరణ ఉన్న అదియే బలము అట్లున్న వారికే ధైర్యముండును భావనాశక్తి గొప్పది ఎట్లు భావనయుండునో అట్లే జరిగిపోవును ముక్తుడనుకున్న ముక్తుడగును నేను బద్ధుడను అనుకున్న అట్లే యగును ఆత్మ విశ్వాసము కలిగినగాని బ్రహ్మశక్తి కలుగదు

132 వెండ్రుకలు తీయకుండా నియమము కలిగి మూడు సంవత్సరములు మంత్రధ్యానము చేసిన ఫలించును

133 యోగము వృద్ధిచేయ వలయును, లోకోపకారము చేయవలయును అనునవి కూడా సంకల్పములే

134 ఏదైనా ఫలించవలయునంటే విశ్వాసము ఉండవలయును

శ్రీ శైలదేవాలయ శిఖరమును వీక్షించగనే పుణ్యము, ముక్తి ఫలితము కలుగుచున్నది అను ఆర్యవచనము వాస్తవమా? గదా? యను ప్రశ్న శ్రీ పార్వతి అమ్మవారు శ్రీ శివదేవుని అడుగగా "అది వారు నమ్ముటలో ఉన్నది" అని జవాబు చెప్పి తద్విషయ బోధనార్థముగా ఇట్లు ప్రవర్తించినారట వృద్ధకిరాత స్త్రీ పురుషవేషములను ధరించనవారై పార్వతీ పరమేశ్వరులు శ్రీశైల యాత్రికులు దేవాలయమును చేరుమార్గము దరికి నున్న ఒక బురదగుంట కడకు వచ్చినారట అందున్న ఊబిలో (బురదలో) శివదైవుడు దిగబడిపోయి బురదనుండి తన్నులేవనెత్తుమని యాత్రికులను కోరవలసినదిగా అమ్మగారికి శెలవిచ్చినారట అమ్మగారు అట్లే కోరుచుండిరి కాని యెవ్వరును రారయిరి మనముకూడా బురదలో కూరుకొని పోవచ్చును శ్రీ శైలేశుని దర్శించనిది పుణ్యము దక్కదు,

అని ఏమేమో సమాధానములతో పోయినారట అప్పుడు కొంతసేవటికి వారిలో ఒక వేశ్యాస్త్రీ, పార్వతి అమ్మవారి కోరిక ప్రకారము శివదేవుని బురదనుండి లేవనెత్త ప్రయత్నింపబోగా ఇతరులు పై విధముగా నివారించ చూచిరట 'శ్రీశైల శిఖరము దర్శనముచేయగానే నాకు ముక్తి కలిగినది అక్కడ పోయితీరవలసిన అగత్యము లేదు నేను ఏమయిపోయినా సరి ఆ ముదుసలిని బురదనుండి లేవదీయు ప్రయత్నము చేయకుండా రాజాలను' అని ఆ వేశ్యాస్త్రీ చెప్పుచూ అందుకు గడంగగా అప్పుడు పార్వతీ పరమేశ్వరులు ఆమె భక్తి విశ్వాసములకు మెచ్చుకొని కైవల్య ప్రాప్తిని ప్రసాదించినారట

**135** సుకుమారులైన తరువాత ఒకసారిగా ద్వంద్వాతీతులు కారు క్రమేణ కావలయును

**136** ఇంద్రియ నిగ్రహము పూర్తికావలయునంటే ఆత్మ సాక్షాత్కారము కావలయును కాని ఆత్మ సాక్షాత్కారము కలుగుటకు ఇంద్రియ నిగ్రహము కావలెను

**137** శివుడు ఎప్పుడు కడుపునిండి ఉన్నాడు శివ స్వరూపు లయిన జీవులు బాధపడుచున్నారు వారికి సహాయము చేయుట దైవసేవ

**138** భగవంతుని ప్రతిఫలము కోరువాడు కూలివాని మాదిరి కర్మ అంతయు నాదేయని నిష్కామకర్మ చేయువాడు నిజమయిన భగవంతుని బిడ్డ

**139** శ్రీ యేసు క్రీస్తులవారు 17 సంవత్సరములు ధ్యానసాధన యందు ఏకాంతములో నుండిరి వారు ఇతరులకు బోధచేసినది మూడు సంవత్సరములు మాత్రమే అయిఉన్నది

**140** కష్టములవల్ల సాధారణముగా చలింపక పోయినా సుఖముల వల్ల బ్రహ్మ నిష్ఠలు చెడిపోవుచున్నారు

**141** ధ్యాన సమయములో గాని యితరత్రగాని సంకల్పములు చేరునప్పుడు బ్రహ్మనిష్ఠ చాలలేదని తలంచి వృద్ధిచేయవలెను

142 శ్రీ బుద్ధదేవులు వేదములను చదువలేదు గాని, అవి చెప్పినట్లు నడచినారు భగవంతుని గురించి చెప్పలేదు గాని భగవంతుడు చెప్పినట్లు నడచినారు

143 ఎంత కష్టకార్యమయినను అభ్యాసమువల్ల సుళువు అయిపోవును అభ్యాసములేక చేయువారికి కష్టముగా నుండును అభ్యాసము పూర్తి అయిన తరువాత బహుసుళువుగాను సంతోషముగాను, ఉండును

144 యోగికూడా ఒక సంఘము, ఉపసంఘములు స్థాపించి ప్రచారము జరిపిననే గాని చిరస్థాయిగా వారి అభిమతము నిలిచి ఉండదు అందుచేత వేమన మొదలగు యోగులు స్వంతముగా కృషిచేసి వెళ్ళిపోయినందున వారి మతమున ఎక్కువ ప్రచారము జరుగలేదు

145 అలవాటుపడిన కుక్కను ఎట్లు పట్టుదలతో తోలివేయ వలయునో అట్లే అలవాటు అయిన వృత్తులను అట్టి పట్టుదలతో క్రమేణ తోలివేయ వలయును

146 శాస్త్రములంతటను ప్రధానముగా రెండు మాటల తెలుసుకొందుము భుక్తి , ముక్తి అందుచే భుక్తి విషయముకూడా అలక్ష్యము చేయరాదు ముందు అది విచారించినగాని ముక్తి సాధ్యము కాదు ముందు ముక్తి చెప్పి తరువాత భుక్తి చెప్పలేదు అయితే భుక్తి విషయములలో మునిగిపోయి ముక్తిసాధన మరువరాదు రెంటిని అనగా ఇహపరములను కలిపి తీసుకువెళ్ళవలయును

147 (ఎ) సన్న్యాసికి కూడా ఈ సిద్ధాంతము వర్తించును కాని వారు ఈ రెంటిని వారొక్కరి విషయమందే కాక సాధ్యమయినంతవరకు ప్రపంచమున అందరి విషయములోను కృషి చేయుచుండవలెను

(బి) సాధువులు సన్న్యాసులు వనములో తపస్సు చేసుకొనుచు భిక్షకు నగరములోనికి పోవచ్చును

(సి) మనుస్మృతిలో గృహస్థాశ్రమమునకు ఆధిక్యమును ఇచ్చి ఉన్నారు

(డి) పై విషయములకు తార్కాణముగా కౌశికుడు అను ఒక సన్యాసి యొక్కయు, గృహస్థుడగు ధర్మవ్యాధునియొక్కయు, గృహిణియగు ఒక

పతివ్రతయొక్కయు కథను గమనించుట సందర్భ శుద్ధియగును కౌశికుడు బ్రాహ్మణ సన్న్యాసి, తపస్వి తపశ్శక్తి కొంత సంపాదించినాడుగాని పూర్ణమగు జ్ఞానము లేదు తనకు వ్యతిరేకముగా చెప్పేవారిని శపించి భస్మము చేయుశక్తి సంపాదించుటయందు ఆసక్తి ఆవిధముగా ఒక కొంగమీద తన యోగ శక్తిని ప్రయోగపరచి భస్మము చేసినాడు ఆయన ఒక రోజున భిక్షకు గాను ఒక పతివ్రతయగు గృహిణి యింటికి వెళ్ళినాడు మీరు కొంచెము సేపు కూర్చోండి, నేను నా భర్తగారికి ఒక సేవాకార్యము పూర్తి చేసి వచ్చెదను అని ఆమెగారు చెప్పినారు అంతట కౌశికుడు కన్ను లెఱ్ఱజేసి మిర్రి మిర్రి చూచుటకు ప్రారంభించినాడు నేను కొంగనిగాదు భస్మమయి పోవటానికి అంటూ ఆ మహాతల్లి భర్తగారి పనితీర్చి పిమ్మట వచ్చి కౌశికునకు భిక్ష యిచ్చినది కౌశికుల వారికి కొంత గర్వము పోయి తనకు బ్రహ్మజ్ఞానము నుపదేశింపవలసినదని ప్రార్థించినాడు అందు నిమిత్తముగా ఆమెగారు కౌశికుని ధర్మవ్యాధులవారి దగ్గరకు పంపినారు అక్కడకు వెళ్ళి శూద్రుడగు మాంసము అమ్ముచున్న ధర్మవ్యాధుని చూచి కౌశికుడు అసహ్య పడినాడు కాని ఏపుట్టలో ఏ పాము ఉండునో అను ఆలోచనతో తొందర పడలేదు వీరిని చూడగానే ఫలాని అమ్మగారు పంపగా వచ్చినవారు కాదాయని ధర్మవ్యాధులవారు ప్రశ్నించి జవాబు నెరింగి తనకర్తవ్య నిర్వహణము పూర్తియగు వరకు వేచి యుండవలయునని చెప్పి ముందు తన పనులన్ని క్రమముగా పూర్తిచేసి పిమ్మట తల్లిదండ్రులను యథావిధిగా పూజచేసి తరువాత కౌశికునికి భిక్ష ఇచ్చి వారికి బ్రహ్మ జ్ఞానము నుపదేశించి పంపినారు ధర్మ నిర్వహణమువల్లనే వారికి ఇట్టి శక్తులు కలిగినవి

(ఇ) మనుజుడు ముందు తల్లిని, పిమ్మట తండ్రిని, తరువాత గురువును పూజింపవలయును

**148** కేవలం స్వానుభవము ఉపయోగము లేదు కేవలం శాస్త్రజ్ఞానము ఉపయోగము లేదు రెండు కలసిన తరించవచ్చు అందుచే జ్ఞానవిజ్ఞానములు కలియవలయునని శ్రీ మద్ భగవద్గీత 7 వ అధ్యాయములో చెప్పినది

**149** పది సంవత్సరములు బ్రహ్మచర్యము నందుండి సంస్కృతమును బాగా చదివిన మనము ఋషి కుమారులము అని బోధపడును

150 ఎక్కడ ఏ ఆశ్రమమునందు ఏ ధర్మమును అవలంబింప దలచినామో అది ఎట్లు చేయవలయునో అట్లు శ్రద్ధకలిగి పూర్తిగా చేయువాడే కృతకృత్యుడు కృతార్ధుడు

151 మనసుద్వారా భావనాశక్తియే మనలను సదాశివుని వరకు తీసుకొనిపోవును, అట్టిదే క్రిందికి పశువు వరకు తీసుకొని పోవుటకు కూడా ఉపయోగపడును భావశుద్ధివల్ల జాతి శూద్రుడు బ్రాహ్మణోత్తముడు కాగలడు అయితే ఆ భావనకు తగిన ఆచరణ కలిగి యుండవలెను

152 వెతుకువానికి దొరకును, తట్టేవానికి తెరవబడును అడిగేవానికి యివ్వబడును అని శ్రీ యేసుదేవుడు చెప్పియున్నారు

153 వ్రతము ఏదైనా దృఢముగా ఉండవలెను గీత, అ 7 శ్లో॥ 28 చూడుడు

154 ఆత్మ శుద్ధిగలవారి సంకల్పములకు విఘ్నములు కలుగవు విఘ్నములు కలుగుచో ఆత్మశుద్ధి యందు లోటు ఉన్నదని గ్రహించవలెను

155 మోక్షమార్గము బహిరంగమయిన దారి అందు రహస్యములు లేవు వెల్తురు దారి అక్కడ చీకటి లేదు

156 ధర్మ నిర్వచనమునకు ఉత్తమ గ్రంధము మనుస్మృతి

157 అన్ని పిండి వంటలలో ప్రధానము పంచదార, నెయ్యి, పిండి అట్లనే సమస్త శాస్త్రములలో ముఖ్యవిషయము జీవుడు, జగత్తు, ఈశ్వరుడు అని శ్రీ రామకృష్ణ పరమ హంసలవారి సుభాషితము

158 ధ్యానము లయము క్రమ క్రమేణ వృద్ధి జేయవలయును సంసార కాల చక్రమునుండి వీడిపోవుట, దైవకార్యక్రమమునందు తగులు కొనుట క్రమేణ చేయుట మంచిది

159 వైరాగ్యము సరి అయినదా లేదా అను పరీక్షకు అందువల్ల శాంతి గలిగినదా లేదా యని చూడుడు దుఃఖము కలిగిన అది సరియయిన వైరాగ్యముకాదు

160 దైవానుగ్రహముగాని, గురుకరుణగాని, ఆత్మ పుణ్యము గాని లేనిది గొప్ప వారు కారు

161 ఒకరాజు తన ఆస్థాన పండితులు మంత్రిగార్లతో భగవంతుడు ఎక్కడ ఉన్నాడు? ఏ వైపుగా కూర్చున్నాడు? ఏమిపని చేస్తున్నాడు? అను ప్రశ్నలు చేసి సమాధానము చెప్పుటకు ఒక గడువు రోజు ఏర్పాటు చేసి, ఆ ప్రశ్నలకు సరియగు సమాధానము చెప్పనిచో వారి అగ్రహారములు ఉద్యోగములు తొలగించెదనని చెప్పినారు వారు చెప్పినాసరి లేక ఎవరితోనైనా చెప్పించినా సరి అని కూడా అన్నారు ఎవ్వరు చెప్పలేక పోయినారు గడువురోజు వచ్చినది మంత్రిగారి ఉద్యోగము కూడా ఆ రోజుతో ఊడిపోవునని ఆయన విచారించుచుండగా వారి వద్దనున్న ఒక నౌకరుకు ఈ విషయం తెలిసి నేను వెళ్ళి సమాధానము చెప్పివచ్చెదనని చెప్పినాడు ఆయన భక్తుడు, జ్ఞాని రాజసభ సమావేశము అయినది ఆ నౌకరు సభకు వచ్చి బోధచెప్పువారు ఎత్తుమీద ఉండవలెను మిగతా వారు దిగువనుండవలెను అని చెప్పుతూ రాజుగారిని కూడా సింహాసనము నుండి దింపి అందుపై కూర్చున్నవాడైఒక దీపము, ఒక చెంబు, ఆవు పాలు తెప్పించినాడు ఆవు పాలనుండి వెన్న తీయువరకు అవసరమగు పనులు చేయించి చూపినాడు ఈ ఆవుపాలయందు అంతటా వెన్న ఉన్ననూ మధించుట మొదలగు కార్యములు చేయనిచో ఎట్లు వెన్నను చూడలేమో అట్లే అంతట భగవంతుడు నిండియున్నను బ్రహ్మనిష్ఠలవల్లగాని చూడజాలము అని చెప్పినాడు ఇంక రెండవ ప్రశ్నకు అక్కడవున్న దీపము ఏ వైపుకు కూర్చున్నదో ఆ వైపుకు భగవంతుడు కూర్చొని వున్నాడు అని చెప్పినాడు రాజుసింహాసనము దిగగా అందుపై నేను కూర్చున్నటుల తన భక్తులను పైకి తీసుకొని వచ్చి మిగతా వారిని క్రిందికి దింపుపనిచేయు చున్నాడు భగవంతుడు అని మూడవప్రశ్నకు ప్రత్యుత్తర మొసగినాడు అంతట రాజుగారు మెచ్చి వారిఆజ్ఞ ప్రకారమే మిగతావారి అగ్రహారములు వుద్యోగములు తొలగించి వాటిని అతనికి వీరికి సమర్పించి నారట

162 వ్యష్టికి సాక్షిని కనుగొనుట ధ్యానాదులవల్ల అగును సమిష్టికి సాక్షిని కనుగొనుట మాయాదృష్టి అంతయు నశింపు అయినగాని సాధ్యము కాదు

163 మహాత్ములయిన వారుకూడా ఏదో ఒక కార్యమునందు మాత్రమే

సంచరించగలరు

164 మంత్రోపదేశమును గురించి యీ కథ గమనించ దగినది ఒక జమీందారు ఒక సన్న్యాసిని గురువుగా భావించినారు మంత్రోపదేశము చేయమని కోరగా (రజోగుణము పోలేదని) చాలాకాలము గడిపినందున జమీందారుకు విసుగు జనించి అందు విషయమై గట్టి పట్టు పట్టినారట అందుపై ప్రపంచములో ఎవరికి పనికిరాని వస్తువును గురుదక్షిణగా తెచ్చిన ఉపదేశము చేసెదనని సన్న్యాసి చెప్పినారు జమిందారు తిరిగి తిరిగి ఏమియు దొరకక కడపట ఒక పూజారి బాహ్యమున విడచిన పదార్థమును నేలనుండి తీయుటకు యత్నించగా "అది నన్ను ముట్టకు నీవు అపవిత్రుడవు, నేను నిన్నటివరకు గుడిలో నైవేద్యవస్తువును ఒక రాత్రి మనుజుని కడుపులో నుండి యీ నీచ స్థితికి వచ్చినాను" అని చెప్పినదట అంతట జమిందారునకు రజోగుణాంశము లన్నియు తొలగి పోయి సత్వగుణం కలుగగా సన్న్యాసి వారికి మంత్రోపదేశము చేసినారు

165 అచరవస్తువులు బాగుగా నుండినగాని చరవస్తువులకు ఉపయోగమునకు వీలుండదని అచరవస్తువులు కూడా క్షేమంగా నుండవలెనని కోరుటకు కారణమయి ఉన్నది

166 బృహదారణ్యకోపనిషత్తులో 'మధురవిద్య' అను ఒక మంత్రము కలదు, అది సిద్ధించిన వారు జలము మంత్రించి ఎండిపోయిన మొద్దుమీద జల్లిన అది చిగిరించును శ్రీ వారి గురువులవారి గురువులగు శ్రీశంకర స్వాముల వారి స్నేహితులలో అట్టివారు ఉండినారట జయేంద్రపురి అని వారిపేరు, ఇది స్వయముగా చూచిన వారు ఉన్నారని శ్రీవారు చెప్పినారు

167 గురువునందుగాని, మంత్రమునందుగాని, ఒక విగ్రహము నందుగాని మరి దేనియందుగాని మనసునందు ఎంతగొప్ప విశ్వాసము ఉండునో అంత ఫలితము మనకు వచ్చును

168 బ్రహ్మవేత్తలందరి శరీరము సామాన్యముగా చాలా బలముగా ఉండును నావ గట్టిగా నుండినగాని యితరులను సంసారసాగరమును దాటించ

వీలుండదు

169 అహంకారము నశించుటకు భక్తి ప్రధానము దుఃఖము మొదలగునవి శమించుటకు యోగము

170 "పరమాంగతిం" అనగా జనన మరణదుఃఖములు ఉండని గతి యని యర్థము జనన మరణములు ఉండవచ్చును గాని వాటిని గురించిన దుఃఖము లుండవు

171 శ్రీ కృష్ణ చైతన్యులవారు చాలా పట్టుదల కలవారు చిన్నతనంలో చాలా పెంకిపట్టు పట్టేవారట వారి తల్లి ఇట్టి పెంకిపిల్లవాని నిచ్చినావా కృష్ణాయని ప్రార్థించుచుండగా, ఆ కృష్ణా యను నామము వినగానే శ్రీ చైతన్యులు సమాధిలో మునిగి మూర్ఛ చెందువారట!

172 ఎక్కడెక్కడ మన సాధనలకు అడ్డు తగులునో ఆ చోటును విడిచిపెట్టిగాని లేక శ్రద్ధ మిక్కిలి పట్టుదల కలిగి ఆ విఘ్నములను ఏదో విధముగా తొలగించుకొని గాని సాధనలను యథాప్రకారము సాగులాగున చూచుకొనవలయును విశుద్ధగుణము ననుసరించవలయును సాత్త్వికమును అనుసరించిన సాగదు, సాలెపురుగు రాబర్టు బ్రూసు అను ఇంగ్లీషు కథ జ్ఞాపకముంచవలయును

173 ఎంతవరకు వృత్తులు ఉండునో అంతవరకు ధ్యానము బ్రహ్మ నిష్ఠ విడువరాదు సమస్తశాస్త్రములు, మహాపురుషులందరు, మన స్వానుభవము చెప్పునది యిదేను జన్మ జన్మాంతర వాసనలన్నియు కూడా పోవలెను ఏ మాత్రము శేషమున్ను ఉండరాదు అట్లున్నచో కందగడ్డలుగా తిరిగి పిలకలు వేసి వృద్ధియగును స్వప్నములో ఎట్టి వృత్తులు పొడసూప కుండుటే అందుకు పరీక్ష బ్రహ్మాచింతనము, గురుమంత్రము విషయము తప్ప మరేమియు రారాదు అప్పుడే వృత్తులన్నియు నశించి పోయినట్లు గుర్తు

174 తరిగొండ వెంగమాంబ, శ్రీరామ కృష్ణ పరమహంసల వారి సతీమణి శ్రీ శారదా దేవిగార్లను గురించియు ఈ క్రింది విషయములు శ్రద్ధతో గమనించేది

భర్తగారు చనిపోయినప్పుడు శ్రీ శారదాదేవిగారు పుణ్యస్త్రీ శృంగారములు తీసివేయ యత్నించగా కలలో భర్తగారు కనుబడి "నేను చని పోలేదు, బ్రతికియే ఉన్నాను, రెండువందల సంవత్సరముల పిమ్మట మరొక దేహము ధరించుతాను నీవు బొట్టు, జుట్టు మొదలగు అలంకరణములు తీయవలదు" అని హెచ్చరించినారట ఆమె అట్లే నడచినారు

వెంగమాంబగారికి శుభకార్యము చేయ యత్నించినప్పుడు భర్త గారు ముట్టుకొనబోగా 'నేను భగవంతుని భార్యను, నీవు తాక వలదు, అట్లు చేసిన నీవు మూడు రోజులలో చనిపోతావు' అని వారించినారు అయినప్పటికి భర్తగారు అంటుకొనుట, ఆమె అన్నట్లె మూడురోజులలోనే చనిపోవుట సంభవించినది ఆ పిమ్మట కూడా ఆమె బొట్టు, జుట్టు మొదలగు మంగళ చిహ్నములు మామూలుగా ధరించే వారట శంకరపీఠాధిపతి వారిని పిలిపించి అట్లుచేయుట అధర్మం అని మందలించగా నా భర్తగారు వాస్తవముగా శ్రీ నారాయణమూర్తి అందుచే నేను ఎల్లప్పుడు పుణ్యస్త్రీనే అన్నారట చుట్టునున్నవారు ముందు పీఠాధిపతికి నమస్కరించమనగా తిరస్కరించినారట పీఠము ఆదిశంకరుల వారిది గనుక నమస్కరించ మన్నారట అట్లయినచో పీఠాధిపతిని లేవమనిచెప్పి అట్లు వారు లేచిన పిమ్మట వెంగమాంబగారు నమస్కరించగా పీఠము భస్మమయిపోయినదట భగవంతుని భర్తగా సేవించినవారగుట వలన అట్టి మహిమాతి శయములు కలిగినవి

175 శ్రీగాంధి గారు స్వరాజ్యమునకై యత్నించుచున్న, మనము స్వారాజ్యమునకు కృషి సల్పవలయును పుణ్యసతులవద్ద భిక్ష గైకొని బ్రహ్మచింతనము చేయవలయును

176 మనసు వశము కాకపోగా శ్రీ రామతీర్థులవారు రెండువైపు పదును గలిగిన ఒక కత్తిని ఎదురుగా నుంచుకొని మనసుకు చెప్పినారట నీవు కదలితివా యీ బాకును రొమ్ములో నాటుతాను జాగ్రత్త అని నరములారా! అన్ని మాంసములారా! మీకు ఇష్టము లేనిచో లేచిపొండు, నేను నిర్వాణము చెందువరకు ఇచ్చట నుండి కదలను అని శ్రీ బుద్ధదేవుడు నలువదిరోజులు దీక్షగా కుర్చున్నారు, సాధువులు ఇట్టి అభ్యాసము, శ్రద్ధను కలిగియుండవలెను

177 గారె పచ్చిపిండితో చేయునప్పుడు శబ్దము లేక యుండును నూనెలో వేసినప్పుడు చప్పుడగును, తరువాత ఆగిపోవును, అట్లనే ధ్యానమునకు ముందు సంకల్పము ఎక్కువ లేకుండా శాంతముగా ఉండవచ్చును ధ్యానము మొదలు పెట్టగానే సంకల్పములు ఎక్కువగా వచ్చి చేరును

178 శ్రీజనకమహారాజు ఒక పురాణమును చదివించుకొను చుండగా అందు గుఱ్ఱమును ఎక్కునపుడు ఒక రికాబులో కాలుపెట్టి రెండవ రికాబులో కాలు పెట్టులోపుగా ముక్తి పొందవచ్చును అను అంశమును తెలుసుకొని యిది వాస్తవమేనా? అయినచో ఎట్లు చూపవలె? అసత్యమయినచో ఈ శాస్త్రమును తగుల బెట్టించెదను అని పట్టుబట్టగా ఆస్థాన పండితులు ఎవరు ఆవిషయము బోధపరుప జాలక పోయినారు రాజు వారిని జయిలు నందుకూడా పెట్టించినారు రాజ్యములోనికి వచ్చే యితర పండితులకు సన్న్యాసులకు ఇదే ప్రశ్న వేయుటయు చెప్పలేకపోతే రాజ్యములోనికే రానివ్వకుండా పంపివేయుమని ఆజ్ఞాపించినారు ఎవ్వరు సాహసింపజాలక పోగా కట్టకడపట అష్టావక్రమునీంద్రులు (అనగా శరీరములో అష్టవంకరలు గలవారు) నేను చెప్పెదనని వచ్చినారు పురాణమునందలి ఆ భాగమునకు పైన క్రింద కొంతవరకు జదివించి అందు చెప్పబడిన గుణములు కూడా కలిగి ఉంటే గాని యట్లు జరుగదు అన్నారు అట్టిగుణములు కలిగి ఉన్నా యిట్లు జరుగునా అని శ్రీ జనకులు తిరిగి ప్రశ్నించినారు అవును అని చెప్పి శ్రీ అష్టావక్రులు జనకుని, ఒక గుఱ్ఱమును అరణ్యమునకు తీసుకువెళ్ళి అక్కడ జనకుని చేత రాజ్యమును విసర్జింప చేసినారు అటుపిమ్మట జనకునిచే గుఱ్ఱపు రికాబులో ఒక కాలు పెట్టించి వెంటనే వారి మనసును తనకు దానము చేయమని కోరగా అట్లు జనకులు "చేసినాను", అని చెప్పగానే అమనస్కము గలిగినవారై సమాధిచెంది అట్లే నిలచి పోయినారు, తిరిగి బ్రహ్మరంధ్రము మీద ఆవునేయి వగైరాలు కలిపి మర్దన చేసిన గాని తిరిగి మనసు కలుగలేదు అప్పుడు ఈ మనసు ఇట్లు లయించి ఉంచియే రాజ్యము చెయ్యమని అష్టావక్రులు చెప్పగా జనకులు అట్లే నడిచినారు అష్టావక్ర గీతయను ఒక మహాగీతను కూడా జనకులకు బోధించి నారు ఇట్టి ఉత్తమ గాధలు ఎన్నియో కలవు, కాని చదువువారు తక్కువయినారు అట్లాచరించువారు ఇంకా తగ్గిపోయినారు

179 శిష్యుని యొక్క అమనస్కము అనగా గురువులవారి మనసును సమర్పించి స్వంతఆలోచన ఏమి లేకుండా వారు చెప్పి నట్లంతా చేయుటయే

180 శ్రద్ధ అనగా ఏ సమయమున ఏ పని ఎట్లు చేయ వలయునో (ఎంత చిన్నపని అయినను) అట్లు చేయుటయే గీత అ 17 శ్లోకము 3 చూడుడు అందుకు పైభాగమున బ్రహ్మవిద్య యొక్క సౌకర్యములు చెప్పి అందుకు కావలసినది శ్రద్ధ ఒక్కటియే అని బోధించినారు

181 గీత అ 9 శ్లో॥ 22 ఉపాసన అను పదమునకు నాలుగు అర్థములు గమనించేది

(అ) భగవంతునికి ఏదో ఒక రూపము, ఒక పేరు పెట్టుకొని అట్లు సేవించితేనే ఫలితము గలదు, లేకపోతే లేదు అను వారు తమోగుణోపాసకులు

(ఆ) అట్లు ఒక నామరూపముతోనే సేవించుతూ ఇతర విధములను దూషించక పతివ్రత స్త్రీ భర్తను సేవించినట్లు చేయువారు రజోగుణోపాసకులు

(ఇ) అన్ని వస్తువులలోను (సమానంగా) ఉండు సద్వస్తువును ఉపాసించువారు సత్త్వగుణోపాసకులు

(ఈ) అన్ని వస్తువు లోనుండు సద్వస్తువు అన్ని వస్తువులు కూడా ఒకటే వస్తువుగా భజించువారు విశుద్ధగుణోపాసకులు ఇది చాలా గొప్పస్థితి ఇది అందరికి సాధ్యము కాదు మూడవది కలిగి ఉండిన చాలును

182 ఒక రాజు గీతార్థమును ఎంతో మంది పండితుల వల్ల చెప్పించుకునే వారు వారు ఎన్నెన్నో విధముల చెప్పినారు అంతా విన్న తరువాత వారిని రాజు సత్కరించి పంపేవారు వారు వెళ్ళునప్పుడు గీతార్థము యింతేనా ఇంకా ఏమయినా ఉందా అని ప్రతివారిని అడిగేవారు ఒక పండితుడు ప్రతి అక్షరానికి ఎన్నో అర్థాలు చెప్పినాడు, ఆఖరున వారిని కూడా రాజు మామూలు ప్రశ్న వేసినారు ఆయన ఇంటికివెళ్ళి యింకా పరిశ్రమచేసి ఆరునెలల పిమ్మట తిరిగి రాజువద్దకు వచ్చి పొల్లు పొల్లుకు అనేకార్థములు చెప్పినారట అయినప్పటికివారు ఇంటికి పోవునప్పుడు రాజుగారు తిరిగి మామూలుగా ప్రశ్నించినారు ఆ పండితుడు ఇంటికివెళ్ళి గీత

18 అధ్యాయములున్నూ రోజూ పూర్తిగా, 108 రోజులు పఠించగా అప్పటికి కొంత అనుభవార్థమును గ్రహించినారు వారిని తీసుకురావలసినదని రాజుగారు మనిషిని పంపినారట, ఇంకా ఎంతో గీతార్థమును గ్రహించవలసి ఉన్నది నాకు ఇప్పుడు కొంచెమే వచ్చినది నేను ఇప్పుడు రానుఅన్నారు అట్లనే యింకా పఠించుచురాగా రాజే స్వయముగా వచ్చినారరు ఆయన ఇదే సమాధానం చెప్పినారట అప్పుడు రాజు సంతసించి కొన్ని అగ్రహారములు ఇచ్చినారు అప్పుడు గీత అ 9 శ్లో॥ 22 యొక్క అర్థము ఆ పండితునకు బోధపడినదట ఇట్లనే గీతార్థము (అనుభవముతో కూడినది) ఎంతో ఉండును

183 ఒక భక్తుడు రాజకుమారునకు, ఇంకా కొంతమందికి విద్య నేర్పువాడు ప్రతిఫలము అడుగువాడు కాదు అయినను ఏదో విధంగా జీవనం జరిగిపోతూంది రోజూ గీతాపారాయణం చేయువాడు భోజనమునకు తల్లి వచ్చి పిలిచినచో వెళ్ళువాడు, అన్నము ఉంటే తల్లివచ్చి పిలిచేది లేకపోతే లేదు ఒకనాడు తల్లి పిలువలేదు ఆరోజున గీత 9 వ అధ్యాయమును పారాయణ చేయుచు 22 వ శ్లోకమను చదివి అందలి యధార్థమును శంకచేయుచు రెండువైపుల గీతలు పెట్టినాడు వెంటనే శ్రీ కృష్ణభగవానులు రాజకుమారుని వేషముతో ఒక తట్టనిండా అమూల్యములగు రత్నములు ఉండజేసి వాటిపైన ఒక రోజుకు అందరికి సరిపోవు భోజన పదార్థములతో నింపి రెండు దవడలమీద రెండుగీతలవంటి గాయములు రక్తము కారుచుండగా ఆభక్తుని యింటికివచ్చి ఆతట్టను ఆ భక్తుని తల్లిగారి చేతికిచ్చినారు అప్పుడు ఆమె ఆ గాయములేమి నాయనా అని అడుగగా చెప్పినట్లు నేను చేయుచున్నానా లేదా యని సందేహించి మీ కుమారుడు ఇట్లు గీచినారు అని చెప్పి (ఆ భక్తునకు కనబడకుండానే ) వెళ్ళినారు తల్లిగారు కుమారుని భోజనమునకు పిలుచుటకు వెళ్ళగా ఈ సంగతులు ఆయన తెలుసుకొని రాజకుమారుని పిలిపించి ఋజువు కోసరము ప్రశ్నించగా ఆయన తనకేమి తెలియదని చెప్పినాడు, అందుపైన భగవానుడే యీ పనిచేసి ఉండవలయును, అని గ్రహించి అవిశ్వాసి అయినందుకు ఎంతో పశ్చాత్తాపమును చెంది వెంటనే సన్న్యసించి ఆభక్తుడు కుటుంబముతో సహా తీర్థయాత్రలకు వెళ్ళిపోయినా

184 ఆవగింజంత విశ్వాసమున్న కొండంత పనిచేయవచ్చును, (శ్రీయేసుక్రీస్తులవారు)

185 కూర్చున్న సమయంలో ఒకరు యోగి అవునా యని చూడవలెనన్న " సమంకాయ శిరోగ్రీవం" అన్న విధంగా కూర్చుని ఉండుటేగుర్తు

186 మానవులు మాయా మోహితులై అన్నవస్త్రాదులు ఎట్లు దొరకునో అని అనుమానవడి దుఃఖపడుచుందురు బ్రతుకునంతవరకు ఎవరికి రావలసినవి వారికి ముందే సిద్ధపరచి ఉంచినారు భగవానులు కాని మన కర్తవ్యమును మాత్రము చేయుచునే యుండవలయును

187 ప్రపంచానుభవము లేని నిర్మలభక్తి గల ఒక బ్రహ్మచారి తపస్వి నిత్యము భిక్షకు మాత్రము ఊరిలోనికి పోవువారు ఒక పుణ్యస్త్రీ రోజూ భిక్ష యిస్తూ ఉండేవారట ఒక రోజున ఆ బ్రహ్మచారి తన కాలుమీద పెద్ద సెగగడ్డచే బాధపడుచూ ఆమెగారి యింటికి భిక్షకు పోగా ఆ యమ్మగారు సన్నని చీరతో అప్పుడే స్నానము చేస్తూ అట్లనేవచ్చి భిక్ష ఇచ్చినారట అప్పుడు ఆయమ్మ పాలిండ్లుచూచి ఆ బ్రహ్మచారి అది సెగగడ్డలు అని ఎంచి అమ్మా నేను ఒక సెగగడ్డతోనే ఎంతో బాధపడుచున్నాను, రెండు సెగగడ్డలతో మీరు ఎంత బాధపడుచున్నారో, అని విచార పడసాగినాడు నాయనా! అవి సెగగడ్డలు కావు ఇక ముందు పుట్టబోవు బిడ్డలకు పాలనిమిత్తము భగవంతుడు ముందుగనే వీటిని ఏర్పాటుచేసి ఉంచినాడు. అని ఆ యమ్మగారు సమాధానము చెప్పినారు అంతట ఆ బ్రహ్మచారి ఆహా! నేను ఎంతటి అవిశ్వాసిని! ఇకముందు పుట్టబోవు వారికే భగవంతుడు ఆహారము ఏర్పాటు చేసి ఉంచగా బ్రతికి ఉన్నవారికి అట్లు చేయక నిద్రపోవునా అని తలంచుచు తన భిక్షాపాత్రను నేలపై పారవేసి వారి స్థానమునకు వెళ్ళి తపస్సులో తదేకనిష్ఠతో కూర్చున్నాడట అప్పుడు మారురూపుతో వారికి శ్రీ కృష్ణభగవంతుడే ఆహారము అక్కడ చేర్చిపోవుచుండిరి మామూలుగా భిక్ష యిచ్చుచుండు ఆ పుణ్యాంగన యొక్క భర్తగారు వెళ్ళి భగవంతుడే స్వయంగా భిక్షయిచ్చుట చూచినారు తరువాత వారే భిక్ష అక్కడికి వచ్చి యిచ్చుచుండువారట భగవంతుని యందు విశ్వాసముగల వారికి జరుగు ఏర్పాటు ఇట్లుండును మామూలుగా బిడ్డలు పుట్టకముందే పాలువచ్చి

చేరును జంతువులకు కూడా యిట్లే ఏర్పాటు గలదు

188 "పత్రం పుష్పం ఫలం తోయం " అని గీత 9 అ 26 శ్లోకములో చెప్పబడినట్లు ఏది యిచ్చినను భక్తితో సమర్పింపవలయును

ఒకరి తపస్సుకు మెచ్చి భగవంతుడు ప్రత్యక్షమైనారట ఆ తపస్వి తాను మామూలుగా భోజనముచేయు నిమిత్తము ఉంచుకున్న అరటిపండ్లను తోళ్ళు తొలగించి తొందరలో పండ్లు పారవేసి తోళ్ళు భగవంతుని నోటికి అందించగా ప్రీతిగా ఆరగించినారట తరువాత చూచి గ్రహించి క్రింద పారవేసిన గుజ్జును తిరిగి భగవంతుని నోటియందు పెట్టగా నుమిసివేసి నారట అదేమి కారణమని భక్తుడడుగగా మొదట నీవు నిర్మలభక్తితో ఇచ్చినావు గనుక గ్రహించినాను, రెండవతూరి అది యిదియను భేదబుద్ధితో ఇచ్చినావు గనుక విసర్జించినాను అని భగవంతడు చెప్పినారట

ఇద్దరు స్నేహితులు ఒకడు భక్తుడు రెండవవాడు ఆత్మజ్ఞాని భక్తుడు వేంకటేశ్వరస్వామికి నైవేద్యము ఇమ్మని రెండు దోసపండ్లను ఆ జ్ఞానికిచ్చి పంపినారు దారిలో ఆకలివేయగా అందు ఒక పండును తిని రెండవ పండును మాత్రమే జ్ఞాని ఆలయములో ఇచ్చినారు భగవంతుడు భక్తుని కలలో కనబడి ఒక పండు మాత్రమే తనకు చేరినట్లు చెప్పినాడు భక్తుడు కోపముతో ఆత్మజ్ఞాని పిలిచి మందలించినాడు, నీవు భగవంతుని ధ్యానము చేసుకొని ఏపండును తినినది తెలుసుకొనుము అని ఆ జ్ఞాని సమాధానము చెప్పినారట ఆ భక్తుడు అట్లు ఆచరించగా ఆత్మజ్ఞాని తిన్నపండే తనకు చేరినట్లు, దేవాలయములో ఇవ్వబడినపండు తనకు చేరనట్లు భగవంతుడు తెలియజేసినారట!

189 అందరు భోజనము చేయునప్పుడు ఆత్మధ్యానముతో తినవలయును

190 మహనీయుల కోపము నీటిపై అక్షరమువంటిది, సామాన్యుల కోపము నేలమీద వ్రాసినది పాపులగు వారిది రాతిపైన వ్రాసినది

191 బంధనము లుండువరకు ముక్తిలేదు

ఒకరాజు తన బంధనములను తెంపుకొను విధము ఆచరణయందు పెట్టకనే పరీక్షిన్మహారాజువలె ఏడు రోజులలో మోక్షమిప్పించుమని తన ఆస్థాన పండితునితో చెప్పి అట్లు చేయకపోయినచో ఉద్యోగము నుండి తీసివేసెదనని ఆజ్ఞాపించినాడు, పాప మా యాస్థాన పండితుడు ఎంతయో ప్రయత్నించినాడట, ఆరురోజులు గడచి పోయినవి రాజు ఏమియు దారికి వచ్చినట్లు కనుపించలేదు 7 వరోజు కూడా జరిగిపోతే ఉద్యోగం ఉండదు ఈ సంగతి ఆ పండితుని సేవకుడు తెలుసుకొని ఆ దినము నన్ను నియమించండి నేను పని పూర్తిచేస్తాను అని చెప్పి తానే వెళ్ళినాడు, పురాణము ప్రారంభించు టకు ముందు రాజు బందీకృతుడు కావలసివున్నది అని ఆసేవకుడు చెప్పినారట మోక్షము చిక్కుటకు అదికూడా అవసరము కాబోలు అని రాజు అంగీక రించినాడు రాజును ఒక స్తంభమునకు చేరదీసి కట్టి కాలుచేతులు కూడా బంధించినారు ఆ పిమ్మట ఆ సేవకుడు అనేక రకముల ఫల హారములు తెప్పించి రాజుముందుపెట్టి వాటిని భుజించుమని చెప్పినాడు అదెట్లు రాజుకు సాధ్యమగును? పరీక్షిన్మహారాజువలె మీకు తగిన వైరాగ్యము లేదు మీ బంధనములు తెగలేదు అట్టి స్థితిలో 7 రోజులలో మోక్షమిప్పించు టకు ఎట్లు సాధ్యమగును అని అతడు సమాధానము చెప్పినాడు అంతట రాజు సిగ్గుచెంది వూరకున్నాడు

192 ముందుజన్మల స్థితిగతులనుగురించి మా ఆశయము "స్వబోధసుధాకరము" లో శుద్ధ జిజ్ఞాస అను శీర్షిక క్రింద తెలియజేయడ మయినది, ఈ సందర్భములో "న త్వహం కామయే రాజ్యం " అని ప్రహ్లాదుని ఆశయమును గమనించేది

193 అపరోక్ష జ్ఞానము గలిగినవారికి అన్ని కర్మములు నశించి పోవును పరోక్షజ్ఞానము మాత్రము కలిగినవారికి అట్లు కర్మలు నశింపవు కాని ఈశ్వరుడు ఉన్నాడు, రక్షించుతాడు అని నమ్మకము మాత్రము కలిగి ఉందురు

194 అమనస్కము నాల్గు విధములు -

(అ) మనస్సును పూర్తిగా స్వాధీనపరచుకొని యుండుట

(ఆ) ధ్యానముచేత మనస్సును లయమొనరించుట (యోగశాస్త్ర

విధానము)

(ఇ) మనస్సునకు సాక్షిగా నుండి మనసును నియమించుట (గొప్ప బోధనాశక్తి గలవారు)

(ఈ) మనసు అనగా ఒకటి వేరేమి లేదు, సంస్కార వాసనా సమూహామే మనసు అని యెంచి వాటిని విడుచుట

195 ఈశ్వర మహిమ అనగా ఎంతవాడో ఎట్లుండునో ఏమి విభూతి కలవాడో పూర్తిగా తెలుసుకోవలయునని ఒక సాధువు 12 సం॥లు తపస్సుచేసినాడు భగవంతుడొక సాధువేషము ధరించి ఆ సాధువునకు దర్శనమిచ్చి భగవంతుని పూర్తిగా తెలుసుకొనుట సాధ్యము కాదు నీ ప్రయత్నము మానవలసినది అని చెప్పి వెళ్ళినాడట అయినను ఆసాధువు పట్టువిడువక మరొక 12 సం॥ తపస్సుచేసినాడు అప్పుడు తిరిగి సాధువేషముతో భగవంతుడు ప్రత్యక్షమయి భగవంతు డెంతవాడో తెలిసినదా అని అడిగినాడు ఆ ! కొంచెము తెలిసినది అని అతడు చెప్పినాడు అట్లనే తిరిగి 12 సం॥లు తపస్సు అనగా మొత్తము 36 సంవత్సరములు తదేకనిష్ఠతో తపము చేయుట జరిగినది అప్పుడు తిరిగి భగవంతుడు ఇదివరలో వలెనే వచ్చి ప్రశ్నించగా ఆ! పూర్తిగా తెలిసినది భగవంతుని పూర్తిగా తెలుసుకొనుట ఎప్పటికి సాధ్యము కాదని పూర్తిగా తెలిసినది అని ఆ సాధువు ప్రత్యుత్తర మిచ్చినాడట

అదే యధార్థము మన యీ యింద్రియ సముదాయముతో గాని లేక ఈ శరీరములలో ఉండు నెట్టి శక్తి వల్లగాని భగవంతుని పూర్తిగా తెలుసుకొనుట సాధ్యము కాదు తెలిసినను వర్ణించే విధము లేదు అయినను తెలియ తగినంత స్థితిని మన ఆచరణానుభవములోనికి తెచ్చుకొని ఉంచిన చాలును

196 పట్టుకారు (వజ్రుంగులు కంసాలుల వద్ద మామూలుగా ఉండు ఒక పనిముట్టు) అన్నింటిని పట్టుకొనునే గాని ఆ అన్నీ పట్టుకారుని పట్టు కొనజాలవు అట్లనే భగవంతు డన్నింటిని పూర్తిగా తెలుసుకొన గల శక్తి గలవాడే గాని భగవంతుని పూర్తిగా తెలుసుకొనగల శక్తి యెవరికిలేదు

197 గ్రహణము (అనగా సూర్యునికి గాని చంద్రునికి గాని గ్రహణ సమయములో నుండుస్థితి) విడిచినప్పుడు మానవులు స్నాన జప హోమ దాన అన్న ప్రదానములు మొదలగునవి ఎట్లు జరుపుదురో అట్లే అవిద్యాగ్రహము తొలగిపోయిన వారుకూడా ఎప్పుడును స్నానం, జపం, హోమం, దానం అన్న ప్రదానం మొదలగునవి చేయుచుందురు అట్లు వారు జరుపక పోయినను వారి సమక్షములో ఇతరులు వాటిని జరుపుచుందురు

198 (అ) మనము మహర్షుల సంతానము అని భావించినచో పవిత్రులము అగుదుము

(ఆ) ఇతరులు కూడా ఋషి సంప్రదాయము అని మనలను గురించి చెప్పునప్పుడు మనము అందుకు తగిన ఆచరణతో నుండవలదా?

(ఇ) లేనిచో ఋషియగు గురువుచే బోధ పొంది గురు సంప్రదాయమును అనుసరించుచున్నాము అందుకు తగిన పవిత్రత కలిగి ఉండవలదా?

(ఈ) నేను ఈశ్వరుని కుమారుడను అని భావించుట యింకింత మంచిది

(ఉ) ఈశ్వరాంశము లేక స్వరూపము అనునది యింకా పవిత్ర భావము

(ఊ) ఈశ్వరుడు తప్ప వేరేమియు లేదు నేను ఈశ్వరుడనే అని ఎంచు భావము ఇంకా గొప్పది అట్టి భావనలన్నియు మనలను పవిత్రులుగా జేయును

(ఋ) సప్తమహాఋషులు ప్రవృత్తి మార్గమును నిరూపించినారు సనకసనందనాదులు నివృత్తి మార్గమును చూపినారు

199 పూజా, జప, ధ్యానములన్నియు అట్టి భావనార్థము కొఱకే ఏర్పడినవే కాని యింక వేరుకాదు అట్టి భావన గలిగి ఉన్నవారికి ఏమియు అవసరము లేదు అట్టి భావశుద్ధియే జ్ఞానసిద్ధి

200 ఉపవాసము అనగా భగవంతుని సన్నిధిలో వసించుట యని అర్థము, అన్ని పనులు కట్టిపెట్టి భగవంతునే ఉపాసించుచుండుట నిరాహారము ఉండకపోయినా కొంచెముగా అపక్వాహారము ఉండవచ్చు పనిపాటలు తప్పకుండా

చేయవలసి వచ్చినవారు కొద్దిగా ఇతర పదార్థములు కూడా భుజించవచ్చును మొత్తము మీద వంటచేయని పదార్థము తినుట మంచిది ఉపవాసము ఏకాదశి రోజుగాని యితర రోజులలో గాని ఉండవచ్చు క్రైస్తవులకు ఆదివారము, మహమ్మదీయులకు శుక్రవారము, హిందువులకు అమావాస్య పూర్ణిమలు, ఏకాదశి మధ్య వచ్చునది

201 శబరి (బోయ), గుహుడు (పల్లె), విభీషణుడు (రాక్షసుడు) మొదలగు శూద్రులకు రాముడు మోక్షపదవిని ప్రసాదింపలేదా? శంబుకుని వధించుటకు కారణము శరీరముతో ఇంద్రలోకమునకు బోయి పదవి నధిష్ఠించ వలయునని జపముచేయు చున్నందువల్ల, అధర్మముగా నెంచబడుట

202 తన్ను తాను ఎక్కించువాడు లోకములో తగ్గించబడును తన్ను తాను తగ్గించుకొనువాడు లోకములో హెచ్చించబడును (శ్రీయేసుక్రీస్తు)

203 గీత 10 వ అధ్యాయము 32 వ శ్లోకంలో అన్ని విద్యలలోను అధ్యాత్మ విద్య తానేయని భగవంతుడు పేర్కొని నందువల్ల ఆ విద్య తప్పక అభ్యసింప వలసినది విరక్తులకు సన్న్యాసులకు చేయవలసిన కర్తవ్యము చూపబడినది

204 సన్న్యాసి తండ్రికి నమస్కారముచేయు నగత్యము లేదు తండ్రియే చేయవలసి ఉండును కాని తల్లికి మాత్రము సన్న్యాసియే నమస్కరించవలెను

205 ఏకాదశీ వ్రతము నియమము ప్రకారము చేసి ద్వాదశి రోజున తెల్లవారు ఝామముననే లేచి వంట కార్యములన్నియు స్త్రీలు పూర్తి చేసి అందరికి పెట్టి తరువాత వారు భుజించుట చూడ గీత 10 అ శ్లో॥ 34 లో చెప్పబడిన వారి క్షమ బోధపడును

206 ఏకాదశిరాత్రికి ధ్యానముచేయు అలవాటు కలవారు జాగరణ చేయనగత్యము లేదు వారు జాగరణ చేసిన మరునాడు ధ్యానము చేయుటకు ఆటంకము గలుగును ధ్యానము చేయనివారు జాగరణచేయుట మంచిది

207 ఎట్టి గురువును ఆశ్రయించవలెనో గీత 10 అ శ్లో॥ 41 చెప్పుచున్నది ఆ గుణములు గలవాడు భగవదంశ కలవాడే అని చెప్పుచున్నది అట్టివారిని

గురువుగాను, దైవముగాను భావించి సేవించవలయును

208 భగవంతుడు భక్తులను పరీక్షించు విధములు -

**విత్తనాశోఽపవాదశ్చ వియోగస్సహ బాంధవైః ।**
**దేశత్యాగో మహావ్యాధిర్మద్భక్తేః పంచలక్షణమ్ ॥**

**తల్లితండ్రివిడిచి తనయులచుట్టాల నాలివిడిచి సంపదాళివిడిచి**
**నన్నెకాని అన్యమెన్నడు నెరుగని వారివిడువ నెట్టివారినైన**

**(భాగవతము)**

**209. విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః ।**
**విపద్విస్మరణం విష్ణోః సంపత్తస్యైవ సంస్మృతిః ॥**

లోకములో ఏర్పడు ఆపదలు ఆపదలు గావు, సంపదలు సంపదలు గావు భగవంతుని విడుచుటయే విపత్తు విడువకుండుటయే సంపత్తు

**210. అహంకారం సుతం విత్తం భ్రాతరం మోహమందిరమ్ ।**
**ఆశాపత్నీం త్యజేద్యావత్తావన్ముక్తో న సంశయః ॥**

సుతుడనెడు అంహకారమున్నూ, ధనమనెడు సోదరులనున్నూ, మోహమనెడు శరీరభ్రాంతిని, ఆశయనెడు భార్యను ఏ యోగివిడచునో ఆయోగి జీవన్ముక్తుడుగాని, యిల్లువాకిలి విడుచుట మొదలగువాటివల్ల జీవన్ముక్తుడు కాడు

211 శ్రీరామకృష్ణ పరమహంసలవారి వాక్కు :- కలువతూడును విరుగదీసినను ఇంకా దారము లాగుచుండగా సాగును దూరంగా పారవేసిన గాని విడిపోవు సంసారమును విడిచినను దగ్గరలో ఆశ్రమమును నిర్మించుకొని ఉండిన యింకా సంసారవాసనలు వదలవు అందుచే దూరంగా తెలియకుండా నుండిపోవు స్థలంలో నుండ వలయును

212 మోక్షము ఎప్పుడు కల్గును? అనుతలంపు ఎప్పుడు ఉండునో అప్పుడు కల్గును

213 ఏసుక్రీస్తులవారు ఒకసారి 3 గంటలు ఉపన్యసించిన పిమ్మట తలనొప్పి భారముగా నుండగా మరొకసభకు వెళ్ళవలసి రాగా శిష్యులలో ఒకరిని వెళ్ళుమనిచెప్పినారట ఏమిచెప్పను అని శిష్యుడు అడిగినాడట ఓ మందబుద్ధీ! అక్కడకు వెళ్ళి దేవుని స్మరించి వారు ఏది తోపజేసిన అది చెప్పు అని శ్రీ యేసుక్రీస్తు చెప్పినారట

214 ఆత్మ నిష్ఠులు అందరు ఒక చోటున నుండుటకన్న అక్కడక్కడ నుండవలయును శ్రీయేసు క్రీస్తులవారుకూడా యిట్లే చెప్పిరి

215 ఉపగురువులు ఎంత మంది ఉన్నను అంతరాత్మను అనగా పరమాత్మతత్త్వమును ప్రధాన గురువుగా ఎంచని యెడల గొప్పవాడు కాజాలడు

216 భారతసారము అంతయు ఒక శ్లోకపాదం - "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్"

217 పరోపకారార్థం ఇదం శరీరం- శరీరము ఉండినన్నాళ్ళు పరోపకారము చేయవలెను

218 మహాత్ములు చెప్పుధర్మములను సాధ్యమైనంత సులభశైలి లోనే చెప్పుదురు కేవలపండితులు సాధ్యమైనంత కఠినశైలిని ఉపయోగింతురు

219 ఆకలి వేసినప్పుడు భోజనము తినవలయును తినుట కోసరము భోజనము చేయరాదు నిద్రవచ్చినప్పుడు పరుండవలయును నిద్రకోసరము పరుండరాదు మెలకువ రాగానే లేవవలయును ఒక వేళవరకు పరుండవలయునని ఎంచరాదు

220 బ్రతుకుటకోసమే తినవలయును తినుటకోసరము బ్రతుకరాదు శ్రీ గాంధి మహాత్ములు కూడా ఇటులనే చెప్పినారు

221 శ్రీ గురునానక్ వారిని గురించిన కథలు :-

(అ) వారు వారి శిష్యులు ఒక గ్రామం వెళ్ళగా అక్కడివారు వారందరిని బాగా మర్యాద చేసినారు, గ్రామమువిడచి వెళ్ళునప్పుడు ఈ గ్రామస్థులందరు

చిన్నాభిన్నములై పోవుదురు గాత అని నానక్‌గారు దీవించినారు అదేమి అని శిష్యులు ప్రశ్నించగా వారందరు జ్ఞానులగుట వల్ల అనేక ప్రదేశములకు వెళ్ళి అచ్చటచ్చటి వారికి ఆదర్శప్రాయు లగుదురని అట్లు దీవించుటయైనది అని చెప్పినారు

(ఆ) వారందరు మరొక గ్రామము వెళ్ళగా ఆ గ్రామస్థులు సరిగా మర్యాద చేయనందున వారెల్లకాలము ఆ గ్రామమందేయుండి సుఖింతురు గాక యని దీవించినారు శిష్యులు కారణమడుగగా ఇతరచోట్లకు వెళ్ళితే వారి దుర్గుణములు అక్కడి వారికి పట్టుపడునని అట్లు దీవించినా నని చెప్పినారట

222 (ఇ) శ్రీ గురునానక్ గారు శిష్యసమేతులై ఒకసారి ఒక మఠం చూడ పోయినారు ఆ ఆశ్రమవాసులందరు అసూయాపరులై వీరిని మర్యాదచేయక చూచిచూడనట్లు నటించుచూ ఏదో నిష్ఠలయందు మగ్నులయినట్లు నటించినారు కూర్చుండుటకు అనువగు స్థలములేనందున శ్రీ గురునానక్ గారు ఒక ఎండినచెట్టుక్రింద కూర్చున్నారు అప్పుడు ఆ చెట్టు వెంటనే చిగిర్చినదట అది చూచి ఆశ్రమవాసులందరు ఆశ్చర్యపడి వారు మహాత్ములని ఎరిగి దాసులైనారు

223 (ఈ) మహమ్మదీయులందరు శ్రీ గురునానక్ బోధలు విని హిందువులయి పోవుచుండగా అక్బరు చక్రవర్తి తెలుసుకున్నవాడై వారిని మంచిగా పిలిచి జయిలునందు పెట్టవలెనని తీసుకురావలసినదిగా భటుల కాజ్ఞాపించినారు చక్రవర్తులకు చక్రవర్తియగు వారి యనుగ్రహము గల నేను సామాన్యచక్రవర్తి వద్దకు రాను అని గురునానక్ అన్నారు దైవప్రార్థన అంటే వారికి ఇష్టమగుట తెలిసి శుక్రవారమునాడు మసీదులో నమాజుచేసుకొనుటకు రావలసినదిగా తిరిగి అక్బరు కబురుపంపినారు అందుకువెంటనే అంగీకరించి నానక్ వెళ్ళినారు చక్రవర్తిగారు, వారి ప్రధాన సేనానికూడా వచ్చినారు వీరిద్దరు నమాజుచేయునప్పుడు శ్రీ గురునానక్ గారు పెద్దగా నవ్వినారట వారు కుపితులై కారణము తెల్పుమనగా ఇంటివద్ద ఏకైక పుత్రుడు తీవ్రంగా జ్వరంతో ఉండగా మందు ఇచ్చినారో లేదో అని సేనానియు, క్రొత్తగా కొన్న కొన్ని పార్శీ గుఱ్ఱములను గురించి చక్రవర్తిన్ని ఆలోచించుచూ నమాజు చేయుచున్నందుకు నవ్వువచ్చినది అని చెప్పినారట అందుపై చక్రవర్తి మున్నగు వారందరు దాసులై వారిష్టము వచ్చినచోట ఇష్టము వచ్చిన బోధలు చేసుకున్నా

ఎవ్వరు అడ్డుకలిగించకుండు లాగున ఆజ్ఞాపించినారు

224 జీవప్రపంచములో ఉన్న అందరికి ఉపకారిగా నుండి అందరి చేత ప్రేమింపబడవలెను లేదా అడవియందు ఋషికుమారుడై నిరంతర ధ్యాన నిష్ఠయందుండవలెను

225 మనసును వశపఱచుకొను విధములు :-

(అ) దొంగ ఆవును జాగ్రత్తపర్చినట్లు విషయముల మీదికి పోనీయకుండా మనస్సును ఆపుచేసి ధ్యానమునందు నిల్పుట

(ఆ) మనస్సుకు సాక్షిగా నిలబడి దాని దొంగతనమును పరీక్షించుచుండుట

(ఇ) సర్వత్రా వ్యాపించి యున్నదంతయు సర్వేశ్వరుడే కాబట్టి మనస్సు నిలబడు స్థానమంతయు ఆ రూపుగా భావనచేయుట

(ఈ) మనస్సులేదు విషయంలేదు నిగ్రహంలేదు అంత ఒక్క బ్రహ్మమే అను భావనలో నిలబడిపోవుట (అవధూతవృత్తి)

226 జపము ఎక్కువ చేసిననే గాని పాపము నశింపుకాదు పాపము నశింపు అయితేనే గాని తక్కిన పనులు సరిగా జరుగవు

227 ఎవరిని వారు బాగుచేసికొననిచో త్రిమూర్తులుకూడా వారిని బాగుచేయజాలరు

228 సాధవులు పరిశ్రమ పరులు, శ్రద్ధావుళులై ఉండవలెను కాని అతి లేకుండా సాధన క్రమముగా నుండవలెను మిణుగురునిప్పు తెచ్చినప్పుడు చిన్న చిన్న కట్టెలు వేసి క్రమంగా బాగుచేయవలెను

229 భోజనము తగ్గించినను నిద్రను ఎక్కువగా తగ్గించరాదు ప్రమాణముగా నుండులాగున చూచుకొనవలెను

230 చేసిన తప్పులు బహిరంగముగా చెప్పినచో పాపము పోగా చాలా

మహత్తుకూడా కలుగును

పాండవులు అరణ్యావాసములో నుండగా ఒకమౌని ఆశ్రమ ప్రాంతమునకు వెళ్ళిరి ఆ ఋషి నిమిత్తముగా సుమారు 11 సంవత్సరముల నుండి పెరుగుచున్న ఒక పెద్ద ఫలమును భీముడు తొందరగా కోసినాడు ధర్మరాజు విచారణ చేసినారు తత్ఫలితముగా ఆ పండు 12 సంవతరములు పూర్తిగా గడచిన పిమ్మట ఆ మౌని తపస్సునుండి లేచి ఆహారముగా తిను ననిన్ని, ఇట్లుఎన్ని సంవత్సరములనుండియో వారి ఆచారమనిన్ని, అది లేనిపద్ధతిలో శపింపవచ్చుననిన్ని తేలినది శ్రీ కృష్ణభగవానులను ధ్యానము చేసి ప్రత్యక్షము చేసుకొని గత్యంతరము నడిగిరి ఎవరైతే ఒక్కటికూడా దాయకుండా వారుచేసిన పాపములన్నియు (ఎంతపాతకమయినను) బహిరంగముగా చెప్పివేయుదురో వారు ఆ పండును తొడిమెకు అంటించిన అతుకును అని శ్రీకృష్ణ భగవానులు చెప్పిరి ధర్మరాజులవారు తానేమియు దోషము చేయలేదనిచెప్పి పండు అతికించుటకు యత్నించగా కొంతదూరము కదలి అక్కడ నిలచిపోయినది గాని తొడిమవరకు చేరలేదు మిగతా వారును అట్లే చెప్పి ప్రయత్నించగా ఆ పండు కదలనేలేదు ఒక్కరాత్రి కర్ణునితో నిద్రచేయవలెనని కోర్కెకలిగి నట్టి పాపము తప్ప ఎట్టి ఇతరపాపము ఎరుగను అనిచెప్పి ద్రౌపదిఅమ్మవారు పండును ముట్టగానే పోయి తొడిమెకు అంటుకుపోయినదట తత్ఫలితముగా ఆయమ్మ మహా పతివ్రతలలో ఒకరుగా పరిగణింపబడుట జరిగినది

231 లోటులు చెప్పువారు మనసును బాగుచేయువారు పొగడువారు పాడుచేయువారు

232 జపమువల్ల పాపములు నశింపదగును కాని ధ్యానము ఉంటేనే గాని మూలప్రకృతి హృదయగ్రంధులు నశింపు గావు

233 పాపాత్ములందరికి అనేక ధనకనక అన్నవస్త్రాదులు ఇచ్చి పుణ్యకర్మలు చేయువారికి భగవంతుడు సరియగు ఆహారము ఇవ్వక పోవుటకు కారణముండును ఎక్కువ ఇచ్చినచో దైవధ్యానదూరు లగుదురని ఎంచి తక్కువ యిచ్చును జబ్బుగా నున్న వారికి డాక్టరు జావపగ్గైరాలు పధ్యం పెట్టించునట్లు

234 యోగాసనములు, ప్రాణాయామము చేయునపుడు నూనె మొదలగు అపథ్యపదార్థములుగాని, ఎక్కువ కారము ఉప్పు పులుపు ఉండు వంటలు గాని తినరాదు శుద్ధమయిన సాత్త్వికాహారము ఉండవలెను ఆ ఆహారము ఒక సమయములో భగవంతుడు ఈయనిచో ప్రాణాయామము, యోగాసనములు అప్పుడు చేయవద్దని తలంపు

235 గీత 12 అధ్యాయము శ్లో॥ 8 నుండి 11 వరకు నాలుగు విధములగు భక్తి, శ్లో॥ 8 ధ్యానయోగము, శ్లో॥ 9 అభ్యాసయోగము, సాధన చతుష్టయసంపత్తి, శ్లో॥ 10 నిష్కామకర్మము, శ్లో॥ 11 ఏకర్మమయినను భగవదర్పితము చేయుట అను విషయములను వివరించును

236 అనుష్ఠానము తొలగకుండిన ఫలితము క్రమేణ కలుగుచునే యుండును కాయ తొడిమ తొలగకుండిన క్రమేణ పండును తొడిమ వీడిపోయిన పండదు అట్లే మనసు భగవంతునిమీద ఉంచకపోయిన అనగా అనుష్ఠానము ఒక దినమైనను మానిన కాయ తొడిమనుండి తెగి పోయినట్లు అట్టి అనుష్ఠానము సిద్ధిపొందదు

237 అనుష్ఠానము క్రమేణా వృద్ధిపొందుచుండవలెను లేని ఎడల గానుగ యెద్దులాగా ఒకచోటునే ఉందుము

238 నేను కూడా మీ మాదిరి మనిషినే, పరిశ్రమమాత్రమేనన్ను ఈ స్థితికి తెచ్చినది రోజుకు 25 శ్లోకములు కంఠస్థము చేసిన రోజులున్నవి

239 ఇంద్రియములు ఆత్మకు (అనగా భగవంతునికి) వశంకాక పోతే బాగా శిక్షించవలయును తప్పుపని చూచినందుకు సూరిబాబు కన్నులు పెరికివేసినారు చెయ్యి తప్పు పనిచేసినందుకు గోరాకుంభారుడు నఱికివేసుకున్నాడు ఒకతూరి నా నాలుక తప్పు చేసినందుకు వాత వేసినాను రోజూ చేయు అనుష్ఠానము చేయకపోతే ఉపవాస శిక్ష

240 మనకంటె తక్కువ బుద్ధులు, అనుష్ఠానము కలవారిని దూషించవద్దు, ఒకప్పుడు మనముకూడా అట్టి వారము అయిఉండవచ్చు గదా! అందుచే జ్ఞాని

యెవ్వరిని నిందించడు ఇతరుల శరీరేంద్రియదృగాదులవల్ల మనసులో వికల్పము కలుగనివారే జ్ఞానులు

241 శ్రీ రామతీర్థులవారి తండ్రి పురోహితుడు బీదకుటుంబము పౌరోహిత్యమువల్ల వచ్చినడబ్బుచాలక యాచనవల్ల వచ్చిన సొమ్ముతో రామతీర్థులవారిని చదివించువారట అట్లా ఒక సంవత్సరము కొంత సొమ్ము ఒకేసారి యిచ్చి, యింతకంటే ఎక్కువరాదు, అంతలోనే జరుపుకోమని తండ్రి రామతీర్థులవారికి చెప్పినారు పుస్తకములు, స్కూలు జీతము మొదలగు ఖర్చులు అంచనా వేసుకొనగా భోజనమునకు స్కూలులో చదువుకొను 10 నెలలకు రోజు ఒక్కంటికి అర్ధణా మిగులునట్లు తేలినది రోజు 4 దమ్మిడీల బరాణీలు, 2 దమ్మిడీల బెల్లంతిని ఉందాము అని రామతీర్థులు నిశ్చయించుకొన్నారు అంతటితోనే మిక్కిలి తృప్తి నొంది రాత్రి స్కూలు డాబాపైన పరుండబోయి ఆనందముతో భగవంతుని గంభీరముగా స్తుతి చేయ నారంభించినారు అది విని ప్రక్కన దగ్గరలోనే నివసించుచున్న ఒక షాహుకారు వారి వద్దకువచ్చి ఎందుకు అట్లు స్తోత్రము చేయుచున్నావు అని అడుగగా అనేకమందికి పరుండుటకు చోటులేదు నాకు ఈ డాబా యిచ్చినారు కొంత మందికి తినుటకు ఏమియులేదు నాకు రోజు ఒక్కటింటికి అర్ధణా చొప్పున 10 మాసములవరకు ఆహారమును ఇచ్చి ఉన్నారు అందుకు నాకృతజ్ఞత, సంతోషమును తెలుపుకొనుచున్నాను అని జవాబు చెప్పినారట అంతట ఆ షాహుకారు ఆ మహాభక్తికి మెచ్చుకొని వారు బడిలో చదువుకొన్నన్ని సంవత్సరాలు నెల 1 కి రు 50/- చొప్పున ఇచ్చు ఏర్పాటు చేసివేసినారు

242 శ్రీరామ తీర్థులవారు తండ్రిగారివల్ల బడిలో చదివించబడు కాలములో బడిలో కూర్చొనక బయటకూర్చొని ఆలోచిస్తూ ఉండు వారలు నాయనా! యింత కష్టపడి చందాలవల్ల చదివించుచుండగా బడిలో కూర్చొని చదవకపోతే ఎట్లు అని అడుగగా , బడిలో చిన్న చిన్న పుస్తకాలే ఆకాశం భూమి అట్టగా నున్న పుస్తకం చదువు తున్నాను అందువల్ల వచ్చే లాభము ముందు మీకు తెలుస్తుంది అని శ్రీరామతీర్థులవారు జవాబు చెప్పినారట

243 దృఢనిశ్చయము (ఎట్టిచంచలము లేకుండా) అన్ని పాపములు

క్షయించిన వారికి గాని కలుగదు

244 ఒకరోజు మంచి భోజనము వచ్చును ఒకరోజు చెడ్డభోజనము వచ్చును ఒకరోజు ఆరోగ్యముగా ఉండను మరొక రోజు అనారోగ్యముగా ఉండును ఒకరోజు అతిచలిగా వుండును ఒక రోజు అతివేడిగా ఉండును ఒకరోజు ఇతరులు భూషించుట విందుము ఒక రోజు దూషించుట విందుము ఇట్లే అన్ని ద్వంద్వములుగా ఉండును సాధువులు వీటన్నింటికి అతీతులుగా నుండ యత్నించవలయును

245 ఎల్లప్పుడు ఆత్మనిష్ఠలో ఉన్నచో అట్లు చేయుటను సాధ్యమగును

246 బ్రహ్మనిష్ఠులవాక్కు బ్రహ్మవాక్కు వృధా పోదు!

**247 యో మే గర్భగతస్యాఽపి వృత్తిం కల్పితవాన్ ప్రభుః ।**
**శేష వృత్తి విధానాయ సుప్తః కిం ను మృతోఽథవా ॥**

గర్భములో నున్న కాపాడిన ప్రభువు గర్భము నుండి వెడలిన పిదప కాపాడకుండుటకు నిద్రించెనా లేక మరణించెనా!

248 నామదేవులవారిని ఒక అగ్రహారిక బ్రాహ్మణుడు ఉపదేశం చేయుమని కోరినారట ఆయన సంస్కారి కాదని ఎరిగి నామదేవులవారు అట్లు చేయ నిష్టము గలవారు కాలేదట అయినను స్పష్టముగా చెప్పక యీ క్రింది విధంగా పారము నేర్పినారు ఒకనాడు వారి చిరపరిచితులగు శిష్యులందరిని మామూలు పనులు చేయువలదని చెప్పి, నేను పనులను చేయుమని చెప్పి అడిగినా మీరు లేవకుండా కూర్చొనుడు ఆ బ్రాహ్మణుడు ఏమిచేయునో చూచెదము అని ఏర్పాటు చేసినారు ఎన్నిసార్లు గురువుగారు పనులు కాలేదు అంటుఉన్నా ఎవరు లేవలేదట ఈ బ్రాహ్మణుడు కూడా లేవలేదు అందువల్ల ఆయనకు ఇంకా గురుభావం కలుగలేదు అని ఎంచి యీ రోజున పనులు కాలేదు తరువాత రావలసి ఉంటుంది అని పంపివేసినారట

249 ధ్యానము చేయునప్పుడు తోచిన సత్సంకల్పములు కూడా త్యజించవలయును

250 మనకున్న పవిత్రత, బ్రహ్మనిష్ఠా కుశలత మొదలగు శక్తులు బహిరంగముగా కనబరచరాదు (శ్రీరామకృష్ణులు)

251 మరణము సంభవించినను సత్యస్థైర్యములనుండి తొలగకూడదు

252 "అసక్తి రనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు" అనగా పుత్రులు మొదలగు వారిని పోగొట్టుమనికాదు వారియందుండు ఆసక్తి విడువుమని

253 జ్ఞానం కలిగిన మాత్రము చాలదు అది పట్టాపొందినట్లు ఉద్యోగము లేదు జ్ఞేయములోనికి ప్రవేశించి సదా నడచుట ఉద్యోగము చేయుట వంటిది

254 తనకు తాను అనగా తన యింద్రియములకు తాను గురువు ఎప్పుడగునో వాడు లోక గురువగును తనకు తాను బోధకుడగుచో వాడు లోకబోధకుడగును తన్నుతాను ఉద్ధరించుకున్నచో వాడు లోకోద్ధారకుడగును వ్యష్టికి గురువయినచో సమష్టికి గురువగును తన సమస్యలు పరిష్కరించుకున్నచో లోక సమస్యలు పరిష్కరింపగలుగును తన సంశయములు తీర్చుకొన్నచో లోకుల సంశయములు తీర్చగలుగును

255 వృద్ధావ్యములో ప్రవక్త అయినవాడులేడు ఇంద్రియములు బలవత్తరములుగా నున్నప్పుడే వాటిని జయింపగలిగిన అప్పుడే గొప్ప వాడయి ప్రవక్త అగును

256 వాత తత్త్వములగలవాడు తమోగుణం గలవాడు పైత్య తత్త్వము గలవాడు రజోగుణజీవి శ్లేష్మతత్త్వము గలవాడు సాత్త్విక గుణము గలవాడు శ్లేష్మ తత్త్వము గలిగి ఉన్నప్పుడే శీతోష్ణములు మొదలగు ద్వంద్వములను భరింపగలిగి ఉండును

257 ఇల్లువాకిలి విడిచిన వాడు, ఆలుబిడ్డలను విడిచినవాడు, సర్వము విడిచినవాడు, సర్వసంకల్పములు విడిచినవాడు కూడా వైరాగ్యము పూర్తిగా ఉన్నవాడు కాదు ఒక్క క్షణకాలము కూడా ఎంతో విలువగా ఎంచి వృధా పోకుండా చూచుచు ఏ వేళకు చేయవలసిన కార్యము ఆవేళకు చేయవలసిన విధిగా చేయువాడే

వైరాగ్యము పూర్తిగా కలిగినవాడు

258 మైత్రేయ్యుపనిషత్తులో శిష్యునిగురించి గురువు నాయనా! సంధ్యాకాలమునందు ఎందుకు సంధ్యవార్చవు అని ప్రశ్నించినారు అందుకు జవాబుగా శిష్యుడు రెండు కారణములు చెప్పినాడు (అ) తండ్రీ! చిదాకాశమునందు ఆత్మసూర్యుడు సదా ప్రకాశించుచుండగా వానిని సదా ఉపాసించుచున్నాను అందువల్ల సంధ్యాకాలములు నాకు కనుపించుట లేదు (ఆ) సూతకం ఉండగా సంధ్యవార్చ రాదుగదా! ఇప్పుడు నేను రెండు సూతకములు కలిగిఉన్నాను, నాకు ప్రకృతి యను మాత చనిపోయినది ఆత్మయను పుత్రోదయమయినది

259 స్వప్నములో ఏ సంకల్పములు కలుగుచుండునో అవన్నియు హృదయంలో ఉన్నట్లే ఎప్పుడు భగవంతుని చింతయే స్వప్నములో కూడా చేసినట్లు తప్ప మరొకటి కనబడనప్పుడు అంతఃకరణశుద్ధి అయినట్లు

260 ధనము సన్న్యాసులకే బ్రహ్మనిష్ఠులకే ఉండవలయునని వివేకానందులవారు చెప్పినారు వారు దానిని సద్వినియోగము చేయుదురు

261 అజ్ఞానులకు పెండ్లి వచ్చునప్పుడు ఎట్టి సంతోషమో, జ్ఞానులు చావు వచ్చునప్పుడట్టి సంతోషముతో నుందురు

262 తిరువళ్ళూరు నాయన(వెలమవారు) గృహస్థులు నేత పని చేసుకొనేవారు తిరుక్కురళ్ అను గొప్ప గ్రంథమును అరవములో వ్రాసినారు వారు అధీతి బోధ కలిగిఉన్న గొప్ప మాహాత్మ్యగలవారు చనిపోయిన తరువాత కాళ్ళకు త్రాడుగట్టి బజార్లవెంట ఈడ్చి దూరంగా పారవేయుమనిన్ని, ఏవిధమయిన పూజలు ఊరేగింపులు చేయవద్దనిన్ని ముందుగానే శిష్యులతో చెప్పి కూర్చుని ఉండగానే ప్రాణము విడిచినారట! అందుకు వ్యతిరేకంగా శిష్యులు పెద్ద పూలరథంగట్టి ఊరేగించి సమాధి కట్టించవలెనని యత్నము చేయుచుండగా తిరిగి జీవములోకి వచ్చి కోపగించి వారు చెప్పినట్లు చేయకపోతే శపించెదను, అని చెప్పి మరల ప్రాణమును విడచినారు విధిగా శిష్యులు అట్లు చేయుచుండగా క్రిందపడిన చీమలు మొదలగునవి అన్ని దివ్యదేహములు ధరించి స్వర్గము చేరినవి

మాంసాదులు తిన్నకాకులు, గద్దలు అట్లే అయినవి ఆ విషయమును వారి శిష్యులలో ఒకరు చూచి వారు కూడా తినబోతే ఏమియు మిగిలిఉండనందున అక్కడనున్న దుమ్ము ప్రోగుచేసుకు తిన్నారట అందుపై వారికి కూడా దివ్యదేహము కలిగి స్వర్గము చేరినారట గృహస్థాశ్రమమునందుండే వారు ఇంత మహత్తుగల వారయినారు

263 గృహస్థాశ్రమము మంచిదా? సన్న్యాసాశ్రమము మంచిదా? యని ఒక బ్రహ్మచారి సాధువు, వెలమనాయనగార్ని ప్రశ్నించినారు అందుపై నీ దిగువసంగతులు వారు తెలియజేసినారు

(అ) అది చలికాలము వారు చల్దిఅన్నము తింటూఉన్నారు భార్యను విసనకర్ర తెచ్చి విసరుతూ కూర్చోమన్నారట ఆ తల్లి మహా పతివ్రత యగుటవల్ల ఎదురు మాటడక వెంటనే అట్లుచేయ నారంభించినారట

(ఆ) పిమ్మట భార్య బియ్యం దంపుచుండగా ఒక తూరి రోకలి పైకెత్తిన సమయంలో వారు మగ్గము నేసుకొనుచు క్రిందపడిన నూలుకండెను తీసియిమ్మని పిలిచినారు ఆయమ్మగారు ఆ రోకలిని వెంటనే అట్లే విడిచి భర్తగారి ఆజ్ఞానుసారము చేసినారు రోకలి అట్లే నిలబడిపోయినట

(ఇ) పిమ్మట ఆయమ్మగారు నూతినుండి నీరు చేదుచుండగా భర్త గారు తిరిగి పిలిచినారు నూతినుండి పైకి సగములాగిన చేదను అట్లే విడచి భర్తగారి వద్దకు వచ్చినారు ఆయమ్మగారు తిరిగి వెళ్ళువరకు చేద అట్లనే నిలచిఉన్నదట

ఈ విషయములు ఆ బ్రహ్మచారికి చూపి గృహస్థాశ్రమములో వుండిన నిట్లుండవలె, లేకపోయిన సన్న్యాసాశ్రమము స్వీకరించుట మంచిది అని సలహా యిచ్చినారట

వారు ఉదయము పది గంటల వరకు బ్రహ్మనిష్ఠ చేసుకునేవారు పిమ్మట మూడు గంటలవరకు నేతపని, తరువాత బజారువెళ్ళి కావలసినవి తెచ్చుకోవటం ఏరోజుకు సరిపోవునవి ఆ రోజుకేగాని నిలువలేదు ఇతరులమీద ఆధారపడకూడదని వారి పట్టుదల, కబీరుదాసుగారు అట్లే ఉండువారు ఇప్పుడు సాయం వరదదాసుగారి అన్నగారు అట్లే చెయు చున్నారు. వారు నేసేవి కట్లు అన్నికట్టి సిద్ధం చేసేవారలు

అందుచే తొందరగా పని సాగిపోవును

264 సన్న్యాసికి అనగా సత్త్వగుణంకూడా దాటినవారికి ముఖ్యముగా మూడు లక్షణములు ఉండును

(అ) నిద్ర వచ్చినచో ఎక్కడఉంటే అక్కడ పరుండుట

(ఆ) ఏ గుడ్డ దొరికితే అది కట్టుకొనుట

(ఇ) ఏమి దొరికితే అది తినుట

265 నాల్గు రకముల యోగములు అనగా కర్మ, జ్ఞాన, ధ్యాన, భక్తి యోగములున్నూ కలవారు గొప్ప లోకోద్ధారకు లగుదురు నాల్గు యోగముల నవలంబించువారు ఏ యోగము నందుండునపుడు ఆ యోగ సూత్రము లన్నియు పూర్తిగా అవలంబించవలయును

266 తిరువళ్ళూరు నాయనగారు, గృహస్థములో నుండువారు బ్రహ్మనిష్ఠకు సన్న్యాసము గొప్పదా? గృహస్థము గొప్పదా? యను ప్రశ్నకు పైన తెలియజేసిన విధంగా సమాధాన మిచ్చియున్నారు సన్న్యాసాశ్రమ మందుండువారు ఒకరు ఈ ప్రశ్నకే ఇట్లు సమాధానము చెప్పియున్నారు ఒక యతీశ్వరుని వద్దకు ఒక బ్రహ్మచారి వెళ్లి యీ ప్రశ్నవేసినారు అందుకు సమాధానంగా ఆ యతీశ్వరుడు ఇట్లుచేసి చూపినారు అప్పటిలో దగ్గరలోనున్న ఒకరాజు (ఏకైక పుత్రికయగు) తన కుమార్తె స్వయంవర విషయమును ప్రకటించినారు ఆ రాకుమార్తె బ్రహ్మనిష్ఠాపరురాలై యుండి అందుకు అనుకూలమైనవారిని వరించి ఆ నిష్ఠ వృద్ధిచేసుకోవలెనని కోరినదేగాని విషయ సుఖములను ఆశించుటలేదు ఈ యతీశ్వరుడు బ్రహ్మచారిని తనతోకూడ తీసుకొని ఆ స్వయంవరమునకు వెళ్ళినారు యతీశ్వరుడు స్ఫురద్రూపి అందరిని చూచి ఎవరిని వరించకుండా రాజకుమార్తె వీరిని వరించి మెడలో పూలమాల వేసినది ఆ దండను వెంటనే తీసిపారవేసి ఆ యతీశ్వరుడు పరుగెత్తి పోసాగినారు పతివ్రతయగు ఆ రాకుమార్తె వారిని వెంబడించి పోవునది ఆ బ్రహ్మచారి కూడా అనుసరించినాడు అట్లు చాలాదూరము పరుగెత్తి రాత్రి యగుసరికి ఒక కారడవిని ప్రవేశించినారు ఒక వటవృక్షము క్రింద మకాము అది చలికాలము పైగామంచు

ఆ వృక్షముపైన రెండు పక్షులు గూడు కట్టుకొని ఒక బిడ్డను కనిపెంచినవి అవి వీరిని చూచి శక్త్యనుసారం అతిధిపూజ చేయనెంచినవి దూరంగా ఒక మంటచూచి అందుండి ఒక నిప్పు పుడకతెచ్చి వారివద్ద పడవేసినవి ఆ పుడకకు అడవిలోని యింకా కొన్ని పుడకలు చేర్చి చలిమంటగా వారు వేసినారు అయితే వారికి ఆహారము ఎట్లు? అతిధిపూజ చేయకపోతే నరకప్రాప్తి తప్పదు దేహము బుద్బుదప్రాయముకదా! ఎప్పుడైనా పోకతప్పదు, ఇప్పుడే వారికి ఆహారమగుట మంచిది వేరే ఆహారమును సమకూర్చు తెరవులేదు, అని విచారించి పోతుపక్షి తొందరగా ఆ మంటలోకి దూకినది దానిని రక్షించవలెనని వారు ప్రయత్నించక పూర్వమే అది కాలి చనిపోయినందున దాని మాంసమును ఆహారముగా నుపయోగించ నెంచినారు నా ప్రాణనాధుని అనుసరించుట కంటే నాకు కర్తవ్యమేమి అని బిడ్డను విడచిపెట్టి పెంటిపక్షి కూడా పోతువలె చేసినది తల్లిదండ్రులు ఇద్దరుపోతే నేను ఎందుకు? అనాధజీవితము గడుపుట దుర్భరము అయినను ఇద్దరికే ఇప్పుడు భోజనము చిక్కినది నేను మూడవ వారికి ఆహార మయ్యేదను అని ఎంచి ఆ బిడ్డకూడా తల్లిదండ్రులను అనుసరించినది

గృహస్థములో నుండనెంచిన ఆపక్షుల వలె త్యాగము, దానము, అతిధిపూజ కలిగి ఉండవలెను లేదా సన్న్యాసము నవలంబించదలచిన నావలె ఏకైక పుత్రియగు రాజకన్యను ఆమెతోటి రానున్న రాజ్యమును కూడా తిరస్కరించునంత వైరాగ్యము కలిగి ఉండవలెను అని ఆ యతీశ్వరుడు బ్రహ్మచారికి చెప్పి పంపినారు

267 (అ) ఏ విధముగు కర్మలోనికి దిగక ముందే అనగా గృహస్థాశ్రమము అంగీకరించక ముందే పూర్ణజ్ఞానము కలిగి ఉండుట మంచిది ఆత్మశక్తి గలిగి ధైర్యముగా చేయుటకున్నూ, ప్రకృతి మాయలను ఎదిరించి సరిగా పోరాడుటకున్నూ, సమర్థత కలిగియుందురు అది లేకపోవుటే కాంగ్రెసు సేవకులు మొదలగువారిలో అనేక లోటులుండుటకు కారణము

(ఆ) శ్రీ కృష్ణచైతన్యులు భజనచేయునప్పుడు శ్రీ కృష్ణుడు నటనచేయు వాడు మహాభక్తుడగు కంబనిచే కంబరామాయణము అను ఒక గ్రంధము వ్రాయబడినది అప్పుడు శ్రీ రంగనాధునివద్ద పుస్తకాలు సమర్పించే ఏర్పాటు

ఉండినది అది స్వామివారు అంగీకరించుటకు ఒక పరీక్ష ఉండేది పద్యం చదివితే ఏ పద్యమునకు శ్రీ రంగనాధుడు తలఊపితే అది ఉంచటం లేకపోతే తీసివేయటం కంబరామాయణము అట్లాంటి పరీక్షకు నిలబడినది కనుక పూజా జపధ్యాన కీర్తనలు వగైరాలు అంతభక్తి గలిగి ఉండవలెనని భావము

268 శ్రద్ధ అనగా ఏ పని ఏ సమయమున ఎట్లు చేయ వలయునో అట్లు ఏమియు తొలగకుండా చేయుటయే

269 ఒకతల్లికి ఒకడే కుమారుడు అతడు దుర్మార్గుడు అయి అన్ని అవలక్షణములు కలిగిఉండువాడు బాగుపడుమని తల్లిగారు ఎప్పుడు చెప్పుతూఉండేది ఆ పోరు అతనికి ఇష్టంలేక దుష్టసహవాసం వల్ల ఒకనాడు తల్లిగారినిచంపి ఆమె మొండెమును దూరంగా పారవేయుటకు తీసుకొని వెళ్ళుచుండగా దారిలో ఒక ఏరు అడ్డము రాగా "ఆ ఏరు జాగ్రత్తగా దాటు నాయనా! బురదనీరు" అని తల్లి మొండెము పలికినదట అట్టిస్థితిలో కూడా తల్లి ప్రేమ యిట్టిది గదాయని వాని మతిమారిపోయి భక్తుడై పోయినాడు మాతృదేవియొక్క ప్రేమ అంత గొప్పది

270 తల్లిదండ్రులు చెడ్డవారయినను మన ధర్మమును మనము చేయవలయును, ఒక ధనికునివద్ద రు 1000-00 రుణము తెచ్చినాము వాని స్వభావము ఎట్టిదయినా బాకీ తీర్చవద్దా?

271 కర్మయోగములో ఉండగా కార్యము మనసుతో గాని, యోగ శక్తివల్లగాని నిర్వహించవలయునని ప్రయత్నించరాదు అట్టి శక్తి ఉన్నను అందుకు వినియోగించరాదు మామూలుగా జనసామాన్యమందరు ఆ కర్మను ఎట్లు విధిగా చేయుదురో అట్లే చేయవలయును

272 విషయ ఉపాసకులతో సంసర్గముచేయు విషయ విరక్తునితో కూడా సాంగత్యము చేయరాదు

273 ''ఓమ్'' అను ప్రణవమంత్రోచ్చారణలో అ ఉ మ అను మూడక్షరముల యొక్క శబ్దములు కలసిఉన్నవి ఆ ఉచ్చారణ సరిగా నుండవలెను

సరిగా పలుకలేనివారు"ఉ" యొక్క శబ్దము ఎక్కువ పలుకునట్లు ఉచ్చారణ చేయుట మంచిది అది విష్ణుచిహ్నము, శుభప్రదము దానిచే సంరక్షణ జరుగును 'మ' కారముమీద ఉచ్చారణ హెచ్చుగా చేసినచో రోగము నశింపుకలుగుట సంభవించును మూడక్షరములమీద సమానముగానుంటే ప్రమాదము లేదు అన్ని విధముల శ్రేయోదాయకమే

274 గొప్పపాండిత్యము గలిగినను, అనేక విషయములు తెలుసుకొన్నను, జ్ఞానము కలుగు అన్ని సంగతులు పట్టుబట్టినను, ఇంకా ఏమయినా వాసనలులేక వృత్తులు ఉన్నచో అట్టి జ్ఞానాగ్నికి దహింపచేయుశక్తి లేదు వాసనలన్ని పోయినచో మాత్రమే అట్టి జ్ఞానాగ్ని దహించుశక్తి గలిగి యుండును అనగా శుష్కవేదాంతము కూడదు

275 ఆధ్యాత్మిక కార్యములలో అందరు ఒకే మాదిరి గొప్పకార్యము చేయవలయునని లేదు సోమరితనము లేకుండా వారివారి వీలునుబట్టి అనుష్ఠించిన ఫలితం అందరికి ఒకటే చీమకు కొంత ఆహారము కావలయును ఏనుగునకుకొంత ఆహారము కావలయును చీమ ఆహారము ఏనుగునకు చాలదు ఏనుగు ఆహారము చీమ తినలేదు దేనికి తగిన ఆహారము అది తినిన తరువాత తృప్తి సుఖము రెంటికి సమానముగా నుండును

276 "ఉపదేశసాహస్రి" అను శ్రీ శంకర విరచిత గ్రంథమును చదువుట మంచిది వేదము, జపము, ధ్యానము గురువు అంతా మాయయే అయితే మాయ మాయనెట్లు పోగొట్టును? అను ప్రశ్న కలుగును మాయలో రెండు రకములు :- శుద్ధమాయ అశుద్ధమాయ పైన తెలియజేయబడిన వన్నియు శుద్ధమాయకు చెందియున్నవి శుద్ధమాయ అశుద్ధమాయను నశింపచేయును చిల్లగింజ గంధముకూడా బురదగానే ఉండను పరిశుద్ధమగు జలములో కలిపిన ఆ గంధము బురదనీరువలె అగును కాని అపరిశుద్ధ జలము అనగా బురద నీటిలో కలిపిన ఆ గంధము బురదను విరగదీసి తానుకూడా లయమొందును వేదము, ధ్యానము గురువు కూడా అట్లే

277 గీత 13 వ అధ్యాయమునందు చెప్పబడిన జ్ఞేయమును గురించిన ఒక కథ పంజాబులో ఒక గ్రామమందు కొంతవరకు బ్రహ్మనిష్ఠగల ఒక సాధువు ఆ గ్రామ చెరువుగట్టుపై నుండువారు ఆచెరువునీరు తీసుకొని పోవు స్త్రీలలో ఒక గృహస్థుని భార్య రోజూ ఆ సాధువునకు నమస్కరించి పోవు చుండెడిది ఆ సాధువుకు ఆమెపై కోరిక జనించినది ఆ ప్రదేశమందు అతిధి అభ్యాగతులకు కామ తృప్తిచేయుటకు భార్యలను వారి భర్తలు బుద్ధిపూర్వకముగా నియమించు ఆచారము కలదట ఆ సాధువు తనకు నిత్యము నమస్కరించు స్త్రీయొక్క భర్తను కోరగా ఆయన అంగీకరించినారు పరుండబోవు సమయమందు ఆ సాధువు గది తలుపు వేయబోయినారు అందుపై ఎవరు చూడకుండా తలుపువేస్తావు? అందరి రూపు ధరించి, అంతట సర్వసాక్షియై ఉన్న భగవంతుని ఎట్లు మరుగుపరచ గలవు? అని ఆమెగారు చెప్పినారట వెంటనే ఆ సాధువుకు ఆత్మబోధ గలిగి తలచిన కృత్యమును విడుచుటయే గాక పశ్చాత్తాపము నొంది ఆయమ్మకు నమస్కరించి గురువుగా భావించినారట

278 వాచా వివేకం అవివేకమే (జ్ఞానవాసిష్ఠము)

279 చింతించి చింతించగా మనసు అరిగిపోవును

280 ఇంద్రియములు శుద్ధమై వశమై ఉన్నవారు ఏవేళకు లేవ వలయునంటే ఆవేళకు లేవగలరు అట్లు లేవలేనివారికి ఇంద్రియశుద్ధి వశీకరణము లేదని యర్థము

281 కార్యాంతరమువల్ల అవకాశము లేని రోజున కూడా నిత్యానుష్ఠానమును ఏకొద్ది అయినను చేసి మానవలయును లేనిచో అందువల్ల అనేక నష్టములు గలుగును క్రమేణ అలవాటు మానుట, సోమరితనము అలవాటుపడుట ఆ ధర్మము తప్పిపోవుట మొదలగునవి జరుగును

282 సరిగా విచారించి చూచినచో లైట్లు గడియారములు మొదలగునవి అవసరము లేనట్లు తెలును సృష్టిలో భగవంతుడు అన్నింటికి తగు ఏర్పాటు చేసిఉన్నాడు

283 ఏకాంత తపస్సు చేసిన కొంతకాలమునకు ఒక్కొక్క మహాకార్యమును చేయు శక్తిన్ని ప్రబోధమున్నూ కలుగును శ్రీవ్యాస భగవానులు శ్రీ పతంజలి మహర్షి శ్రీ యేసు, శ్రీ బుద్ధదేవుడు, శ్రీమహమ్మదు మొదలగు వారందరు అట్లే చేసిరి అట్టినివాసము పిమ్మటనే శ్రీవ్యాసులు బ్రహ్మసూత్రములు, గీత మొదలగునవి రచియింపగలిగిరి మిగిలిన వారందరు అట్టి ఏకాంత తపస్సు పిమ్మటనే మహాకార్యములను చేయగలిగిరి

284 మరణములేకుండా చేసుకొనవలయునంటే జననము లేకుండా చేసుకొనవలెను

285 ఏదైనా పదవి నాశించువారు ఆ పదవి యందుండువారు పోయినచో నాకు వచ్చును అని కోరినచో వారి వెనుకవారు వారిని గురించి కూడా అట్లే చింతన చేయుచుందురని మరువరాదు

286 సాధువులు బ్రహ్మనిష్ఠులు తప్పులు చేసినందుకు తత్పాపపరిహారార్థము ప్రధానముగా అయిదు శిక్షలు గలవు (అ) పశ్చాత్తాపము ఇక ముందుచేయనన్న నిశ్చయము (ఆ) ఉపవాసము (ఇ) మౌనము (ఈ) దివ్య మంత్రజపము (ఉ) అన్నదానము

287 కబీరుదాసుగారు కూడా గురుకులవాసము చేసినారు వారి గురువు ఒక బ్రాహ్మణుడు ఆ గురువువద్ద ఇంకా బ్రాహ్మణ శిష్యులు ఉండువారు వారికి కబీరుమీద అసూయ సాహేబును ఎట్లనో వెడల గొట్టవలయునని తలంపు కలిగి ఉండేవారట ఆశ్రమంలోవుండు పెద్ద పెద్ద పాత్రలన్ని తోముట కబీరునకు ఒక విధి వాటిని బయట బాగా తోమి లోన సరిగా తోమువారు కాదు ఈ విషయము బ్రాహ్మణ శిష్యులు గురువుగారితో పితూరి చెప్పినారు అందుపై కబీరును పిలిచి వారు ప్రశ్నించినారు ఇతర ఆ బ్రాహ్మణ శిష్యులందరిని చూపుచు, వీరందరు బాహ్య శుద్ధి గలిగియున్నారు ఆంతరశుద్ధి లేదు అందుచే ఆ పాత్రలు కూడా వీరికి తగినట్లు తోముచున్నాను అని కబీరు సమాధాన మిచ్చినారు

288 దేహారోగము విషయములో ఔషధమును, పథ్యమున్నూ

తెలుసుకున్న చాలదు ముందు అపధ్యమేదో తెలుసుకొనవలెను ఇది లేనిది పై రెండు పనిచేయజాలవు భవరోగము విషయముకూడా అట్లే

289 చెప్పక తప్పనిసరియయిన సత్యముచెప్పితే అధర్మమగునప్పుడు తెలివిని వినియోగించి యుక్తితో జవాబు చెప్పి తప్పించుకోవలెను ఉదాహరణములు

(అ) ఒక బ్రహ్మనిష్ఠుని వద్ద తనకు అత్యవసర మయినంత ధనము మాత్రమే ఉన్నదని ఎంచుడు నీ వద్ద డబ్బుఉంటే యిచ్చివేయి అని దుర్మార్గు లగువారు అడిగితే లేదంటే అబద్ధం! ఉన్నదంటే! యిచ్చి వేయాలి మౌనము వహించితే ఊరుకోరు అప్పుడు మీకు ఇవ్వటానికి డబ్బు లేదనుటే మంచిది

(ఆ) తిరుపతిలో కొందరు మూలపూస ఒకటి మాత్రము తులసిది అయిఉండి, మిగతా పూసలన్ని యితర పూసలుగానుండే మాలలను తులసి మాలలని అమ్ము ఆచారము కలదు అమ్మేవాడు మూలపూసను మాత్రం పట్టుకొని యిది దైవసాక్షిగా తులసి అని ప్రమాణం చేయును, అదేమాదిరిగా సాధువులు సందిగ్ధము వచ్చినప్పుడు తప్పుకోవాలి

(ఇ) ఒక కిరాతుడు ఒక మృగమును వేటాడుటకు వెంబడించి నాడు ఆ మృగము ఒక యోగి ఆశ్రమములో దాగినది కిరాతుడు మృగము ఎక్కడ అని ప్రశ్నించినాడు, చూచేది కన్ను కాని కన్నుకు మాట్లాడు శక్తి లేదు చెప్పవలసినది నోరు, దానికి చూచు శక్తిలేదు ఏమి చెయ్యాలి అని ఆ యోగి తిరుగ ప్రశ్నవేసినారు ఏమి అర్థము కానందున ఆ కిరాతుడు వెడలి పోయినాడు (శ్రీతిలక్ మహాశయుని కర్మయోగమునందలి కథ)

290 అన్ని కరణముల వల్ల చేయబడునదంతా కర్మయే అన్ని కర్మములు నిష్కామముతో చేయవలయును భగవత్పరముగా నుండవలెను బుద్ధికూడా కరణమే అగును బుద్ధి తోచేసే ధ్యానాదికము లన్నియును కూడా కర్మలే అందుచే అట్టికర్మలన్నియు కూడా పై విధులకు లోబడి యుండవలెను

291 ఒక కొబ్బరికాయ ఒకచోట భూమిలో పెట్టి నీళ్ళుపోయు చుండిన కొన్ని రోజులకు మొలక ఎత్తును తరువాత క్రమేణ పెద్దదగును కాని దానిని ఒకచోట

నుండి మరొకచోటునకు మార్చుచునున్నచో సరిగా పెరుగదు అట్లే ఆత్మబీజము హృదయములో కలదు ఏకాంతముగా ఒకచో నిలచి యుండి భక్తియను జలముచే పోషించుచున్నచో చక్కగా పెరిగి వికసించును అట్లు ఆత్మవృక్షము సరిగా పెరుగకపూర్వము అటు ఇటు తిరుగరాదు ఒకచోటనే సామాన్యముగా మూడు సంవత్సరములయినా ఉండి తపస్సు చేయవలయును ఆఖరుకు ఆరుమాసము లయినా కనీస పక్షము

292 శరీరములో ఎట్టి అణువులు (అనగా సాత్త్వికాది త్రివిధములయినా) ఉండునో అట్టి ఆహారమునే అవి ఆకర్షించుచుండును సత్త్వాను రూప అణువులు శరీరమందున్నచో సత్త్వ ఆహారము తప్ప రెండో ఆహారము నచ్చదు శరీరస్థితి ఏడు సంవత్సరములకు ఒకసారి మారుచుండును (సైన్సు శాస్త్రప్రకారము కూడా ఇది సత్యమని తేలుచున్నది )

293 ఎప్పుడైతే ఉప్పు పులుపు కారం మీద మనసుపోవునో అప్పుడు ఇంకా రజస్సు పోలేదని గ్రహించవలెను ఆరోగ్యశాస్త్ర ప్రకారము కూడా ఎప్పుడు అవి మూడు లేకుండా ఆహారము ఇష్టముగా తినగలమో అప్పుడే ఆకలి సరిగా ఉన్నదని అర్థం

294 ఉచ్ఛిష్టం అనగా భగవంతుని నైవేద్యం గురుభుక్తశేషం, భర్తభుక్త శేషం దానియందు చేరవు

295 ఒక గురువు గారికి అనేక మంది శిష్యులుఉండే వారు ఆగురువు తల్లితండ్రులకు చాలా ధనం కలదు ఆ ధనం వెచ్చించి యీ శిష్యులను పోషించువారు, ఆ శిష్యులు సరిగా బ్రహ్మనిష్ఠ చేయక , చేసినట్లు ఆడంబరముగా మాత్రము కనబడువారట వారి నీవిధంగా పరీక్షచేయుమని గురువు తల్లిగారు కుమారునితో చెప్పినారు ఆమె చనిపోయినట్లు చెప్పి పిండితో ఒక శరీరములాగ తయారుచేసి (అది) ఆమెశవమని చెప్పి గుడ్డ కప్పిఉంచి శిష్యులందురు ఆమెగారి సొత్తే నిత్యము తినుచున్నారు కనుక ఆమె శరీరంలో ఒక్కొక్క భాగం తింటేనే గాని ఆమె పుణ్యలోకము చేరదు కనుక ఆవిధంగా చేయుమని ఆ గురువు తన శిష్యులందరిని కోరినారు అందుకు ఇష్టములేక ఒకడుతప్ప అంతా ఆయనగారిని విడిచిపోయినారు.

ఆ ఒక్కరుమాత్రం జబ్బు శరీరమును మీరు తినవద్దు అంతా నేనే తింటాను అని ఆ గురువుగారితో చెప్పినారు అతడే నిజమయిన శిష్యుడు అని గురువు తెలుసుకున్నారు

296 శీతోష్ణములు సహించు శక్తి గలిగి చెమటపట్టినచో బ్రహ్మ చర్యము నిలుచును అందుకు దేహతపస్సు కూడా ముఖ్యము

297 రసము వృద్ధిచేయుట, ఇంద్రియము కాపాడుట ఆరోగ్యమునకు ప్రధానము చెరువులో నీరు నిండుగా ఉండవలయునంటే నీరువచ్చే కాల్వలో నీరు వృద్ధిచేయుట, మురుగుతూములు కట్టివేయుట అవసరము కదా!

298 బ్రహ్మచర్యములో దేహ బ్రహ్మచర్యమున్ను, ఆత్మ బ్రహ్మ చర్యమున్ను రెండనుండవలయును దేహబ్రహ్మచర్యం మాత్రం ఉంటే వట్టకొట్టబడి బలిసిన ఎద్దుమాదిరి ఉన్నట్లే

299 "సత్యం ప్రియహితం చ" అని గీతావచనము సత్యం చెప్పినా ప్రియవాక్కులతో చెప్పవలయును క్షీరాన్నమును పెట్టినా కాలనిది పెట్టవలయును

300 శ్రీశంకరులు రచియించిన "వేదాంత డిండిమము", "ఆత్మబోధము" అను గ్రంధములు సాధువులు బ్రహ్మనిష్ఠులు అందరు పఠించతగినవి

301 ప్రాతఃకాలము గం॥ నాలుగునుండి 9 గంటలవరకును, సాయంకాలము సూర్యాస్తమయము నుండి రాత్రి తొమ్మిదింటి వరకును సాత్త్విక కాలము ఆ సమయములో ధ్యానాదులు చేసుకొనుట మంచిది సహకారిగా నుండును మిగతాకాలము తామసరాజసకాలము

302. ఆకాలములలో మహనీయులు ధ్యానముచేయుచు లోకమును ఆశీర్వదింపుచుందురు ఇక్కడ మన మనసును కూడా అట్లు శుద్ధపరచి కేంద్రీకరించి ఆత్మవైపు త్రిప్పినచో రేడియో లాగున ఆ ఋషివర్యుల యొక్క ఆత్మబోధము, శాంతి ఆశీర్వాదములు మనకందును మనకు శాంతి సుఖములు కలుగును ఆ సమయమున ఏ సంకల్పములు ఉండరాదు దైవ సంకల్పము కలిగి ఉండవలెను

303 సదా ఆత్మశాంతి ఆనందము కలుగకపోవుటకు కారణము ఇంకా కొన్ని సంకల్పము లుండుటయే

304 తమోగుణాంశముచేత స్థూలదేహము, రజోగుణాంశము చేత కర్మేంద్రియములు, సత్త్వగుణాంశమువల్ల జ్ఞానేంద్రియములు కలిగినవి అందువల్ల రోజులో పై తెలియజేసిన సాత్త్వికకాలమందు ధ్యానాదులు చేయుదురు ఈ మధ్యకాలములో కర్మ చేయుదురు అది రజోగుణకాలము, రాత్రి తమోగుణకాలము అప్పుడు స్థూలదేహముతో నిద్రపోవుదురు

305. బీజాంకురన్యాయము, అనగా ఒక వృక్షమువల్ల ఫలమునెట్లు పొందగలమో అట్లే బ్రహ్మనిష్ఠవలన ఆత్మఫలమును పొందుట యను విషయమును అందరు శ్రద్ధతో గమనించవలెను భూమి బాగుచేయుటవంటిది అంతఃకరణమును శుద్ధము (అనగా పాపరహితము) చేయుట, నీటి వంటిది భక్తి, అగ్ని లేక ఎండ వంటిది జ్ఞానము, గాలివంటిది తనవలె లోకమంతయు ఆత్మఫలము లేక శాంతిపొందవలెనను కోరిక, ఆకాశమువంటిది అన్నిటి యందుండి కూడా వేటిని అంటకుండాఉండు బ్రహ్మభావన గలిగి ఉండుట ఈ అయిదు ఉన్నను వృక్షము పూర్ణాభివృద్ధిపొంది ఫలించుటకు కొన్ని సంవత్సరములు బట్టును అట్లే ఆత్మసిద్ధి పొందుటకును కొన్ని సంవత్సరముల కాలము (తప్పక) పట్టును

306 పాపము తపస్సు చేతనే రహితము కావలెను

307 "ఆలస్యం హి మనుష్యాణాం శరీరస్థో మహారిపుః" అనగా మనుష్యులకు ఆలస్యము కంటే ఎక్కువ శత్రువు ఏమియు లేదు

308 ప్రతి మనిషికి ఇంత ఆహారము అని ప్రమాణము ఉండును అంతకు మించి ఎక్కువ ఆహారము తినినచో తొందరగా చనిపోవుట నిక్కువము ఈ నీమమును ముఖ్యముగా అనారోగ్యముగా నుండువారు, జరామరణములు సమీపించువారు ముఖ్యముగా పాటించవలెను

309 అలస పురుషులను గురించిన ఒక కధ ఒక తహాశ్శీలు దారు సోమరి కాగితము చూడకుండా సంతకాలు పెట్టు అభ్యాసం, అంతకు మినహా ఏమియు

చేయడు గుమాస్తాలను మాత్రము చాలా బాధ పెట్టువాడు వారు చాలాకాలము ఓపిక పట్టినారు తరువాత విసుగుపుట్టి అందరు కలసి కుట్ర చేసినారు నేను ఉద్యోగమునకు రాజీనామా ఇస్తున్నాను అంగీకరించవలసినది అని ఒక కాగితం వ్రాసి సంతకం పెట్టించి జిల్లా కలెక్టరుగారికి పంపినారు అందుపయిన ఇంకా రెండు మాసములు ఆగి మీ రాజీనామా అంగీకరించెదము ఇప్పుడు శిస్తువసూలు వత్తిడికాలము అని జవాబు వచ్చినది రాజీనామాకు కూడా మీ యిష్టమేమిటి? వెంటనే అంగీకరించకపోతే తాళంవేసి నేను వెళ్ళిపోతాను అని తిరిగి మరొక కాగితం వ్రాసి తహశ్శీలుదారు సంతకం పెట్టించి పంపినారు అందుపైన వెంటనే డిస్మిసలు ఆర్డరువేసి కలెక్టరుగారు చార్జి అప్ప జెప్పమన్నారు ఇదేమిటి అని తహశ్శీలుదారు తెల్లపోయినారు కాని ఎవరిని ఏమి చేయుటకు అవకాశము లేదు కాగితాలు అన్నిటిలో తన సంతకాలు ఉండె, డిస్మిసలు ఆర్డరు పడె, సోమరి తనమువల్ల ఆ విధముగా ఉద్యోగము ఊడగొట్టుకొన్నాడు

310 **సీమానం సర్వదుఃఖానా మాపదాం కోశ ముత్తమమ్ ।**
**బీజం సంసారవృక్షాణాం ప్రజ్ఞామాంద్యం వినాశయేత్ ॥**
**(జ్ఞానవాసిష్ఠము)**

సోమరితనము అనగా బుద్ధిమాంద్యము ఎట్టి అపాయము చేయునో ఈ శ్లోకముచే చెప్పబడుచున్నది బుద్ధిమాంద్యము సర్వదుఃఖములకు ఆధారభూతమున్నూ, ఆపదలన్నింటికి కోశముగాను, సంసార వృక్షమునకు జీవముగాను నుండును కావున ప్రయత్న పూర్వకముగా బుద్ధిమాంద్యమును ముముక్షువైనవాడు రహిత మొనర్చుకొనవలయును

311 గీత 9 వ అధ్యాయము 3 వ శ్లోకముకూడా పై విషయమునే తెలుపుచున్నది

312 వానప్రస్థము గైకొనుటకు సం॥ 40 ల వయస్సునుండి అని సామాన్యముగా చెప్పబడినది 50 నుండి తప్పకుండా పోవలయును లేక వెంట్రుకలు నెరయుట ప్రారంభించినప్పటినుండి పోవలయునని మరొక విధి కలదు

313 తీర్థయాత్రకు ఇద్దరు లేక ముగ్గురి కంటే ఎక్కువ లేకుండా అంతకు తక్కువ లేకుండా వెళ్ళుట అన్ని విధముల వీలుగా నుండును

314 వైరాగ్యము ఎట్లుండవలయునో పాండవులు వానప్రస్థమునకు పోవు విషయము బోధించుచున్నది మంచుచలిలో వరుసగా ద్రౌపది, సహదేవుడు నకులుడు, అర్జునుడు, భీముడు నడువలేక ఒకరి పిమ్మట ఒకరు పడిపోయినప్పుడు ధర్మరాజు వెనుకకు చూడకుండా ముందుకు సాగి పోయినారు దండ కమండలములు తప్ప వెంట మరేమి సామగ్రి తీసుకుపోలేదు

315 మహాత్ముల మనస్సు రెండురకములుగా నుండును లోకోపకారముచేయు తలంపులో పుష్పముకంటే మృదువుగా నుండును కార్యనిర్వహణ వచ్చినప్పుడు వజ్రాయుధముకంటే కఠినముగా నుండును ప్రమాణము

**వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి ।**
**లోకోత్తరాణాం చేతాంసి కోను విజ్ఞాతు మర్హతి ॥**

**(భవభూతి)**

316 ఘటగుణము లుండగా మఠం కట్టకూడదు

317 మోక్షసన్న్యాసయోగము (గీత 18 అ ) నకు అర్థములు

(అ) మోక్షమును కూడా సన్న్యసించుట

(ఆ) మోక్షము నిమిత్తం సన్న్యసించుట

(ఇ) మోక్షము ప్రమేయం నీకువద్దు, నన్ను శరణుపొందుము ఆపని అంతా నేను చూస్తాను

(ఈ) నీవు అసలు బద్ధుడవే కాదు, అందువల్ల ముక్తి అనేది లేదు జబ్బులేనివాడు కలలో జబ్బుపడినట్లుగా భావించురీతిగా నీవు బద్ధుడవు అని అజ్ఞానావస్థవల్ల భావించుచున్నావు ఆ అజ్ఞానము పోతే చాలు ఆ అజ్ఞానము పోవుమార్గమే ఈ అధ్యాయములో చెప్పబడును అని అర్థము

318 ధనమున్నవారు ధర్మమునకు ఖర్చు పెట్టకపోతే మిగతా సోదరులు (1) నష్టములు, (2) అగ్ని, (3) తస్కరులు (4) రోగములు, హరించుచుందురు ధర్మరాజుకు అపకారము ఎంచితే మిగతా సోదరులు నలుగురు ఏ విధముగా విజృంభించెదరో అట్లు ధర్మమును అలక్ష్యము చేసిన పై చెప్పిన మిగతా నలుగురు సోదరులు విజృంభించి ధనము ఖర్చు పెట్టించెదరు

319 స్నానము ఆఱువిధములు (అ) జలస్నానం (ఆ) భస్మస్నానం (ఇ) మృత్తికాస్నానం, (ఉ) వాయుస్నానం, (ఊ) మంత్రస్నానం (ఋ) భావస్నానం

320 అజ్ఞాన శమనము కోరు సాధువులు, బ్రహ్మనిష్ఠులు జ్ఞానవాసిష్ఠమును తప్పక చదువుట మంచిది

321 అజ్ఞానము నిత్యవ్యాధివంటిది నిత్యవ్యాధికి నిత్య ఔషధ ముండవలెను ఔషధము వాడని రోజున వ్యాధి తలచూపుచునే యుండును అటులనే అజ్ఞానము నిత్యము ఆవహించుచునే యుండును అందు నిత్య ఔషధమగు ధ్యానాదులు చేయుచునే ఉండవలయును ఎంతయినను సరే విధిగా ఉండవలయును

322 గీత 17 వ అధ్యాయములో చెప్పబడిన మూడు తపస్సులు నిత్యము కలిగిఉండవలెను ఆ శ్లోకార్థములు ఒక్కొక్క మాటలో చెప్పవలసి నప్పుడు దేహ తపస్సుకు పుణ్యకార్యములు, వాక్కు తపస్సుకు నామస్మరణ, మానసిక తపస్సుకు ధ్యానము అని గ్రహించవలయును

323 సన్న్యాసమును పుచ్చుకొనుటకు తల్లి ఉన్నచో ఆమె అనుజ్ఞ విధిగా నుండవలయును తల్లి అనుజ్ఞ ఉన్నచో తండ్రి, భార్య, సోదరుల అనుజ్ఞ అవసరము లేదు తల్లిలేనిచో భార్య అనుమతి ఉండవలెను భార్య అనుమతి ఉన్నచో నితరుల అనుమతి అవసరము లేదు

324 తల్లిదండ్రులుగాని, పిల్లలుగాని, భార్యగాని ఉన్నారు అని గాని, వారిని పోషించవలయును అనిగాని, అదిధర్మము అనిగాని ఏభావముఉన్నా సన్న్యాసము పనికిరాదు అందరు ఒక సద్వస్తు స్వరూపమే అది భగవంతుని స్వరూపము నేను

అని, బంధువులు వీరు వారు అని భేదమే లేదు అన్న దృఢభావము కలిగితేనే సన్న్యాసమునకు అర్హత కలదు లేనిచో పతితుడగును బాధల పాలగును

325 సర్వేశ్వరుడు ఒక్కడే సద్గురువు ఆ గురువునకు శిష్యుడు అగుటకు ఒక పరీక్ష కలదు ఆ పరీక్షకు నిలబడువారు అయిదుగురే శిష్యులు ఉన్నారు వారే పంచభూతములు వారు సమస్త ప్రాణికోట్లను సమానముగా చూచుచున్నారు అట్టి సమత్వ బుద్ధిగలవారే శిష్యులగుటకు అర్హులు

326 గురువంతవాడు అయ్యేవరకును గురువుపేరుకూడా చెప్పకూడదు లేకపోతే మనలోటులవల్ల గురువుగారికి అప్రతిష్ఠ గలుగుచుండును అందువల్ల మహాపాపము సంక్రమించును గురువు పేరు చెప్పుకొని సౌకర్యములు పొందువారు తల్లిని వ్యభిచారమునకు అమ్ముకొని జీవించువారి వంటివారు

327 ఏ పనికైనను మనుష్యులను నమ్ముటకంటే దైవమును నమ్మిఉండుట అన్ని విధముల ఉత్తమము, ధర్మము

328 స్వబుద్ధితో, స్వంతముగా విచారణచేయ వలయునేగాని, గీత వల్ల, యోగశాస్త్రమువల్ల బ్రహ్మసాక్షాత్కారము కాదు అవి సహాయము మాత్రము చేయును లేక స్వంతవిచారణ లేక చింతనము వల్ల తేలిన విషయములను స్థిరపరచుటకు ఉపయోగపడును

329 ధ్యానముచేయుటకు గాని, నిద్రపోవుటకుగాని ఎప్పుడు పరిశుభ్రమగు గాలిలో ఉండవలయును లేనిచో బుద్ధి వికసింపక మాంద్యము కలుగును

330 ఆశ్రమములు నాలుగింటి యందు బ్రహ్మచర్యము, గృహస్థము పూర్వభాగము వానప్రస్థము, సన్న్యాసము ఉత్తరభాగము అని విభాగించ వచ్చును భగవద్గీత (పూర్వ గీత ) మొదటి భాగమునకును, ఉత్తరగీత రెండవ భాగమునకును ప్రధానముగా వర్తించును, భగవద్గీత ముఖ్యముగా ప్రవృత్తి మార్గమును, ఉత్తరగీత కేవలము నివృత్తి మార్గమును చూపును సర్వకర్మ చేయుచునే దానికి అంటకయుండు మార్గమును భగవద్గీతయందు చెప్పినట్లు నడచుకున్న వారికే గాని ఉత్తరగీత సంగతులు పట్టుబడవు

331 ధర్మము అనగా మామూలు అర్థము వర్ణాశ్రమ ధర్మము కాని యింకా గొప్ప అర్థము ఎవరు ఏ సమయమున ఏ పని చేయుటకు అవలంబింతురో అది చేయవలసిన విధిగా చేయుటయే ధర్మము ఏ వర్ణము వారైనను ఏ ఆశ్రమస్థులైనను, స్త్రీలైనను, పురుషులైనను, పెద్దలైనను, పిన్నలైనను ఒకే ఔషధమును సేవించునపుడు ఒకే పథ్యమును చేయవలయును కదా

332 భగవంతుడు మొత్తము 24 గీతలు చెప్పినట్లు తెలుచున్నది, భగవద్గీత ఉత్తరగీత గాక తక్కిన 22 అజకు రాలేదు ఆత్మగీతయను ఒక గీత యందలి అయిదు శ్లోకములు మాత్రము పంచదశియందు కాన వచ్చుచున్నవి

333 సర్వతీర్థములందు గంగ, సర్వతేజస్సులకు సూర్యుడు, సర్వశాస్త్రములలో భగవద్గీత, సర్వధర్మములకు మనస్మృతి గొప్పది దయానంద సరస్వతీ స్వాములవారు అందు అసలు మనువు వ్రాసినవి, తరువాత ఇతరులు చేర్చినవగు శ్లోకములను ఉదాహరణ విచక్షణల పూర్వకముగా విడదీసినారు అట్లుగాక ఈ స్మృతియందు ఉన్నది ఉన్నట్లుగా చదివినచో జీవుని శివునిగా చేయునవి ఉన్నవి, పశువుగా జేయునవి యున్నవి విమర్శించి చదువవలయును

334 మోక్షము భగవంతుడు ఏ జీవునకైన నివ్వదలచు కున్నప్పుడే జ్ఞానవాసిష్ఠము వినుట లేక చదువుట జరుగును లేనియెడల చదువలేరు లేక విఘ్నము లయినను కలుగును

335 మనసుకు చలనము నశించి ఏకాగ్రత కుదురునిమిత్తముగా బ్రహ్మము హృదయంలో ఉన్నదని, భ్రూమధ్యంలో నున్నదని, బ్రహ్మ రంధ్రములో నుండును, పశ్చిమాంతరమందుండును అని, లక్ష్యము నిమిత్తంగా ఋషులచే చెప్పబడినది తుపాకి వేయుట నేర్చుకొనువాడు మొదట ఒక లక్ష్యమునుంచుకొని ఏకాగ్రత ఎట్లు నేర్చుకొనునో అట్లే లక్ష్యమును ఛేదించు శక్తి బాగా కలిగిపిమ్మట అసలు కొట్టదలచుకున్న వస్తువును భేదించు శక్తి కలుగును అట్లే ఆత్మవస్తువును కొట్టుట లేక పట్టుటకు ఆ విధముగా ఋషులు ఉపాసన చేయుచున్నారు

336 అద్దమును ముందుకు త్రిప్పి పట్టుకున్న ముందు వస్తువులు

కనబడును మనవైపుకు త్రిప్పుకున్న మనముఖం కనబడును అట్లే దృష్టి బహిర్గతమయిన విషయములు గోచరమగును అంతరమునకు త్రిప్పినచో ఆత్మ గోచరమగును

337 జ్ఞేయమును చేరుటకు గీత 13 వ అధ్యాయములో చెప్పబడిన 7 శ్లోకములు బట్టీవేసి ప్రతినిమిషం ఆచరణలో పెట్టుటకు అలవాటు పరచవలయును

338 శత్రువులు పట్టుకొనుటకు ముందు ధ్యానములో ఏసుక్రీస్తుల వారు రాబోవు ఆపత్తు తెలుసుకొని ఆపత్తును తప్పించుమని మొదట దైవమును ప్రార్థించి పిమ్మట మాయలోపడి కోరిక చెంది తప్పిదము చేసినాను అని దైవమును తిరిగి ప్రార్థన చేసుకొని నీ సంకల్పములో ఏమిచేయవలయునని ఉన్నదో అట్లు చేయవలసినది అని ఆత్మసమర్పణము చేసినారట

339 ముక్తిని సూక్ష్మముగా వర్ణించవలయునంటే ఆత్మయను సూర్యుడు అస్తమయం కాకుండా, ప్రకృతిగుణము లను చంద్రుడు ఉదయించకుండా సదా చూస్తూ ఉండుటయే ముక్తావస్థ

340 ఆత్మలోనే ప్రకృతి లేదా యని వాదించువారికి ఇంకావారిలో ప్రకృతిగుణములు పోలేదు అని అర్థము అట్లా భావన చేసినన్నాళ్ళు ప్రకృతి వీరిని పూర్తిగా వదలిపోదు ఆత్మ పూర్తిగా వారియందు ప్రకాశింపదు

341 నాస్తికమతవాదులు దేవుడు లేడని తెలిసుకున్నాము అనెదరుగదా! అట్లా తెలుసుకొనేవాడు వేరేఉన్నాడుగదా! అంతా శూన్యం అని తెలుసుకొన్నచో నేననే వస్తువు వేరేఉండును గదా

342 రోజూ ఒకేరకము నిష్ఠ ఒకేకాలమున చేయువారు గానుగ త్రిప్పుచున్న యెద్దు ఎంతదూరము పోవునో అంతదూరము పోవువారు నిష్ఠలో ముందుకు సాగిపోదలచినవారు (దానిని వృద్ధిపరచి క్రమముగా) సాధారణ విషయములన్ని మరచి నిష్ఠచేసే స్వభావ మేర్పడినగాని ముందుకు సాగజాలము

343 శ్రీవారు సనకసనందనతీర్థములో తపస్సు చేయుకాలములో భిక్ష కూడా అడుగకుండా తపస్సుచేయు నీమమును పెట్టుకున్నారు కొన్ని దినములు

పిండాశనము, పారవేసిన విస్తళ్ళలోది ప్రోగుచేసుకొని తినుట మొదలగు విధముల కాలక్షేపము చేయువారు ఒక్క దినం మాత్రం ఏమియు దొరకక బాధపడినారట అప్పుడు మనస్సులో కష్టము తోచగా ఆరాత్రి తిరుపతి దేవాలయాధికారికి కలలో భగవంతుడు కనబడి పలానచోట నా భక్తుడు చాలా బాధపడుచున్నాడు, అన్నము పంపవలసినదని చెప్పినంతటట వారట్లుచేయువారట

344 వివేకానందులవారు ఒకతూరి రాత్రి రైలులో ప్రయాణం చేయుచుండగా ఆహారమునకు ఇబ్బంది జరిగినదట నీవు ఇంత బలంగా ఉన్నావు, పనిచేసుకొని సంపాదించి తినరాదా అని ఎవరో యన్నారట అందుపై వారికి కష్టము కలిగిన మీదట భగవంతుడు ఇష్టదైవస్వరూపముతో ముందుస్టేషనులో ఉన్నట్టిన్ని, భద్రుడయినట్టిన్ని, ఒక భోజన హోటలు యజమాని కలలో ఈవిధంగా నాభక్తుడు రైలునందు వచ్చుచున్నాడు అన్నం పెట్టవలసినది అని భగవంతుడు చెప్పగా ఆయన అట్లు చేసినారట

345 దీనత్వముతో ఓంకారము నుచ్చరించరాదు విషయములతోగాని, విషయములను అనుభవించు అవయవముల సంబంధముతో గాని ప్రణవము నుచ్చరింపరాదు

346 గీతయను వాక్యార్థమును గురించి చెప్పబడిన శ్లోకము

**గీకారం త్యాగరూపం స్యాత్ తత్త్వబోధం తకారకమ్ ।**
**గీతావాక్యమిదం తత్త్వం జ్ఞేయం సర్వముముక్షుభిః ॥**

దొంగరాముడు అనువాడు దొంగతనము, త్రాగుడు మొదలగు దుష్టజీవనము చేయుచుండెను ఎప్పుడు రాజ్యాధికారులకు పట్టుబడకుండా తెలివితేటలతో మెలగుచుండువాడు అతనికి ఒకనాడు ఒక సాధువుదర్శనము లభించినది ఇతరులతోపాటు వెళ్ళి పండ్లు ఇచ్చినాడు ఇతరులు ఇచ్చిన పండ్లు ముట్టక ఆసన్న్యాసి ఈతడు ఇచ్చినవి తిని మంత్రోపదేశంచేసి "ఏపని అయినా చెయ్యి, సత్యం మాత్రం చెప్పు" అని బోధించినాడు రాముడు ఆవ్రతము అవలంబించినాడు

ఒకనాడు రాత్రి అతడు దొంగతనమునకు బయలుదేరినాడు క్రింది అధికారులు దొంగతనము అరికట్టని సంగతి స్థితిగతులవల్ల ఆ దేశమును పరిపాలించు రాజు మారువేషముతో దొంగతనపు జాడలు కనిపెట్టు నిమిత్తం స్వయంగా ఆ రాత్రి గస్తీ తిరుగుతూ దొంగరాముని చూచినాడు వాడి గుణచర్యలు పట్టనెంచి తానుకూడా ఒక దొంగ ననియు, దొంగతనము నిమిత్తమే వెదకుచున్నాను అనిన్నీ జతగా వచ్చెదను అనిన్నీ, ఆరాజుగారు రామునకు చెప్పి రాముని నివాసము మొదలగు సంగతులు తెలుసుకున్నారు రాముడు (తోడిదొంగతనముకు) అంగీకరించినాడు దొంగిలించిన సొత్తులో రాముడికి రెండుపాళ్ళు రాజుకు ఒకపాలు అని నిశ్చయించుకున్నారు రాజుగారు వారి భవనమునకే ఆచూకీ యిచ్చినారు భవనంలో ప్రవేశించి ఒకచోట నాలుగు రత్నములుంటే పంపిణీకి వీలుగా నుండుటకయి మూడే తీసుకున్నారు, పంచుకున్నారు ఎవరి దారిన వారు వెళ్ళినారు

మరునాడు దొంగని పట్టవలసినదని రాజు మంత్రికి ఆజ్ఞ యిచ్చినాడు మంత్రి ముందుదొంగతనము జరిగిన ప్రదేశమునకు వెళ్ళి అక్కడ ఒకరత్నము మిగిలి ఉండుట చూచి దీనిని దొంగ మిగిలించునని ఎవరు తలపరు అని భావించి దానిని తాను దొంగలించినాడు దొంగతనము తేల్చలేదు అప్పుడు రాజు రాముని పిలిపించి సభలో అడుగగా తన గురు ఆజ్ఞప్రకారం సత్యము చెప్పివేసినాడు నాలుగవమణి మంత్రి దొంగిలించిన సంగతి తెలుసుకొనియు మంత్రిని ఎంత అడిగినా దాని విషయము చెప్పినాడు కాదు రాజు రాముని నీతికి బుద్ధికి మెచ్చి మంత్రినడవడికకు కినిసి ఆయనను పదవినుండి తొలగించి మంత్రిపదవి రాముని అంగీకరించుమని అడిగినారు నాగురు ఆజ్ఞలేనిది మంత్రిపదవిని నేను ఒప్పుకొనను పోయి అడుగుతాను వారు అంగీకరించితే సరి,లేకపోతే నాకు వద్దు అని రాముడు తనగురువగు లోగడ సన్న్యాసి వద్దకు వెళ్ళి అనుజ్ఞ కోరినాడు ఈ తూరి రామునిలోఉన్న దుర్గుణములు అన్ని వదలి పదవి అంగీకరించుమని ఆ గురువు చెప్పినారు అట్లే వాగ్దానము చేసి మంత్రి అయినాడు సత్యము యొక్క మహిమ యిట్లుండును

347 శ్రీ వారు తిరుపతి వద్ద తుంబురుతీర్థములో ధ్యాననిష్ఠచేయు

సమయములో రాత్రి దోమలు, నుసుమలు కుట్టుచుండెడివట చంపితే పాపం చంపకపోతే నిష్ఠకు నష్టం-వీటిని ఈశ్వరుడు ఎందుకు సృజించినాడా! యని ఆలోచించినారట మిగతా అన్నింటి గురించి అది యిందుకు, యిది అందుకు సృష్టించి యుండవచ్చును అని బుద్ధికి తోచిన విధంగా తృప్తిచేసుకొనువారు ఈ దోమలు మొదలగునవి ఎందుకు అని ఎంత విచారించినా సరియగు సమాధానము కుదురలేదు కడపట మానవజన్మమే పుణ్యపాప మిశ్రమము, ఎప్పుడో ఎవరినో నేను హింసించి యుండవచ్చును అందువల్ల ఈ హింస నాకు సంభవించినది అని ఎంచినారట

348 ఆత్మవంచనము కూడదు ఏకాంతమున నున్నపుడు నిష్ఠచేయక బహిరంగస్థలమునకు పోయినప్పుడు చేయుట, ఎక్కడను చేయకనే చేసినట్లు కనబడుట యిట్టి కృత్యములు ఆత్మ వంచకములు అనగా భగవంతుని వంచించుటయే ఎల్లప్పుడూ ఒకే విధమగు నడవడి కలిగిఉండవలెను ఉదయం సభలకువచ్చు ముందు సాధువులు బ్రహ్మనిష్ఠులు తప్పకుండా ఎంతో కొంత ధ్యానము చేసి రావలయును ధ్యానమువల్ల గొప్ప శక్తి కలుగును మీదు మిక్కిలి మనసు రాగిపాత్ర వంటిది ధ్యానముచే, రోజా తోమక పోయిన బాగుపడదు. ఉదయం కార్యక్రమము సరిగా నడుపుకోవలయునంటే నియమితకాలము (సామాన్యముగా 4 గంటలు మంచిది) నకు లేచుట అవసరము అందుకు రాత్రి ఆహారము తక్కువగా ఉండినగాని సాధ్యపడదు ఒక వేళ కార్యక్రమ కాలము పొడిగించిన పనులు సరిగా జరుగునేమోయని ఎప్పుడును భావించరాదు శ్రద్ధలేనివారికి ఎంత వ్యవధి యున్నను మామూలుగానే వారికి ఆలస్యము అగును ఇప్పుడు కాలము చాల ఎక్కువగా నున్నది ఇంకా కొంతసేపు నిద్రపోయినను లేక పనులు నెమ్మదిగా చేసినను పరవాలేదు అని భావింతురు వారి మామూలు ఆలస్యము తప్పదు కనుక వారి వారి శ్రద్ధనుబట్టి ఉండునుగాని కాలము పొడిగించుటవల్ల పనులు పూర్తియగునని ఎంచుటకు వీలులేదు. ఎందు కంటే ఉదయం నాలుగు గంటలుదాటి లేచుట క్షేమం కాదు లేచిన తర్వాత పనులు తొందరగా అయిపోవునట్లు చూడవలెను తిరుపతి దేవాలయములో పని

చేయువారికి ఒక కాలములో రు 2/- లు మాత్రమే జీతములు ఇచ్చేవారు అందువల్ల వారు యాచన చేయువారు ఆ యాచన తప్పించవలయునని రు 5/- లు జీతం చేసినారు కాని వారు యాచన మానలేదు

349 ఒక ఆశ్రమము వృద్ధిలోనికి రావలయునన్నచో అక్కడ నిజమగు ధ్యానపరులు బ్రహ్మనిష్ఠులు ఉండి, బ్రహ్మనిష్ఠ శ్రద్ధగా చేస్తూ ఉంటేనే గాని అది వృద్ధికి రానేరాదు వృద్ధియగు లక్షణములు నాలుగు (అ) భక్తులు ఆకర్షింపబడవలయును (ఆ) భోజనమునకు లోటు లేకుండా సామగ్రి వచ్చి చేరవలయును (ఇ) నివసించుటకు ఏర్పాటులు అన్ని జరుగవలెను (ఈ) ఆధ్యాత్మిక పుస్తకములు, బోధనలు, సాధనలు ఉద్భవించి అభివృద్ధి యగుచుండవలెను ఇవి జరుగకపోతే అక్కడ వారి నిష్ఠలో లోటు ఉన్నదని చెప్పక తప్పదు వారి లోటులుగాక యితరులు కూడా అక్కడ ఏ పిచ్చిపనులు చేయకుండా ఉండులాగున చూడవలయును ఎవ్వరును విషయసుఖములను అక్కడ అనుభవించకుండా ఉండులాగున చూడవలయును

350 మనవల్ల అయ్యేపని మన అనుష్ఠానమును సరిగా చేయుట అనుష్ఠానమునకు అడ్డువచ్చు కార్యము చేయకుండుట ఫలితమంతా భగవంతుడు, ప్రకృతి యథావిధిగా నెరవేర్చును

351 ఒక్కసారి నిర్వాణము లేక మోక్షము లేక ఆత్మానుభవము పొందిన పిమ్మట, ఆస్థితి వారి కెప్పటికి తొలగదు ఒక సారి యినుము పరుసవేదిని తాకిన బంగారు అగును అట్టి బంగారు ఎన్నిరోజులు ఇనుముతో కలసియున్నను ఇనుము కాదు కాని అట్టి ఆత్మైక్యస్థితి పొందినవారు లోకోపకారార్థము దిగుదురు అయినప్పటికి ఇతరులకు ఆదర్శముగా ఉండు నిమిత్తము నిష్ఠచేయుచునే ఉందురు

352 ఎంతవరకు అన్నము తినుచున్నామో అంతవరకు మన ధర్మమును నెరవేర్చుచుండ వలసినదే కాని అది నేనే చూస్తున్నాను అను అహంకార మమకారములు ఉండరాదు అట్లున్నచో సంసారి యగును గుడిగోపురమున స్తంభములలో కొన్ని విగ్రహములు గోపురమును అంతయు మోయుచున్నట్లు కనబడునేగాని అవి ఏమియు మోయుట లేదు వాటిని కూడా గోపురం పునాది

భూమియే మోయుచుండును అట్లనే అంతయు భగవంతుడే భరించియుండగా నేను భరించుచున్నాను అని ఎంచుట అజ్ఞానము

353 "వెతకువానికి వేదాంతవేద్యుడు దొరకును వెతకువాని తాను వెతకుచుండు" ఒక గొప్పభక్తుడు భగవద్దర్శన మపేక్షించి ఎంతో ప్రార్థన చేసి దర్శనం చిక్కక తీర్థయాత్రలకు బయలుదేరినాడు ఒక మిట్ట మధ్యాహ్నము వేసవిలో ఒక యిసుకప్రదేశములో ఒకచెట్టు క్రిందచేరి నిరుత్సాహముతో కూర్చున్నాడు అప్పుడు నీలకాంతిగల సుకుమార యౌవన కుమారుడొకడు ఆ కాలుచున్న యిసుకలో తొందర తొందరగా ఏదియో పోయినట్లు వెదకుచున్నట్లు కనుపించినది అందుపైన ఈ భక్తుడు ఆ యువకునివద్దకు వెళ్ళి ఈకాలే యిసుకలో ఎందుకు వెదుకుతున్నావు అని అడిగినారట ఇంటివద్ద సూదిపోయింది, యిక్కడ వెదుకు తున్నాను అన్నాడు అదేమిపని అంటే నీలోపల దేవుని పెట్టుకొని ఆ దేవుని కోసరము తీర్థయాత్రలలో శ్రమపడి ఏ విధంగా నీవు వెతుకుతున్నావో అట్లాగా నేనున్నూ అన్నాడు అందుపయిన ఆయనకు బ్రహ్మజ్ఞానము కలిగినదట (శ్రీమహావిష్ణువే ఆ రూపముతో ఉపదేశము చేయుట యైనదని గ్రహింపవలయును )

354 అజ్ఞాని, ఆవులు అనేకరంగులతో రకరకములుగా ఉండును వాటియందు భేదమున్నది అని భావించును జ్ఞాని, వాటన్నిటి పాలు తెల్లగా ఒకటిగానే ఉండును భేదము అనావశ్యకము అని యెంచును బాహ్యమును, తేడాను అజ్ఞాని చూచును ఆంతర్యమును, సమత్వమును జ్ఞాని చూచును

355 మోక్షమార్గము మొట్టమొదట ఇరుకుగా ముళ్ళకంపలు మొదలగు అనేక యిక్కట్లు కలిగిఉండును తరువాత విశాలముగా సుఖముగా నుండును నరకమార్గము ముందు విశాలము సుఖముగా నుండి పిమ్మట అన్ని యిక్కట్లు దుఃఖములకు నిలయముగా ఉండును (శ్రీ యేసు క్రీస్తులవారు)

355 పూర్వపాపములు నశింపజేసుకొను మార్గములు

(అ) జపము

(ఆ) అన్నదానములు

(ఇ) హోమము

(ఈ) ఇతర పుణకార్యములు

(ఉ) పాపకార్యములు చేయుకుండుట

356 ప్రాణాయామమును చేయువారు గమనింవవలసిన ముఖ్యనియమములు

(అ) యుక్తము, మితము గల ఆహారము

(ఆ) బ్రహ్మచర్యవ్రతము

(ఇ) ఏకాంతవాసము

(ఈ) మితముగా చేయుట

ప్రాణాయామము చేయునప్పుడు సహజముగా హెచ్చుగా చేయవలయునని కోరిక గలుచుండును అట్టికోరిక నిగ్రహించి మితముగా అవలంబించవలెను లేనియెడల రోగముగా పరిణమించును ఇంజను బాయిలర్లకు స్టీము హెచ్చుగా నున్న బ్రద్దలయిపోవును

357 ప్రణవము, ప్రాణము, మనసు ఒకేదారిగ నడవు విధము అలవాటుచేయుట ప్రాణాయామము

358 ఆత్మస్తుతి, పరనింద కలవారికి మోక్షద్వారము మూయబడును అవి లేనివారికి తెరవబడును (దయానంద సరస్వతీస్వామివారు)

359 ఒకపూట భిక్షాహారము చేయువాడు నిత్యోపవాసి లేక నిరాహారి పగలు ఎప్పుడూ నిద్రపోనివాడు నిద్రపోనివాడే

360 ఏది చెప్పినను పాడినను వారు ఆత్మశాంతి గలిగి భక్తితో చేసినచో వినువారికి కూడా అట్టి శాంతి భక్తి కలుగును

361 కైవారం నారాయణప్ప అను గొల్లవారు గృహస్థులు, పరమ భాగవతోత్తములు, భార్య చాల దుష్టురాలు బ్రహ్మధ్యానం చేయకుండా అడ్డుపరచునది ధ్యానం నిమత్తం వేరుగా కుటీరం వేసుకుంటే అది తగుల బెట్టినది

ఈ విధంగా నడుస్తూ ఉండగా వారు సన్న్యాసం స్వీకరించారు అడవికి వెళ్ళుమార్గంలో దాహంగాఉండి కూర్చున్నారు 40 పంచదార బండ్లు ఆ దారిని వెళ్ళుచున్నవి నారాయణప్ప అదేమని అడుగగ యజమాని యిసుకబండ్లు అని చెప్పినాడు వాస్తవముగా అవి యిసుకబండ్లు అయిపోయినవి తరువాత పశ్చాత్తాపపడి వారిని ప్రార్థించితే తిరిగి పంచదార బండ్లు అనమని అనిపించి అట్లు అవునట్లు చేసినారు వారు సిద్ధపురుషులై ఒక గ్రంథము వ్రాసినారు అందులో ప్రతిపద్యమునకు ఆఖరున నారాయుణా అని యుండును పండితులు ఆక్షేపించినారు యుణాఅంటే 'ఉ' కారము విష్ణు స్వరూపము, శుభదాయకము, వేదరహస్యం అవి నారాయణప్పగారు చూపినారు అప్పుడు పండితులు సిగ్గుపడినారు మైసూరులో వారి పేరిట ఇప్పుడుకూడా కైవారమఠం అని ఉన్నది

362 శరీరములోని దోషములను ఈ జన్మములో మార్చుట కష్టము కాని ముందుజన్మలో ఎట్టి శరీరము కావలయునో యిప్పుడు జాగ్రత్త పడిన తగినదానిని పొందవచ్చును శిలావిగ్రహమును చేయు శిల్పికి మనము ఎట్టి ఆర్డర్లు ఇచ్చిన అట్టి విగ్రహములు చేయురీతి మనము ఎట్టి కోర్కెలు కలిగిఉందుమో అట్టి జన్మ కలుగుచుండును

363 ధ్యానము చేయునప్పుడు ఒక శబ్దము వినబడినచో అది ఫలానవారిది అని వారిరూపు తెలియును రూపు తెలియగానే వారి గుణములు తెలియ వచ్చును, అట్లనే ధ్యానములో ధ్యేయమును గురించిన మనమంత్ర శబ్దమువల్ల ధ్యేయవస్తువు రూపు తెలియును పిమ్మట ధ్యేయవస్తువు గుణములు తెలియును అదే బ్రహ్మసాక్షాత్కారము

364 అగస్త్య మహామునులవారు యోగశక్తివల్ల ఓషధిచెట్లను వాటి పేర్లు గుణములు మొదలగు విషయములు అడిగి తెలుసు కొని అందుపై ఆయుర్వేద శాస్త్రనిర్మాణము చేసినారట

365 బుద్ధదేవుని జన్మమునకు పూర్వము 32 జన్మములనుండిన్ని నివృత్తి మార్గములో ఉన్నారు అందువల్ల ముందు జన్మమును గురించి యీ జన్మమందే జాగ్రత్త పడవలయును, జన్మ అవసరము లేకపోయిన అట్టి బ్రహ్మనిష్ఠలో

వుండవలెను

366 రామరామా అని అంటూ ఉన్నను మానవునకు దేహాభిమానం వృత్తులు లయము కావలెను లేనిచో రామరామ అను చిలుకను పిల్లిపట్టిన ఎట్లు రామశబ్దమును విడిచి కీచుకీచుమని కొట్టుకొనునో అట్లే యిక్కట్టులుగాని మృత్యువుగాని సంభవించునప్పుడు ఆ మానవుడు అంతే చేయును

367 ధ్యానమునకు వెళ్ళి తిరిగి మానువరకు ఇతర సంకల్పము లన్ని విడిచి వేయవలయును

368 ఎంతవరకు అన్నపానములు మీద ధ్యాస కలదో అంతవరకు లోకోపకార కర్మములు చేయుచునే ఉండవలయును ఎప్పుడు మలమూత్రములు శరీరమునకు అంటినా శుద్ధిచేయవలయునని తలంపు కలుగదో అప్పుడు లోకచింత మానవచ్చును

369 పురుషప్రయత్నము చాలా గొప్పది ప్రయత్నముచేత గోదావరికి ఆనకట్ట నిర్మించలేదా? అట్లనే అన్ని పనులయందును ప్రయత్నము ఉపయోగపడును అనారోగ్యముగా ఉన్నప్పుడు కూడా పురుషప్రయత్నము చేసిన లాభించును కాని భగవంతుని నమ్మి ప్రార్థించుచుండ వలయును

370 ఆహార మార్పిడివల్ల మనసునందు కలిగే మార్పులకు కొంత వ్యవధి ఉండవచ్చును, నివాసదోషములు వెంటనే అంటును

371 శ్రీవారు రోజుకు అర్థంతో 25000 జపం చేసేవారు! ఇతర మంత్రాలు కూడా జపంచేసేవారు

372 రోజుకు 6 గంటలు తక్కువలేకుండా 9 గంటలకు లోపుగా జపధ్యానములు మూడు సంవత్సరములు ఒక చోట కదలకుండా చేసిన ఆత్మ జ్ఞానసిద్ధి కలుగును

373 సూర్యరశ్మికి నీరు క్రమేణా ఆవిరి యయిపోవును నిప్పు పెట్టి కాచిన త్వరగ ఆవిరి అయిపోవును అట్లే భగవంతుని ఆజ్ఞచే సృష్టిలో జీవులు క్రమముగా

మోక్షమును చెందుదురు కాని ధ్యానయోగముచేత తొందరగా వృత్తులు నశించి గమ్యస్థానము తొందరగ చేరుదురు

374 విద్యార్థి ఒక సంస్థలో సరిగా విద్య నేర్చుకుంటే తెరవని తలుపులు కూడా తెరవబడి పాఠశాల వృద్ధికావలయును సాధువు ఒక గృహస్థు యింటికి వెళ్ళినప్పుడు ఆ సాధువు గృహమును విడిచిపోకుండా ఎప్పుడు నిక్కడనే ఉండిన బాగుండును అని గృహస్థునకు తోచవలెను ఒకడు ఒక గ్లాసు నీళ్ళుఇచ్చిన, వానికి తిరిగి పాలుపంచదార వేసి యివ్వవలయునను కృతజ్ఞత గలిగిఉండవలెను

375 ఆత్మలో నివసించుటలో మీనవృత్తి, మృగవృత్తి, కూర్మవృత్తి యని మూడు విధములుగా నుండును నిశ్శబ్దముగా ఏకాంతముగా ఉండుచోటమాత్రమే ధ్యానము చేయగలవాడు మీనవృత్తి గలవాడు భజనలో పారాయణ మొదలగువాని యందు గాని భగవద్ధ్యానమునందు నిలువజాలనివాడు మృగవృత్తి గలవాడు ఏకాంతమునందును, జన మధ్యమునందును భగవద్ధ్యానములో సమానంగా నిలువగలవాడు కూర్మవృత్తి గలవాడు

376 శ్రీ గాంధీమహాత్ముని ఒక సన్న్యాసి మీరు ఏకాంతముగా ఉండి ధ్యానము చేయరాదా మంచిది అన్నారట నడచుచూ, కూర్చుని పనిచేయుచూ కూడా, ధ్యానముచేసే మార్గము లేదాయని వారు ప్రశ్నించినారట, అందుకు సమాధానం చెప్పలేక సన్న్యాసి ఊరకున్నారట

377 యోగంలో ఉండగా భోజనము, అవసర పదార్థములు మొదలగునవి అడగకూడదు గాని , అవసర మయినవి వచ్చినప్పుడు వద్దనవద్దు

378 కృతయుగములో బ్రాహ్మణ వంశములో బ్రాహ్మణుడై జన్మించినగాని వారు ఏ యుగంలోను ముక్తిని పొందజాలరు ఏ యుగంలో నైనను ముక్తుడు అయితే అట్టివాడే, ఏ యుగంలో వారు ఉన్నా కృతయుగ ధర్మము లాచరించిననేగాని ముక్తులుకారు

379 తాండవరాయుడు అను గురువుగారికి ఒక శిష్యుడు ఉండువాడు, ఆ శిష్యుడు గురువుగారికి 60 సంవత్సరములు శుశ్రూష చేసినాడు తనకు

మంత్రోపదేశము చేయుమని ఎన్నడూ గురువుగారిని కోరలేదట అవసరమని తోచినప్పుడు వారే చెప్పుతారు అని శిష్యుడు, ఏదైనా శిష్యుడు కోరితే చెప్పుతాము అని గురువుగారు ఊరుకొన్నారట, ఇట్లు జరుగుచుండగా ఒకరోజున శిష్యుడు అడవికి వెళ్ళగా ఈ లోపుగా గురువుగారు సమాధి అయినారు అప్పుడు శిష్యుడు వచ్చి విచారపడి నాకు ఏమి చెప్పకుండ వెళ్ళినారా అని గట్టిగా వారి శవమును కౌగలించుకొని మూడురోజులు రాత్రింబవళ్ళు అటులనే ఉండిపోయినారు, ఆ స్థితిలో వారికే గొప్ప ప్రబోధం జరిగిపోయినది వారికి చదువు రాకపోయినా "కైవల్య నవనీతం" అను మహా గొప్పగ్రంధమును అరవంలో వ్రాసినారు

**380. కృతే ప్రవర్తతే ధర్మం చతుష్పాత్తజ్జనైర్ధృతః ।**
**సత్యం దయా తపో దానమితి పాదాని భో నృప ॥**

**శమో దమస్త పశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ ।**
**జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మస్వభావజమ్ ॥**

(1) సత్యం (2) దయ, (3) తపస్సు (4) దానం అని ధర్మము నాలుగు పాదములు గలిగిఉన్నది కృతయుగంలో ధర్మము ఈ నాలుగు పాదములతో గూడినదై యుండును త్రేతాయుగం సత్యముకాక మిగతా మూడు కలిగిఉండును ద్వాపర యుగంలో దయకూడా తగ్గిపోవును కలియుగంలో మిగతా మూడులోపించి ఒక్కదానము మాత్రము మిగిలియుండును కలియుగంలో ఉన్నవాడయినా దానంతో పాటు తపస్సు కూడా సంపాదించిన ద్వాపరపురుషు డగును అందుతో పాటు దయకూడా కలిగియుండిన త్రేతాయుగ మానవుడగును సత్యము సంపాదించుట కష్టము సత్యమున్న మిగతావి లేకపోయినా లోటులేదు మిగతావి దానియందే ఉన్నవి

381 ఏసుక్రీస్తువారు ధర్మము బోధించుతూ ఉంటే కుటుంబములో వారు (వారు చెప్పిన ధర్మముల ప్రకారము వడుచుకొను నిమిత్తము) అనేక విధములుగా కుటుంబములనుండి చీలిపోయేవారు - నేను మంచిగా విడదీస్తున్నాను అది వారి మంచికోసరము రేపు (యముడు) బలవంతము మీద విడదీయునప్పుడు ఏమి చేయుదురు? అని వారు అడిగేవారు

382 జ్ఞానం- గీత 13 వ అధ్యాయములో "అమానిత్వమదంభిత్వం అను శ్లోకారంభము నుండి ఏతత్ జ్ఞాన మితి ప్రోక్తం అజ్ఞానంయదతో ఽన్యథా" అను వరకు నుండు శ్లోకములలో చెప్పబడినది (శ్లో॥ 8 నుండి 12 వరకు), విజ్ఞానం అనునది "జ్ఞేయం యత్త త్ర్పవక్ష్యామి అను శ్లోకమునుండి జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్" అను వరకు ఉండు శ్లోకములలో (అనగా 13 నుండి 18 శ్లోకముల వరకు) తెలియజేయబడినది

383 తైలము, వత్తి, చమురు కలిపితేనే దీపము వెలుగును అట్లనే ఆర్జవము అనగా మనోవాక్కాయములు మూడును ఏకోన్ముఖము చేసిననే జ్ఞానము వెలుగును తైలము, వత్తి, చమురు మూడు వేరుగా మూడు చోట్ల పెట్టిన ఎట్లు దీపము వెలుగజాలదో అట్లనే త్రికరణములను వేరుగా నడిపిన జ్ఞానము ప్రకాశింపజాలదు

384 ఏకార్యమయినను చేయవలయునను సంకల్పము గట్టిగా ఉండిన, తరువాత అది నెరవేరిపోవును (తిరువళ్ళూరి నాయనగారు)

385 తిరువళ్ళూరి నాయనగారు స్వంతవృత్తి వల్ల అధర్మములేని వృత్తి వల్ల జీవించవలయునని ఎన్నోవృత్తుల విషయము ఎన్నాళ్ళో విచారించి, కొన్ని చేసి వదలివేసి, చిట్టచివరకు నేతవృత్తి అధర్మం కాదని అది అవలంబించినారట

386 వారు శిష్యులకు ధ్యానము చెప్పుకథ :-

వారికి సుమారు 300 మంది శిష్యులు కలరు-బోధ రాత్రిళ్ళు చెప్పువారు -పగలు వృత్తి పనులు మొదలగు వాటివల్లను, గృహస్థులగుట తత్కార్యముల వల్లను అట్లు చేయువారు వారు శిష్యులకు ఎవరికి ఎట్టి మంత్రోపదేశము ఎన్నాళ్ళకును చెయ్యలేదట అనేక మంది అడిగితే ఆ మంచిరోజున ఈ మంచిరోజున అంటూ కాలయాపన చేయువారు ఒకతూరి శిష్యులు గట్టిపట్టుపట్టినారు అయితే దేహాభిమానము ఎవరికి పోతే వారికి చెప్పుతాను అనివారు అన్నారు మాకు దేహాభిమానం పోయింది చెప్పుమని చాలా మంది కోరినారు సరే ఒక రోజూరాత్రి కావేరిదాటి అవతలి ప్రదేశంలో ఒకచోట చెప్పెదను అని ఏర్పాటు చేసినారు ఆ

రోజురాత్రి పెద్దవర్షము, ఉరుములు మెరుపులు పిడుగులు కావేరి వరదలో నిండియుండుట, కారుచీకటి, అర్ధరాత్రి గురువుగారు బయలుదేరి రాదలచిన వారిని వెంటరమ్మని చెప్పి నారు చాలామంది బయలుదేరినారు కావేరి వరకు వచ్చినందున గురువు నీటిపై నడిచిపోవ నారంభించినారు శిష్యులు నీళ్ళలోదిగి కొంత కొంత దూరము వెళ్ళి తిరిగి పోయినారు ఒక్కరుమాత్రం తల మునుగువరకు వెళ్ళినారు అప్పుడు గురుమహిమ దైవమహిమచేత ఏరు రెండుగా (వారి ఒక్కరికిమాత్రం) చీలినందున అనుగమించి అవతలికి చేరినారు, ఆయనకు మాత్రం ఆ గురువుగారు ఉపదేశము చేసినారు ఆ శిష్యుడు ఒక్కరికే దేహాభిమానం పోయినట్లు తేలిపోయినది మిగతా వారందరికి దేహాభిమానం పోలేదు అని తేలినది ఈవలనాయనగారిని గురించి పైన కొన్ని కధలు చెప్పబడినవి, ఆయన గృహస్థాశ్రమములో గొప్ప బ్రహ్మజ్ఞాని

387 ఇంద్రియ వశీకరణము లేక విషయసుఖముల అనుభవించ దలచువానికి నిజమగు సుఖము దొరకదు, సరికదా అనేకమంది సుఖమును కూడా హరించినా వాడికి సుఖము పూర్తికాదు, ఎవడు ఇంద్రియములను జయించి విషయములను అరికట్టునో వాడు నిజమగు ఆత్మ సుఖమును అనుభవించుటయే కాక అనేక మంది జీవులకు ఇహపర సుఖములను ప్రసాదింపజాలును

388 పది సంవత్సరములు అనుష్ఠానముతో, జపతపాదులతో, ఆచరణతో సరియగు గురువువద్ద శాస్త్ర పఠనమును గావించిన యెడల స్త్రీలు గాని, శూద్రులు గాని మేము ఋషిబిడ్డలము అని తెలుసుకొందురు

389 అభ్యాసము యొక్క మాహిమ చాలా గొప్పది ఒక రాజుగారి మహలు ముందు ముగ్గువేయుటకు ఒక వృద్ధస్త్రీని ఏర్పాటు చేసినారు, ఆ రాజుగారి ఏనుగు గున్న ఒకటి రోజూ ఆమె వేయుచుండు ముగ్గులో పరుండెడిది అప్పుడది చాలా చిన్నదిగా ఉండెడిది ముగ్గు చెడిపోవునను భయముతో ఆమె దానిని దూరముగా తోలినను, పోనందున ఎత్తుకొని అవతలగా పెట్టుచుండునది, రోజువారీ అభ్యాసమువల్ల పిల్ల పెద్దదయిన తరువాత కూడా అటులనే ఎత్తి దూరముగా పెట్టుశక్తి కలిగినది రాజుగారు ఒకదినం చూచి ఆశ్చర్యపడి అదెట్లు సాధ్యమని

అడుగగా పై విషయమును తెలిపినారట అట్లే ఆహారము, నిద్ర, పరిశ్రమ, ఆరోగ్యము మొదలగునవి హెచ్చు తగ్గులు గలిగించుకొనుటకు అభ్యాసము గొప్ప అవకాశమును కలిగించును,

390 నాలుగు యోగములు సమానముగా శీలించవలెను

(అ) భక్తి యోగములో ఉండగా లీనమై పోవలయును

(ఆ) కర్మయోగములో నియమిత కార్యమును భగవదర్పితముగా (ఎంతచిన్న కార్య మయినను పెద్దదైనను) చేయవలయును

(ఇ) ధ్యానయోగములో, నీళ్ళు పంచదార ఉప్పు కలిసిపోయినట్లు లీనము కావలయును

(ఈ) జ్ఞానయోగములో సమస్త చరాచర భూతములలో వెలుగు సద్వస్తువు తానే అను బోధ కలిగిఉండవలయును

391 దీనభావంతో గాని దీనముగా గాని ఉండువారిని నేను చూడను చూచుటకు నిష్టముండదు

392 దైవకార్యముగాని, గురుకార్యముగాని ఎంతచిన్న పనియైనను ఎంతో శ్రద్ధతో, గౌరవముతో పూర్తి చేయవలయును

393 ద్వంద్వములవల్ల వికారము పొందుట దేహమున్నంత వరకు అందరికి ఉండును (శ్రీరామకృష్ణ పరమహంసలవారు) కాని ఆత్మవేత్తలకు నీటిపై అక్షరమువలెను, ఇంకా తక్కువ ధర్మవేత్తలకు ఇసుకపై అక్షరమువలెను పాపాత్ములకు రాతిపై వ్రాయబడిన అక్షరము వలెను ఉండును సముద్రములో ఎట్టిపడవ అయినను కదలునుగాని ఆ కదలుట ఆ పడవ బరువుయొక్క తారతమ్యమునుబట్టి హెచ్చుతగ్గులుగా ఉండును ఆత్మశక్తి ఎంత హెచ్చుగా ఉంటే అంత తక్కువ కదలుదురు

394 జీవుడు సుఖమే స్వభావముగా కలవాడు అందువల్ల దుఃఖము జీవుని ప్రకృతికి వ్యతిరేకము, దుఃఖమును దూరీకరించ వలయునని యత్నము

చేయుచుందురు ఆత్మజ్ఞానము లేనివారికి కూడా అట్లే ఉండును దుఃఖము లేకుండా ఉండే అవస్థకు పోవుదారిలోనే అందరు తప్పక ఉందురు పూర్ణముగా దుఃఖము నశింపు అయి పూర్ణసుఖము పొందవలెనన్నచో ఆత్మస్థానమందు తప్ప ఇంకా ఎక్కడా గలుగదు అని (స్వర్గములో కూడా) క్రమేణా తెలుసుకొనవలెను

395 సంకల్పబీజము (వృత్తులు) పూర్తిగా నశింపు కావలయునంటే అసంప్రజ్ఞాత సమాధి పొందితేనే అగ్నిలో గింజలు దహింపు అయినట్లు నశింపు అవును

396 యోగారంభము యుద్ధారంభము వంటిది ఆయుద్ధములో క్రమంగా సైనికులు , దండనాధులు మంత్రి, కడపట రాజు ప్రతిఘటనలు చూపుదురు ఒక్కొక్కరిని క్రమేణా జయించుచూ పోతూ ఆఖరున రాజునుకూడా జయించిన వెంటనే మంత్రినుండి దిగువవారంతా అనుకూలము అయిపోవుదురు అటులనే యోగము ప్రారంభించగానే ప్రకృతిపురుషులు, ప్రకృతిశక్తులు, రాగాదులు అన్నీ క్రమేణా శత్రువు లగుదురు చిట్టచివరకు ఆత్మస్థానమును పొందిన తరువాత మిగతావి అన్నియు వశమైపోయి అవే మేలుచేయును

397 పండ్లున్న చెట్టుకే కాపలా లేని చెట్టుకు అవసరము లేదు, ఆత్మధర్మ పరిపూర్ణుడు City Motor Driver (అనగా గొప్పపట్టణములలో మోటారుకారును నడుపువానివలె) కడు జాగరూకుడై యుండవలయును, అట్లు జాగ్రత్తగా నుండ నవసరము లేదు అనేవారికి ఆత్మధర్మము లేదని భావించవచ్చును

398 ప్రాణాయామము చేయునప్పుడు ప్రణవము, ప్రాణము, మనస్సు మూడు కలిపి భావన చేయవలెను ఎడమవైపునుండి కుడివైపునకు తిరిగినట్లు భావన చేయవలయును

399 తాటిచెట్టు క్రింద పాలు త్రాగిన దోషములేదు గాని యితరులకు సందేహము కలుగుచుండును బోధకులు కాదలంచినవారు అట్లెన్నడు నడవరాదు అన్నీ శుద్ధమగు ఆచరణలు గలిగి ఆదర్శ ప్రాయులుగా నుండవలెను

400 పుణ్యకర్మలయొక్క ఫలము, లేక తపము ధ్యానముయొక్క ఫలము

ఎక్కడనున్నా వచ్చి చేరుచునే యుండును

శ్రీవారు సనకసనందన తీర్థమునందున్న సమయంలో రోజూ ఎవరో వచ్చి పూజలు భిక్షలు చేయుచుండువారు నేను అందుకు తగిఉంటే ఎక్కడ ఉన్నను అట్లు జరుగవలదా యని పరీక్ష నిమిత్తము ఒక దినము తుంబురుకోనకు వెళ్ళి అక్కడ ఒకచోటకూర్చుని ఉండిరి సనకసనందన తీర్థమునకు వెళ్ళి శ్రీ వారికి గొప్ప భిక్ష చేయ దలంచిన ఒక సమాజమువారు బండ్లమీద అన్ని సామగ్రులు వేసుకొని అరణ్యములో దారితప్పి తుంబురుకోనకు వచ్చి అక్కడ శ్రీవారినే దారి చెప్పుమని అడిగినారట అంతట పరస్పరము సంగతులు తెలుసుకొని, అక్కడనే మహాభిక్ష జరిపినారట, పుణ్య పురుషులకు గలుగు ఫలములు వారు అరణ్యమునకు వెళ్ళినా అక్కడ జరుగును అట్లే పాపులను పాపఫలితము కూడా వెంటాడును

401 జ్ఞాన విజ్ఞానములు గలిగి అవి స్థిరమైనప్పుడు యోగధారణములు మొదలగునవి లేవు అప్పుడు వియోగమే లేదు గనుక యోగము లేదు

402 ఒకతూరి రాజమహేంద్రవరములో శ్రీవారి సభలు జరుగు నప్పుడు రోజూ సాయంకాలము సరిగా సభాసమయమునకు వర్షము వచ్చుచుండెడిది, రేపుకూడా వచ్చిన యికముందు "శం నో మిత్రః" అను శ్లోకమును చెప్పను అని శ్రీవారు శపథం చేసినారట ఆ మరునాడు వర్షము రాలేదట అరణ్యములో ధర్మరాజాదులను కనిపెట్టుటకు శ్రీ భగవానులు ఒక గుర్తు చెప్పినారట ఎక్కడ నెలనెలకు వానలు తప్పక కురియునో, అన్ని సస్యములు సమృద్ధిగాఉండునో అచ్చట ఉందురు, వెతకుమని చెప్పినారట

403 ఒకరు ఒక గురువుగారి వద్దనుండి 12 సంవత్సరములు కర్మ యోగమును అభ్యసించి అందు ఉత్తీర్ణులై వెళ్ళుటకు గురువుగారి వద్ద సెలవు కోరగా, మరి 12 సంవత్సరములు భక్తియోగము నేర్వవలసియున్నది, ఉండుమని చెప్పగా అట్లే చేసినారట ఆ పిమ్మట సెలవు కోరగా ఇంకా 12 సంవత్సరములు జ్ఞానయోగము అభ్యసించవలయునని చెప్పి నిలిపివేసినారట, ఇట్లు 36 ఏండ్లు పూర్తియయిన పిమ్మట గురువుగార్ని సెలవు అడుగకుండనే వెళ్ళిపోవుచున్నారట అప్పుడు గురువుగారు పిలిచి హేతువు అడుగగ సెలవు కోరువారు ఒకరు, ఇచ్చువారు ఒకరు ఉన్నారాయని

చేయుచుందురు ఆత్మజ్ఞానము లేనివారికి కూడా అట్లే ఉండును దుఃఖము లేకుండా ఉండే అవస్థకు పోవుదారిలోనే అందరు తప్పక ఉందురు పూర్ణముగా దుఃఖము నశింపు అయి పూర్ణసుఖము పొందవలెనన్నచో ఆత్మస్థానమందు తప్ప ఇంకా ఎక్కడా గలుగదు అని (స్వర్గములో కూడా) క్రమేణా తెలుసుకొనవలెను

395 సంకల్పబీజము (వృత్తులు) పూర్తిగా నశింపు కావలయునంటే అసంప్రజ్ఞాత సమాధి పొందితేనే అగ్నిలో గింజలు దహింపు అయినట్లు నశింపు అవును

396 యోగారంభము యుద్ధారంభము వంటిది ఆయుద్ధములో క్రమంగా సైనికులు , దండనాధులు మంత్రి, కడపట రాజు ప్రతిఘటనలు చూపుదురు ఒక్కొక్కరిని క్రమేణా జయించుచూ పోతూ ఆఖరున రాజునుకూడా జయించిన వెంటనే మంత్రినుండి దిగువవారంతా అనుకూలము అయిపోవుదురు అటులనే యోగము ప్రారంభించగానే ప్రకృతిపురుషులు, ప్రకృతిశక్తులు, రాగాదులు అన్నీ క్రమేణా శత్రువు లగుదురు చిట్టచివరకు ఆత్మస్థానమును పొందిన తరువాత మిగతావి అన్నియు వశమైపోయి అవే మేలుచేయును

397 పండ్లున్న చెట్టుకే కాపలా లేని చెట్టుకు అవసరము లేదు, ఆత్మధర్మ పరిపూర్ణుడు City Motor Driver (అనగా గొప్పపట్టణములలో మోటారుకారును నడుపువానివలె) కడు జాగరూకుడై యుండవలయును, అట్లు జాగ్రత్తగా నుండ నవసరము లేదు అనేవారికి ఆత్మధర్మము లేదని భావించవచ్చును

398 ప్రాణాయామము చేయునప్పుడు ప్రణవము, ప్రాణము, మనస్సు మూడు కలిపి భావన చేయవలెను ఎడమవైపునుండి కుడివైపునకు తిరిగినట్లు భావన చేయవలయును

399 తాటిచెట్టు క్రింద పాలు త్రాగిన దోషములేదు గాని యితరులకు సందేహము కలుగుచుండును బోధకులు కాదలంచినవారు అట్లెన్నడు నడవరాదు అన్నీ శుద్ధమగు ఆచరణలు గలిగి ఆదర్శ ప్రాయులుగా నుండవలెను

400 పుణ్యకర్మలయొక్క ఫలము, లేక తపము ధ్యానముయొక్క ఫలము

చలాయించుటకు మొదలిడినచో అందుకు రాజు తగినట్లు శిక్షించును

413 అయితే వ్యాసులవారు అందుకు వ్యతిరేకంగా చెప్పినారు ఆ అవస్థలో లేకపోయినా ఆ వాక్యం చెప్పుతూ ఉంటే క్రమేణ ఆ అవస్థ చెందగలరు, అని అట్లు చెప్పిన పుణ్యం కూడా కలుగును అని తేజోబిందూపనిషత్తులో చెప్పబడినది

414 కాని రెండూ కలసియున్న తొందరగా ముక్తులగుదురు

415 మానవదేహము జీవుని శివునివద్దకు జేర్చు రథమువంటిది అదే మానవజన్మ ప్రాధాన్యము కఠోపనిత్తు ఈ విషయమును గురించి బాగా చెప్పినది భగవంతుని ప్రతిఫలింప చేయుటకు మానవజన్మ మంచి అద్దమువంటిది పితృలోకములోని వారికి వారు నీళ్ళలో ఉన్నట్లు తోచును బ్రహ్మలోకములోని వారికి మనుష్యుని నీడవలె మాత్రము కనబడును అందుచే పరబ్రహ్మమును ప్రతిఫలింపజేయుటకు నిర్మల అద్దము వంటిది మానవలోకము అందువలన మోక్షము పొందవలసినచో ప్రేతలోకము వారికిగాని, స్వర్గలోకము వారికిగాని, బ్రహ్మలోకమువారికిగాని సాధ్యము గాదు వారు తప్పక మానవజన్మ మెత్తి తద్వారా మోక్షము చెందవలసినదే అట్లే మిగతా అన్నిలోకములకన్నను మానవలోకము శ్రేష్ఠము అయియున్నది

416 మద్రాసులోని ఒక షావుకారునకు ఇద్దరు భార్యలు ఆయన గారికి భక్తిజ్ఞాన వైరాగ్యములు క్రమముగా వృద్ధియగుచుండెను కొంత కాలమునకు అన్ని త్యజించి తీర్థయాత్రలు తపస్సు మొదలగునవి చేయు ఉద్దేశం కలిగినది చిన్న భార్యను "వస్తావా" అని అడిగినారట "ఎక్కడికి" అని ఆమె ఎదురు ప్రశ్న వేసినదట సరే ఎక్కడికి లేదు ఇంటివద్దనే ఉండు అని వదలివేసినారు అట్లనే పెద్దభార్యను అడిగినారు వెంటనే వస్తాను అని బయలుదేరినది అట్లే నడచి సనకసనందన తీర్థము చేరినారు అక్కడకు వారి తల్లిదండ్రులు, సోదరులు (వేదాంత పండితులు) మొదలగు వారు వచ్చి వారిని కలుసుకొని, దేవుడు అంతటా లేడా, మనసులో లేడా, యింట్లోఉండి తరించగూడదా, అని అనేక విధముల బోధలు చేసినారు ఇట్టి వేదాంతములను నేను ఇదివరలో నితరులకు చెప్పి ఎంతో పాపము గడించినాను ఆ సంగతులు నాకు చెప్పవద్దు, నేను రాను అని ఆయన అన్నారట, (ఇది శ్రీవారు

స్వయంగా ఎరిగి ఉన్నకథ)

**417** చంద్రుడు నిశ్చలముగా ఉన్నను చలనము గలిగియున్న నీళ్ళయందు ఎట్లు చలించుచున్నట్లు కనబడుచుండునో అట్లే ఆత్మవస్తువు స్థిరమైన దయియున్నను అంతఃకరణమునందుండు సంకల్పములు అను చలనమువల్ల కదలుచున్నట్లు తోచును

**418** ముత్యాలహారము కావలయునంటే అవి అన్నియు సమకూర్చి హారముగా అమ్ము షావుకారువద్ద కొనుట మంచిది, అంతేగాని ఎక్కడ అవి దొరకునో అక్కడకువెళ్ళి సమకూర్చుకొనుట కష్టము అట్లనే జ్ఞానము కొరకు శాస్త్రములు అన్నియు చదివి సారమును గ్రహించి కావలసిన సంగతులు ప్రోగుచేసిన బ్రహ్మనిష్ఠుడైన గురువు నాశ్రయించుట మంచిది (శ్రీరామ కృష్ణులు)

**419** ఒక పెద్దసత్రములో అనేకవందల జనులున్నారు పోలీసువారు వారి నందరిని ఎరిగిఉన్నారు వారు పోలీసువారిని ఎరిగిఉన్నారు రాత్రి పోలీసువారు పహరాయిచ్చుటకు వచ్చినప్పుడు అందరిని అదలించి అడుగుచుందురు అప్పుడు నీవెవరు, అని పోలీసువారు అడిగినచో వారందరు నేను, నేను అని చెప్పుదురు అప్పుడు అందురు "నేను" అని చెప్పుచున్నారుగాని అంతకంటె ఎక్కువ చెప్పుటలేదు ఆ "నేను" అనే వస్తువు అందరిలోను ఒక్కటే అని తేలుచున్నది అదే పరబ్రహ్మము

**420** కనీసము మూడేండ్లు కదలకుండా ఒక చోట పరబ్రహ్మ నిష్ఠలో నిల్చిన మహత్తు గల్గును శ్రీ రమణమహర్షులవారు, సిద్ధారణ్య స్వాములవారు మొదలగువారందరు అట్లే ఉండిరి మొట్టమొదటవారు పాకలో కూర్చొనిరి ఇప్పుడవి పెద్ద పెద్ద సంస్థలు అయిపోయినవి, ఆవిధంగా అందరు అక్కడక్కడకు వెళ్ళి ప్రబోధమును జరిపించండి, అన్నిటిని ఋషుల ఆరామముల వలె మార్చండి

**421** అన్నమయకోశములో నివసించువారు మృగప్రాయులు వారు శరీరమును మాత్రమే చూచుకొందురు ప్రాణమయకోశములో ఉండువారు సగము మృగత్వము, సగము మానవత్వము కలిగిఉందురు మనోమయకోశమును చెందియుండువారు పూర్ణమానవత్వమును పొందుదురు సామాన్యముగా

గృహస్థాశ్రమములో ధర్మబద్ధముగా కాలము గడుపుచు మనస్సును నిగ్రహింప యత్నించుచుదురుగాని నిగ్రహింపలేరు విజ్ఞానమయ కోశమును చేరుసరికి సగము మానవత్వము, సగము దేవత్వము సంప్రాప్త మగును మనసు కొంత వశమై బుద్ధిరాజ్యము జరుగుచుండును గృహస్థాశ్రమములో ఉన్న కొంత శ్రద్ధమాత్రమే దానియందుండి మిగతా శ్రద్ధ ఆధ్యాత్మ విషయములందు గడుపును, సగము ధనము కుటుంబమునకు, సగము దైవకార్యములకు ఖర్చు పెట్టును ఆనందమయకోశము పూర్ణదేవత్వము, వాడు ఎల్లప్పుడు దైవకార్యములే చేయును వానికి దుఃఖములు పోవును అతడు ఆత్మరాజ్యములోనికి వెళ్ళును వ్యష్టికి సాక్షిగా ఉండును దైవగుణములన్ని అవలంబించుచు సత్త్వగుణ ప్రధానుడు, సత్సంకల్పములు మాత్రమే కలిగి యుండును ఆనందమయకోశముకూడా కోశమే కాని అది శుద్ధకోశము, పూర్ణముగా ఆత్మసాక్షికాదు అదికూడా దాటినప్పుడు పూర్ణ ఆత్మస్థితి కలుగును అప్పుడు సమష్టికి సాక్షిగా నుండును, సత్సంకల్పము కూడా తొలగును పరమశాంతి స్థానము త్రిగుణములు పోవును ఇది జీవం పోయి శివం అయిన స్థానం, కాని యీస్థితిలో అన్ని క్షేత్రములలోఉన్న క్షేత్రజ్ఞుడు అని భావము ఉన్నది సమష్టి అనునది ఒకటి అందుకు సాక్షి ఒకటి రెండూ ఒకటే అను అవస్థలోనుండు వారే పరబ్రహ్మస్థాన మందుండువారు

**422** ఎక్కువ అన్నము తినుటవల్ల మూడు దోషములు :-

(అ) ఎక్కువ తిన్న ఏ కొద్ది అయినా యితరుల పొట్టలో వేయవచ్చును (అట్లు చేయుటకు లేకుండా పోవుచున్నది )

(ఆ) క్రమంగా రోగములు కలుగును

(ఇ) భుక్తాయాసం గలిగి కర్తవ్యమును మాని నిద్ర వగైరాలు జేయుట, పుణ్యకాలము వృధా పోవుట జరుగును

**423** జిహ్వేంద్రియమును కట్టిననేగాని పరిమితముగా తినుట సంభవము కాదు జిహ్వేంద్రియమును, గుహ్యేంద్రియమును జయించి గాని మోక్షమార్గము తెరువబడదు ముక్తుడైననేగాని ఏ కార్యమును చేయుటకు నిజమగు అర్హత లేదు,

స్వయంగా ఎరిగి ఉన్నకధ)

**417** చంద్రుడు నిశ్చలముగా ఉన్నను చలనము గలిగియున్న నీళ్ళయందు ఎట్లు చలించుచున్నట్లు కనబడుచుండునో అట్లే ఆత్మవస్తువు స్థిరమైన దయియున్నను అంతఃకరణమునందుండు సంకల్పములు అను చలనమువల్ల కదలుచున్నట్లు తోచును

**418** ముత్యాలహారము కావలయునంటే అవి అన్నియు సమకూర్చి హారముగా అమ్ము షావుకారువద్ద కొనుట మంచిది, అంతేగాని ఎక్కడ అవి దొరకునో అక్కడకువెళ్ళి సమకూర్చుకొనుట కష్టము అట్లనే జ్ఞానము కొరకు శాస్త్రములు అన్నియు చదివి సారమును గ్రహించి కావలసిన సంగతులు ప్రోగుచేసిన బ్రహ్మనిష్ఠుడైన గురువు నాశ్రయించుట మంచిది (శ్రీరామ కృష్ణులు)

**419** ఒక పెద్దసత్రములో అనేకవందల జనులున్నారు పోలీసువారు వారి నందరిని ఎరిగిఉన్నారు వారు పోలీసువారిని ఎరిగిఉన్నారు రాత్రి పోలీసువారు పహారాయిచ్చుటకు వచ్చినప్పుడు అందరిని అదలించి అడుగుచుందురు అప్పుడు నీవెవరు, అని పోలీసువారు అడిగినచో వారందరు నేను, నేను అని చెప్పుదురు అప్పుడు అందురు "నేను" అని చెప్పుచున్నారుగాని అంతకంటె ఎక్కువ చెప్పుటలేదు ఆ "నేను" అనే వస్తువు అందరిలోను ఒక్కటే అని తేలుచున్నది అదే పరబ్రహ్మము

**420** కనీసము మూడేండ్లు కదలకుండా ఒక చోట పరబ్రహ్మ నిష్ఠలో నిల్చిన మహత్తు గల్గును శ్రీ రమణమహర్షులవారు, సిద్ధారణ్య స్వాములవారు మొదలగువారందరు అట్లే ఉండిరి మొట్టమొదటవారు పాకలో కూర్చొనిరి ఇప్పుడవి పెద్ద పెద్ద సంస్థలు అయిపోయినవి, ఆవిధంగా అందరు అక్కడక్కడకు వెళ్ళి ప్రబోధమును జరిపించండి, అన్నిటిని ఋషుల ఆరామముల వలె మార్చండి

**421** అన్నమయకోశములో నివసించువారు మృగప్రాయులు వారు శరీరమును మాత్రమే చూచుకొందురు ప్రాణమయకోశములో ఉండువారు సగము మృగత్వము, సగము మానవత్వము కలిగిఉందురు మనోమయకోశమును చెందియుండువారు పూర్ణమానవత్వమును పొందుదురు సామాన్యముగా

సమయమునానే (ప్రాణముమీదికి వచ్చినను) చేసి తీరవలయునని దృఢసంకల్పము కలిగి ఉండుటయే సార్వభౌమ వ్రతము

429 నిద్దుర, ఆహారము, పరిశ్రమ, స్నానము మొదలగు బాహ్యాక్రియలు ఒకవేళకు చేయుట అలవాటు అయినయెడల ఆ వేళకు ఆ పనే మనలను ప్రోత్సహించును ఆ మామూలువేళ ఆపని క్రమముగా నెరవేరును

430 కుడివైపున పరుండవలెను జీర్ణము అగుటకు కూడా జలతత్త్వము ఉండవలెను చంద్రనాడి ఆడవలెను పురుషులు బోర్లగాను, స్త్రీలు వెలకిలగాను పరుండరాదు

431 చెన్నపట్టణమునకు దక్షిణ ప్రదేశమున నిర్వాణ సాధు అను ఒక గొప్ప అవధూత ఉండువారు వారికి మానవులను చూడగానే వారి పూర్వ జన్మ కధాస్వరూపము లన్నియు గోచరమవు శక్తి కలిగి ఉండువారట వారిని దర్శించుటకు వచ్చు మానవులందరిని వారి పూర్వజన్మ స్థితి ననుసరించి తేలు పాము కప్ప అని ఇట్లు సంబోధించువారట శ్రీ రామలింగేశ్వర స్వాముల వారు ఒక తూరి వారిని దర్శించగా వారిని మాత్రము పూర్వజన్మలో కూడా మానవులుగానే ఉన్నట్లు సంబోధించినారట మామూలుగా దిగంబరిగా నుండు నిర్వాణ సాధువు రామలింగేశ్వర స్వామిని దూరముగా చూడగానే బట్టకట్టుకొని విభూది వ్రాసుకొని కూర్చున్నారట మీరు ఈ స్థలములో నుండతగిన వారు కారు, ఏకాంత ప్రదేశములోనికి వెళ్ళుట మంచిది అని రామలింగేశ్వరస్వామివారు కోరగా అట్లే చేసినారట పూర్వజన్మ స్థితిగతులను గనిపెట్టుట మాకుకూడా చూపుమని శిష్యులు పట్టుబట్టగా వారందరిని దిగంబరులుగా చేసి తన శరీరమును వారిని పట్టుకొని ఉండుమని అప్పుడు చూడు మన్నారట అప్పుడు వారికి కూడా మానవుల పూర్వజన్మస్థితి గోచరమయినదట, దారముతో కూడిన ఎట్టి గుడ్డకట్టినా, ఉప్పు, కారము, పులుపు ఏమాత్రము తిన్నా త్రికాలజ్ఞానము గలుగదట ఇది ఋషి సంప్రదాయము తోలుగాని నారవస్త్రముగాని కట్టవచ్చునట, లేక దిగంబరిగానైనా ఉండవలెను

432. భిక్షాటనము పరిగ్రహములో చేరదు భిక్ష దుష్టులనుండిగాని

శిష్యులనుండి గ్రహించిన ప్రమాదము లేదు సన్న్యాసి సంపాదించిన అన్నము తినరాదు ఒక్కపూట మాత్రం తిని తిరుగ నీళ్ళు తప్ప మరేమియు తినటంగాని త్రాగటంగాని చేయకుండుట ఉపవాస ముండిన దానితో సమానము

433 ఋషిత్వము కలిగిన తరువాత గాని శాస్త్రములందు అత్యంత ప్రీతి కలుగదు

434 జరిగిన దానిని గురించి చింతచేయుట వృధా జరుగబోవు దానిని గురించిన చింతతో మనస్సులో యాతనపడుట వృధా వర్తమాన ధర్మమును చక్కగా నిర్వహించువాడు యోగి

435 (గీత 9 అ॥ 22 శ్లోక విషయమును గురించి కథ ) ఒక పెద్ద రైలు స్టేషనుమాస్టరు గొప్పదైవభక్తుడు ఒక రోజున స్టేషను డ్యూటీకి రాక యింటి వద్ద ధ్యానములో ఉన్నాడట అప్పుడే చెక్కింగు ఆఫీసరు వచ్చినారట సంగతి తెలుసుకొని అంతా తానే పరీక్షచేసి స్టేషను మాస్టరు రాకుండానే అనుమతి సంతకం పెట్టి ఎట్టి వ్యతిరేక రిపోర్టు వ్రాయకుండా వెళ్ళినారట భగవంతుని (దృఢముగా) నమ్మి ధ్యానములోనే ఉండువారికి కావలసిన పనులు భగవంతుడే సమకూర్చును అనుట కిది నిదర్శనము

436 శ్రీ ఏసువారి గొప్పదైన విశ్వాసమును గురించి కథ వారు ఒక తూరి శిష్యులతో ఒక అరణ్యంలో ప్రయాణం చేయుచుండగా ఆహారము దొరకనందున శిష్యులు సంకటపడ నారంభించినారట మనయొక్క ఒక వెంట్రుకలో ఎన్నోవంతు పుణ్యముచేయని జంతుజాలము లన్నింటికి భగవంతుడు ఆహారమును సిద్ధముచేసి పెట్టుచుండగా తలలో ఎన్నివెంట్రుకలు గలవో అన్ని పుణ్యములుచేసిన మానవులకు ఆహారం లోటు కలిగించునా? మీలో విశ్వాసములేదు అని శ్రీ ఏసు శిష్యులను మందలించిరి

437 ఒక సాధువు ఉత్తర హిందూ స్థానమున పెద్ద అరణ్యములో ప్రయాణము చేయుచున్నారు వారు ఎప్పటికి ఏది దొరికితే అది తిని తృప్తిపడు అలవాటు గలవారు కాని ఒక దినము ఏదియు దొరకలేదు చాలా బడలికచెంది

ఒక చోట నిలిచి పోయినారు దగ్గరలో ఒక కోనేరు ఉంటే దానిలోని నీరు కొంత తెచ్చి కాచి త్రాగి ఊరకుందామని తలంచి తనవద్దనున్న పాత్రతో నీరు తెచ్చుకొని నిప్పుచేసి అందు పైన పెట్టినారు కొంతసేపటికి మరొక సాధువు ఆదారినే వచ్చి ఈ సాధువుచేత ఒక పుల్ల తెప్పించి కొంచెము సేపు ఆవేడియగుచున్న నీటిపాత్రలో ఉంచి త్రిప్పి వదలి వేసి ఎచ్చటికో పోయినారు ఆనీరు కాగపెట్టుకొన్న సాధువు కొంతసేపటికి పాత్ర దింపుకొనబోగా దానినిండా క్షీరాన్నము ఉన్నదట ఈ విషయమును స్వయంగా చూచిన మరొక సాధువు శ్రీవారికి ఈ సంగతి తెలియజేసినారు

438 ఏకాంత తపస్సుకు వెళ్ళువారు అంతకు పూర్వము అన్ని రకముల పుణ్యకర్మములు పూర్తిగా చేసినవారుగా నుండవలయును లేని ఎడల రోగము, సంకటములు దరిద్రములు మొదలగు విఘ్నములు తొలగక బాధపడుచు గమ్యస్థానమును చేరలేరు

439 మలేరియాజ్వరము సుమారు పదిహేను రోజులవరకు పట్టును ఆరోగికి జావ, గంజి లేక మిరియాలచారు భోజనం మాత్రము పథ్యము పెట్టుట మంచిది తీపివస్తువులు తగలరాదు (అందరుకూడా ఎండలు ఎక్కువగా ఉన్న సమయంలో పరమాన్నము మొదలగు తీపిపదార్థములు, వడలు మొదలగు పిండివంటలు మానవలయును పెరుగు, నెయ్యి, నూనెకూడా ఏ మాత్రము కూడదు)

440 తాము ముక్తులై యితరులను తరింప జేయుటకు ప్రయత్నించువారు కూడా వారితో పాటు బాధల పొందవలసియుందురు

ఒక తండ్రికి తన పుత్రునియందు అతిప్రేమ కొడుకు తండ్రివళ్ళేములో గాని మరెక్కడ భుజించడు అట్లుండగా ఒకతూరి కొడుకు మలేరియా జ్వరముతో బాధపడుచుండెను గంజి, జావ చారు అన్నంతప్ప యింకేమి తినరాదు అని విధి అది కూడా వేరుగా తినడు అందుకోసరము తండ్రికూడా ఆజావ మొదలగునవి త్రాగితేనే ఆయనవద్ద కుర్రవాడు త్రాగును అందువల్ల తండ్రి కుమారునికోసరము సుమారు పదిహేను రోజులు జావ మొదలగునవే త్రాగువారు అట్లే

శిష్యులనుండి గ్రహించిన ప్రమాదము లేదు సన్న్యాసి సంపాదించిన అన్నము తినరాదు ఒక్కపూట మాత్రం తిని తిరుగ నీళ్ళు తప్ప మరేమియు తినటంగాని త్రాగటంగాని చేయకుండుట ఉపవాస ముండిన దానితో సమానము

433 ఋషిత్వము కలిగిన తరువాత గాని శాస్త్రములందు అత్యంత ప్రీతి కలుగదు

434 జరిగిన దానిని గురించి చింతచేయుట వృధా జరుగబోవు దానిని గురించిన చింతతో మనస్సులో యాతనపడుట వృధా వర్తమాన ధర్మమును చక్కగా నిర్వహించువాడు యోగి

435 (గీత 9 అ॥ 22 శ్లోక విషయమును గురించి కథ ) ఒక పెద్ద రైలు స్టేషనుమాస్టరు గొప్పదైవభక్తుడు ఒక రోజున స్టేషను డ్యూటీకి రాక యింటి వద్ద ధ్యానములో ఉన్నాడట అప్పుడే చెక్కింగు ఆఫీసరు వచ్చినారట సంగతి తెలుసుకొని అంతా తానే పరీక్షచేసి స్టేషను మాస్టరు రాకుండానే అనుమతి సంతకం పెట్టి ఎట్టి వ్యతిరేక రిపోర్టు వ్రాయకుండా వెళ్ళినారట భగవంతుని (దృఢముగా) నమ్మి ధ్యానములోనే ఉండువారికి కావలసిన పనులు భగవంతుడే సమకూర్చును అనుట కిది నిదర్శనము

436 శ్రీ ఏసువారి గొప్పదైన విశ్వాసమును గురించి కథ వారు ఒక తూరి శిష్యులతో ఒక అరణ్యంలో ప్రయాణం చేయుచుండగా ఆహారము దొరకనందున శిష్యులు సంకటపడ నారంభించినారట మనయొక్క ఒక వెంట్రుకలో ఎన్నోవంతు పుణ్యముచేయని జంతుజాలము లన్నింటికి భగవంతుడు ఆహారమును సిద్ధముచేసి పెట్టుచుండగా తలలో ఎన్నివెంట్రుకలు గలవో అన్ని పుణ్యములుచేసిన మానవులకు ఆహారం లోటు కలిగించునా? మీలో విశ్వాసములేదు అని శ్రీ ఏసు శిష్యులను మందలించిరి

437 ఒక సాధువు ఉత్తర హిందూ స్థానమున పెద్ద అరణ్యములో ప్రయాణము చేయుచున్నారు వారు ఎప్పటికి ఏది దొరికితే అది తిని తృప్తిపడు అలవాటు గలవారు కాని ఒక దినము ఏదియు దొరకలేదు చాలా బడలికచెంది

కొంతకాలమునకు అట్లే పరిణామము కలుగును శ్రీ రామకృష్ణపరమహంసలుకూడా అట్లనే చెప్పినారు కనుక బ్రహ్మనిష్ఠ చేయువారు (వారికి ఎవరివల్ల ఎట్టి ఆటంకములు ఉన్నను) శాంతముతో ఓర్చుకొని నిష్ఠ మానకుండా చేయుచుండుటయే కాక హెచ్చుగా కూడా చేయుచుండవలయును

446 మానవునితో పోల్చిచూచిన తేళ్ళు పాములు మొదలగు జంతువులు చాలా చిన్నవి వాటికి మానవుడు భయపడవలసిన పనియేమి? పైగా మనోవాక్కాయకర్మముల లోగడ జన్మములలోగాని యింతవరకు ఈ జన్మములోగాని వాటికి ఏ విధముగాను అపకారముచేసి గాని ఎంచి గాని ఉండనిచో అట్టివారికి అవి ఏ విధమగు అపకారమును చేయవు చేయజాలవు

447 అహింస పాటించిన ఎవరి వల్లను హింసింపబడరు సత్యవాక్కు గలిగిఉండిన అన్న మాటలు అయిపోవును మట్టిని బంగారము సమానముగా చూచువారికి భూమిలోని నిధి నిక్షేపములను చూడగల శక్తి గలుగును బ్రహ్మచర్యముచేత బ్రహ్మతేజస్సు గలుగును అపరిగ్రహముచేత త్రికాలజ్ఞానము కలుగును

448 ఆర్థిక జీవితమున కూడా ఋషిజీవితమే ఆదర్శప్రాయము కొంత స్వంతప్రదేశం పన్నుకూడా ఉండకుండా ఫలితమును అనుభవించటము ఆదాయముకంటే ఖర్చువిధిగా తక్కువ చేయుట, ఖర్చులో చాలా నిరాడంబరమగు తక్కువ ఖర్చు మిగతా ఆర్థిక సిద్ధాంతము లన్నియు ఇట్లే శాంతి ప్రదముగాను, నిత్యసుఖప్రదములుగాను వుండును

449 అటులనే ఆరోగ్యజీవనమునకు కూడా ఋషి జీవనమే ఆదర్శ ప్రాయము

450 మాటలు తగ్గించువారికి మాయ ఉడుగును అట్లు చేయుట మోక్షమునకు మొదటి మెట్టు, మొదటిద్వారం అని చెప్పినారు (శ్రీ శంకర వచనము)

451 కేవలం శరీరధారణకు తగినది గ్రహించుట అపరిగ్రహ సిద్ధాంతమునకు వ్యతిరేకము కాదు అదిగాక ప్రేమతో ఇచ్చినప్పుడు పుచ్చుకోకపోతే

దైవమునకు కోపము అట్లా చేసిన ఎడల కొన్నాళ్ళకు ఇతరులను అడుగుకొనే శిక్ష కూడా వేస్తాడు

452 బ్రహ్మకు అయిదవ శిరస్సు పోయిన కధ :- అందరికంటె గొప్ప వాడనని బ్రహ్మకు అహంకారము నాబొడ్డుకమలంలో నీవు పుట్టినావు నాకంటే గొప్పవాడివి కాజాలవు అని విష్ణువు ఈ వాదన తెంపుకోవటము నిమిత్తము ఇద్దరు పరమేశ్వరుని వద్దకు వెళ్ళినారు నా శిరస్సు ఒకరు పూజించవలసినది నాకాళ్ళు ఒకరు చూడవలసినది అట్లు లేకపోయిన ముందుగా వచ్చి నాకు చెప్పండి అని వారు అన్నారట అందుపైన హంస రూపమును దాల్చి బ్రహ్మ పైకి ఎంత ఎగిరినా అంతు దొరకలేదు విసిగిపోయి తిరుగుచుండగా సిద్ధపురుషులు శివుని శిరస్సును పూజించిన మొగలిపువ్వు ఒకటి క్రిందికి దిగుచుండగా తాను కూడా శిరస్సును చూచినట్లు, పూజించినట్లు సాక్ష్యము చెప్పుమని దానితో బ్రహ్మ ఏర్పాటు చేసుకొన్నారు అట్లే దారిలోనే కామధేనువుతో కూడ అటువంటి ఏర్పాటే చేసుకొన్నారు శ్రీ విష్ణువు శ్వేతవరాహ రూపమును ధరించి ఎంత త్రవ్వినను పాదములు చూడజాలక తిరిగివచ్చి వెంటనే నిజము చెప్పినారట శిరస్సు నేను చూచినాను అని బ్రహ్మ అబద్దము ఆడినారు ఆయనకు మొగలిపువ్వు అబద్ధపు సాక్ష్యము చెప్పినది కామధేనువును అడిగతే నోటితో ఏమియు చెప్పక తోకను ఆడించుచు నిజమును సూచించినదట అప్పుడు ఆవుతోక (ముఖముకాదు. దాని కట్టి పూజార్హత లేదు) పవిత్రము అయి పూజింపబడుగాక యనిన్ని, ఆ తోకను అంటునవి అన్నియు కూడా పవిత్రములు అగునుగాక యనిన్ని శివుడు దీవించినారట అందువల్లనే తోకను అంటివచ్చు పేడ, పంచితముకూడా చాలా పవిత్రములు అయి అన్ని పుణ్యాకార్యములయందు అవిలేకుండా పూజయే జరుగనట్టి స్థిరమగు ఆచారము ఏర్పడినది దుర్జడత గలవారిచే అలంకరింపబడుదువు గాత అని మొగలి పువ్వును శపించినాడట బ్రహ్మ అయిదవ తలను గోటితే పెరికివేసి నీకు లోకములో ఏ విధమగు పూజలు గాని, స్మరణగాని లేకుండా పోవుగాక యని శపించినాడట అన్ని యజ్ఞములకు వేద కర్మములకు సర్వభోక్తవు నీవే అయి లోకముచే పూజింపబడుదువు గాక యని శ్రీ విష్ణువును దీవించినాడట

**453** శివరాత్రి కథ :- పాము కరచినవారు రాత్రి నిద్రపోరాదు సముద్రమథనములో వచ్చిన హాలాహలమును మ్రింగిన శివుడు ఆ రాత్రి జాగరణ చేసినారట అందువల్లనే శివరాత్రి ఏర్పడినది దానిననుసరించే పాముకరచినవారు ఆ రాత్రి నిద్ర పోకుండా ఉండు ఏర్పాటు వచ్చినది

**454** భీష్మలవారి బ్రహ్మచర్యం, పరుశురాములవారి సలహాకథ- మమ్మెుతెచ్చినాడు వివాహము చేసుకోననుచున్నాడు మీరు చెప్పవలసినది అని భీష్మలవారి గురువులగు పరశురాములవారికి అంబ మొరపెట్టుకొనగా, ఆయనగారు భీష్మలవారి వద్దకు వెళ్ళి వివాహము చేసుకోమని చెప్పినారట నేను చేసుకోనని భీష్మలవారనిరి గురుని ఆజ్ఞ తిరస్కరించి నందులకు నిన్ను శిక్షించెదను అని పరశురాములవారు పలికిరి ఇప్పుడు నేను రాజ్యపరిపాలనలో నున్నాను ధర్మమును కాపాడవలసినది నేను, పితృవాక్య పరిపాలనార్థము వివాహమాడనని శపథము చేసిఉన్నాను మీరు అధర్మమును మాట్లాడిన దండించు అధికారము నాకు కలదు ఈ విషయములో మీరు గురువులని పాటించవలసిన అగత్యము లేదు అని భీష్మలవారు చెప్పిరి అందుపై ఇరువురకు హోరాహోరి యుద్ధము జరిగినది కడపట ఋషులు రాజీచేసిరి భీష్మలవారి గొప్పతనమును పరశురాములవారు అంగీకరించినారు ధర్మసూక్ష్మతకూడా ఎటులుండునో యీ కథ తెలుపుచున్నది

**455** భారతము రచియించునప్పుడు శ్రీ వ్యాసులవారు చెప్పుతూ ఉండగా శ్రీ వైశంపాయనులు వ్రాయుచుండువారు వైశంపాయనులు అప్పటిలో యౌవనదశలో నుండువారు ఎంత పండితుడైనను తల్లి, తోబుట్టువు మొదలగువారితో కూడా ఏకాంతవాసము చేయరాదు అనుఅర్థముతో ఒక శ్లోకమును చెప్పగా పండితుడుకాక మిగతావారు అట్లుచేయరాదు అను అర్థమునిచ్చునట్లు వైశంపాయనులు మార్చి వ్రాసినారట అందువల్ల ఒకరాత్రి వైశంపాయనులు ఒంటరిగా ఉండజూచి వ్యాసులవారు ఒక మహా సుందరిరూపముతో వారికడకు వచ్చి మనసుని చలింపజేసి పారమును నేర్పిరి

**456** ఏ మాత్రము దుఃఖమున్నను - హృదయమాలిన్యము పోలేదు, సంకల్పము విడువలేదు, పాపము నశింపు కాలేదు అని అర్థము

దైవమునకు కోపము అట్లా చేసిన ఎడల కొన్నాళ్ళకు ఇతరులను అడుగుకొనే శిక్ష కూడా వేస్తాడు

452 బ్రహ్మకు అయిదవ శిరస్సు పోయిన కథ :- అందరికంటె గొప్ప వాడనని బ్రహ్మకు అహంకారము నాబొడ్డుకమలంలో నీవు పుట్టినావు నాకంటే గొప్పవాడివి కాజాలవు అని విష్ణువు ఈ వాదన తెంపుకోవటము నిమిత్తము ఇద్దరు పరమేశ్వరుని వద్దకు వెళ్ళినారు నా శిరస్సు ఒకరు పూజించవలసినది నాకాళ్ళు ఒకరు చూడవలసినది అట్లు లేకపోయిన ముందుగా వచ్చి నాకు చెప్పండి అని వారు అన్నారట అందుపైన హంస రూపమును దాల్చి బ్రహ్మ పైకి ఎంత ఎగిరినా అంతు దొరకలేదు విసిగిపోయి తిరుగుచుండగా సిద్ధపురుషులు శివుని శిరస్సును పూజించిన మొగలిపువ్వు ఒకటి క్రిందికి దిగుచుండగా తాను కూడా శిరస్సును చూచినట్లు, పూజించినట్లు సాక్ష్యము చెప్పుమని దానితో బ్రహ్మ ఏర్పాటు చేసుకొన్నారు అట్లే దారిలోనే కామధేనువుతో కూడ అటువంటి ఏర్పాటే చేసుకొన్నారు శ్రీ విష్ణువు శ్వేతవరాహ రూపమును ధరించి ఎంత త్రవ్వినను పాదములు చూడజాలక తిరిగివచ్చి వెంటనే నిజము చెప్పినారట శిరస్సు నేను చూచినాను అని బ్రహ్మ అబద్ధము ఆడినారు ఆయనకు మొగలిపువ్వు అబద్ధపు సాక్ష్యము చెప్పినది కామధేనువును అడిగతే నోటితో ఏమియు చెప్పక తోకను ఆడించుచు నిజమును సూచించినదట అప్పుడు ఆవుతోక (ముఖముకాదు. దాని కట్టి పూజార్హత లేదు) పవిత్రము అయి పూజింపబడుగాక యనిన్ని, ఆ తోకను అంటునవి అన్నియు కూడా పవిత్రములు అగునుగాక యనిన్ని శివుడు దీవించినారట అందువల్లనే తోకను అంటివచ్చు పేడ, పంచితముకూడా చాలా పవిత్రములు అయి అన్ని పుణ్యాకార్యములయందు అవిలేకుండా పూజయే జరుగనట్టి స్థిరమగు ఆచారము ఏర్పడినది దుర్గ్నడత గలవారిచే అలంకరింపబడుదువు గాత అని మొగలి పువ్వును శపించినాడట బ్రహ్మ అయిదవ తలను గోటితే పెరికివేసి నీకు లోకములో ఏ విధమగు పూజలు గాని, స్మరణగాని లేకుండా పోవుగాక యని శపించినాడట అన్ని యజ్ఞములకు వేద కర్మములకు సర్వభోక్తవు నీవే అయి లోకముచే పూజింపబడుదువు గాక యని శ్రీ విష్ణువును దీవించినాడట

దోషములను పోగొట్టును చాలా శ్రేష్ఠము కాని యీ రెండు వంటలలోను ఉప్పుకారం పులుపు ఎక్కువ చేర్చరాదు వాటి ఫలితం పోవును బొప్పాయి కాయకూడా అట్లే ఉసిరికకూడ మంచిది

462 సుఖం, దుఃఖం రెండున్నూ ఆత్మప్రాప్తికి ప్రతిబంధకములు ఈ రెండు లేనివారు గాని బ్రహ్మమునందు నిలువలేరు అందుచే ఎక్కువ ఆస్తి పనికి రాదు నిండా దరిద్రము పనికిరాదు అట్లే యితర విషయమున్నూ

463 చరక సంహితయను వైద్యశాస్త్రమును రచియించిన ఋషి సాలుకు రెండు, మాసమునకు రెండు, వారమునకు రెండు, రోజుకు రెండూ ఉన్న వారికి ఈ శాస్త్రముతో పనిలేదు అని వారి శిష్యులకు చెప్పినారట దినమునకు రెండుసార్లు భోజనము, వారమునకు రెండుతలంట్లు, మాసమునకు రెండుసార్లు మైథునం, సాలుకు రెండుసార్లు భేదికి పుచ్చుకొనుట

464 అట్లు నాలుగు విధులు కాదు, ఒక్క విధే ఏదైనా చెప్పమని చరకమహర్షిని శిష్యులు కోరగా, ఎవరైతే బ్రహ్మచర్య వ్రతమును క్రమంగా నడుపుకొందురో వారికి కూడా ఆరోగ్యశాస్త్రముతో పనిలేదు అని చెప్పినారట

465 కరక్కాయ తల్లివంటిది తల్లి అయినా ఎప్పుడైనా అపకారము చేయవచ్చును కాని కరక్కాయ అట్లుచేయక ఎప్పుడు ఉపకారమే చేయుచుండును త్రిఫలయోగం (కల్పము) చాలామంచిది నాలుగు ఆశ్రమ వాసులకు కూడా మేలుచేయును త్రిఫలములు కరక్కాయ, తాండ్రకాయ, ఉసిరికకాయ గుండ్ర కరక్కాయ పనికిరాదు బాగా తోమిన రాగిపాత్ర రంగు కలిగి కోలగా ఉండునది మంచిది చైత్రమాసములో తీసిన కరక్కాయ కావలయును కరక్కాయ ఒక తులం, తాండ్రకాయ రెండు తులములు, ఉసిరికకాయ నాలుగు తులములు కలుపవలెను ఉసిరికకాయ కొన్నవి శ్రేష్ఠము కాదు పచ్చివి పనికిరావు పండి రాలుటకు సిద్ధంగా ఉన్నసమయంలో తీయవలయును అనుపానం సామాన్యముగా తేనె అన్నికలిపి ఒక డబ్బాలో వేసి ఉసిరికకాయంత ప్రాతఃకాలములో తినిన సర్వరోగనివారిణి రాత్రి భోజనముచేసి పరుండబోవునప్పుడు తీసుకొనవలెను అప్పుడు నీరుకూడా కొంచెము త్రాగుట మంచిది బ్రహ్మచారులకు ఆవునెయ్యి అనుపానం మాత్రం,

రోగములు ఎక్కువగా ఉన్నవారికి ఆవునెయ్యి బెల్లం అనుపానం

466 7 1/2 తులాలు సునాముఖి, 7 1/2 తులాలు గులాబి లేహ్యం, కొంచెం తేనె కలిపి రాత్రి ఉసిరిక కాయంత తినిన కాలవిరేచన మగును

467 కేవలము యోగులకు, బ్రహ్మచారులకు, బ్రహ్మనిష్ఠులకు మంచియోగము :- కరక్కాయలు మాత్రం తీసి రోగము లేకుండా యౌవనములో ఉన్న ఆవుమూత్రం క్రొత్త మట్టిపాత్రలోపోసి కరక్కాయ చెక్కలు అందులో కలిపి ఒకరోజు నానబెట్టి, ఒకరోజు ఎండనిచ్చి, అట్లు మూడుసార్లు చేయవలయును పిమ్మట చూర్ణముచేసి ఆవునెయ్యి కలిపి ఉసిరికకాయంత పుచ్చుకొనవలెను దేహము వజ్రకాయ మగును

468 కేవలము ఇంద్రియమును కాపాడుటకు పంచకల్పము- (1) ఉసిరిక పప్పు, (2) తెల్లమిరియాలు, (3) జీలకర్ర, (4) కస్తూరి పసుపు, (5) ఆవుపాలు ఒక్కొక్క తులం వంతున బాగా నూరి ఆవుపాలలో కలిపి మంచి (పొగలేనట్టి) అగ్ని మీద ఆవిరి వచ్చువరకు కాచి దింపవలయును దానిని తలకు వ్రాసుకొని ఎండనిచ్చి తరువాత స్నానము చేయవలయును

469 బ్రహ్మచారులకు, జబ్బుకలవారికి పైన చెప్పిన వాటిలో ఉసిరికకాయ మిగతావి మూడు ఆవుపాలతో ఇత్తడిపాత్రలో కలిపి తలకు పూసి స్నానముచేయుట మంచిది

470 మాతాపితరులయందు గొప్పభక్తి లేనివారు గొప్పవారు కాజాలరు వారియందు దైవభావన కలిగిన గాని దైవసాక్షాత్కారము కలుగదు

471 పాపము చేసినవారే పాపిని అని విచారపడుదురు పాపి కాని వారికి అట్టి అభిప్రాయమే ఉండదు నేను భగవంతుడనే అనుభావమును ఎవడు మరచునో వాడు పాపము చేసినట్లే అని శ్రీ రామతీర్థులు చెప్పియున్నారు

472 ఇల్లు చిన్నదిగాను వంటపాత్రలు పెద్దవిగాను ఉండవలెను దేవాలయం చిన్నదిగాను నైవేద్యము హెచ్చుగాను ఉండవలయును

473 పూర్ణబ్రహ్మనిష్ఠునకు ఉండు కళలు (అ) మరం, (ఆ) కొలను (ఇ) దేవాలయం, (ఈ) కళలు నేర్చుకొను పాఠశాల, అర్ధబ్రహ్మనిష్ఠునకు మొదటి మూడుమాత్రం, పాతిక బ్రహ్మనిష్ఠునకు మొదటి రెండు మాత్రం, పరక బ్రహ్మనిష్ఠునకు మొదటిది మాత్రం ఉండును

474 ఇవి భగదాజ్ఞచే ఏర్పడవలయును - కోరినను వచ్చునవి కావు వారు కోరరాదు కోరకుండా వచ్చినప్పుడే ఆ గుర్తు

475 జంతువు లన్నింటికి కాలనియమం కార్యనియమం ఉండగా మానవునకు లేకపోవుట విచారము ఆహారము, నిద్ర, పరిశ్రమము మొదలగునవి సరిగా నియమప్రకారము నడచినచో గడియారము అవసరము లేకుండా ప్రకృతే ఆ సమయమునకు ఆ పని చేయుటకు సిద్ధముగా నుండును ఏపని కొన్నిరోజులు ఎట్లు ఏ వేళకు చేయుట అలవాటు చేయుదుమో ప్రకృతి ఆ పనిని ఆవేళకు అట్లు మన ప్రయత్నం లేకుండానే చేయును లేక చేయించు స్వభావశక్తి కలిగియున్నది

476 సంకల్పములు అయిదు విధములు,(అ) మృగసంకల్పము, (ఆ) మనుష్యసంకల్పము, (ఇ) దైవసంకల్పము, (ఈ) సిద్ధసంకల్పము, (ఉ) బ్రహ్మసంకల్పము

మొదటి సంకల్పము ఎప్పటికిని నెరవేరదు అది కలవారు కేవలము పశుప్రాయులు, తమోగుణప్రధానులు రెండవసంకల్పము గలవారు ధర్మబద్ధులుగా నడుచువారు వారి సంకల్పము మూడేండ్లలో నెరవేరును మూడవతరగతి సంకల్పము గలవారు సత్త్వగుణ ప్రధానులు-వీరి సంకల్పము ఒక సంవత్సరములో నెరవేరును సిద్ధసంకల్పముకలవారు విశుద్ధగుణములో ఉండువారు వారి సంకల్పము మూడు మాసములలో నెరవేరును బ్రహ్మసంకల్పము గలవారు నిత్యమందు నివసించువారు వారు సంకల్పించగానే నెరవేరును

477 మనకు నిజమగు కరుణ కలిగి సమస్త చరాచర ప్రాణికోట్ల క్షేమం కోరినచో భగవంతుడు ముందు అట్టివారికే క్షేమము కలుగజేయును

478 శ్వాసలు ఎంత నెమ్మదిగా నడచునో అంత ఎక్కువకాలం

బ్రతుకుదురు

479 ఓంకార లక్ష్యంలో నిలబడి ఉన్న సమయమున ఓంకారము ఉచ్చారణ అవసరము లేదు అట్లు మనసు నిలువనప్పుడు తిరిగి ఓంకారమును ఉచ్చరించు చుండవలయును

480 అన్ని ప్రాణాయామములు దైవభావనతో చేసినకాని ఫలితం లేదు

481 కేవలం కుంభక ప్రాణయామము అపాయం లేదు కేవలం ఉజ్జయినీ ప్రాణాయామము బాధలేదు రేచకపూరక కుంభకములతో కూడిన ప్రాణాయమము చేయునప్పుడు ఆహార బ్రహ్మచర్యాది నియమములు (అందు ముఖ్యముగా యమ నియమములు) లేనిచో చాలా హానిచేయును

482 వేదములు, ధర్మశాస్త్రములు ప్రతిపాదించిన పరమాత్మ మన యందే కలదు ఏదైనా సందేహము కలిగిన లేక ప్రశ్న అడుగదలచిన దానిని అడుగుట మంచిది

483 తిరుపతిలో ఏడుకొండలు ఎక్కుటకు మొట్టమొదట రెండవ కొండను గురించి ప్రయత్నించుట అవసరము లేదు మొదటి కొండ ఎక్కినచో ఆదారే తీసుకుపోయి రెండవ కొండదగ్గర విడుచును అట్లే యోగమార్గమునందును మెట్లు వరుసగా నడిచిన ఒక మెట్టు పై మెట్టుకు క్రమముగా తీసుకొని వెళ్ళియే తీరును, కాని ఏమెట్టులోఉన్నామో దాని యందు నడచుచునే ఉండవలయును అనగా నిష్ఠ సాధించుచునే ఉండవలయును

484 దైవకార్యములు అనేక విధములు దేనియందు మనసు నిలువదో అప్పుడు రెండవకార్యమును చేయుచుండవలయును అట్లు తగిన మార్పులతో కార్యక్రమము ఏర్పాటు చేసుకొనవలయును

485 సంస్కార జీవులగు వారికి గురుకులవాసము మండలము రోజులు కూడా చాలును

కళావతి అను స్త్రీ భృగుమహర్షికి శిష్యురాలు, పరమ పవిత్రురాలు ఆమెభర్త

అపవిత్రుడు నన్ను అంటుకున్న కాలిపోదువు అని ఆమె భర్తతో చెప్పినదట అయినప్పటికి చేతితో అంటగా చేయి కాలిపోయినదట అందుపై ఆయనతో ఆమె, భృగుమహర్షులవారిని ఆశ్రయించి ఉపదేశమును పొంది పవిత్రుడవు అగుము అప్పుడు నాతో కాపురము చేయు అర్హత కలుగును అని చెప్పినది ఆ విధంగా 40 రోజులు గురుగుల వాసము సరిపోయినదట

486 బంధువుల నెడబాసినను, దేహము రోగమయమయి పోయినను, ఎన్ని కష్టములు వచ్చినను భగవదుపాసనము మానకుము

487 త్రిగుణవ్యాపారమునకు నీవు సాక్షి వగుటకు పూర్వము (అనగా విశుద్ధ గుణమును ప్రవేశించునప్పుడు) ఒక మహాకష్టము కలదు నీ స్వభావమందలి యశుద్ధి నీకు గోచరమై పుణ్యాపాప భావము నిన్ను వెంటాడించును భగవానుని హస్తములో నిన్ను నీవు సమర్పించుకొంటివి గనుక ఆయన నీ అపరిశుద్ధములను తుడిచి వేయునని గట్టిగా జ్ఞప్తియందుంచు కొనుము (అరవింద ఘోషు)

488 నీవావల నిలుచుండి నీయందు భగవచ్ఛక్తి యెట్లు పనిచేయు చున్నదో పరిశీలించుము ఈ కార్యమునందు తరచుగా శరీరక్షోభయు, క్లేశమును కలుగును అందుచే విశ్వాసము - పరిపూర్ణవిశ్వాసము - ఒక్క సారిగా సాధ్యము కాకున్నను అవసరము ఏమనగా నీలో నెట్టి అశుద్ధి యున్నను - బహిరంగముగా నున్నను గూఢముగా నున్నను, - అది పూర్తిగా నిర్మూలింప బడనంతవరకు ప్రాయశః విజృభించి మరల మరల తలయెత్తుచుండును ఈ కాలమున సాధారణముగా సంశయము లోక సామాన్యమగు అపరిశుద్ధి, సంశయము చుట్టుముట్టి నపుడుకూడ నీవు ఒత్తిగిలి నిచ్చి దానిని వెడలి పోనిమ్ము, సాధ్యమగునేని ఈ మార్గమున నిదివరకే పురోగాములగువారి సత్సంగలాభమును సంపాదింపుము అది దుర్లభ మగునప్పుడు, యోగము యొక్క మూలసూత్రమగు ఆత్మ సమర్పణమును గట్టిగా నవలంబించి యుండుము అంతరంగమున బాధగలిగి నప్పుడు గాని, బాహ్యమునుండి ముట్టడింపబడినప్పుడు గాని "మచ్చిత్తస్సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి" నాయందు చిత్తమును సమర్పించిన వాడవై నాప్రసాదముచే సర్వకష్టములను తరించగలవు "సర్వధర్మాన్ పరిత్యజ్య మాశుచః" అను

గీతావాక్యములను స్మరింపుము బాధ్యత నీ భుజములపై నున్నట్లుగాని, ఫలము నీ ప్రయత్నములమీద ఆధారపడినట్లుగాని నీవు ఆందోళన పొంది శ్రమపడనక్కర లేదు నీకంటె బలవత్తరమయిన శక్తి యీ విషయమున శ్రద్ధతో పనిచేయుచున్నది వ్యాధిగాని, విపత్తుగాని నీలో నెట్టిభయమును కలిగింపరాదు ఆయననే నీవు దృఢముగా నమ్మి యుండుము నిన్ను "సర్వపాపములనుండి రక్షించును", ఈ విమోచనము ఆకస్మికమగు ఇంద్రజాలముచే జరుగును అది శోధన విధానముచే లభించును ఇవి అన్నియు ఆ విధానములందలి భాగములు అవి చిరకాలముగా నూడ్చని గదిని ఎట్టకేలకు తుడిచినప్పుడు మబ్బులు గట్టుచు లేచు ధూళి వంటివి ఆ ధూళిచే నీకు ఊపిరి సలుపకున్నను దీక్షతో కృషిచేయుము (అరవిందయోగి)

**489** జబ్బులు, రోగములు, ఆటంకములు కలిగినప్పుడు, సామాన్యముగా సుందరకాండ పారాయణ, సూర్యనమస్కారములు, విష్ణు సహస్రనామ పారాయణ చేసిన తొలగిపోవును వర్తమాన ప్రతిబంధములు- రోగములు, విషయసుఖములు, ప్రజ్ఞామాంద్యము, దురాగ్రహము

**490** శ్రీ రామలింగేశ్వరస్వామివారు బంగారము చేయుశక్తి గలిగి అట్లు చేయుచుండుట తెలిసి గవర్నమెంటువారు అరెస్టు చేయవలయునని ప్రయత్నము వారు చేసిరి ఒకచోట అరెస్టుచేసి పట్టుకొనినచో వారట ఇంకొకచోట ఉండుట యీ విధంగా విసిగిపోయి అధికారులు క్షమాపణకోరి వెళ్ళిపోయినారట!

**491** శ్రీ గురునారాయణస్వాములవారు చేసిన రెండు రైలు ప్రయాణములను గురించిన కథలు :-

ఒకతూరి రైలు ప్రయాణమునకు వారు స్టేషనుకు రాగా రైలు వారికి అందక పోయినదట వారి శిష్యులు కొంతమంది మాత్రము వెళ్ళినారట గమ్యస్థానము చేరునరికి వారికంటే ముందే శ్రీవారు అక్కడికి వచ్చిఉన్నారట అందరు ఆశ్చర్యపడినారట

మరొకతూరి రైలు ప్రయాణమునకు బయలుదేరి స్టేషను చేరుసరికి కొంచెము ఆలస్యమై రైలు బయలుదేరిపోతూ ఉండగా వీలులేదు అనే సరికి రైలు కారణం

లేకుండా ఆగిపోయినదట, అధికారులు ఏ లోటువల్ల ఆగింది కనిపెట్టలేక పోయినారట, వారు ఎక్కినపిమ్మట ఏమియు చేయకుండానే రైలు కదలినదట

492 అహంకారమను సుతుని, ధనమను సోదరుని, మోహమను మందిరమును (అనగా ఇల్లు) ఆశయను భార్యను ఎవడు విడచునో వాడు సంన్యాసి ముక్తుడు, ఆత్మజ్ఞాని (అట్టివానికి మూలావిద్య అను తల్లి చనిపోయి బోధయను సుతుడు పుట్టినవాడు అగును) స్త్రీకి నిజమగు భర్త ఆత్మారాముడు పురుషునకు నిజమగుకాంత ముక్తి(మైత్రేయ్యుపనిషత్తు)

అట్టివా రిద్దరికి పుట్టు ఆత్మబోధయను కుమారుడు తల్లిదండ్రులనే కాక లోకమంతయు ఉద్ధరించును

493 బొంబాయిలో ఒక స్త్రీయున్ను- బర్మాలో ఒక బౌద్ధసన్న్యాసియు తమ పూర్వచరిత్రలు చెప్పినట్లు వార్తాపత్రికలలో తెలుపబడినది

బొంబాయి స్త్రీ పూర్వజన్మమందలి తన భర్తను, కుమారుని, ఊరు, అందుండు ఇల్లు-అన్ని సంగతులు చెప్పినదట, దానికి తార్కాణము చూపు మనగా పూర్వజన్మలో ఒక వందరూపాయలు నేలలో పాతి పెట్టినచోటు కనబర్చినదట అక్కడ త్రవ్వగా అట్లే ఉన్నవట ఈ వార్త ఆంధ్రపత్రికలో ప్రకటింపబడినది అట్లనే బర్మాలో ఒక బౌద్ధసన్న్యాసి మూడు జన్మల సంగతులను తెలిపినారట

494 ఆత్మ గుహయందు నివసించువాడు అరణ్యములో నివసింపవలసిన పనిలేదు (విషయము మైత్రేయ్యుపనిషత్తు నుండి)

495 కర్మవిడుచుట సన్న్యాసము కాదు జీవుని శివుని జేయుటయే సన్న్యాసము

496 మధూకరమను తల్లిని- వైరాగ్యమను తండ్రిని - శ్రద్ధ[illegible]- జ్ఞానమను కుమారుని విడువనివాడు సన్న్యాసి (మైత్రేయ్యుపనిషత్తు)

497 ధనవృద్ధులు, వయస్సున వృద్ధులు, [illegible] జ్ఞానవృద్ధునకు దాసులగుదురు, (మైత్రేయ్యుపనిషత్తు)

498 అన్ని పనులలోను ఆత్మను గురించి చెప్పు ఆధ్యాత్మవిద్య నభ్యసించుట చాలా గొప్పది అట్టిది ప్రపంచములో ఏమిన్ని లేదు

499 ఆత్మ ఎట్టిదనగా నీళ్ళలోఉంచబడిన కుండవలె అంతఃపూర్ణం బహిః పూర్ణం, ఆకాశములో ఉంచబడిన కుండవలె అంతశ్శూన్యం బహిశ్శూన్యం (మైత్రేయ్యుపనిషత్తు)

ఓం తత్ సత్ ఓమ్



# పాపవిముక్తి

పాపమనియు, కర్మమనియు, మాయ యనియు, అవిద్యయనియు, అజ్ఞానమనియు గల శబ్దములన్నియు ఒకే అర్థమున పర్యాయపదములుగానే ప్రయోగింపబడుచుండును అట్టి పాపమునుండి, అజ్ఞానము నుండి విముక్తి పొందుట కొఱకే యీ మానవజన్మ గలిగినది అనగా అజ్ఞాన విమోచనము గలుగ జేసికొనుట కొఱకు మనుష్య జన్మ గలవారికి మాత్రమే సాధ్య మగును పశ్వాదుల కిది సాధ్యము గాదు ఏలన మనుజులకు ఏదైన వ్యాధి గలిగిన నౌషధ సేవాదులచే నివృత్తి జేసికోవచ్చును కాని పశ్వాదులకు స్వయముగా అట్టిశక్తి గనిపించుట లేదు ఈ తరుణమున, నీ విషయమైయాలోచించుకొనవలసిన సంగతి యొకటి గలదు అదేమన ఔషధమున్ను వైద్యులున్ను రోగులకొఱకే యేర్పడినవని మరుపు గలుగనీయక ప్రతివారున్ను, జ్ఞాపకములో నుంచుకొనవలసి యుండును ఆలాగున అజ్ఞానులను జ్ఞానోపదేశములచే నుద్ధరించుకొనుటయే జ్ఞానులయొక్క కర్తవ్యమని మరువగూడదు ఈ విషయములో భారతదేశమున నావిర్భవించిన జీవన్ముక్తులను దలంచి వచ్చిన, వారిలో కొద్దిమంది మాత్రమే తమ కర్తవ్యమును నిర్వహించినట్లు చరిత్రమువలన గనిపించుచున్నారు వారిలో ప్రధములు శ్రీ బుద్ధదేవుడు, రెండవవారు శ్రీ గురునానక్, తక్కిన మతకర్తలందరున్నూ పాపులని తలంచబడు జనులను దూరీకరించుచువచ్చిరి అందువలననే భారతదేశము ఇతరదేశములతో సరితూచిన నెంతయో క్రింది మెట్టులో ఉండుటకు గారణమైనది శ్రీ యేసుక్రీస్తు శ్రీ మహమ్మదునబి మొదలగు ప్రవక్తలందరున్నూ పాపులను పవిత్రులనుగా నొనర్చుటకు ప్రయత్నించినందువలననే ఆ మతము లున్నతస్థితిలోనికి వచ్చుటకు గారణమైనవి ఈ విషయమై మనశాస్త్ర మేమి తెలిపియున్నదని విచారణము జేయుట ప్రతి ముముక్షువు యొక్కయు, ప్రతి జిజ్ఞాసువు యొక్కయు కర్తవ్యమై యున్నది

ఈ విషయమై గీతాచార్యులగు శ్రీ కృష్ణభగవానులు ఏమిచెప్పిరో యోచింతము గీతా మాహాత్మ్యమున ఈ విషయమునే భూదేవి విష్ణుమూర్తి నడిగెను

కావుననే "ధరోవాచ" అని గనిపించుచున్నది ప్రభో భగవన్ ! ప్రారబ్ధము ననుభవించుచుండు నీ జీవులకు అచంచలమైన భగవద్భక్తి ఎట్లు గలుగునని యడుగుటకు హేతువైనది ప్రారబ్ధకర్మ ఒకజాతికి గాని, ఒక వర్గమువారికి గాని సంబంధించినది గాదు ప్రారబ్ధముండుటవలననే ప్రతి వారున్నూ పుట్టుచున్నారు ప్రారబ్ధకర్మము లేనిచో జ్ఞానిగాని, అజ్ఞాని గాని, బుట్టుటకు గారణ మేయుండదు పండితుడుగాని, పామరుడుగాని, అగ్రజాతిగాని, అంత్యజాతిగాని జన్మించుటకు గారణము ప్రారబ్ధకర్మమే యగును కావుననే భూదేవి సర్వజనులను గురించి అడిగినది ఒక్క జాతిని గురించి అడిగి యుండలేదు, ఇదే విశాల భావము యొక్క గురుతు దీనికి విష్ణుమూర్తి యేమి సమాధానము జెప్పెనో అది గ్రహించిన మనలో గల సందేహము నివృత్తి యగును

"విష్ణురువాచ" - ప్రారబ్ధ మనుభవించువాడు, శ్రీ భగవద్గీతా పఠనము జేసి దానియందు జెప్పిన ప్రకారము నడచువాడు ప్రారబ్ధకర్మము ననుసరించి కర్మములను జేయువాడైనను, సకలకర్మముల నుండి విముక్తి బొంది మోక్షమును పొందగలడనియు, తామరాకు నీటిలో ఉండినను నేలాగున తడవక ఉండునో ఆలాగున విధ్యుక్త కర్మపరుడై యుండు సన్న్యాసిగాని గృహస్థుడుగాని, ముక్తుడు గాగలడని భగవాను డుపదేశించెను

**ధరోవాచ :-**

**భగవన్ పరమేశాన భక్తిరవ్యభిచారిణీ ।**
**ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో! ॥**

**విష్ణురువాచ :-**

**ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।**
**స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥**

వీటి యర్థములు పైన తెలిపినవే యగును ప్రశ్న యెంత విశాల భావముతో గూడినదో, సమాధానమున్నూ అంత వైశాల్యముతోనే విష్ణుభగవానుడు తెలిపెను

## శ్రీగీతామాహాత్మ్యము

**మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్।**
**క్వచిత్స్పర్శం న కుర్వన్తి నళినీదళమమ్బుసా ।**

ఎవరైతే గీతాపారాయణము చేయుదురో వారికి కమల పత్రమునకు నీరంటని విధమున మహాపాపాది పాపములు కొంచెమైనను అంటవు

విశేషార్థము :- గీతాపారాయణము జేయుట యనగా దానియందు చెప్పెడులాగున ఆచరణలో ఉండవలయునని భావము మహాపాపములు చేయువారు ఇప్పుడు ప్రపంచములో లేరనియే చెప్పవచ్చును బ్రహ్మహత్య, గోహత్య, గురుహత్య, భ్రూణహత్య మొదలగునని మహాపాపములు అట్టివారి పాపములే గీత యనెడు గొప్పదైన ప్రజ్వలించెడు అగ్నిలో భస్మమై పోవుచుండగ, ఇప్పుడుండువారిలోగల కొంచెము అబద్ధము, కొంచెము ఇంద్రియ నిగ్రహము లేకపోవుట, లోపము గలిగి యుండుట, ఇట్టి ఉప పాపములను గుఱించి మరల ఏమి చెప్పవలయును? గొప్పవగు పచ్చిమ్రానులే కాలిపోవుచుండగా స్వల్పమగు ఎండిన తృణములు, పత్రములు కాలిపోవునా అను సంకల్పమేల గలుగవలయును? ఇదంతయు మానవుని విశ్వాసముపై నాధారపడి యున్నది "జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే" భగవద్ధ్యాన యోగము నభ్యసించుట కభిలాష గలవాడుసహ వేదప్రతిపాదిత బ్రహ్మమును పొందగలడని భగవాను డుపదేశించియుండగా, మరల అనుష్ఠానమును గురించి చెప్పవలయునా? ఇట్టి భగవద్వాక్యములో విశ్వాసము గలిగియుండుడు

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ సమన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥**

మిక్కిలి పాపము గలవాడైనను, నన్ను అన్యచింత లేనివాడై నిరన్తరము చింతన చేయుచుండిన, అట్టివానిని సాధువునుగా (పవిత్రునిగా) తలంపవలయును ఏలన అట్టి దృఢవిశ్వాసము గలిగినందుచే వాడు పవిత్రుడే, సంశయము లేదు

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।**
**కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥**

అట్టివాడు శీఘ్రముగా ధర్మాత్ము డగుచున్నాడు శాశ్వతమయిన పరమశాంతిని నిశ్చయముగా పొందుచున్నాడు ఓ అర్జునా! నాయొక్క భక్తుడు నాశ మొందడని ప్రతిజ్ఞచేసి చెప్పుమా!

**మాం ఽహి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥**

ఓ అర్జునా! ఏ కారణమువలన పాపజన్మ గలవారగుదురో వారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను నన్నాశ్రయించి సర్వోత్తమ మయిన గతిని పొందుచున్నారు

మానవులారా! ఇక మీకు ఏల సందేహము గలుగవలయును? భగద్వచనములో నమ్మకము గలిగియుండుడు

**యథైధాంసి సమిద్ధో ఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**

ఓ అర్జునా! ఏ ప్రకారము చక్కగా ప్రజ్వలించుచుండెడు అగ్ని సమిధలను భస్మము చేయుచున్నదో, ఆ ప్రకారముగానే భగవత్ జ్ఞానాగ్ని సమస్తకర్మలను భస్మము చేయుచున్నది

**అపి చేదసి పాపేభ్యస్స ర్వేభ్య : పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥**

పాపాత్ములందరి కంటెను నీవు మిక్కిలి పాపాత్ముడైనను జ్ఞానమనెడు పడవచేత పాపమనెడు సముద్రమును లెస్సగా దాటగలవు

ఈలాగున భక్తులపై అపారకరుణ గలిగి భగవాను డుపదేశించిన వాక్యములలో విశ్వాసము గలుగక పోవుటచేతనే గదా పాపమును గురించి భయపడవలయును! కావున విశ్వాసము గలిగియుండుడు

# భయపడకుడు

చాతుర్మాస్య వ్రతకాలమున గోదావరీ తీరమున తెలిపినది

ముఖ్యముగా ముసలివార లిక మీద భయపడ నక్కరలేదు అభయము గలదు వార్ధక్యదశలోనుండు చాలమంది స్త్రీ పురుషులు మేమెట్లు తరింపగలము, మా కాలమంతయు సంసారములోనే గడచినది ఏ పూర్వపుణ్య విశేషము వల్లనో దైవానుగ్రహము వల్లనో ఇప్పు డీసంసార దుఃఖసాగరమునుండి తరించవలయుననెడి తలంపు గలిగెను ఇక మీద శ్రీ భగవద్గీతోపనిషదాది గ్రంథములను జదువుటకుగాని, తపోనిష్ఠాది సాధనములను జేయుటకు గాని కాలము లేదు ఒక్కొక్క దినమున్నూ మహాభీతిని గలుగజేసెడి మృత్యుదేవతయొక్క సమీపములోనికి జేరుచున్నారమని హృదయ వ్యాకులముతో సంకటపడు ముదుసలి వారలు కొందరు గలరు వారి భయనివృత్తి కొఱ కీవ్యాసమును వ్రాయడమైనది ఈ విషయమై శ్రీ భగవద్గీతయందు స్థితప్రజ్ఞుని లక్షణములను ఉపదేశించిన పిమ్మట శ్రీ కృష్ణభగవానుడు ద్వితీయాధ్యాయాంతమున అభయశ్లోకమును నుపదేశించెను

**ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యాతి ।**
**స్థిత్వాఽస్యామంత కాలేఽపి బ్రహ్మ నిర్వాణమృచ్ఛతి ॥**

ఓ యర్జునా! ఈ బ్రహ్మ సంబంధమైన నిష్ఠయందు మనస్సును నిలిపినవాడు, మాయామోహము (అజ్ఞానము)ను బొందడు ఈ నిష్ఠయందు అంత్యకాల మందైనను, అనగా మరణకాల మందైనను, ప్రాణము కంఠగతమున నున్నకాల మందైనను, మనస్సును నిలిపినవాడు మోక్ష ప్రాప్తిని బొందుచున్నాడు అని భగవదనుగ్రహ పూర్వకమైన ఆశీర్వాదపరమగు వచనము గలదు ఇక ఏల భయపడవలయును? ఇపు డీసభలో నుండు ముసలి వారలెవ్వరున్నూ తప్పక పది వత్సరములుగాని, అయిదు సంవత్సరములు గాని కడకు మూడు హాయనములుగాని జీవించువారలే గాని మరణించువారు గారు ఇట్లుండ నిక మనకేల భయము? ఒక గుహయందు బహుకాలము నుండి అంధకారము నిబిడమై

యుండినను నేక్షణమందు దీపమును వెలిగించునో, ఆక్షణమందే యా యంధకారము పటాపంచలై పోవునట్లు అనాదికాలము నుండి హృదయమున దట్టమై యుండు అజ్ఞాము భగవన్నిష్ఠ గలిగిన వెంటనే నశించిపోవును అయితే విశ్వాస మొక్కటిమాత్రము దృఢముగా గలిగి యుండవలయును అంతే చాలును ఈ విషయమై గీత పదమూడవ అధ్యాయమున భగవాను డుపదేశించినది జూడుడు

**ధ్యానేనాత్మని పశ్యన్తి కేచి దాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥**

**అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽ న్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥**

ధ్యానయోగముచే గొందరు, సాంఖ్యయోగముచే మరికొందరు, నిష్కామ కర్మయోగముచే నికకొందరు మోక్షమును బొందుచున్నారు ధ్యానయోగమందు భక్తియోగ మంతర్భూత మగుటచే నిచ్చట ప్రత్యేకముగా జెప్పలేదు పై జెప్పిన ధ్యాన, సాంఖ్య, కర్మ, భక్తి యోగముల నాచరించుటకు శక్తి లేనివారున్నూ, మోక్షము బొందవలయునను నభిలాష గలవారునగు వృద్ధులగతి యేమని ప్రశ్న రాగా, అట్టివారు బ్రహ్మనిష్ఠులగు మహనీయులచే నొక యక్షరము జెప్పించుకొని యనుష్ఠించుచుండిన వారు పై జెప్పిన వారికన్న ముందుగ మోక్షమును బొందగలరని భగవాను డానతిచ్చెను కావుననే 'అతితరంతి' అని ప్రయోగించుటకు గారణమైనది ఇక నేలభయము జెందవలయు? 'అతితరంతి' అని జెప్పుటలో వీరు వృద్ధు లగుటచే మరణభీతియు భగవత్కారుణ్యమును నవలంబించి యుండు వారగుటచే వీరి చిత్తము భగవచ్చిన్తనయందు లగ్నమై యుండుటవల్లనే యట్లు దెలుపుటకు గారణమైనది ఇది ప్రతివారియొక్క యనుభవమువల్ల తెలిసి కొనదగును వీరి పట్టుదల భల్లూకపు పట్టువలె నుండును గీతాంత్యభాగమగు పదునెనిమిదవ అధ్యాయములోను దీనినే భగవాను డుపదేశించెను

**శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**
**సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥**

ఏనరుడు గీతాపారాయణము జేయుటకు దగిన విద్య లేనప్పటికిన్నీ అసూయ లేనివాడును, శ్రద్ధావంతుడునునై గీతాశాస్త్రమును భక్తి శ్రద్ధలతో చక్కగ శ్రవణము జేయుచున్నాడో అతడున్నూ, సంసారబంధము నుండి ముక్తుడై పుణ్యాత్ములు బొందెడి లోకమును బొందుచున్నాడు గీత యొక్క యంత్యోపదేశమున శ్రీ కృష్ణభగవాను డేమిజెప్పెనో దీనిని జూచిన ముసలివారలు మరల భయము నొందనక్కర లేదు

**సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

ఓ యర్జునా! యజ్ఞదాన తపఃస్వాధ్యాయాది కర్మలు జేయలేదను సంకల్పమును వీడి నన్నొకనినిమాత్రము శరణుబొంది తదేకనిష్ఠ గలిగి యుండుము అటులైన సమస్తకర్మములనుండి నిన్ను విముక్తునిగా జేసెద కావున దుఃఖింపకుము, సంశయము జేయకుము ఇట్టి అభయ శ్లోకమును భగవానుడు వచించియుండ నిక మనమేల భయపడవలయును? ఇది చరమశ్లోకము, అనగా కట్టకడపటి యుపదేశము

ఈ విషయమై శ్రీ మద్భాగవతమున, ద్వితీయస్కంధమున ఖట్వాంగ మహారాజు చరిత్ర మెుండుగలదు దానిని వినినచో మీకు మరింత నిర్భయత్వమున్నూ, మనోధైర్యమున్నూ గలుగును

## ప్రథమస్కంధము

తనకు మీద నయ్యెడి జన్మాంతరంబులందును హరిపాద భక్తిసౌజన్యములు సంధిల్లుంగాత మని గంగాతరంగిణీ దక్షిణకూలంబునం బూర్వాగ్రదర్భాసనంబున నుత్తరాభిముఖుండై యుపవేశించి జనమేజయు రప్పించి, రాజ్యభారంబు సమర్పించి, యత్నంబు సంసారబంధంబునకు దప్పించి, చిత్తంబు హరికి నొప్పించి, పరమభాగవతుండైన పాండవపౌత్రుండు ప్రాయోపవిష్టుండై యున్న సమయంబున ----------- సభాసీను లయిన ఋషు లిట్లనిరి -------------

**వసుధాధీశ్వర! నీవు మర్త్యతనువున్ వర్జించి నిశ్శోకమై**
**వ్యసనచ్ఛేదకమై రజోరహితమై వర్తించు లోకంబు న**

ర్వసమత్వంబున జేరునంతకు భవద్వాక్యంబులన్ వించు నే
దెసకుం బోవక చూచుచుండెదము నీదివ్య ప్రభావంబులన్.

అని యిట్లు పక్షపాత శూన్యంబులును, మహనీయ మాధుర్య గాంభీర్య సౌజన్యధుర్యంబులును నైన భాషణంబు లాడుచు మూడులోకంబులకు నవ్వలిదైన సత్యలోకంబునందు మూర్తిమంతంబులై నెగడుచున్న నిగమంబుల చందంబునం దేజరిల్లుచున్న ఋషులం జూచి భూవరుండు నారాయణ కథాశ్రవణ కుతూహలుండై నమస్కరించి యిట్లనియె

ఏడు దినంబుల ముక్తిం
గూడగ నేరీతి వచ్చు గురుసంసార
క్రీడన మేక్రియ నెడతెగు
జూడుడు మాతండ్రులార! శ్రుతివచనములన్.

అని యుత్తరానందనుం డాడిన వచనంబులకు మునులందరు బ్రత్యుత్తరంబు విమర్శించునెడ దైవ యోగంబున శ్రీ శుకమహర్షి చనుదెంచెను

ప్రతినిమేషము బరబ్రహ్మము నీక్షించి
మది జొక్కి వెలువల మఱచువాడు
కమలంబుమీది భృంగముల కైవడి మోము
పై నఱసిన కేశపటలివాడు
గెఱవ్రాసి మాయ నంగీకరించిన భంగి
వసనంబు గట్టక వచ్చువాడు
నంగిగాడని వెంట జాటుభూతములు నా
బాలుర హాసశబ్దములవాడు

మహితపదజానుజంఘోరుమధ్యహస్త
బాహువక్షోగళానన ఫాలకర్ణ
నాసికాగండమస్తకనయనయుగళు
డైన యవధూతమూర్తి వాడరుగుదెంచె.

అట్లు వచ్చిన శుకయోగికి ప్రణమిల్లి

అవ్యక్తమార్గుండవైన నీదర్శన
మాఱడి బోనేర దభిమాతార్థ
సిద్ధి గావించుట సిద్ధంబు నేడెల్లి
దేహంబు వర్జించు దేహధారి
కేమి చింతించిన నేమి జపించిన
నేమి గావించిన నేమి వినిన
నేమి సేవించిన నెన్నడు సంసార
పద్ధతి బాసిన పదవిగలుగు

నుండుమనరాదు గురుడవు యోగివిభుడ
వావు బిదికిన తడవెంత యంతసేపు
గాని యొకదెస నుండవు కరుణతోడ
జెప్పవే తండ్రి ముక్తికి జేరు తెరువు

అని పరీక్షిన్నరేంద్రుడు బాదరాయణి నడిగెనని చెప్పి

## ద్వితీయ స్కంధము

పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రు డిట్లనియె

హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుడై
పొరలుచుండెడి వెఱ్ఱిముక్తికి బోవనేర్చునె వాడు సం
సరణముం బెడబాయ డెన్నడు సత్యమా హరినామ సం
స్మరణ మొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా!

గోవిందనామకీర్తన
గావించి భయంబు దక్కి ఖట్వాంగధరి
త్రీవిభుడు మూఱుగొనియెను,
గైవల్యము దొల్లి రెండుగడియలలోనన్ !

వినుము నీకు నేడు దివసంబులకుంగాని జీవితాంతంబు గాదు తావత్కాలంబునకు బరమకల్యాణంబు సంపాదింపవచ్చును"

ఈ కథయందు విశ్వాసముగలిగి వర్తించువారికి కాలము గడచిపోయెనని భయపడ నవసరము లేదు గదా!

**అత్యల్పోఽపి యథా దీపస్సుమహన్నాశయేత్తమః**
**జ్ఞానాభ్యాసస్తథాఽల్పో ఽపి మహత్పాపం వ్యపోహతి ।**

రాత్రికాలమున గృహాన్తరాళములోగల చిన్న

దీపమయినను చీకటి నేలాగున పారద్రోలుచుండునో, ఆలాగున ఈ బ్రహ్మాభ్యాసము స్వల్ప మయినను గొప్పదగు అజ్ఞానమనెడు తమస్సును రహిత మొనరించుచున్నది

**యథా వహ్నిర్మహాదీప్తశ్శుష్కమార్ద్రం చ నిర్దహేత్ ॥**
**తథా శుభాశుభం కర్మ జ్ఞానాగ్నిర్దహతి క్షణాత్ ॥**

ఏలాగున మండుచుండు అగ్నిహోత్రుడు ఎండినవి, పచ్చివియునగు కట్టెలను భస్మమొనరించుచున్నాడో, ఆలాగున జ్ఞానాగ్ని శుభాశుభ కర్మములను కట్టెలను భస్మ మొనరించి జీవిని జీవన్ముక్తునిగా జేయుచున్నది బహుకాలము నుండి అరణ్యములో గుట్టలుగుట్టలుగా పడియుండు కట్టెలన్నిటిని ఒక్కరవ్వ నిప్పు ఏలాగున బూడిదగా చేయుచుండునో, ఆలాగున అనేక జన్మములనుండి చేయబడిన కర్మలన్నిటిని భగవద్జ్ఞానాగ్ని త్వరలోనే బూడిదగా చేయుచున్నది

**మన్త్రౌషధబలైర్యద్వజ్జీర్యతే భక్షితం విషమ్ ।**
**తద్వత్సర్వాణి పాపాని జీర్యన్తే జ్ఞానినః క్షణాత్ ॥**

ఏలాగున భుజింపబడిన విషము మంత్రౌషధబలముచే జీర్ణమగు చున్నదో ఆలాగున ఆత్మజ్ఞానబలముచే క్షణకాలములో సమస్త పాపములు జీర్ణమగుచున్నవి

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥**

భగవచ్చింతనానిష్ఠగల వారిపై అనుగ్రహము గలిగి, వారి అన్తఃకరణ మందున్నవాడనై, ప్రకాశజ్ఞానజ్యోతిని వెలిగించి, వారి యజ్ఞాన మనియెడు చీకటిని రహిత మొనరించుచున్నాను ఈ లాటి అనుగ్రహ వాక్యములలో విశ్వాసము లేకపోవుటచేతనే మానవులు దుఃఖసాగరమునుండి దరికి జేరజాలకయున్నారు

**అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

ఇతర చింతలు లేనివారై నన్ను చింతించుచు ఏజను లుపాసించు చున్నారో, ఎల్లప్పుడును నాయందే చిత్తమును జేర్చి ధ్యానము జేయునట్టి వారి యొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను అని భగవద్వాక్యము



# ఆత్మోద్ధరణము

**బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః ।**
**అబోధోపహతాశ్చాన్యే జీర్ణమఙ్గే సుభాషితమ్ ॥**

ధర్మబోధకులు ఒకరిపైనొకరు మాత్సర్యపరులై యున్నారు ప్రభువులు హృదయ నైర్మల్యము లేనివారగుటచే గర్వులైయున్నారు ఇతరజను లన్ననో, బోధించువారు లేనందుచేత అజ్ఞానముచే నణగగొట్టబడినవారలుగా నున్నారు అందువల్ల మహనీయాత్ములు జెప్పదలంచిన సాధుభాషణము, వారిలోనే లీనమైపోవుచున్నది - అని భర్తృహరి

**ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥**

మలినమైన మనస్సును, శుద్ధమైన మనస్సుచే నుద్ధరించుకొనవలయును

(నిన్ను నీవే ఉద్ధరించుకొనవలయును) తనయాత్మను చెడనీయకూడదు స్వాధీనమైన మనస్సే మీకు పరమబంధువు, స్వాధీనములేని మనస్సే నీకు పరమశత్రువు అని భగవద్గీత

**ఆత్మనో గురురాత్మైవ పురుషస్య విశేషతః ।**
**యత్ప్రత్యక్షానుమానాభ్యాం శ్రేయోఽసావనువిన్దతే ॥**

విశేషించి పురుషునికి తనయాత్మయేను గురువు ఇతడు ప్రత్యక్షానుమానములచే పరమ పురుషార్థ రూపశ్రేయస్సు (ఆత్మను) పొందుచున్నాడు అనగా తన్ను తానుద్ధరించు కోవలయునను సంకల్పము గలవానికి మాత్రమే యీశ్వరుడున్ను, గురువున్ను సహాయపడగలరు అని భాగవతము

ఒకానొక సమయమున హరిద్వారమున కుంభమేళ జరుగుచుండగా పుణ్యవంతులగు నొక బ్రహ్మణ దంపతులున్నూ, వారి కుమారుడున్నూ గంగాస్నాన మొనర్చి పునీతులగుట కొఱకు వెళ్ళిరి జనస్తోమ మధికరించి యుండుటచే స్నానమయములో నైదు సంవత్సరముల ఈడుగల వారి కుమారు డెచ్చటనో తప్పిపోయెను మాతాపితరులు మూడురోజు లంతట వెదకినను కుమారుడు గనిపించలేదు శోకభరిత హృదయులై స్వగృహముజేరి దైవ విధి ఈలాగున్న దనిదలంచి తక్కిన ఇద్దరి యాడుబిడ్డలతోను, బాలకులతోను అతిధి సేవాపరులై, దైవ విశ్వాసనిరతులై పవిత్రముగా కాలము గడపుచుండిరి కుంభమేళలో తప్పిపోయిన పిల్లవాడు రోదనము చేయుచూ, తిరుగుచుండగా నొకయాప్తు డాబాలుని ఎత్తుకొని, యాదరించి ఆ గంగాతీరమున తపమొనర్చుచుండెడి ఒక తాపసోత్తమున కప్పగించెను ఆ యోగిపుంగవుడు మిక్కిలి ప్రేమతో, పుత్రవాత్సల్యముతో విద్యజెప్పి యోగసాధనలు నేర్పి, ఆబాలుని మంచి బ్రహ్మజ్ఞాన సంపన్నునిగా జేసెను అతడున్ను మహాగురుభక్తి గలవాడై, గురుశుశ్రూషా నిరతుండై, గురువాక్యము నుల్లంఘనము జేయక అధ్యయన నిరతుడై యోగధ్యాన నిష్ఠాపరుండై గొప్ప జ్ఞానవంతు డాయెను అయిదేండ్ల ప్రాయములో మాతాపితరులను వదలిన వాడైనను తనదేశము తనగ్రామము తల్లిదండ్రులను సోదరీ సోదరులను బొత్తిగ మరచినవాడు గాడు

ఇతని పేరు విశ్వనాధశర్మయై యుండెను మహారాష్ట్రదేశీయుడు ఉత్తమ విద్యచేతను, శ్రేష్ఠమైన యోగసాధనల చేతను, నిరువదియైదు సంవత్సరములు వచ్చుసరికి గొప్ప జ్ఞానవిజ్ఞాన సంపన్ను డాయెను అత్తరి గురుదేవుని యనుజ్ఞను పొంది పాదచారియై బ్రహ్మచర్యవ్రతమును పాలించుచు అపరిగ్రహవ్రత నిష్ఠగలవాడై, (ఏ సమయమున కేది దొరికిన దానితో తృప్తిబొంది యుత్తర క్షణమునకు దాచియుంచక యుండువాడు అపరిగ్రహవ్రతము గలవాడు) దక్షిణదేశ తీర్థయాత్ర చేయుటకారంభించెను గురుదేవునికి సాష్టాంగనమస్కారము జేసి, యనుజ్ఞను వేడుకొనిన సమయమున గురుదేవు డాశీర్వదించి తెలిపిన వాక్యమును సదా జ్ఞప్తిలో నుంచుకొని సంచరించుచుండెను గురుదేవుండు జెప్పిన వాక్యమిది :-

**బ్రహ్మచర్యమహింసాం చ సత్యం చైవాపరిగ్రహమ్ ।**
**యత్నేన హే రక్షత హే రక్షత హే రక్షతేతి ।**

(1) బ్రహ్మచర్యము, (2) అహింస, (3) సత్యము, (4) అపరిగ్రహము అను నీ నాల్గింటిని నో కుమారుడా! ప్రయత్న పూర్వకముగా రక్షింపుమా! రక్షింపుమా! రక్షింపుమా ! యని ముమ్మారు వచించెను మరియు ఈలాగున నుపదేశింప ప్రారంభించెను :-

**ముహూర్తమపి నోతిష్ఠేద్దేశే సోపద్రవే యతిః ।**
**ఉపద్రవేణ మనసి సమాధిర్నైవ జాయతే ॥**

బ్రహ్మనిష్ఠుడు తన బ్రహ్మనిష్ఠకు అనుకూలములేని స్థలమున యొక్క ముహూర్తకాలమైన నుండరాదు బాధాకరమగు ప్రదేశమున నుండిన సమాధియందు (ధ్యానమందు) మనస్సు నిశ్చలముగా నుండదు

**ఆత్మసమ్మితమాహారమాహరేదాత్మవాన్యతిః ।**
**అత్యంతక్షుధితస్యాపి సమాధిర్నైవజాయతే ॥**

ఆత్మనిష్ఠుడగు యతి తనయాత్మకు ఎంతమాత్ర మాహారము కావలయునో అంతమాత్రమే గ్రహించవలయును ఎక్కువ ఆకలి గలవానికిన్ని, మిక్కుటముగా భుజించువానికిన్ని సమాధియందు మనస్సు సుస్థిరముగా

నిలువజాలదు

**అల్పాన్నాభ్యవహారేణ రహఃస్థానాసేవన చ ।**
**హ్రియమాణాని విషయైరింద్రియాణి నివర్తయేత్ ॥**

అర్ధకడుపు అన్నముచేతను, మితమైన వ్యవహారముచేతను, ఏకాంత, స్థానమునందు ఉండుటచేతను, చక్షురాది ఇంద్రియ విషయముల నుండి మనస్సు మొదలైన ఇంద్రియములను లోపలికి ముడుచుకొనుట చేతను, మనస్సు మొదలగు ఇంద్రియముల నిగ్రహము త్వరలోనే ప్రయాసము లేకనే ధ్యానపరులకు కలుగును

**ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేన చ ।**
**అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే ॥**

ఇంద్రియములన్నింటి యొక్క నిరోధముచేతను, రాగ ద్వేషముల యొక్క క్షయముచేతను, ప్రాణికోట్లలో గల యహింసచేతను బ్రహ్మనిష్ఠుడు అమృతత్వమును (మోక్షమును) పొందుచున్నాడు

**దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్ ।**
**సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం సమాచరేత్ ॥**

ఓ వత్సా! ప్రతి అడుగును పెట్టునప్పుడు ఏదైన ప్రాణికి బాధ కలుగునో యని చూచుకొని నడుపుము నీటిలో గూడ ప్రాణికోట్లుండును, అందువలన వడగట్టిన నీటిని త్రాగుము ఏ వాక్యమును చెప్పునప్పుడున్ను సత్యమునుండి జారనీయక మాట్లాడుము, మనస్సులో సత్యమని తోచిన వాక్యమును మాత్రమే చెప్పుము

**న ప్రమాదోఽత్ర కర్తవ్యో విదుషా మోక్షమిచ్ఛతా ।**
**ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా ॥**

ఓ పుత్రుడా! మోక్షేచ్ఛగల బుద్ధిమంతుడు ఏ విధమైన ప్రమాదమున్ను గలుగనీయక చూచుకొనుచుండవలయును అజాగ్రత్తచే ప్రమాదము గలిగెనేని సూర్యు డస్తమించిన వెంటనే చీకటి లోకమును ఆవరించునట్లు హృదయమును అజ్ఞానము ఆవరించును.

**ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థమసహాయవాన్ ।**
**సిద్ధిమేకస్య సంపశ్యన్న జహాతి న హీయతే ॥**

ఒంటరియై మరియొకచోట తోడులేక దైవమును తోడుచేసుకొని సంచరించవలయును మోక్షప్రాప్తి యొంటరిగానుండు వారికే గలుగునని తెలిసి , యటుల సంచరించెనేని దేనివలనను దుఃఖము గలుగదు

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్ష పరాయణః ।**
**కామదర్పాదయో దోషాః న భవన్తి మితాశినః ॥**

మోక్ష పరాయణుడగు బ్రహ్మనిష్ఠుడు ఎల్లప్పుడున్ను మితాహారము గలవాడై యుండవలయును కామదర్పాదులగు దోషములు మితముగా భుజించువానికి గలుగవు

**నాసమానసహాయేషు నివసేద్యోగవిత్క్వచిత్ ॥**
**వసేత్సమానశీలేషు సుశీలేషు తపస్విషు ॥**

ధ్యాననిష్ఠాపరుడు తన స్వభావమునకు, తన యనుష్ఠానమునకు సరిపడని వారితో ఒకప్పుడున్ను నివాసము చేయరాదు తన యనుష్ఠానమునకు, తనగుణమునకు సమానమైన వారితో గాని లేక తనకన్న కొంచె మధికమైన అనుష్ఠానము కలవారితో గాని వాసము చేయవలయును అందువలన బ్రహ్మనిష్ఠ వృద్ధినొందును

**వాసో బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి ।**
**ఏక ఏవ చరేత్తస్మాత్కుమార్యా ఇవ కంకణః ॥**

కుమారి (కన్యక) యొక్క కంకణములవలె అనేకు లొకచోట నున్నయెడల కలహములు సంభవించును అయితే ఇద్దరున్నను వ్యర్థ సంభాషణాదులు గలుగవచ్చును కాన ఒంటరిగనే సంచరించవలయును అనగా ఎక్కువ గాజులు ధరించిన ఏలాగున శబ్దము గలుగునో నాలాగున ఎక్కువ జనమధ్యము నందుండిన నిశ్శబ్దము గలుగదనియు, ఇద్దరుండినను ఏదో వ్యర్థ మాటలచేత కాలము గడచుననియు, కాన బ్రహ్మనిష్ఠుడు ఒంటరిగానే యుండవలయుననియు భావము.

ఐతే తనతో సమాన నిష్ఠగలవారున్ను, సంకల్ప రహితులున్ను నైనవారు ఎంతమంది యున్నప్పటికిని బాధయుండదు తానున్ను దేహమును ఏకాంతమందుంచిన చాలదు ఏకమైన యాత్మభావము మాత్రము గలిగియుండవలయును అప్పుడే యది ఏకాంత మగును ఏకాంతమందుండినను హృదయములో సంకల్పము లుండిన అదిన్ని బహుజనుల మధ్యయందున్నట్లే తలంచవలయును, అయితే సాధనకాలమునందు మాత్రము అట్లుండిన చాలును, ఆరూఢస్థితి గలిగిన పిమ్మట ఆశ్రమములు గాని, మఠములుగాని ఏర్పరచుకొన్న తర్వాత మంచి స్వభావము గల సాధకులు ఎంతమంది యున్నప్పటికిన్ని బాధాకరము కానేరదు

**అవ్రతా హ్యనధీయనా యత్ర భైక్షచరా ద్విజాః ।**
**తం గ్రామం దండయేద్రాజా చోరభక్తప్రదో హి సః ॥**

ఓ మునిపుత్రుడా ! ఈ శ్లోకార్థమును సర్వదా మనస్సు నందుంచుకొని నంచరించుము వేదవ్రతము బ్రహ్మచర్యవ్రతము లేనివారున్ను, వేదోపనిషద్గీతాదులను లెస్సగా నధ్యయనము చేయనివారున్ను, నెచ్చట భిక్షాన్నమును భుజించి తిరుగుచుండినను, అట్టి ద్విజులను గాని సన్న్యాసులను గాని రాజు దండించవలయును అంతియేగాదు ఆ గ్రామస్థులను గూడ శిక్షించవలయును ఏలన దొంగలకు సహాయము చేయువారు మంచివారైనను ఏలాగున వారుగూడా దండనార్హులో, ఆలాగే వీరున్ను దండనార్హులే అని పరాశరుడు చెప్పెను ఈలాటి నియమము వర్తమానకాలమున లేక పోవుటే సాధువులున్ను, సన్న్యాసులున్ను, బ్రాహ్మణులున్ను బ్రహ్మనిష్ఠనుండి జారిపోవుటకు కారణమైనది

**యధాకాష్ఠమయో హస్తీ యధా చర్మమయో మృగః ।**
**యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి ॥**

కొయ్యతో చేయబడిన ఏనుగు, చర్మము (రబ్బరు)తో చేయబడిన జింక, అధ్యయనమును చేయని విప్రుడు(సంన్యాసి) - వీరు ముగ్గురును కేవలము నామధారులు మాత్రమే యని మనువు చెప్పిన వాక్యమును మరువకుము

**ఏకో భిక్షుర్యథోక్తస్స్యాద్ద్వావేవ మిథునం స్మృతమ్ ।**
**త్రయో గ్రామస్సమాఖ్యాత ఊర్ధ్వం తు నగరాయతే ॥.**

**నగరం న హి కర్తవ్యం గ్రామో వా మిధునం తధా ।**
**గ్రామవార్తా హి తేషాం స్యాద్భిక్షావార్తా పరస్పరమ్ ॥**
**స్నేహపైశున్యమాత్సర్యం సన్నికర్షాత్ప్రజాయతే ॥**

బ్రహ్మనిష్ఠ డొంటరిగా నుండుటయే శ్రేయస్కరము ఏలన, ఒంటరిగా నుండిన నిరంతర బ్రహ్మస్వరూపానుసంధానము గలవాడై యుండును లేక ఇద్దరుచేరిన మిధునమనియు (సంసారమనియు), ముగ్గురు జేరిన గ్రామమనియు, అంతకుపైగా నెంతమంది జేరినను నగర మనియు చెప్పబడును, ఇటువంటి స్థితిలో అన్యోన్య సన్నికర్షణముచేత గ్రామవృత్తాంతములను భిక్షావృత్తాంతములను పరస్పరము జెప్పుకొనుటయు, నొకరి యందొకరికి స్నేహము గలుగుటయు, ఇతరులయందుండు గుణదోషములను నితరులతో జెప్పుటయు, పరులయొక్క శ్రేయస్సును జూచి సహింపలేక పోవుటయు మొదలగు దోషములు సంభవించును

**సమ్మానాద్బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాదివ ।**
**అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా ॥**

ఓ కుమారుడా ! బ్రహ్మనిష్ఠుడు సమ్మాన గౌరవాదులను విషమువలె ద్వేషించవలయును అనగా వాటి యందాసక్తి యుంచరాదు అగౌరవ నిందాదులను నెల్లప్పుడును సమృతమువలె నాశించవలయును, అనగా వానివల్ల క్లేశము పొందరాదు ఏలన సన్మానాదులు చేయువారు తన పుణ్యము నపహరించుచున్నారు అవమానము చేయువారు తన పాపమును పంచుకొనుచున్నారు ఈ భావము నెల్లప్పుడున్న మనస్సులో నుంచి సంచరించవలయును అని మనువు చెప్పెను ఈలాగున గురుదేవుడు శిష్యుడైన విశ్వనాధశర్మ కుపదేశించెను

ఈ మునిపుత్రుడు (శిష్యుడు) ఇరువదియైదు సంవత్సరములు ప్రాయమైనందున సుందరమైన జటాజూటమున్ను, తపస్సుచే ప్రకాశమైన తనువున్ను పావనమైన నారచీరచే కాంతిమంతమైన స్థితియు గలిగియుండెను తీర్థయాత్ర జేయుచు శ్రీ రామేశ్వరము, అనంతశయనము మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించుచూ, భక్తులకు కల్పతరువగు పండరీనాధుని దర్శింపవలయునను తలంపుతో మహారాష్ట్రదేశం మీదుగా వచ్చునప్పుడు దారిలో తన స్వగ్రామ

ముండుటవలన, జూడవలయునని అభిలాషగలిగి ఇంటికి వెళ్ళి, ముంగిటి ప్రదేశమున నిల్చుండి "జై సీతారాం" యని మిక్కిలి ప్రశాంత భావముతో నుచ్చరించెను వారు సామాన్యజనుల ఇంటికి ముఖ్యులు అయిన చుట్టములు అరుదెంచిన ఎట్లు ఆదరింతురో అట్లే వీరున్ను సాధువులు, భగవద్భక్తులు, అతిధులు వచ్చిన ఆదరపూర్వకముగా నర్ఘ్యపాద్యము లిచ్చి సత్కరించి పంపేవారు ఈ తాపసవేషము ధరించియుండినవానిని నాలాగున నాదరించి భోజనమునకు నిమన్త్రణము జేసిరి కాని ఇతడెవరో కాశీదేశస్థుడు, బైరాగియని మాత్రము వారు తలంచిరి ఎక్కువ ప్రేమ యేమియు జూపలేదు కాని అతిధులకు జేయు మర్యాదనుమాత్రము జేసిరి అతని తల్లిదండ్రులున్ను, తక్కిన ఇద్దరు అన్నదమ్ములున్ను, అక్కచెల్లెండ్రున్ను అత్తరి నచ్చటనే యుండిరి

ఈ తపస్వియో తన వారే వీరలని తెలియక గంభీర భావముతో విరక్తస్థితిలోనే యుండి భోజనాంతరము 'నేను ఈ గ్రామసమీపమునకు వచ్చియుంటిని ఈ యూరిలో పలాని యింటివారు కుంభమేళకు వెళ్ళినప్పుడు వారితోగూడ వెళ్ళిన పిల్లవాడు అచ్చట స్నానసమయమున తప్పిపోయెను అది మీకు తెలుసా? ఇప్పుడు నేను వారిని జూచి విచారించి పోవచ్చుననెడి తలంపుతో నిచటి కరుదెంచడమైన'దని జెప్పిన మాటలను వినగా, అతని తల్లిదండ్రులు, సోదరీ సోదరులున్నూ ఇరుగుపొరుగు జనులున్నూ దగ్గరకు గుంపులు గుంపులుగా రాదొడగిరి తల్లిదండ్రులున్ను, పెద్దకుమారుడు విశ్వేశశర్మయు, రెండవ కుమార్తె యగు రమాబాయియు చాలదగ్గరకు వచ్చి పాదములనుండి శిరస్సువరకు, శిరస్సునుండి పాదముల వరకు బాగుగ జూడదొడంగిరి ఈ విశ్వేశశర్మకున్ను, రమాబాయికిన్ని తాపసవరుడగు విశ్వనాధశర్మ యొక్క బ్రహ్మతేజస్సును, తాపసుల వేషమున్ను జూచి మన విశ్వనాధశర్మ యగునా, కాదా, యని పలుమార్లు సంకల్ప వికల్పములు గలుగుచుండెను తల్లియగు రేణూబాయి సంతోషమును, దుఃఖమును గూడిన హృదయము గలదై ఆయోగి యొక్క హస్తద్వయమును బట్టుకొని, "నాయనా ! కుంభమేళా సమయమును బోగొట్టుకొనిన విశ్వనాధశర్మ యను పిల్లవాడు మీకు తెలుసునా?" యని కన్నీరు మున్నీరై ప్రవహించగా అడిగెను తల్లియొక్క మాట వినగా, అంతవరకు భావమును

బైటపెట్టక దృఢపరచియుండు యోగియొక్కమనస్సు జాలిగలదై కన్నీరు కారందొడంగెను అప్పుడొక్కొక్కరున్ను అతని ముఖము, దేహము జూచి యితడే మన విశ్వనాధశర్మయని తెలిసికొని ఆనందబాష్ప పులకాంకిత శరీరులై యాలింగనము జేసుకొని, రోదనము జేయ ప్రారంభించిరి అచ్చట సమావేశమైన జనులందురు భక్తి పరవశ హృదయము గలవారై, విశ్వనాధశర్మ వచ్చినాడు! వచ్చినాడు! వచ్చినాడు!' అని చెప్పుచు పరమానంద భరితులై కొందరు పాదములకు నమస్కరించు వారున్ను, కొందరు చేతులు పట్టుకొని ముద్దుబెట్టుకొను వారున్ను, కొందరు పరమేశ్వరుని స్తోత్రము జేయువారుగా నుండిరి అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు మొట్టమొదటనెవరో బైరాగియని తలంచి బైట యరుగుపై అన్నము పెట్టినందుకు క్షమాపణ గోరుచు, తెలియక చేసిన యపరాధమును క్షమింపవలెనని ప్రార్ధన జేయుచుండిరి

ఈ లాగున ఒకే యీశ్వరుని బిడ్డలగు మానవు లనంతకాలమునుండి భిన్న భిన్న దేశములలో వాసము చేయుటచేతను, భిన్న భిన్న ఆచారము గల వారగుటచేతను, కాలాంతరమున భిన్న భిన్న మతస్థు లగుటచేతను, వేరు వేరు వేషభాషలు గలవారగుట చేతనున్ను ఇపుడు సోదరభావము నశించి ప్రేమకు దూరులై వివిధసిద్ధాన్తములు గలవారై వేరువేరు జాతులున్ను, మతములున్ను, ఆచారములున్ను గలవారైరి ఇప్పుడు ఆత్మజ్ఞానవేత్తలు, సాధుపురుషులు ఈ భేదముల నన్నింటిని ధర్మోపన్యాసములచే తొలగించిన, ఈ మానవులందరు పరమేశ్వరుండగు లోకైకపితయొక్క బిడ్డలని బోధము గలుగజేసిన విశ్వనాధశర్మయొక్క తల్లిదండ్రుల, సోదరీసోదరుల స్థితి తప్పక గలుగును అప్పుడు సర్వజనులున్ను సోదరీ సోదరభావముతో, ప్రేమామృత హృదయముతో సుఖముగా జీవింపగలరు ధర్మబోధచే గలిగిన ప్రయోజన మిట్టిదని తెలియందగును ఈ విషయమై బహిర్దృష్టియు, ప్రేమామృత రహితమున్ను గలకొందరు మానవులు బీజాంకుర న్యాయమును జెప్పుదురు, వాదము జేయుదురు బీజాంకురన్యాయమును గురించి శ్రీ కృష్ణ భగవానులు గీతలో నేమిజెప్పిరో అది యిచ్చోటనుండి ప్రారంభమగును

ఇదొక మతము పైగల ద్వేషము చేతగాని, మరియొక్క మతముపై గల ప్రేమచేతగాని, ఆలాగున నొకజాతియందుగల రాగము చేతగాని, లేక మరియొక జాతియందుగల విరోధముచేత గాని వ్రాయంబూనినది గాదు అందరున్నూ సోదరభావము గలిగి సుఖముగా ఇహలోక జీవితము గడపి పరలోకమునందు పరమాత్మ కృపకు పాత్రులై జీవన్ముక్తులై యుండవలయుననెడి తలంపుతో మాత్రము వ్రాయడమైనది

# బీజాంకుర న్యాయము

బీజాంకురన్యాయమనగా బీజమెటువంటి జాతియో వృక్షమున్ను అదే జాతిగాను, దాని ఫలపల్లవ పుష్పలతాదులున్ను అదే జాతిగ నుండునని భావము దానిని బాగుగ ఆలోచించిన భేదభావమునకును, కలహమునకును కారణ ముండదు అంతదూరము విచారణచేయక సామాన్యబుద్ధి గలవారు దేహమును బీజముగాను, దేహమునుండి పుట్టిన జాతులను వృక్షాదులుగాను నిర్ణయింతురు ఈ సత్యమును తెలియక, ముష్టివిత్తనమును పెట్టి చీనిపండ్లు ఫలించునా యనియు, వేప విత్తనమునుండి మామిడిపండ్లు పుట్టునా యనియు వాదింతురు కుక్కను కాశికి తీసుకొని వెళ్ళి గంగాస్నానమును చేయించినను గోవు కాగలదా యనియు, కాకిని తీసుకొని కాశీ దర్శనము చేయించి గంగతో అభిషేకము చేసినను హంసము కాగలదా యనియు వాదనచేయుదురు ఇందువల్లనే మనదేశములో సోదరభావ మంతరించి, జాతిద్వేషమునకు దారితీయుచున్నది ఇందువల్ల నిమ్నస్థితిలో నుండు వారికి ఉన్నత స్థానములోనికి వెళ్ళుటకు ఆటంకము గలుగుచున్నది అందువల్లనే ఆర్య సంతతిలో గల ఈ పవిత్రజాతి, మహమ్మదీయ ఆక్రమణము నుండి నిన్న మొన్నటి వఱకు రమారమి సహస్ర సంవత్సరములు విదేశీయులకు పరాధీనులై బానిసలైపోయిరి సర్వేశ్వరుని కరుణచేతను పరమఋషుల దయవల్లను ఈ సత్యమును గ్రహించి గాంధీగారు మొదలగు దివ్యపురుషులు గుణమునకు ఆధిక్యము గలదని తలంచి పరాధీన విమోచనము కొఱకు ప్రయత్నించి నందుచేతనే స్వరాజ్యము లభ్యపడెను

పైన జెప్పిన ముష్టి విత్తనము చీనీపండు విత్తనము యొక్క దృష్టాంతము

ఇచట సరికాదు ఇచట దేహము ఆత్మ రెండుగా నుండును వృక్షమునకు ఆలాటి ఆత్మ, అనాత్మ అను స్థితి యింకను వికాసమునకు రాలేదు కావున ముష్టివిత్తనము పెట్టి పన్నీటితోను, పాలతోను పోషించినను చీనీపండు ఫలించునా యను యుక్తివాదము అర్ధరహిత మైనది అందువల్ల నిమ్నజాతిలో నుండే వారిని ఎంత సంస్కరించినను ఉన్నతజాతి స్థితిలోనికి రాజాలరను వాదము నిరర్ధకము ఆలాగున కుక్కను గంగా స్నానముచేయించిన గోవగునా యను న్యాయమును అర్థము లేనిది ఏలన శునకమునకున్ను, గోవునకున్ను ఏలాటి సంబంధమున్ను లేదు ఆకారములో ఆహారములో, వర్ణములో, శబ్దములో, స్థూలసూక్ష్మ, అవయవములలో అన్నిటిలోను ప్రత్యక్షముగా భిన్నస్వభావములు కనబడుచున్నవి నిమ్నోన్నత కల్పిత మానవజాతులలో ఆలాగున కన్పించుట లేదు ఆకారములో రంగులలో అవయవములలో జనన మరణములలో ఏలాటి భేదమున్ను ఎవరున్ను నిరూపింపజాలరు ఆహారములోను సత్త్వాదిగుణములలోను భేదములుండ వచ్చును అవి సంస్కార జన్యములు అట్టిదానిని సంస్కారముచే మార్పు చేసుకోవచ్చును సంస్కారముచే మార్పు చెందు విషయము ప్రతివారును అంగీకరించియే యున్నారు అది తప్పనిసరిగా ఉండవలసినదే ఆలాగున నల్లని కాకి యెచట? తెల్లనిహంస యెచట? ఇట్టి యుక్తి చెప్పువారు ఎచట నేర్చుకొన్నారో దురూహ్యముగా ఉంటున్నది దీనిని యుక్తి యని చెప్పరాదు కుయుక్తి యనియే పేరు పెట్టవలయును కాకి యొక్క యాకారము, ఆహారము, వర్ణము, స్వరమునకున్ను, రాజహంస యొక్క ఆకార ఆహారవర్ణ స్వరములకున్ను ప్రత్యక్షముగా భేదము అందరికిన్ని కనబడుచునే యున్నది ఆలాగున మానవులలో ఆకార స్వర వర్ణములలో ఎవరైన భేదము చూపెట్టగలరా? మరియొక్క రహస్యము గూడగలదు ఏజాతికి ఆజాతి స్త్రీ పురుషులలోనే పరస్పరము విషయాసక్తి కనబడుచున్నది కాకికి కాకితోను, హంసకు హంసతోను, కుక్కకు కుక్కతోను, గోవునకు గోత్వముతోను మాత్రమే పరస్పర మిధున సంబంధము కనబడుచున్నది భిన్న జాతి పక్షులలోగాని, మృగములలోగాని ఈ సృష్టి ధర్మ రహస్యము కానుపించుటలేదు మానవులలో అన్ని కులములలోను స్త్రీపురుషులలో పరస్పరము ఇట్టిగుణము కనబడుటవల్ల మానవులందురు ఒకే

వర్గమునకు చెందిన వారలని యనుటలో సంశయ మిసుమంతయు లేదు ఐతే "సంస్కారాద్ద్విజ ఉచ్యతే" అను సిద్ధాంతమును తప్పక ప్రతివారున్ను అంగీకరించవలసినదే లేనిచో జాతి సంకరము, జాతి భ్రష్టత్వము తప్పక కలుగును, ఇది క్షేమకరముకాదు ఈ విషయమై శ్రీ కృష్ణభగవానుని యాశయము మీ ముందట పెట్టెద

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ॥ (7-10)**

సర్వభూతములలోను బీజరూపముగాను, సనాతన రూపముగాను నున్న వానినిగా నన్ను తెలిసికొనుము

దేహము పంచభూతాత్మక స్వరూపమగుటచేత దేహమునకు పంచభూతములే బీజమని చెప్పవచ్చును ఆత్మయో పంచభూతవ్యతిరిక్త సాక్షి చైతన్య మగుటచే సనాతన చైతన్యరూపమగు ఈశ్వరుడే దానికి బీజరూపము, దేహమే యాత్మయని తలంచెడు నాస్తికు లెవరైనఉండినచో వారే దేహమని తలంచురుగాక ఆస్తికులెవరున్ను దేహమే యాత్మయని తలంచువారుండరు వారు ఆత్మయే తామని తలంచు వారగుటచే అట్టి యాత్మ పరమాత్మాంశమగుటచే వారియొక్క బీజభూతము పరబ్రహ్మమే యగును ఇట్టి సత్యమైన బీజాంకుర న్యాయమును తెలుపక దేహమునకే బీజాంకుర న్యాయము తెలిపినందుచేతనే దేహమేలాగున జడమైనదో అట్లే ఈ చైతన్యాత్ములు గూడ జడత్వమును పొందిరి ఇట్టి అనాత్మ జడమునుండి చైతన్యాత్మను ఉద్ధరించుకొనవలెనను భావముతోనే ఈ వ్యాసమునకు "ఆత్మోద్ధరణ" మని నామకరణము చేయుట్టైనది కుమారునకు తండ్రి యేలాగున బీజకారణము గాకపోవును? సద్వంశములో పుట్టిన యే వ్యక్తియైనను తండ్రియగు బీజమును అన్య బీజమున లేక యన్య గోత్రమున పుట్టినవాడని చెప్పినచో సహింపగలుగునా? ఆలాటి స్వభావము మానవులలో వ్యాపించునప్పుడే ఈశ్వరబీజమై ఈశ్వరాంశములో పుట్టిన మనుజాలకు ఆత్మోద్ధరణ కాగలుగును పౌరుషమున్ను జనించును అపుడు చెడు సంస్కార ముండిన మంచి సంస్కారము చేసుకొని పవిత్రు డగుటకు యత్నించును శౌర్యముదయ మగును

**అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥ (10-20)**

ఓ యర్జునా! సకల భూతములయొక్క హృదయకమల మందుండు ప్రత్యగాత్మను నాస్వరూపముగా నెరుంగుము సమస్త భూతముల యొక్క ఆది, మధ్య, అంతములును నేనేయని తెలుసుకొనుము ఈలాగున భగవానుడు చెప్పియుండగా మరలఏల సంశయపడవలయును? ఈ సృష్టికి పూర్వమును, ఇప్పుడును, ఈ సృష్టి లయించిన పిమ్మటను ఈయాత్మ సాక్షాద్భగవత్స్వ రూపముగా ఉంటున్నదను సత్యమును నిరూపించడమైనది

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ॥ (10-39)**

ఓ యర్జునా! సమస్త భూతములకు బీజభూత మేదిగలదో అది నేనే

**ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ (13-3)**

ఓయర్జునా! ఈ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది దీనిని (క్షేత్రధర్మమును) ఎవడెరుంగుచున్నాడో వానిని క్షేత్రజ్ఞుడని క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరింగినవారు చెప్పుచున్నారు ఇచట క్షేత్రము క్షేత్రజ్ఞుని నుండి వేరుపఱచి చెప్పినట్లు, దేహమునుండి దేహిని వేరువేరుగ గ్రహించుకొనవలయును దేవాలయము లోగల దేవుని త్యజించి దేవళమే దేవుడని తలంచువారు ఎంత వెఱ్ఱివారలో ఆలాగున ఆత్మ నుపేక్షించి దేహమునుకు బీజాంకురన్యాయము చెప్పువారు సహా భ్రమలో పడినవారే యగుదురు

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥ (13-3)**

ఓ యర్జునా ! సమస్త దేహధారుల యందుండెడు క్షేత్రజ్ఞుని (ఆత్మను) నన్నుగా ఎరుంగుము క్షేత్రముయొక్క క్షేత్రజ్ఞునికి యొక్కయు జ్ఞానమున్నదున్నట్టు ఎరుంగుట యేదిగలదో అదే జ్ఞానమని నామతము

క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వభావము తెలిసికొనుట యేది కలదో యదే నిజమైన

జ్ఞానమని శ్రీ కృష్ణభగవానుడు చెప్పియుండగా, క్షేత్రజ్ఞునికి బీజాంకుర న్యాయము చెప్పక క్షేత్రమునకు బీజాంకురన్యాయము చెప్పుట జ్ఞానము కాదనియు, అది యజ్ఞానమనియు శ్రీ భగవానుడే యుపదేశించెను

**క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా ।**
**భూత ప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్ ॥ (13-35)**

ఎవరు క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క భేదమును, భూతములకు సంబంధించి యుండు ప్రకృతినుండి విముక్తి నొందదగిన యుపాయమును జ్ఞానదృష్టిచేత నెరుంగుచున్నారో వారు పరమపదమును (మోక్షమును) పొందుచున్నారు

ఇది అనాత్మ బంధనమునుండి యాత్మ నుద్ధరించెడి కార్యమగును అందువల్లనే దీనికి నాత్మోద్ధరణమని పేరిడుటకు కారణ మైనది ఈ స్థితిని గ్రహించిన పంజరములోనుండు పక్షికిన్ని, పంజరమునుండి విడుదల పొందిన పక్షికిన్ని ఎంత తారతమ్యము గలదో, మఱియు బోనులో పడిన సింహమునకు, బోనునుండి విముక్తి గలిగిన సింహమునకును ఎంత తారతమ్మము గలదో, అనాత్మ భావమునుండి యాత్మభావము లోనికి వచ్చెడు ఆత్మకున్ను నంత తారతమ్యము గలదని తెలుసుకొనగలరు

**సర్వయోనిషు కౌన్తేయ మూర్తయస్సంభవన్తి యాః ।**
**తాసాం బ్రహ్మమహద్యోనిరహం బీజప్రదః పితా ॥ (14-4)**

ఓ యర్జునా! దేవ పితృ మనుష్య పశు మృగాది సకలయోనుల యందు పుట్టు పలువిధములైన శరీరములకు మాయ (ప్రకృతి) తల్లి యనియును, పరమేశ్వరుడనగు నేను గర్భాధానకర్తయగు తండ్రిననియును తెలిసికొనుము

**ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశే ఽ ర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥ (16-61)**

ఓ యర్జునా! సమస్త ప్రాణులకు నియామకుడగు పరమాత్మ దేహములనెడు యంత్రముల నధిష్ఠించియున్న సమస్తప్రాణులను మాయచేత త్రిప్పుచు హృదయస్థానమందు ఉంటున్నాడు

ఇందువల్ల మాయచే ఆత్మ స్వరూపము నెరుంగజాలక జనులు దేహాత్మ బుద్ధిగలవారై యుంటున్నారని తెలియందగును

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ (6-29)**

యోగదృష్టిగలవాడు సమస్తజంతువులయందు సమభావము గలవాడై, తన్ను సమస్త భూతములయందున్న వానిని గాను, సమస్తభూతములు తనయందున్నవానిని గాను చూచుచున్నాడు

అనగా అన్నిటిలోగల యాత్మను తన యాత్మను సహద్దైవ స్వరూపముగా జ్ఞానదృష్టిగలవాడు చూచుచున్నాడు అని భావము

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే ॥ (6-31)**

ఎవడు సమస్త భూతములలో ఉన్న నన్ను ఒకేయాత్మగా తెలిసినవాడై భావనచేయుచున్నాడో, అట్టి యోగి సర్వప్రకారముగ వర్తించు చున్నవాడైనను, నా యందు ఉండువాడగుచున్నాడు ఏడవ అధ్యాయమున "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని భగవానుడు జ్ఞానియందును తనయందును గల యభేదమును నిరూపించినది యిచ్చట వ్యక్తీకరించడ మైనది మరియు "సర్వథా వర్తమానోఽపి" యను దానికి ఎల్లప్పుడు నిర్వికల్ప సమాధియందుండినను లేక పరప్రాణుల మేలుకొఱకు సర్వదా ప్రవర్తించుచుండినను అతడు సదా భగవంతుని యందుండువాడే యగును లేక గృహస్థాశ్రమము నందుండినను, సంన్యాసాశ్రమ మందుండినను, వన మందుండినను, గ్రామమందుండినను, ఎల్లప్పుడున్ను భగవానునిలో ఉండువాడే యగును

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వ వినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ (13-28)**

బ్రహ్మాది స్తంబపర్యంతములగు సమస్త వస్తువుల యందును సమముగా ఉండునట్టి పరమేశ్వరుని (ఆత్మను) ఎవండు సర్వము నశించినను నశింపని

వానినిగా చూచుచున్నాడో, వాడే చూచువాడు తక్కిన వారు నేత్రములున్నప్పటికిని చూడని వారని భావము తక్కినవారు చూచే వస్తువులు నశ్వరములు లేక మిధ్యా స్వరూపములు కావుననే "యః పశ్యతి స పశ్యతి" అని ప్రయోగించుటకు కారణమైనది ప్రపంచములో గల గొప్ప ప్రజ్ఞావంతులు సూక్ష్మ బుద్ధిగలవారలు కనిపెట్టిన అద్భుత యంత్రసామగ్రులు, విద్యలు అన్నియు నశించునవే అందువల్ల వారు జీవించి యున్నప్పుడుగాని, దేహము విడిచిన పిమ్మట గాని యాత్మశాంతిని పొందలేరు అయితే ప్రపంచమునకు మహోపకారము చేసినవారే, అందువల్ల వారు గౌరవనీయులే, అయితే ఆత్మశాంతి, యాత్మతృప్తి, యాత్మప్రసన్నత లేనివారికి నన్నివిద్య లుండిననేమి? యెంతధన ముండిన నేమి? దైవానుగ్రహము లేనప్పుడు వ్యర్థముగదా! కావుననే ఉపనిషత్తు ఈలాగున తెలుపు తెలుపుచునాను :- "ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజంతి నీడం శకుంతా ఇవ జాతపక్షాః" పక్షులు గూడుకట్టుకొని గ్రుడ్లు పెట్టి పిల్లలకు రెక్కలువచ్చిన పిమ్మట నవి గూటిని వదలిపోవునట్లు అవసానకాలమున మానవుడు గ్రహించిన విద్యలన్నియు వానిని వదలిపోవును

**సమం పశ్యన్ హి సర్వత్ర సమనవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనా ఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥ (13-29)**

సకల ప్రాణులయందు నున్నట్టి ఈశ్వరుని సమభావముతో చూచుచున్నవాడై, తన్ను తనచేత హింసించుకొనుట లేదు అందువలన సర్వోత్కృష్టమగు మోక్షమును పొందుచున్నాడు

అన్ని జీవకోట్ల హృదయాంతరాళములో గల యాత్మను ఈశ్వర స్వరూపముగా ఎరింగినవాడై మోక్షమును పొందుచున్నాడనియు, ఆలాగున తనలోను అన్నిటిలోను గల యాత్మను ఈశ్వరస్వరూపముగా నెరుంగనివాడు తన్ను తాను చంపుకొనిన వానితో (ఆత్మహత్య చేసుకొనిన వానితో) సమానుడనియు భగవానుడే యుపదేశించెను ఇదే ఆత్మోద్ధరణము చేసుకొనకపోయిన గలిగెడు దుఃఖమున్ను, ఆత్మోద్ధరణము చేసికొనిన గలిగెడు అనంతానందమున్ను అని గ్రహించుకొనేది.

ఈ విషయమై మరియొక గాథను గూడ మీకు తెలిపెద ఒకానొకప్పుడు

హరిద్వారమునందు గంగా పుష్కరము జరుగు పుణ్యాకాలమున స్నాన మొనర్చుటకు ఉజ్జయిని రాజును, రాణియు కొందఱు పిల్లలతో సహా బోటులో ప్రయాణమై వచ్చుచుండిరి తుపానుగాలి బలముగా కొట్టుటచేత బోటు మునిగిపోయెను అప్పుడు చిన్నకుమారుడగు బాలుడు మాత్రము కనిపించలేదు తక్కిన వారందఱున్ను మరణించినట్లు కనుగొనినారు దైవమహిమవలన చిన్నరాకుమారుడు మాత్రము నీటిలో మునిగిపోవక పైన తేలు చుండెను చేపలు పట్టు పల్లెవారలు ఆ శిశువును కనుగొని తీసుకొని వెళ్ళి సాకుచుండిరి రాజకుటంబస్థులు, రాజబంధువులు ఆ శిశువుకొఱకు ఎంతో వెదకిరి భటులచే వెదకించిరి కాని జాడ తెలియలేదు అనేక జ్యోతిష్కులను, ప్రశ్నలు చెప్పెడి వారిని అడిగినప్పుడు వారందఱును బోటులో పడిపోయిన రాకుమారుడు మాత్రము సజీవముగా నున్నట్లున్ను, 23 సంవత్సరముల వఱకు అతనికి గొప్పగండమున్ను, అజ్ఞాతత్వమున్ను గలదనియును, చతుర్వింశతి వత్సరారంభమున అతడు లభించుననియు ఐకకంఠ్యముతో చెప్పుటచే రాజ్యమునకు మరియెవరిని పట్టాభిషిక్తుని చేయక మంత్రులు, తక్కిన రాజ బంధువులు ధర్మముతో రాజ్యమును పాలించుచుండిరి అయితే నానాదిక్కులకు అనేక భటులను పంపించుచు, ఎవరైతే రాకుమారుని కనుకొనివచ్చెదరో వారికి గొప్ప బహుమతి గూడ ఇచ్చెదమని దేశదేశములలో ప్రకటనజేసిరి అనేక భటుల సేవకులు దేశములన్నియు సంచరించి వెదకుచు, తిరిగి వచ్చుచు, మరల పోవుచుండిరి వారికి కావలసిన ఖర్చులన్నియు సంస్థానము నుండియే యిచ్చుచుండిరి

భాగీరథియందు దొరికిన రాచబిడ్డను పల్లెవాండ్లు తీసుకొని వెళ్ళి వారినాయకున కిచ్చిరి సూర్యాంశుడైన కర్ణుడు క్షత్రియ కుంతీదేవి యందు జన్మించినను ఏలాగున రాధేయుడుగా సూతవంశజుడుగామారెనో, వీడున్ను ఆలాగుననే పల్లెవాడై వలలు కట్టడం, చేపలు పట్టడం స్వధర్మముగా భావించి గొప్ప చంబడివాడాయెను అందరును అతనికి బెస్తయ్యయని పేరు పెట్టి పిలుచుచుండిరి వాడు మహాధీరుడై, నిర్భయుడై, యెంత లోతైన చెరువులలో గాని, నదులలో గాని, సముద్రములో గాని దిగి చేపలు పట్టుటలో మహాకుశలు డాయెను అయితే గంభీరాశయముతో ఆజానుబాహువులు గలిగి మంచికాంతి

మంతుడై ధర్మమార్గము తప్పక యనుష్ఠించెడు స్వభావము గలిగియుండెను మహానీతిమంతుడై మితభాషణము గలిగి యుండెను ఏలాటి దుర్వ్యసనములకు లోబడెడివాడు కాడు తన్ను చాకిన నాగయ్య, గంగమ్మగారగు తల్లితండ్రులయెడ బెస్తయ్య మాతా పితరులను భావముగలిగి వారి వాక్యమును జవదాటక వారికి ప్రీతి కరమగు కార్యములనే సర్వదా చేయుచుండెను అందువల్ల చాకిన తల్లిదండ్రులగు నాగయ్య గంగమ్మగారు తాముచేసిన నోములకు భగవంతుడు తృప్తి పొంది ఇట్టి సుగుణ సంపన్నుడగు పుత్రుని తమకు అనుగ్రహించినట్లు తలంచి యానందభరితులై యుండిరి ఇప్పటికి మన బెస్తయ్యకు 23 సంవత్సరములు వయస్సు పూర్తియై 24 వ వత్సరము ప్రారంభమయ్యెను

అత్తరి రాజభటులు పల్లె పల్లె, గ్రామ గ్రామ, పట్టణ పట్టణములను శోధించి శోధించి ఈ పల్లెవారిపల్లెకు వచ్చిరి ఇదివరలో ఎన్నిసార్లులో ఆ పల్లెకువచ్చి వెదకి వెళ్ళినవారైనను జాడ తెలియలేదు దైవవిధి యేమని చెప్పవచ్చును! ప్రతిపల్లెలోను గ్రామములోను మీ గ్రామములో క్రొత్తగా పిల్లలెవరైనా వచ్చియున్నారా? అనాథ పిల్లలు ఎవరికైనా దొరికియున్నారా? యని భటులు అంతట సంచరించుచు అడుగుచుండిరి ఆలాగున ఆ పల్లెలోను తిరిగి తిరిగి అడుగుచుండగా కొందఱు, బెస్తయ్య యను నొకకుర్రవాడు మా గ్రామపెద్దకు దొరకియున్నాడని, చెప్పిన వాక్యము విని రాజసేవకులు పోయిచూడగా, అతని వర్చస్సు, గాంభీర్యము చూచి యితడుగానే యుండవచ్చునని తలంచి, వీడు మీ కెప్పుడు దొరకెను? ఎచ్చట దొరకెను? యని యడగగా, ఈ జరిగిన గంగా పుష్కరమునకు పూర్వము జరిగిన పుష్కరకాలమున మాకు దొరకెను అది యిప్పటికి 23 వత్సరములు దాటినది అని చెప్పిరి ఆ యువకుని నీ పేరేమని యడుగగా బెస్తయ్య అనెను మీ తల్లిదండ్రు లెవరని యడుగగా ఈ గ్రామ పెద్దలగు నాగయ్య గంగమ్మలగు బెస్తవారలు అని చెప్పెను నీ జాతి యేమని అడుగగా పల్లెవాడనియు చెప్పెను ఆ రాజభటులు వెంటనే సంస్థానమునకు వెళ్ళి వృత్తాంత మంతయు మంత్రులతోను రాజబంధువులతోను, ఆ రాజకుమారుని పెదతల్లి పినతల్లులతోను చెప్పగా, వారందరున్ను పురోహితులతో గూడ గొప్ప ధన వస్త్రాదులను తీసుకొని బెస్తవారిపల్లెకు

వచ్చిరి బెస్తయ్యను చూచి అందరున్ను ఆనంద బాష్పాకుల హృదయ నేత్రములు గలవారై బెస్తయ్యను ఆలింగనము చేసుకొని యేడవదొడంగిరి ఆ పల్లెలో ఉండిన జనులు గాక చుట్టు ప్రక్క గ్రామ వాసులు సహా అనేకులు గుమిగూడి ఈ యాశ్చర్యమును చూచుచుండిరి మంత్రులు పౌరోహితులు బెస్తయ్య పల్లెవారికి దొరికినరోజును పుష్కరమున గంగలో బోటు మునిగిన రోజున్ను చూడగానొకే కాలముగానుండెను రాజబంధువులు మంత్రులు వారు తెచ్చిన ధనవస్త్రాదులను బెస్తయ్య చాకిన తల్లిదండ్రులకిచ్చి శాశ్వతముగా ఉండేలాగున ఆ గ్రామమును గూడ వారికి దాన మిచ్చి బెస్తయ్యను తీసుకొని వెళ్ళునప్పుడు బెస్తయ్య యిదివరకు తల్లి దండ్రులని తలించిన నాగయ్య గంగమ్మగార్ల పాదములపైబడి నమస్కరించగా, నాగయ్య గంగమ్మ గార్లు ఇదివరకు కుమారుడిగా తలంచిన బెస్తయ్యను ఆలింగనము చేసుకొని నాయనా! వెళ్లుచున్నావా? మేము రాకుమారుడగు నిన్ను ఎన్నియో విధములుగా తిట్టుచు కొట్టుచు నిందించి యుండవచ్చును అట్టి అపరాధము లన్నిటిని క్షమింపుము, పుత్రసంతానము లేని మాకు భగవంతుడు నిన్ను అనుగ్రహించినట్లు తలంచి పరమానంద భరితులమై యుంటిమి ఇప్పుడు మా హృదయమును కార్చిచ్చు అడవిని దహించునట్లు పుత్రశోకము దహించుచున్నది మా అదృష్టము మా భాగ్యము, మాపై భగవంతునికి గల కరుణయు నింతటితో పూర్తియగు చున్నది నాయనా! వెళ్ళి ప్రజలపై కరుణగలిగి ధర్మముతో రాజ్యమును పాలించి కృతార్థుడవు గమ్మని ఆశీర్వదించి పంపిరి అత్తరి బెస్తయ్యను మంత్రి ప్రభృతులు రాజబంధువులు తీసుకొనివెళ్ళి వేద మంత్రపూర్వకముగా పుణ్యాహవాచకములతో అభిషేకముచేసి శాస్త్రప్రకారము సంస్కార క్రియలు మంత్రపూర్వకముగా జేసి ఉపనయనాది క్రియలు జరిపి, బ్రాహ్మణులచేతను, సాధువులచేతను, పెద్దలచేతను ఆశీర్వాదములు చేయించి సూర్యవంశ ఇక్ష్వాకు కుల క్షత్రియుడని చెప్పి ధర్మపాలకవర్మయను నామకరణము చేసిరి అప్పటి నుండి అతడు తన్ను క్షత్రియునిగా తలంచి గంభీర గుణము గలిగి తండ్రిచే పాలింపబడిన రాజ్యమును చక్కగా పాలనముచేయుచు ధర్మపాలకుడను నామమును సార్థక మొనర్చెను పట్టాభిక్తుడైన వెంటనే తానుండిన గ్రామములో గల బెస్తవారలగు స్త్రీ పురుషులందురు ఏ సమయమున వచ్చినను తన్ను చూచి మాట్లాడవచ్చునని

ప్రకటనజేసెను

ఈలాగున తన ఈశ్వరత్వము మరచిపోయి దేహాత్మబుద్ధి గలిగి యుండు జీవులకు ఆత్మోపదేశ మొనర్చి యుద్ధరించు టేదిగలదో దానికే ఆత్మోద్ధరణమని పేరు కావుననే శాస్త్రమీలాగున చెప్పినది

**జన్మనా జాయతే జంతుః సంస్కారాద్ద్విజ ఉచ్యతే ।**
**వేదపారాయణాద్విప్రో బ్రహ్మజ్ఞానాత్తు బ్రాహ్మణః ॥**

జన్మించినప్పుడు మనుజుడు గూడ జంతువువలెనే యుండును ఉపనయనాది సంస్కారము వల్ల ద్విజుడగును వేదపారాయణముచేత విప్రుడనంబడును బ్రహ్మజ్ఞానము కలుగునప్పుడు బ్రాహ్మణు డనబడును మరియు శాంతిపర్వమున చెప్పినది జూడుడు

**జన్మనా బ్రాహ్మణాస్సర్వే కర్మభిః శూద్రతాం గతాః ।**
**అతో వేదైశ్చ సంస్కారాచ్ఛుద్ధి మర్హంతి రత్నవత్ ॥**

మానవులందరున్ను ఆర్యసంతతిలోనివారే అనగా మొదట ఆర్యసంతతి యొక్కటియే యుండెను నిషిద్ధ కర్మలచేత శూద్రత్వము నొందిరి అయినను, వేదాధ్యయనమువల్ల సంస్కారము గలవారై శుద్ధిని పొందవలసినవారై యున్నారు రత్నమై యున్నప్పటికిని సానపట్టకపోయిన ఏలాగున ఆభరణయోగ్యము కాదో, ఆలాగున మంచి వంశములో పుట్టినను సంస్కారము గలుగనిచో బ్రాహ్మణత్వమునకు అర్హతలేదు

**నిషిధ్య నిఖిలోపాధీన్ నేతి నేతీతి వాక్యతః ।**
**విద్యాదైక్యం మహావాక్యైర్జీవాత్మ పరమాత్మనోః ।**

సమస్తమైన జీవులయొక్క దేహేంద్రియాది ఉపాధులను విచారణ చేసి విడిచిపెట్టి జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యమును తెలిపెడు మహావాక్యరూపమగు అఖండానంద స్వరూపార్థము గ్రహించుకొనదగినది ఇదే నేతి నేతి వాక్యార్థ విచారణచే తెలుసుకొనందగినది

**వపుస్తుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యవఘాతతః ।**
**ఆత్మానమాంతరం శుద్ధం వివిచ్యాత్తండులం యథా ॥**

లోకములో జనులు ధాన్యమును దంచి పొట్టు, తవుడు మొదలైన వానిని త్యజించి, బియ్యమును గ్రహించునట్లు ముముక్షు వైనవాడు వేదాంత శ్రవణ, మనన నిదిధ్యాసలనెడు ఉపాయములతో అంతర మందు శుద్ధమై యుండు ఆత్మను తెలిసికొనవలయును

బీజము పొట్టుతో కూడియుండువఱకు మొలచును దంచి పొట్టును తొలగించిన మరల మొలవదు ఆలాగున దేహాత్మబుద్ధి కలిగియుండువరకు జీవునకు జనన మరణాది దుఃఖములు గలుగుచుండును దేహేంద్రియాదులకు సాక్షియగు శుద్ధమగు యాత్మయే తానను బోధము కలుగునప్పుడు బియ్యము మొలవనట్లు విముక్తి బొందిన యాత్మయు జననమరణాది దుఃఖమును పొందదు

**భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా ।**
**పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥**

కీటకము భ్రమరమును భావన జేసి తుమ్మెదై మారునట్లు పురుషుండు తీవ్రమైన నిరంతర భావన దేనిని గురించి చేయుచుండునో ఇతని యొక్క భావన జ్ఞేయరూపమై మారుచుండును అనగా దేహభావనచేత దేహత్వబుద్ధియు బ్రహ్మభావనచే బ్రహ్మత్వబుద్ధియు తప్పక కలుగుచుండును కావున బ్రహ్మభావన గలిగియుండే లాగున చూడవలయునని అపరోక్షానుభూతి ఉపదేశించుచున్నది

**భావవృత్త్యా హి భావత్వం శూన్యవృత్త్యా హి శూన్యతా ।**
**బ్రహ్మవృత్త్యాహి పూర్ణత్వం తథా పూర్ణత్వ మభ్యసేత్ ॥**

మానవుడు ఏభావన కలవాడగుచున్నాడో ఆ భావమునే పొందుచున్నాడు శూన్యవృత్తిగల వాడయ్యేనేని శూన్యత్వమునే పొందును బ్రహ్మాకారవృత్తి భావన జేసెనేని పూర్ణమైన బ్రహ్మత్వమునే పొందును కావున పూర్ణాత్మ స్వరూపజ్ఞానమునే నిరంతర మభ్యసించవలయును ఈ ప్రపంచమంతయు మానవుని యొక్క శక్తిని గాని మనో వేగమునుగాని, నేటివర కెవరున్ను ఇంతవరకు గలదని నిశ్చయించి

యుండలేదు కావుననే మనస్సుయొక్క శక్తి అచింత్యమని చెప్పుచున్నారు అది అతివేగముగల ఊర్ధ్వాధోలోకములలో తిరుగుచుండు ఒక విచిత్ర యంత్రమువంటిది అది జీవత్వముతో కూడి ఈ మర్త్యలోకమున మధ్యలోకమున స్థితిగలిగియున్నది దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియగు శుద్ధజ్ఞాన స్వరూపమైన యాత్మయే తానని తలంచినచో త్వరలోనే భూర్భువస్సువర్గాది సత్యలోకమున కావల తీసికొనివెళ్ళి శివత్వముగా తన్ను మార్చివేయును అట్లుగాక శుద్ధాత్మ స్వరూపమగు తన్ను మరుపుజేసి దేహేంద్రియ మనోబుద్ధులతో గూడిన వానిగను, జాతి వర్ణ ఆశ్రమములతో కూడిన వానిగను, స్త్రీ పురుషాది లక్షణములతో కూడిన వానిగను భావన జేసినచో ఈ జీవుడగు తన్ను అతల వితల పాతాళలోకముల కావల తీసుకొనివెళ్ళి పశుత్వముగా మార్చును కావున ఈ జీవత్వమే తన్ను శివత్వము గాను పశుత్వముగాను నొనర్చునని గల పరమసత్యమును మరువకుడు ఆత్మోద్ధరణము ఇట్టి మహోన్నత కార్యము నొనర్చుచుండును కావున జాత్యాదులను ఆధారపడిన బోధలు మిమ్ముల నేమి జేయుచున్నవో, ఆత్మాభిమానము మీకు ఏ స్థితిని గలుగజేయుచున్నవో మీలో మీరే యోచించుకొనుడు ఈ విషయమై మీకు ఇదివరలో చెప్పిన రెండు కథలను గాక మరియొక్క కథను గూడ తెలిపెద

మహారాష్ట్రదేశమందు యాజ్ఞవల్క్య గోత్రస్థుడును, ఆపస్తంబ సూత్రము గలవాడుననగు నొక సద్బ్రాహ్మణు డుండెను వేదవేదాంగములు చదివినవాడే గాక అర్థమును బాగుగా విచారణ చేసి తెలిసికొనిన వాడుగా నుండెను మంచి వైదికాచరణము గలిగి బ్రాహ్మణత్వమునకు నేలాటి లోపమున్ను గలుగనీయక వేదమార్గానుయాయియై జీవించుచుండెను ఒకానొకరోజు మంచి మిట్టమధ్యాహ్న కాలమున పొరుగూరికి వెళ్ళి వచ్చునప్పుడు శ్మశానభూమిలో శవము కాలుచున్నది చూచి వచ్చుచుండగా, భయము గలిగినందుచే నొక లంబాడి (సుగాల) మునీశ్వరగ్రహము ఆవేశించడ మైనది అది చాల నీచగ్రహము, అప్పటినుండి మతి మరుపు గలిగి గొప్పగా అఱచుచు ఇంటికి వచ్చి స్నానాద్యనుష్ఠానములు చేయకనే మలినరూపముగలిగి మనుష్యులను కఱచుటకు ప్రారంభించెను అత్తరి కొందరువచ్చి నీవెవరని యడుగగా నేను లంబాడి మునీశ్వరుడనని చెప్పం దొడంగెను

ఏమి కావలయునని ప్రశ్నింపగా, సారాయి కావలయును మాంసము కావలయును, కోడిగ్రుడ్లు కావలయును, అని చెప్పదొడగెను అప్పటినుండి స్నానాది దినకృత్యములేమియు చేయక పెద్ద పెనుభూతమై దగ్గఱకు వచ్చువారి ముఖముపై ఉమ్మివేయుటకు ప్రారంభించెను అందువలన కిటికీలు తెరచిన ఒక గదిలోనుంచి తాళమువేసిరి అప్పుడు గూడ కిటికీ వద్దకెవరైన వచ్చి చూచినచో పండ్లు పటపట కొఱకుచు ఉమ్మివేయుచుండెను నీవెవడని యెవరైన అడిగిన నుగాల మునీశ్వరుడనని అఱచుచుండెను ఇంటివారు ఈ కష్టమును సహించజాలక గొప్ప మాంత్రికుని తెప్పించి హోమాదిక్రియలు చేసి మంత్రశాస్త్ర ప్రకారము గ్రహమును యంత్రములో నావాహనముచేసి యొకచెట్టునకు కట్టివేయించిరి మరల నెప్పుడైన నాదయ్యమువచ్చి యావేశించునను తలంపుతో ఒక యంత్రమును (రక్షరేకును) మూడు బీజాక్షరములు లిఖించి కట్టించెరి వెంటనే రామచంద్రశర్మయను నామధేయముగల బ్రాహ్మణునకు గ్రహవిమోచము గలిగి తన బ్రాహ్మణత్వము జ్ఞాపకమునకు వచ్చి ప్రాయశ్చిత్తాది కర్మలు జేసికొని శుద్ధుడై యుండెను అప్పుడు తన యాజ్ఞవల్క్యగోత్రము, ఆపస్తంబసూత్రము, రామచంద్ర శర్మయను నామము జ్ఞాపకమునకువచ్చి పూర్వము వలె బ్రాహ్మణాచార వృత్తి గలిగియుండెను

ఆలాగున దైవస్వరూపము, లేక దైవాంశ స్వరూపముగా నుండు ఈ యాత్మయు, మాయామోహ గ్రహము (దయ్యము)చే పట్టుబడినందున ఇప్పుడు ఒకరిని మీరెవరని ఎవరైన నడిగినచో తన యాత్మజ్ఞానము మరుపుగలిగి బ్రాహ్మణుడని గాని, క్షత్రియుడనిగాని, వైశ్యుడనిగాని, శూద్రుడని గాని, బ్రహ్మచారి గృహస్థవాన ప్రస్థ సంన్యాసులనిగాని, స్త్రీ యనిగాని, పురుషుడనిగాని దేహధర్మములనే చెప్పుదురు, ఇవన్నియు అజ్ఞానకల్పిత నామరూపములు మాంత్రికుని సహాయముచే గ్రహము నుచ్చాటనము చేసినట్లు ఆత్మవేత్త యగు మంత్రకారుని సహాయముచే ఆత్మానాత్మ విచారణ చేసి అనాత్మరూపమగు దేహాదులనుండి ఆత్మను వేరుపఱచి తెలుసుకోవలయును అప్పుడు మీ యొక్క సత్య జ్ఞానానంద స్వరూపమగు నాత్మను తెలుసుకొనగలరు దీనికే ఆత్మోద్ధరణమని పేరు ఇచట రక్షారేకనగా జ్ఞానరక్షయని గ్రహించుకొనవలయును దానిలో గల మూడు బీజాక్షరము లెవ్వియన (1)

యుక్తాహారము, (2) వివిక్తవాసము (3) బ్రహ్మచింతనము, ఈ మూడున్ను శరీరపతన పర్యంతము విడువరాదు విడిచిన వెంటనే మాయ ప్రవేశించును కావుననే శ్రీ శంకర భగవత్పాదాచార్యులు వివేకచూడామణి యందిట్లు తెలిపిరి

**జాతినీతికుల గోత్రదూరగం నామరూపగుణదోషవర్జితమ్ ।**
**దేశకాల విషయాతివర్తి యద్బ్రహ్మతత్త్వమసి భావయాత్మని ॥**

శిష్యా ! ఆ పరబ్రహ్మము మనుష్య పశ్వాదిజాతితో గాని, కర్తవ్యాకర్తవ్యాది నీతితో గాని, బ్రాహ్మణాదికులముతో గాని, భారద్వాజాది గోత్రముతో గాని సంబంధము లేనిది నామరూప గుణరహిత మయినది దేశకాల విషయాతిరిక్త మైనది ఆ పరబ్రహ్మవు నీవే కనుక శరీరాభిమానమును విడిచి నేను బ్రహ్మము అని సర్వదా భావింపుము, మరియు ఈ విషయమై వేదాంత శాస్త్రము ఉపదేశించునది చూడుడు

**గ్రహావిష్టో ద్విజః కశ్చిచ్ఛూద్రోఽహమితి మన్యతే ।**
**గ్రహనాశాత్పునః స్వీయం బ్రాహ్మణ్యం మన్యతే యథా ॥**

**మాయావిష్టస్తథా జీవో దేహోఽహమితి మన్యతే ।**
**మాయానాశాత్పునః స్వీయం రూపం బ్రహ్మోఽస్మి మన్యతే ॥**

ఒక వేద బ్రాహ్మణుని శూద్రగ్రహము పట్టుకొనిన ఆవేశ సమయమున నెవరడిగినను శూద్రుడనని చెప్పును కదా? వారికికూడ గ్రహావేశ సమయమున బ్రాహ్మణుడను బుద్ధి పోయి తాను శూద్రుడనే బుద్ధి యుండును ఆ గ్రహము తొలగిన పిమ్మట నేలాగున తన నిజస్థితియగు బ్రాహ్మణుడని నిజబోధ నిశ్చయముగా గలుగునో, ఆలాగున మాయయను గ్రహముచే జీవుడు పట్టుబడుటచే తాను దేహమనియు, బద్ధుడనియు, అల్పుడనియు తలంచి దుఃఖించుచున్నాడు ఆమాయ తొలగిన పిమ్మట నిజరూపమగు బ్రహ్మత్వము ప్రకాశించి తాను నిత్యముక్తుడనియు బ్రహ్మమేయనియు బోధగలుగును అని గరుడపురాణమునందు శ్రీ మహావిష్ణువు గరుడునకు ఉపదేశించెను

**కృశోఽతిదుఃఖబద్ధోఽహం హస్తపాదాదిమానహమ్ ।**
**ఇతి భావనరూపేణ వ్యవహారేణ బధ్యతే ॥**

నేనతి కృశుడను, బహు దుఃఖములతో గూడినవాడను కరచరణముల గూడిన దేహమాత్రుడను, నేను శూద్రుడ, వైశ్యుడ, క్షత్రియుడ, బ్రాహ్మణుడ, స్త్రీ- అను అనాత్మయైన దేహమందాత్మబుద్ధితో గూడి స్వస్వరూపమైన తన స్థితిని తెలియక బద్ధులగుచున్నారు

**నాహం దుఃఖీ న మే దేహో బన్ధః కోఽస్యాత్మనఃస్థితః ।**
**ఇతి భావనరూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥**

నిత్య శుద్ధస్వయం ప్రకాశుడనైన నేను దుఃఖిని గాను దేహమునకు సాక్షియై దేహియై యుండు నాకు దేహముతో సంబంధ మెచ్చట? సచ్చిదానంద లక్షణములు గల యాత్మయైన నాకు బంధ మెక్కడది? ఈ లాటి విచారణ భావరూప వ్యవహారములచే ముక్తుడగుచున్నాడు అని వాసిష్ఠము

**నేతి నేతీతి నేతీతి శేషితం యత్పరం పదమ్ ।**
**నిరాకర్తుమశక్యత్వాత్తదస్మీతి సుఖీ భవ ॥**

ఈ లోకము నేనుగాను, దేహమునుగాను, ఇంద్రియములు గాను ప్రాణములుగాను, మనస్సుగాను, బుద్ధియును గాను,'కాను కా' నని నిరాకరించి త్యజించుటకు సాధ్యముగాక శేషించిన యే యొక్క ఆత్మగలదో దానియందు బ్రహ్మభావము గలిగియుండుము యుక్తులచేతను అనుభవముచేతను శ్రుతువులచేతను ఇతరములన్నియు త్రోసివేయబడును గాని సత్పదార్థమగు బ్రహ్మవస్తువు త్రోయుబడదు అదే నీయొక్క యాత్మయని భావన గలిగియుండుటయే మోక్షము దానికే ఈశ్వరప్రాప్తి యనియు, ఈశ్వరసాక్షాత్కారమనియు పేర్లు

**దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక ।**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీ భవ ॥**

ఓ కుమారుడా! నీవు ఆత్మభావన మరచి దేహ భావన కలిగియుండుటచేత చిరకాలమునుండి సంసారమున బద్ధుడవైతివి ఇప్పుడు దేహ విలక్షణ సాక్షియగు ఆత్మయనెడు బోధమను ఖడ్గముచే ఆ భవపాశమును ఛేదించి శాశ్వత సుఖస్వరూపుడవు గమ్ము అని అష్టావక్రమునీంద్రుడు జనక మహారాజున కుపదేశించెను

**అనాత్మ భూతే దేహాదావాత్మ బుద్ధిస్తు దేహినామ్ ।**
**సాఽవిద్యా తత్కృతో బంధస్తన్నాశో మోక్ష ఉచ్యతే ॥**

అనాత్మ భూతమగు దేహాదులందు ఆత్మబుద్ధి యేదిగలదో జీవులకు అదే బంధము, అదే అవిద్య, అదే మాయ, అదే అజ్ఞానము దాని యొక్క నాశమే మోక్ష మనంబడును, అని ఉపనిషద్వాక్యము

**పుష్పే గంధం తిలే తైలం కాష్ఠేఽగ్నిం పయసి ఘృతమ్ ।**
**ఇక్షౌ గుడం తథా దేహే పశ్యాత్మానం వివేకతః ॥**

ఆత్మోద్ధరణము ఈ శ్లోకముచే నిరూపించడమైనది పుష్పమునందు సుగంధము, నువ్వులయందు నూనెయు, కఱ్ఱయందు నిప్పును, క్షీరమందు ఘృతము, చెఱుకునందు బెల్లము ఏలాగున నిగూఢమై కనబడక యుండునో, చేయవలసిన క్రియలచేత ప్రత్యక్షముగ కనుగొనవచ్చునో, ఆలాగున ఈ దేహమందు ఆత్మ కనపడక యుండినను ఆత్మానాత్మ వివేక జ్ఞానముచేతను, ధ్యానము చేతను కనుగొనవచ్చును ఆలాగున చేయని కారణముచేతనే ఆత్మ వస్తువు ఒకటుండిన ఏల కనుపించుట లేదు భగవంతుడు అన్నిటిలోనుండిన ఏల యగుపడుట లేదు అని ప్రశ్నలు వచ్చుచుండును

ఇదివరలో చెప్పిన మూడు దృష్టాంతములేగాక వేదాంతశాస్త్రములలో మరియొక్క ఉదాహరణము గూడ చెప్పుట గలదు అదేమన ఒక గ్రామ సమీపారణ్యములో ఒక పెద్ద సింహము సంచరించుచుండెను, అది గ్రామస్థుల గొఱ్ఱెలను, మేకలను విశేషముగా చంపి తినుచుండెను. గొల్లవారలు గూడ బరిసెలు, కత్తులు, గండ్రగొడ్డళ్ళతో అజ సమూహమును సంరక్షించుచుండిరి ఒక్కరోజు

గ్రామముదగ్గఱ గొఱ్ఱెలమందను చేర్చి కొందరు నిద్రపోవక కాపలయుండిరి రాత్రి సమయమున సింహము గూడ దాపులోనే చిన్న పొదలో కనిపెట్టి కూర్చుండెను అత్తరి ఆ సింహము నిండుగర్భముతో కూడియుండెను గొల్లవారికి కొంచెము నిద్రపట్టుటచే నిశ్శబ్దముగా నుండుట చూచి సింహము గొఱ్ఱెల మందలోనికి దుమికిన వెంటనే వారు తెలుసుకొని పెద్ద ధ్వని చేసి ఆయుధముల పట్టుకొని దానిని తరుముటకు, చంపుటకు యత్నించినపుడు భయము గలిగి అది అచ్చటనే ప్రసవించెను కాపల యుండువార లందరున్ను అఱచుటచేత ఆ సింహము అడవిలోనికి పారిపోయెను సింహశిశువును గొల్లవారు ఎత్తుకొని గొఱ్ఱెపాలుబోసి పెంచుచుండిరి అదిన్ని గొఱ్ఱెలతో తిరుగుచు గొఱ్ఱెలవలె అఱచుచు, గొఱ్ఱెలవలె గడ్డిమేయుచు కొంతవరకు పెద్ద సింహము అగువరకు జీవించుచుండెను దాని యొక్క తల్లిసింహము అడవిలో కనుపెట్టియుండి యే విధమైనను తనబిడ్డ యగు సింహమును తనతో చేర్చుకొన వలెనని తలంచి తిరుగుచుండెను అదిన్ని గాక మృగరాజుగా నుండు తన బిడ్డ స్వల్పజంతువులగు గొఱ్ఱెలతో కలిసి తన కేసరిధర్మమును మరచియుండుట చూచి మనస్సులో జాలిగలిగి యుండెను

ఒకానొకప్పుడు గొల్లవారలు కొంచెము కునుకుపాటు గలిగియుండు సమయమున గొఱ్ఱెలమధ్య నిద్రించుచుండు తన సంతానమును పరుగెత్తి వచ్చి, యెత్తుకొని, అడివిలో చాలదూరము వరకు తీసికొని వెళ్ళెను గొల్లవారు గొఱ్ఱెలకు నష్టము కలుగనందుచే ఏమియు ఆర్భాటము చేయక మామూలుగానే యుండిరి సింహకిశోరము భయపడి గడగడ వణకుచు గొఱ్ఱెలవలె అఱుచుచుండెను, తల్లిసింహము ఓదార్చి, ప్రశాంత భావముతో తడవి తనతో చేర్చు కొన్నప్పుడు ఆ చిన్న సింహమునకు కొంతవరకు మనశ్శాంతి గలిగి భయము తగ్గిపోయెను అప్పుడు పెద్దసింహము తనబిడ్డ యని యెంత తెలిపినను ఆ చిన్న సింహము తెలుసుకొనలేకపోయెను తరువాత తనయొక్క జూలును చూపినను అది తెలుసుకొనలేదు అప్పుడు దానిని పట్టుకొని ఒక బావిదగ్గఱకు తీసుకొని వెళ్ళి నీటిలో తనయొక్క ప్రతిబింబమును చూపి, తరువాత బిడ్డయగు చిన్న సింహము యొక్క రూపమును చూపి, నేను నీయొక్క తల్లిననియు నీవున్ను నావంటి దానవనియు, మనము మృగరాజులమనియు, క్షుద్రజీవులగు గొఱ్ఱెలము కామనియు

ప్రబోధించి, తన తోకను, దానితోకను చూపుచు రంగులు, వక్షఃస్థలములు చూపి ఒక పెద్ద గర్జనముచేసి, తనబిడ్డచేతను అదే విధముగా గంభీరమగు గర్జనము చేయించెను అప్పుడు ఇదివరలో గొఱ్ఱెయని తలంచి యుండిన అది గొప్ప సింహమునను బోధము కలిగినదై అరణ్యములో మృగరాజుగా నిర్భయముగా గంభీరముగా నివసించుచుండెను జనులారా! ఇదే ఆత్మోద్ధరణము యొక్క రహస్యము

పై సింహమువలె శివరూపులై యుండు ఆత్మలుగూడ దేహేంద్రియాదులతో గూడి జాతి వర్ణాశ్రమములతో సంబంధించిన వారమని తలంచి శివత్వమును మరచి పశుత్వమునకు వచ్చిచేరినవి ఇప్పుడు ఆత్మజ్ఞానము గల బోధకుడగు గురువరేణ్యుడు తన సమానముగా నుండవలసిన ఈ జీవకోట్ల దీనావస్థను జూచి జాలిగలవాడై ఆత్మానాత్మ విచారణ చేయించి దేహేంద్రియ మనోబుద్ధులకు విలక్షణమై సాక్షియగు ఆత్మయే వారియొక్క నిజమైన స్వరూపమని ఉపదేశించి జీవబ్రహ్మల యైక్యము నుపదేశించవలెను, జీవేశ్వరుల ఉపాధిద్వయమగు అవిద్యా మాయోపాధులను తొలగించినప్పుడు శుద్ధాత్మ జ్ఞానమందు ఏకత్వమే గలుగును జహల్లక్షణా, అజహల్లక్షణా, జహదజహల్లక్షణా వృత్తులతో ముముక్షువులకు బోధించివారిని శుద్ధజ్ఞాన శివస్వరూపులుగా నొనర్చవలయును

**కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।**
**కార్యకారణతాం హిత్వా పూర్ణబోధో విశిష్యతే ॥**

మలినోపాధియగు కార్యోపాధియందు ప్రతిబింబించిన బ్రహ్మ చైతన్యము జీవుడనియు, శుద్ధోపాధియగు మాయయందు ప్రతిబింబించిన బ్రహ్మ చైతన్యము ఈశ్వరుడనియు చెప్పబడును జీవునియొక్క మలినోపాధియు, ఈశ్వరుని యొక్క శుద్ధోపాధియు తొలగించిన శుద్ధమగు బ్రహ్మస్వరూపమగు జ్ఞాన మొకటియే మిగులు చుండును దీనికే ఆత్మోద్ధరణమని పేరు

**జీవశ్శివ శ్శివోజీవ స్స జీవః కేవలః శివః ।**
**తుషేణ బద్ధో వ్రీహిస్స్యా త్తుషాభావేన తండులః ॥**

**ఏవం బద్ధస్తథా జీవః కర్మనాశే సదాశివః ।**
**పాశబద్ధస్తథా జీవః పాశముక్తః సదాశివః ॥**

జీవుడే శివుడు, శివుడే జీవుడు, ఆ జీవుడే సాక్షాత్ శివుడు పొట్టుచే గప్పబడినప్పుడు వడ్లగింజనియు, పొట్టుపోయిన వెంటనే బియ్య్య మగునట్లు కర్మచే కట్టుబడినవాడు జీవుడు, కర్మవిముక్తిచే సాక్షాత్ శివుడగును అని స్కందోపనిషత్తు దీనియందు పొట్టుతో కూడియుండు వరకు వడ్లనియు, పొట్టు పోయిన తరువాత బియ్యమగునట్లు ప్రకృతి కూడియుండు వరకు జీవుడనియు, ప్రకృతి నశించిన శివుడగుననియు తెలుపడమైనది పొట్టుతో కూడియుండు కాలమువరకు అది మొలకెత్తును, పొట్టుపోయిన మరల నది మొలవదు ఆలాగున మూల ప్రకృతి యుండువరకు జీవునకు జనన మరణములు వచ్చును దానినుండి విముక్తి పొందిన మరల జనన మరణము లుండవు జీవన్ముక్తి గలుగును

**సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమవివర్జితమ్ ।**
**బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్ ॥**

జాతివర్ణాశ్రమ రహితమై, సర్వసాక్షియైన పరమాత్మను బ్రహ్మమయముగా చూచువాడు స్వయముగా బ్రహ్మరూప మగును

**జన్మనా జాయతే శూద్రః సంస్కారేణ ద్విజోత్తమః ।**
**వేదాభ్యాసీ భవేద్విప్రో బ్రహ్మ జానాతి బ్రాహ్మణః ॥**

మానవులందరున్ను జన్మనా శూద్రులనియు, సంస్కారమువల్ల ఉత్తమద్విజుడగు నియు, వేదాభ్యాసము చేయుటవల్ల విప్రత్వము వచ్చుననియు, బ్రహ్మజ్ఞానము కలుగునప్పుడు బ్రాహ్మణు డగుననియు యతిధర్మము చెప్పుచున్నది భారత అనుశాసనిక పర్వము

**ఏకవర్ణమిదం పూర్వం విశ్వమాసీద్యుధిష్ఠిర ।**
**కర్మక్రియా విశేషణ చాతుర్వర్ణ్యం ప్రతిష్ఠితమ్ ॥**

భీష్ముడు దర్మరాజునకు ఉదేశించుచున్నాడు ఓ యుధిష్ఠిరా! మహారాజా! పూర్వము ఈ విశ్వమంతయు ఒకే వర్ణమగు ఆర్యజాతిచే నిండియుండెను.

కాలాంతరమున జనులయొక్క కర్మ క్రియల విశేషము వల్ల చాతుర్వర్ణ్యముగా చేయబడెను

**న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రహ్మమయం జగత్ ।**
**బ్రహ్మణా పూర్వసృష్టం హి కర్మభిర్వర్ణతాం గతమ్ ॥**

చాతుర్వర్ణ్యమున విశేషమేమియు లేదు వీరందరు నొకే బ్రహ్మజాతి గుణకర్మములచే చతుర్వర్ణములుగా ఏర్పడిరి ఆ గుణకర్మము లెట్టివో ఈ క్రింద నిరూపింపబడుచున్నవి, శాంతిపర్వము -

**బ్రహ్మక్షత్రియవిట్శూద్రాంశ్చతుర్వర్ణాన్ గుణాత్మకాన్ ।**
**విప్రశ్శుక్లో నృపో రక్తః పీతో వైశ్యోఽన్త్యజోఽసితః ॥**

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులను నాలుగు వర్ణముల వారును వారివారి గుణకర్మముల ననుసరించి విభాగింపబడిరి వారిలో తెల్లని వర్ణముగలవాడు బ్రాహ్మణుడును, ఎరువు వర్ణము గలవాడు క్షత్రియుడును, పసుపువర్ణము గలవాడు వైశ్యుడును, నలుపు వర్ణముగలవాడు శూద్రుడనియు తెలియందగినది

ఇచట వర్ణమనగా గుణమని గ్రహించవలయును కావుననే మూలమందు "చతుర్వర్ణాన్ గుణాత్మకాన్" అని ప్రయోగించడమైనది దేహ వర్ణము అప్రధానము

**విస్మృత్య ధర్మశాస్త్రే హి తేషాం కర్మ సమీరితమ్ ।**
**ఏకస్మిన్నేవ వర్ణేతు చాత్వురర్ణ్యం గుణాత్మకమ్ ॥**

ఈ నాలుగు వర్ణములవారి జన్మనా స్వభావకర్మములు ధర్మశాస్త్రమునందు ప్రసిద్ధము ఒక్కొక్క జాతియందు వారి గుణకర్మముల ననుసరించి నాలుగు వర్ణములు గలవు

**మోక్షధర్మేఽధికారిత్వసిద్ధయే మునిరభ్యధాత్ ।**
**న కర్మ దేవతాయోగ జ్ఞానకాండేష్వనుక్రమాత్ ॥**

శ్రీ వ్యాసముని మోక్షము కొరకు కర్మ, భక్తి యోగ జ్ఞానములను క్రమముగా విధించెను

**ప్రవర్తయతి తత్ కర్మ పరిపాకక్రమం విదన్ ।**
**ఋజవశ్శుద్ధవర్ణాభాః క్షమావంతో దయాళవః ॥**
**స్వధర్మనిరతా యే స్యుస్తే ద్విజేషు ద్విజాతయః ॥**

వారిలో వారివారి కర్మపరిపాకము ననుసరించి యొక్కొక్కరు బ్రవర్తించెదరు మనసా, కర్మణా, వాచా ఏకరీతిగా బ్రవర్తించువారును, సాత్త్వికగుణము గలవారును, క్షమావంతులును, దయాళుత్వము గలవారును, బ్రహ్మణ ధర్మమగు వేదాధ్యయనము తపోధ్యానాది బ్రహ్మవిద్యయందు ప్రవర్తించు వారెవరు గలరో వారు బ్రాహ్మణులయందు బ్రాహ్మణులు

**కామభోగప్రియాస్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః ।**
**త్యక్తస్వధర్మరక్తాంగాస్తే ద్విజాః క్షత్రతాం గతాః ॥**

బ్రాహ్మణులలో కామపరవశులై, భోగాసక్తులై, కఠిన స్వభావము గలవారై, క్రోధులై, సాహసులై, పై జెప్పిన బ్రహ్మకర్మ విడిచిన వారై రజోగుణము, ఎరుపువర్ణము గలవారు క్షత్రియు లైరి

**గోషు వృత్తిం సమాధాయ పీతాః కృష్యుపజీవినః ।**
**న స్వకర్మ కరిష్యంతి తే ద్విజాః వైశ్యతాం గతాః ॥**

పై జెప్పినవారిలో గోపరిపాలన వ్యవసాయములచే జీవించువారును, పసుపు వర్ణము గలవారును, తపస్సు వేదాధ్యయనాది బ్రహ్మకర్మములను జేయనివారు వైశ్యులైరి

**హింసాఽనృత ప్రియాక్షుద్రాస్సర్వకర్మోపజీవినః ।**
**న స్వకర్మ కరిష్యంతి తే ద్విజాః శూద్రతాం గతాః ॥**

మనసా, కర్మణా, వాచా ప్రాణిహింసకులై, అసత్యభాషణ ప్రియులై, నీచ దేవతోపాసకులై, వ్యవస్థ లేక అన్నిపనులు జేసి జీవించువారై తమోగుణము గలవారై, శౌచాచారాదులు లేనివారలు నల్లనివారలు బ్రాహ్మణులలో శూద్రులైరి

ఇచట బ్రాహ్మణ శబ్దమునకు ఇదివరలో నిరూపింపబడిన ఆర్యులని అర్థము గ్రహించుకొనవలయును

**ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తైరేవ తు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః ॥**

ఆత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు చెప్పువాడు ప్రకృతి సంబంధములగు గుణములతో గూడి యున్నప్పుడే అట్లుచెప్పబడును ఆ ప్రకృతిగుణముల నుండి విముక్తి గలుగునప్పుడు ఆ ఆత్మయే పరమాత్మయని వ్యవహరింపబడును

**త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।**
**స పూజ్యః సర్వభూతానాం వంద్యశ్చైవ మహామునిః ॥**

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది మూడింటిలో వెలుగుచుండు ఆత్మ ఒకటే యనియు, అదే తనయాత్మయనియు తెలిసికొనినవాడు సర్వభూతములచేతను పూజ్యుడున్ను, వందనీయుడున్ను మహాజ్ఞానియున్ను అగుచున్నాడని మాండూక్యోపనిషత్తు

**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యో శూద్ర శ్చండాల ఏవచ ।**
**దృఢాభ్యానకరో నిత్యం పునర్జన్మ న విందతి ॥**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాలురలో నెవరైనను దృఢముగా ఈ బ్రహ్యాభ్యాసము నిత్యము చేసెదరేని అతడు పునర్జన్మమును పొందడు, ముక్తుడగును.

**శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్ ।**
**క్షత్రియాజ్జాతమేవం తు విద్యా ద్వైశ్యా త్తథైవ చ ॥**

బ్రహ్మవిద్యానుష్ఠానముచే శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందుచున్నాడు అట్టి బ్రహ్మవిద్యానుష్ఠానములేనిచో, బ్రాహ్మణుడైనను శూద్రత్వమును బొందుచున్నాడు ఆలాగున క్షత్రియజాతియందు జన్మించినను లేక వైశ్యకులములో పుట్టినను పై జెప్పిన విధముగానే జరుగును అని మనువు చెప్పెను

**యధా జలం ధరావృష్ఠాత్ఖనన్నాప్నోతి మానవః ।**
**తధా త్వాం పూజయన్నిత్యం మోక్షమాప్నోత్యసంశయమ్ ॥**

ఏలాగున భూమిని త్రవ్వుటచేత మానవుండు జలమును పొందుచున్నాడో,

ఆలాగున మనుష్యుడు సర్వేశ్వర ధ్యానానుష్ఠానము నిత్యము చేయుటవల్ల మోక్షమును పొందుచున్నాడు దీనియందు సంశయము లేదు

భూమిపై నీరు కనబడనప్పటికిని నూతిని త్రవ్వువాడు ఉదకమును ఎట్లు పొందుచున్నాడో, ఆలాగున దేహమున ఆత్మ కనబడనప్పటికిని ధ్యానసమాధి నిష్ఠలో అంతర్ముఖములో ప్రవేశించువాడు అమృతత్వమును పొందుచున్నాడు ఈలాగున చేయుటవలన గలిగెడు దైవప్రాప్తి ఆత్మోద్ధరణ మనంబడును

**యధా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగా**
**స్సహస్రశః ప్రభవంతే సరూపాః ।**
**తధాఽక్షరాద్వివిధాః సోమ్యభావాః ప్రజాయంతే ॥**

ఈ ముండకోపనిషద్వాక్యమున్ను, ఈ జీవకోట్లన్నియు పరమాత్మ స్వరూపులనియేం తెలుపుచున్నది అది సదృష్టాంతముగా ఇచ్చట నిరూపింపబడుచున్నది ఏలాగున ప్రజ్వాలించుచుండెడు హోమకుండము నుండి సహస్రసంఖ్యలుగల అగ్నికణములు లేచుచుండునో, అవి అన్నియు ఒక్కే విధములైన అగ్నియంశములై యుండునో, ఆలాగున అక్షరస్వరూపుడగు పరమాత్మ నుండి అసంఖ్యాకములగు సమానరూపములగు జీవకోట్లు ఏర్పడుచున్నవి అవి త్రిగుణములచేత ఏలాగున విభిన్నరూపములగు చుండునో, ఆ వివరము ఈ కఠోపనిషత్ మంత్రము తెలుపుచున్నది

**అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో**
**రూపం రూపం ప్రతిరూపో బభూవ ।**
**ఏకస్తథా సర్వభూతా న్తరాత్మా**
**రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

ఏ విధముగా ఒక్కడైన అగ్ని ధాతువులను ప్రవేశించినదై ఎరుపు, నలుపు, పసుపు, తెలుపు మొదలగు ధాతువుల ననుసరించి ఆయా వర్ణముల ననుసరించిన రూపము గలదియగునో, అదేవిధముగా ఏకవిధమగు పురుషుడే సర్వభూతములకు అంతరాత్మయై వెలుపలనున్నూ ప్రతిరూపమును గూర్చి సమానమయిన రూపము

గలవాడాయెను

ధాతువులవగా మతాబును కాల్చుటకు తగిన గంధకాది పదార్థములని భావము పదార్థముల భేదముచే అవి అనేక రంగులుగా కనబడుచున్నవి

**ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా**
**స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

ఒక్కడున్ను, సర్వజగత్తు స్వాధీనముగా గలవాడును, సర్వభూతములకు అంతరాత్మ స్వరూపుడునునగు ఏయాత్మ శుద్ధవిజ్ఞాన ఘనస్వరూపుని అనేకవిధములు గలవానినిగా చేయుచున్నాడో, యే విశుద్ధాంతఃకరణము గలవారు స్వశరీర హృదయాకాశాంతర్గతమగు బుద్ధి గుహయందున్న ఆ యాత్మను చూచుచున్నారో, వారికే శాశ్వతమైన సుఖము కలుగును, ఇతరులకు కలుగదు

**నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం**
**ఏకో బహూనాం యో విదధాతి కామాన్ ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా**
**స్తేషాం శాన్తిశ్శాశ్వతీ నేతరేషామ్ ॥**

ఒక్కడగు ఏ పరమాత్ముడు, అనేకులకు వారివారి కర్మలకు తగిన ఫలము నిచ్చుచున్నాడో, ఆ పరమాత్ముడు అవినాశు లయినవాని లోపల నిత్యమైనవాడు, చైతన్యముగల బ్రహ్మాది స్తంబపర్యంతముగల ప్రాణులలోపల చేతనస్వరూపుడు, స్వశరీర హృదయాంతరాళమందు గల ఆ యాత్మను చిత్తైకాగ్రత గల యే ధీరులు చూచుచున్నారో, అట్టి వారికే నిత్యమయిన శాంతిసుఖము గలుగును ఇతరు లయినవారికి అట్టి శాశ్వతమైన శాంతిసుఖము కలుగదు

**ఆప్రోక్షిం ఖననం తథోపరిశిలాపాకర్షణం స్వీకృతిం**
**నిక్షేపః సమపేక్షతే న హి బహిఃశబ్దైస్తు నిర్గచ్ఛతి ।**

**తద్వద్బ్రహ్మవిదోపదేశమననధ్యానాదిభిర్లభ్యతే**
**మాయాకార్యతిరోహితం స్వమమలం తత్త్వం న దుర్యుక్తిభిః ॥**

భూమిలో ధనము పాతి పెట్టబడి యున్నదని తెలిసినప్పుడు, ఆ నిధి యెచ్చట నున్నదో, ధ్రువముగ జెప్పగల ఆప్తునివలన దెలిసికొని, ఆచోట త్రవ్వి పై మట్టిని దొలగించి ఱాళ్ళను పెళ్ళగించి, తీసివేసి, పిమ్మట ధనమును కనుగొని దానిని దీసికొనవలెను ఖననాది క్రియలను నోట నుచ్చరించిన మాత్రాన, అనగా నిచట నిధి యున్నదని యనుకొనిన నంత మాత్రమున నా నిధి లభింపదు, ఆ ప్రకారమే ఆత్మ వస్తువు లభింపవలెనననిన సద్గురూపదిష్ట మార్గమున ఆత్మానాత్మ వివేచన పూర్వకముగా పంచకోశములను శోధించి, మనన నిదిధ్యాసనాదుల వలన మాయా తత్కార్యములగు అహంకారాదులచే మాటుపడియున్న నిర్మలాత్మ తత్త్వమును గ్రహింపవలెను అని శంకర భగవత్పాదులు తెలిపిరి ఇదే ఆత్మోద్ధరణము యొక్క స్వరూపము

**ఘటమధ్యే యథా దీపో బాహ్యే నైవ ప్రకాశతే ।**
**భిన్నే తస్మిన్ ఘటే చైవ దీపజ్వాలా చ భాసతే ॥**
**స్వకాయం ఘటమిత్యుక్తం యథా జీవో హి తత్పదమ్ ।**
**గురువాక్యసమాభిన్నే బ్రహ్మజ్ఞానం ప్రకాశతే ॥**

ఘట మధ్యమందుండు దీపము బాహ్యమున, ఏలాగున ప్రకాశము లేక యుండునో, ఘటమును పగులగొట్టిన దీపమేలాగున బయటికి బాగుగా ప్రకాశించునో, ఆలాగున తన శరీరమే ఘటమనియు, జీవుడే తత్పదమగు బ్రహ్మప్రకాశమనియు, గురువుచే బోధింపబడిన మహావాక్యమను కర్రచే ఆత్మ కావరణమగు కుండను ధ్యాననిష్ఠచే బగులగొట్టిన బ్రహ్మజ్ఞానమగు పరంజ్యోతి ప్రకాశించును



# గూఢము

ఉపనిషత్తులలో, గీతలలో, యోగశాస్త్రములలో గూఢమనియు,

రహస్యమనియు, గోప్యమనియు, గుహ్యామనియు మొదలుగా గల పదము లనేకములు దొరకగలవు, ఈ పదములకు ఈ బ్రహ్మవిద్య, వేదవిద్య, యోగవిద్య, జ్ఞానవిద్య గూఢముగా నుంచవలసిన దనియు, ఎవరికిని చెప్పరాదనియు, ఎవరున్ను వినరాదనియు, ఎవరున్ను చూడరాదనియు, ఎవరికిన్ని చూపరాదనియు ప్రప్రథమమున ఎవరో కొందఱు అర్థమును వ్రాసిరి దాని ననుసరించి ఈవల అర్థము వ్రాసే వారందఱున్ను ఆలాగున చెప్పి వచ్చినందుచేత ఈ బ్రహ్మవిద్య గుప్తమైపోయినది అందువలన ప్రజాసామాన్యములో వ్యాపింపక పోవుటయే గాక సంకుచిత మయ్యెను అందువలననే వేదకాలములో, ఆర్షకాలములో, ఆర్యులకాలములో జనులకు గలిగియుండిన విజ్ఞానమున్ను, ఆత్మశక్తియు, దైవశక్తియు క్రమముగా లోపించుచు వచ్చెను అందువలననే ఋషుల కాలములో దేశము లన్నింటిలోను ఉన్నత స్థానమున నుండిన భారతదేశము క్రమముగా పతన మొందుటకు కారణ మయ్యెను ఇక భారతదేశము ఔన్నత్యమును పొందవలసియుండిన ఈ బ్రహ్మవిద్య, ఆత్మవిద్య, యోగవిద్య సర్వజనులకు అందుబాటులో నుండే లాగున నేర్పడవలసి యుందును అప్పుడే భారతదేశము స్వరాజ్య స్వారాజ్యములను రెండింటిలో ఔన్నత్యస్థితిని పొందగలుగును

**గీతలో "రహస్యం హ్యేతదుత్తమమ్" (గీ. 4-3)**

ఈ గీతాశాస్త్ర ముత్తమమైనది రహస్యమైనది

**"ఇదం తు తే గుహ్యతమమ్" (9-1)**

ఈ జ్ఞానము పరమ రహస్యమైనది

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥**

ఈ జ్ఞానము విద్యలలో రాజగుటచే రాజవిద్యయనియు, పరమ రహస్య మైనదియు, పావన మైనదియు, ఉత్తమ మైనదియు, అనుభవము వలన తెలిసికొనదగినదియు, అనుష్ఠించుటకు మిక్కిలి సులభ మైనదియు, ధర్మముల న్నిటికిని మూలమైనదియు, నాశరహిత మైనదియునై యున్నది ప్రజలలో రాజు యేలాగున అధికుడో, విద్యలన్నిటిలోను ఈ బ్రహ్మవిద్య రాజగుట చేత

రాజవిద్యయని చెప్పడమైనది

**" గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్" (11-1)**

పరమరహస్యమైనదియు, అధ్యాత్మజ్ఞానమను సంజ్ఞగలదియు,

**"ఇతి గుహ్యతమం శాస్త్రమ్" (15-20)**

అతి రహస్య మైనదియునగు అధ్యాత్మ జ్ఞానశాస్త్రము

**" ఇది తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా" (18-63)**

ఈ జ్ఞానశాస్త్రము రహస్యము లన్నిటిలోను పరమ రహస్యమగు జ్ఞానము మీ కొఱకు చెప్పబడినది

**" సర్వ గుహ్యతమం భూయః శృణుమే పరమం వచః" (18-64)**

రహస్యము లన్నిటిలో నతి రహస్య మైనదియు శ్రేష్ఠమైనదియునగు నాయొక్క వాక్యమును మరల వినుము

**య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥ (18-68)**

ఎవడు ఈ పరమరహస్యమైన గీతాశాస్త్రమును నా భక్తులకు చెప్పుచున్నాడో వాడు సంశయరహితుడై నా యందు సర్వోత్కృష్టమైన భక్తిని చేసినవాడై నన్నే పొందగలడు దీనియందు సందేహము లేదు

**వ్యాస ప్రసాదాచ్ఛ్రుతవానేత ద్గుహ్యతమం పరమ్ ।**
**యోగం యోగీశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కధయతస్స్వయమ్ ॥**
**(18 75)**

నేను॥ శ్రీ వేదవ్యాస మహర్షియొక్క యను గ్రహమువలన అతి గోప్యమైనదియు శ్రేష్ఠమైనదియునగు ఈ యోగశాస్త్రమును యోగీశ్వరుడగు శ్రీ కృష్ణభగవానుడు స్వయముగా అర్జుననకు చెప్పుచుండగా వింటిని

శాస్త్రములలో గల యీలాటి గోప్యరహస్య నిగూఢ వాక్యముల నిజార్థమును

తెలిసికొనక పోవుటే భారతదేశపతనమునకు కారణమైనదని ఇదివరలోనే తెల్పుపడమైనది అందుచేతనే బ్రహ్మాస్త్రము, ఆగ్నేయాస్త్రము, వారుణాస్త్రము నాగాస్త్రము, సమ్మోహనాస్త్రము మొదలగు అస్త్రముల పేర్లు మాత్రము నిలిచిపోయి ప్రస్తుతము ఎవరికిన్ని వాటియొక్క నిర్మాణము తెలియక పోవుటకు కారణమైనది ఆలాగున పూర్వకాలము విరివిగానుండిన ఆకాశవిమానము యొక్క నిర్మాణము నశించిపోవుటకు హేతువైనది అదేరీతిగా భూగర్భశాస్త్రములలో గల రత్నాది ఖనిజముల యొక్కయు, నిధులయొక్కయు జ్ఞానము జనులలో శూన్యమైపోయినది కట్టకడకు భూమియందుగల జలముయొక్క జ్ఞానమైనను తెలియని దీనావస్థకు దేశము జారివచ్చినది అందువలననే గదా ఎంతయో ధనము వ్యయము చేసి బావి త్రవ్వినను నీరు లభించక జనులు సంకటపడు చున్నారు! మఱియు వర్షాభావకాలమున యజ్ఞముచేసి ఋషులు సమృద్ధిగా వర్షము కురిపించే వారలు అట్టి జ్ఞానమున్ను లుప్తమై పోయినందుచే గదా కాటకములచే అనేక జనులు తపించవలసి వచ్చినది! గూఢము రహస్యము యొక్క స్థితి మానవులను ఇంత దీనావస్థకు తీసుకొనివచ్చెను పై జెప్పిన శాస్త్రములన్నియు సంస్కృత భాషలో నుండుటవలన గీర్వాణభాష అందరికిన్ని చదువుట కవకాశము గలుగజేయని మహాపరాధమే ఈ యాపత్తు లన్నిటికిన్ని మూలకారణ మైనది కావున సంస్కృతభాషను సర్వజనులు చదివే అవకాశము గలుగజేసిపుడే ఈ దురితములు, అరిష్టములు క్షయించి జీవులు ఇహపరసుఖములను పొందగలరు పై నిరూపించిన గూఢ, గోప్య, రహస్య పదములయొక్క అర్థము క్రింద నిరూపింపబడుచున్నది దీనిని గ్రహించిన గూఢ రహస్య గోప్య శబ్దముల అర్థమును జనులు తెలిసికొనగలరు కఠోపనిషత్తు -

**ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥**

ఈ యాత్మ సర్వభూతములయందు గోప్యముగా నున్నందుచే కానుపించుటలేదు అయితే సూక్ష్మబుద్ధిగల జ్ఞానులయొక్క ఏకాగ్రతగల మనస్సుచే అయ్యది కానుపించుచున్నది ఏకాగ్ర బుద్ధియు హృదయనిర్మలత్వమున్ను

లేనికారణముచే ఈ యాత్మవస్తువు (ఈశ్వర స్వరూపము) కనుపడుటలేదను నర్థము స్పష్టమగుట లేదా? ఇకను అనేక దృష్టాంత దార్ష్టాం తములతో నీ విషయమునే కఠోపనిషత్తు నిర్ణయించు చున్నది

**తిలేషు తైలం దధినీవ సర్పిరాపస్స్రోతస్స్వరణీషు చాగ్ని:।**
**ఏవమాత్మని గృహ్యతేఽసౌ సత్యేనైనం తపసా యోఽనుపశ్యతి ॥**

నువ్వులయందు నూనెవలెను పెరుగునందు నేయివలెను, భూగర్భమందు జలమువలెను, అరణులందు అగ్నివలెను తనయం దీయాత్మ నిగూఢమై యున్నది దానిని సత్యము చేతను, తపస్సు చేతను మనుజుడు గాంచగల్గుచున్నాడు

నువ్వులు కనుపడుచుండునే గాని నూనె కనుపించుటలేదు అయితే గానుగలో పోసి ఆడుటవలన నూనె యేలాగున ప్రత్యక్ష మగుచున్నదో, పెరుగు కనపడునే గాని దాని యందుగల నవనీత మేలాగున తరచనిచో కానుపించుటలేదో, భూమిలోపల జలధారలున్నను నూయి త్రవ్వనిచో జలమెట్లు లభించుట లేదో, అరణియందు అగ్ని యుండినను మధించనిచో నిప్పు ఏలాగున బయలుపడజాలదో ఆలాగున సమస్త చరాచర ప్రాణికోట్ల యందును ఈ యాత్మ(ఈశ్వరస్వరూపము) నిగూఢమై యున్నప్పటికిన్ని సత్యము, తపస్సు లేనికారణముచే కనుపించుట లేదు సత్యతపస్సులు గలవా రెవరైనను ఈ యాత్మను, లేక ఈశ్వరస్వరూపమును చూడగలరు అరణియనగా చెకుముకిరాయి అగ్గిపుల్లను కనిపెట్టుటకు ముందు అరణి నుండియే నిప్పును తీయుచు వచ్చిరి ఇది రావి, అత్తి, జువ్వి మొదలైన బాగుగా ఎండిన మెత్తని కర్రలను రంధ్రముచేసి దానిపై కదురునుంచి తఱచునపుడు అగ్నికణములు పుట్టుచుండును దానిని దూదిలోపెట్టుకొని నిప్పును చేయుచుండిరి అయితే కర్ర బాగుగా ఎండనిచో ఎంత తఱచినను అగ్ని ఆవిర్భవించదు ఆలాగున సత్య తపస్సులచేత చక్కగ ప్రకృతి దోషము నశించనివారు ఎంత ధ్యానము చేసినను జ్ఞానాగ్ని ప్రజ్వలింపజాలదు ఇదే దీనిలో గల రహస్యము

ఇప్పుడు గూడ యజ్ఞాదిక్రతువులకు అరణినుండియే నిప్పు తీసెదరు అది పురాతన పద్ధతి ననుసరించి యేర్పడినది నువ్వులాడించువారు, పెరుగు తఱచువారు, నూయి త్రవ్వువారు, అరణిని మధించువారు, స్త్రీలైనను, పురుషులైనను,

బ్రాహ్మణులైనను, అబ్రాహ్మణులైనను, సంన్యాసులైనను, గృహస్థులైనను, వెయ్యేల, మనుష్య మాత్రు లెవరైనను, దానియొక్క ఫలమును ఎట్లు పొందగలరో, ఆలాగున సత్యతపస్సులచేత హృదయమును మథించు వారెవరైనను తనలో గల ఆత్మను (దైవమును) దర్శింపగలరు కావుననే శ్లోకాంతమున "యోఽను పశ్యతి" ఎవడైనను చూడగలడని ఉపనిషత్తు తన యనుభవమును నిర్భయముగా నుద్ఘోషించుచున్నది దేవర్షియగు నారదుడున్ను, బ్రహ్మర్షులగు వసిష్ఠభృగు అగస్త్యాదులున్ను, రాజర్షులగు విశ్వామిత్ర జనకాదులున్ను, తులాధారాదులున్ను, మహాఋషులగు సూత ఉద్ధవ విదురాదులున్ను, పరమర్షులున్ను, కిరాతకులలో వాల్మీకి మహర్షులున్ను సత్యతపస్సులవలన ఆత్మను దర్శింప గలిగిరి వీరిలో నారదుడు దేవర్షులకున్ను, వసిష్ఠాదులు బ్రాహ్మణులకును, విశ్వామిత్రాదులు క్షత్రియులకును, తులాధారాదులు వైశ్యులకును, సూతాదులు శూద్రులకును, వాల్మీక్యాదులు కిరాతులకును, సంబంధించినవారు, ఆలాగున స్త్రీలలోను మైత్రేయి, సులభ,శార్జ్గి, శాండిలి, తపస్విని, విశ్వవర, కాత్యాయని, చూడాల, మదాలసాదులున్ను సత్యతపస్సులచే మథించి ఆత్మను(అమృతమును) పొందిరి వీరిలో సులభాయోగిని మైత్రేయ్యాదులు సంన్యాసాశ్రమములోను, శార్జ్గి, శాండిల్యి, తపస్విని మొదలగువారు వాన ప్రస్థాశ్రమములోను, మదాలస చూడాల మొదలైనవారు గృహస్థాశ్రమములోను, గార్గి బ్రహ్మచర్యాశ్రమములోను ఉండిరి గార్గి చరిత్రము బృహదారణ్య, ఛాందోగ్యాద్యుపనిషత్తులలోను, మైత్రేయిచరిత్రము బృహదారణ్యములోను, చూడాలచరిత్రము యోగవాసిష్ఠములోను, సులభాయోగిని చరిత్రము మహాభారతములోను కనుగొనగలరు ఇందువలన స్త్రీలకు బ్రహ్మచర్యాశ్రమమునకు సంన్యాసాశ్రమమునకు వేదాధ్యయనమునకును అర్హత కలదా, లేదా యను సంశయగ్రస్తుల సందేహము నివృత్తి కాగలుగును ఆత్మమథనము ఏలాగున చేయవలయునో ఆ విషయమై ఉత్తరగీత తెలిపినది చూడుడు

**ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।**
**ధ్యాననిర్మథనాభ్యాసాదేవం పశ్యేన్నిగూఢవత్ ॥**

ఆత్మను క్రింది అరణిగాను, ప్రణవరూపమగు పరమాత్మను మీదుగానుండు

అరణిగాను చేసి ధ్యానమనెడు నిర్మధనాభ్యాసముచేత అతి గూఢమై వర్తించునట్టి పరమాత్మను చూడవలయును

జ్ఞాననిర్మధనాభ్యానమనియు, ధ్యాననిర్మధనాభ్యానమనియు పారాంతరముగలదు జ్ఞానమనెడు స్థలమున ఆత్మానాత్మవిచారణ జ్ఞానమనియు, ధ్యానమను స్థలమన ధారణా ధ్యానసమాధులనియు గ్రహించుకొనవలెను

మరియు ఆత్మ లేక బ్రహ్మము ఏలాగున నిగూఢమై యుంటున్నదో దానిని ఉత్తరగీతలో శ్రీ కృష్ణభగవాను డుపదేశించినది చూడుడు

**తిలమధ్యే యధా తైలం క్షీరమధ్యే యధా ఘృతమ్ ।**
**పుష్పమధ్యే యధా గంధః ఫలమధ్యే యధా రసః ॥**
**కాష్ఠాగ్నివత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్ ॥**

నువ్వులయందు నూనెవలెను, పాలయందు నేయివలెను, పుష్పమునందు సువాసనవలెను, ఫలమునందు రసమువలెను, కట్టెలందు నిప్పువలెను, ఆకసమునందు గాలివలెను ఈ యాత్మ శరీరమునందు నిగూఢమై ప్రకాశించి చలించుచున్నది తిలమును గురించియు, క్షీరమును గురించియు ఇదివరలో తెలుపడమైనది పుష్పమే కనుపడుచున్నది గాని దానియందు గల సుగంధము కానుపించుటలేదు సుగంధమును? తీయుప్రకారము తీయుటచేతనే అత్తరు, పన్నీరు మొదలగు సుగంధ ద్రవ్యములు గోచరించుచున్నవి ఆలాగున పండ్లు కనపడు చుండునేగాని రసము కనుపించుట లేదు అదియును తీయవలసిన ప్రకారము తీయునవుడు బత్తాయి నిమ్మ మొదలగువాటి నుండి ఫలరసమును వేరుపరచుచున్నారు, కఱ్ఱయందు నిప్పును గురించి చెప్పినది ఇదివరలో నిరూపించి అరణియని గ్రహించుకొనవలయును ఆలాగున వాయువు గోచరించుచుండునేగాని, ఆకాశము గోచరించుటలేదు అయినను శబ్దముచేత ఆకాశ మేలాగున గ్రహించబడుచున్నదో, పరమాత్మయు ఇదేలాగున అందరి శరీరములోను ప్రకాశించుచున్నదని గ్రహించుకొనవలయును, ఇదే రహస్య పదము యొక్క అర్థమని గ్రహించేది అమృత బిందూపనిషత్తు తెలిపినది చూడుడు-

**గవామనేకవర్ణానాం క్షీరస్యా ప్యేకవర్ణతా ।**
**క్షీరవత్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యధా ॥**

గోవులు తెలుపు, ఎరుపు, నలుపు, పొట్టి, పొడవు గలవైనను పాలు ఏలాగున అన్నిటిలోను ఒకేవిధముగా గూఢముగా తెలుపు రంగు గలిగియుండునో ఆలాగున మానవులు అనేక వర్ణ ఆశ్రమములతో కూడియుండినను పరమాత్మ అందరిలోను ఒకేవిధముగానే గూఢముగా వెలుగుచున్నది గోవులు కనబడుచుండునవే గాని, పాలు ఏలాగున కానుపించుటలేదో, ఆలాగున దేహములు గోచరించుచున్నవే గాని, దేవుడు గోచరించుట లేదు ఏలన గోప్యముగా నుండుటవలన అయితే ఏలాగున పాలను పితుకునపుడు అందరికిని స్పష్టముగా గోచరించుచున్నదో ఆలాగున సత్య తపస్సు గలవారందరును పరమాత్మను చూడగలరు, ఇకను అమృతబిందూపనిషత్తు చెప్పినది చూడుడు :-

**ఘృతమివ పయసి నిగూఢం భూతే భూతే చ వసతి విజ్ఞానమ్ ।**
**సతతం మనసి మధయితవ్యం మనోమంధానుభూతేన ॥**

క్షీరమందు ఘృతమువలె సమస్త ప్రాణులలోను పరమాత్మ నిగూఢమై వెలుగుచున్నది పాలను తరచి వెన్నతీయునట్లు ఆత్మానాత్మ విచారణ జ్ఞానముచేతను, ధ్యానమధనముచేతను ఎవడు హృదయమును తఱచునో వాడు పరమాత్మను చూడగలుగును, విజ్ఞానమును పొంద గలుగును

**నాహం ప్రకాశస్సర్వస్య యోగ మాయాసమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥(7- 25)**

ఆత్మ అన్నిటిలోనుండియు ఏల గోచరించుటలేదో దానికి కారణము ఇచ్చట నిరూపించడమైనది నేను యోగమాయచే కప్పబడిన వాడనై సమస్త జనులకున్ను ప్రకాశించువాడను కాను ఆత్మజ్ఞానము లేని యీ జనము జన్మరహితుడై నట్టియు, నాశరహితుడై నట్టియు నన్ను ఎరుగజాలదు

భగవన్మాయచే ఆచ్ఛాదింపబడినందుచే పరమాత్మను చూడజాలక యున్నారు ఒరలో ఆచ్ఛాదింపబడిన ఖడ్గము కనుపించక పోయినను,

ఒరతీసివేయునపుడు స్పష్టముగా కనుపించునట్లు పంచకోశములచే నీయాత్మ ఆచ్ఛాదింపబడి యున్నది భగవత్కృపగలిగి మాయ తొలగునపుడు అందరును దర్శింపగలరు పంచకోశముల విచారణచే సాక్షియగు ఆత్మను తన స్వరూపముగా నెఱుంగగలరు ఇదే రహస్యమను దానికి అర్థమని గ్రహించేది

**యతన్తో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్ ।**
**యతంతోఽ వ్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః ॥ (15-11)**

జ్ఞానసిద్ధికొరకు యత్నించుచున్న ధ్యానయోగానుష్ఠానవరులు తమయందున్నట్టి ఈ యాత్మను చూచుచున్నారు ఆత్మసంస్కారము లేని వారున్ను అంతఃకరణశుద్ధి లేనివారున్ను మోక్షాపేక్షయందు ప్రయత్నము చేయువారివలె నుండినను ఈ యాత్మను చూడజాలరు

ఒకడు సారవంతమైన భూమిని శుద్ధపరచి మంచి విత్తనములను విత్తి బాగుగా పండించినాడు అదే భూమి ప్రక్కన మరియొకడు బాగుగా దున్ని పైవాడు పెట్టిన విత్తనమునే పెట్టినాడు కాని చవిటి భూమి అగుటచే పండకపోయెను ఆలాగున పరమపవిత్రమగు సాధువుల వేషము వేసినను, పావననామమును ధరించినను ఆత్మసంస్కారము, హృదయశుద్ధియులేనిచో జ్ఞానమును పొందజాలడు ఆత్మ సంస్కారమనగా , గీత 13 వ అధ్యాయమున చెప్పిన అమానిత్వాది జ్ఞానమునకు అన్యమగు ప్రకృతిగుణముల రహిత మొనర్చుటయే యగును అచేతస్సనగా హృదయమును నిర్మలముగా నుంచక పోవుటయే యగును కావున "అకృతాత్మాన,అచేతసః" అను రెండు పదములను భగవానుడుపయోగించెను ఇదియే జిజ్ఞాసువులు మిక్కిలి జాగరూకతతో సదా జ్ఞాపక ముంచుకొనదగినది ఆత్మ బోధమున శంకరభగవత్పాదు లుపదేశించినది చూడుడు -

**వపుస్తుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యవఘాతతః ।**
**ఆత్మానమాంతరం శుద్ధం వివిచ్యాత్తండులం యథా ॥**

అన్నమయాది కోశములతో కూడుకొన్నవాడును దేహము వలెనే దోచువాడును, శరీరాంతర్గతు డైనవాడును, నిర్మలుడునైన సత్యజ్ఞానానంద

స్వరూపుని, పొట్టు తవుడు మొదలగు వానితో కూడుకొన్నటువంటి బియ్యమును ఏ తీరున దంచి వేరుపరచెదరో ఆలాగున ధ్యాన జ్ఞాన ఉపాయములచేత వేఱు పరచి తెలుసుకొనవలసినది

**నిషిధ్య నిఖిలోపాధీన్ నేతి నేతీతి వాక్యతః ।**
**విద్యాదైక్యం మహావాక్యైర్జీవాత్మపరమాత్మనోః ॥**

కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వాది రూపోపాధులను ఇదికాదు, ఇది కాదు అను వేదవాక్యమువల్ల త్రోసివేసి జీవాత్మ పరమాత్మల యొక్క ఐక్యము మహావాక్యములచేత తెలుసుకొనదగినది

**ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥**

ఆత్మ సర్వపరిపూర్ణవస్తువని ఎల్లప్పుడు చేయబడిన సంస్కారము దివ్యరసాయనము వ్యాధులను పోగొట్టు క్రమముననే అజ్ఞానమును నశింపజేయుచున్నది

ఔషధమునకు సరియైన పథ్యముకూడా నుండవలెనను విషయమును, ముముక్షువులు మరువకూడదు అదే యిప్పుడుగల ప్రమాదమునకు కారణము

**ఏవమాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే ।**
**ఉదితాఽవగతి జ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥**

అంతఃకరణమనెడి అరణియందు ధ్యానమనెడి చిలుకడము ఎల్లప్పుడు చేయగా నుదయించిన జ్ఞానమనెడి జ్వాల సమస్తమైన అజ్ఞానమనెడు కట్టెలను కాల్చి వేయును

మానవునకు సామాన్య జ్ఞానమనియు, విశేష జ్ఞానమనియు రెండు విధముల జ్ఞానములు గలవు, సామాన్యజ్ఞానము దృశ్యజ్ఞాన మనబడును విశేష జ్ఞానము ఆత్మ జ్ఞానమగును దీనివలననే అజ్ఞానము నశించును, కొయ్యయందు నిప్పు అంతట వ్యాపించియుండినను అది కర్రను దహింపజేయజాలదు అట్టి కర్రలో

గల అగ్ని అంశమే కర్రను మధించునపుడు ప్రజ్వలించు అగ్ని కర్రను కాల్చునట్లు, జ్ఞానాగ్ని వలన అజ్ఞానము సంపూర్ణముగ నశించును ఈ విషయమై పైన నిరూపించిన అరణినిగురించి తెలుసుకొన వలయును

**తద్వ్యక్త మఖిలం వస్తువ్యవహారశ్చిదన్వితః ।**
**తస్మాత్సర్వగతం బ్రహ్మ క్షీరే సర్పిరివాఖిలే ॥**

సమస్తమైన పంచ భూతాత్మక ప్రపంచము ఆ యఖండానంద బ్రహ్మముతో చేరియున్నది లౌకిక వ్యవహారమును జ్ఞానస్వరూపాత్మతో జేరి యున్నది అందువలన బ్రహ్మము సమస్తమైన పాలయందు నేయివలెనే అంతట వ్యాపించియున్నది

ఇదే నిగూఢము యొక్క అర్థము

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్ ॥**

ఆత్మజ్ఞానమను నేత్రముగలవాడు సమస్తమందు వ్యాపించి యుండు సచ్చిదానంద స్వరూపాత్మను చూచుచున్నాడు దేహములే ఆత్మయను అజ్ఞాన నేత్రము గలవాడు ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాడు వలెనే చూడకపోవుచున్నాడు

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యజ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ సచ్చిదానంద స్వరూపముయొక్క ఆదాయము కంటే వేఱే యధికమైన ఆదాయము లేదో, ఏ బ్రహ్మముయొక్క ఆనందము కంటే వేఱే యధికమైన ఆనందము లేదో, ఏ బ్రహ్మయొక్క సాక్షాత్కార జ్ఞానము కంటే వేఱే యధికమైన సాక్షాత్కార జ్ఞానము లేదో అది సర్వ పరిపూర్ణ బ్రహ్మమని గ్రహించవలెను

మఱియు ఈశ్వరుడు ఏలాగున అంతర్యామియై గూఢముగా నుంటున్నాడో ఆ విషయమై శాస్త్రములు తెలిపినది చూడుడు దీనివలన గూఢ, రహస్య శబ్దములు స్పష్టముగా సామాన్యులకు సహ అర్థము గాగలవు.

**యథా తిలగతం తైలం గూఢం తిష్ఠతి సర్వదా ।**
**తథా త్వం సర్వలోకేషు గూఢస్తిష్ఠసి శంకర ॥**

ఏలాగున తిలలయందు తైలము గూఢముగా ఎల్లప్పుడున్ను ఉంటున్నదో, ఆలాగున ఓ సర్వేశ్వరా! నీవున్ను సర్వభూతములయందును గూఢముగా నుంటున్నావు

**యథా దధిగతం సర్పిర్నిగూఢత్వేన సంస్థితమ్ ।**
**చరాచరేషు భూతేషు తథా త్వం దేవ సంస్థితః ॥**

ఏలాగున దధియందు ఘృతము గూఢముగా స్థితిగలిగి యుండునో, ఆలాగున చరాచర భూతములయందు ఓ పరమేశ్వరా నీవున్ను రహస్యముగా స్థితి గలిగియున్నావు

**యథా జలం ధరాంతః ఖననాదాప్నోతి మానవః ।**
**తథా త్వత్పూజయా నిత్యం మోక్షమాప్నోత్యసంశయః ॥**

ఏలాగున మానవుడు భూమిని త్రవ్వుటచేత జలమును పొందుచున్నాడో, ఆలాగున ఓ సర్వేశ్వరా ! నీ యొక్క జపధ్యాన పూజాదులచేత మనుజుడు మోక్షమును పొందుచున్నాడు

ఇక ఈ విషయమై గూఢము రహస్యము, గోప్యము, గుప్తము అను పదములకు ప్రత్యేక ప్రత్యేకముగా అర్థము వ్రాయ పనిలేదని తలంచెద, ఈ లాటి పదములు గల శ్లోకములు శ్రుతి, స్మృతి పురాణ, ఇతిహాసాదులందు అనేకములు గలవు అవన్నియు వ్రాయబూనిన గ్రంథవిస్తారమేగాని ఫలమంతయు నొకటియే, అంతేగాదు అది చర్వితచర్వణమే యగును పదములు మాత్రము మార్పుగా కనపడుచున్నవే గాని అర్థమంతయు నొకటే యగుటవలన నిచట చేర్చబూనలేదు స్థాలీపులాక న్యాయానుసారముగా విజ్ఞులకు ఇంతే చాలునని తలంచడమైనది

**న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।**
**మంథనేన యథా క్షీరాన్నవనీతం ప్రజాయతే ॥**

**మర్దనాదిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।**
**తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥**

శరీర సౌఖ్యమును మాత్రము కోరియుండు వారికి పుణ్యము లభించదు అది శరీరపరిశ్రమ గలవారికి మాత్రమే లభించును ఎట్లన పెరుగును తఱచనిచో వెన్న యేలాగున బయలుదేరజాలదో, చెఱకును గానుగలో పెట్టి ఆడుటచేత మాత్రమే రసము లభించునో, ఆలాగున వ్రతానుష్ఠాన తపస్సుచేతనే మానవుడు తనలో వెలుగుచుండు ఆత్మను (అమృతమును, మోక్షమును) పొందగలుగును ఇచట శరీరేంద్రియములను కృశింపజేసెడు తపస్సనిగాని, వ్రతమనిగాని తలంచవలదు బ్రహ్మవిచారణకున్ను, ధ్యానానుష్ఠానములకున్ను అనుకూలమగుస్థితిలో దేహేంద్రియముల నుంచుటయే జ్ఞానతపస్సని తెలియదగినది అట్లుకానిచో అది కర్మతపస్సే యగును గీతలో శ్రీ భగవాను డుపదేశించినది చూడుడు

**వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ (4-10)**

అనేకులు జ్ఞానమనెడు తపస్సుచేత పరిశుద్ధాత్ములై నన్నాశ్రయించినవారై నాయొక్క స్వరూపస్థితి గలవారగుచు రాగము, భయము, క్రోధము లేనివారై నా భావమును పొందినవారైరి (భగవన్మయులైరి)

ఓం తత్సత్



# బ్రహ్మవిద్యయొక్క గొప్పతనము

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**
**యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ।**
**తం హ దేవమాత్మ బుద్ధి ప్రకాశం**
**ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ॥**

ఏ పరమాత్మ ప్రపంచ సృష్టికి ముందు చతుర్ముఖబ్రహ్మను సృజించి, ఆ బ్రహ్మదేవునికి వేదము లుపదేశించెనో , అట్టి స్వయం ప్రకాశకుడును, ఆత్మబుద్ధి యందుండి సర్వేంద్రియములను ప్రకాశింప జేయువాడును అగు ఆ పరమాత్మను ముముక్షువగు నేను శరణుపొందుచున్నాను ఈ వేదమంత్రమువలన బ్రహ్మ విద్యయొక్క గొప్పతనము గ్రహించుకొనవచ్చును ఇదేరీతిగా బ్రహ్మవిద్యా గురుపరం పరలోను కానుపించుచున్నది

నారాయణం పద్మభువం వసిష్ఠం
శక్తిం చ తత్పుత్రపరాశరం చ ।
వ్యాసం శుకం గౌడపదం మహాంతం
గోవింద యోగీంద్రమధాస్య శిష్యమ్ ॥
శ్రీ శంకరాచార్య మధాస్య పద్మ
పాదం చ హస్తామలకం చ శిష్యమ్ ।
తం త్రోటకం వార్తికకారమన్యా
నస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥

దీనియందును శ్రీ మన్నారాయణుండు బ్రహ్మదేవునికిన్ని, బ్రహ్మదేవుడు వసిష్ఠ, శక్తి, పరాశర, వ్యాస, శుక, గౌడపాద, గోవింద యోగీంద్ర, శంకరాచార్య ప్రభృతులకు పరంపరగా నుపదేశించుచు వచ్చినట్లు గోచర మగుచున్నది దీనిని బట్టి చూచినను బ్రహ్మవిద్య యెంత ప్రభావము గలదో గ్రహించదగును శ్రీ గౌతమబుద్ధుడు ఈ పరమనిర్వాణమునే పాదచారియై పల్లె పల్లెలోను, గ్రామ గ్రామములోను, పట్టణ పట్టణములోను ప్రబోధించెను బుద్ధుడు రారాజు యొక్క ఏకకుమారుడు, నారాయణుని యొక్క నవమావతారుడు ఆలాగున ఈశ్వరపుత్రు డనబడు శ్రీ యేసుక్రీస్తు పట్టణ గ్రామ పల్లెటూరులలో, కాలినడకతో సంచరించుచు జనసముదాయమునకు బోధించెను అదేరీతిగ మహమ్మదునబిగారు కాలినడకతోనే పట్టణము, గ్రామము, పల్లెటూరులలో నీ బ్రహ్మవిద్యను జనసముదాయమునకు తెలిపెను, శ్రీ బుద్ధుడు భారతదేశమందున్ను, శ్రీ యేసుక్రీస్తు పశ్చిమ దేశమందున్ను, శ్రీ మహమ్మదునబి అరేబియా దేశమందున్ను జన్మించిరి, బౌద్ధమతముయొక్క

చిహ్నమునే జపాన్ మొదలయిన చక్రవర్తులు శిరసావహించుచున్నారు శ్రీ యేసు క్రీస్తు యొక్క చిహ్నమునే ఇంగ్లాండు మొదలగు దేశములలో గల చక్రవర్తులు శిరోభూషణముగా చేసుకొనిరి ఆలాగున మహమ్మదునబియొక్క గుర్తునే ముస్లింమహారాజులు మస్తకమున భక్తితో ధరించుచున్నారు ఇకను చైనాదేశ మతోద్ధారకుడగు శ్రీ కాంఫ్యూషియస్సున్ను, గ్రీకుమతోద్ధారకులగు శ్రీ సోక్రటీసు మొదలగు ననేకులు ప్రవక్తలున్ను ప్రపంచములో వారి వారి మతములను ప్రబోధము చేసిరి

మానవ సముదాయ మంతయు నేదోయొక మతకర్తల ననుసరించియే యుంటున్నది వారందరున్ను దివ్యపురుషులే మహామహా పండితులును, చక్రవర్తులందరను వీరి ననుసరించి యుండుటవలన బ్రహ్మవిద్యయొక్క మహిమాతిశయము యేమని చెప్పవచ్చును? ఇక ఈశ్వరావతారమని పొగడబడుచున్న శ్రీ శంకరాచార్యులున్ను, ఆదిశేషావతారమని స్తుతింపబడుచున్న శ్రీ రామానుజాచార్యులున్ను, అంజనేయావతారమని స్తోత్రము చేయబడుచున్న శ్రీ మధ్వాచార్యులున్ను, ఎంత దివ్యపురుషులో! వీరియొక్క యనుయాయులే అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత మతస్థులందరున్ను భారతదేశములో నీ ముగ్గురున్ను ముఖ్యులు ఇకను శ్రీ గురునానక్ మొదలగు ప్రవక్తలు కూడా కొందరు గలరు వారిని కూడ ఆయా మత సంప్రదాయులు దివ్యపురుషులుగానే తలంచుచున్నారు వారివారి కాలములలో నీ బ్రహ్మ విద్య యెంత యుచ్చస్థానములో నుండినదో యోచించదగినది, కాలక్రమముగా దీనిని జనసముదాయమునకు విరివిగా బోధించెడు మహనీయులు జన్మింపక పోవుటచేతను, అనుష్ఠానము సరిగా లేనివారిలోను, పవిత్రవర్తనము లేనివారిలోను ఈ బ్రహ్మవిద్య పడిపోయినందుచే, ఇప్పుడు విద్యావంతులకున్ను, ప్రభువులకున్ను దీనియందు విశ్వాసము తగ్గిపోయెను, అట్టి ఆచరణశూన్యులను చూచి బ్రహ్మ విద్య యిట్టివారికి సంబంధించినదని తలచుటచే విద్యాధికులకున్ను రాజులకున్ను నిరుత్సాహము గలిగెను దీనికను గుణముగా పాశ్చాత్యవిద్య భారతములో వ్యాపించుటయును, బ్రహ్మవిద్యను పోషించువారు లేకపోవుటయు నొక ప్రబల కారణ మయ్యెను అయితే

పట్టణములలోగల మురికికాలువలను చూచి భారతదేశములో గల నదులన్నియు ఈలాగున నుండనని తలంచుట యెంత విశాలదృష్టి శూన్యత్వమో, ఆలాగున ఆచరణరహితులను చూచి బ్రహ్మ విద్య యిట్టిదని తలంచుట కూడ పొరపాటు గంగా, యమునా, గోదావరి, సింధు, మొదలైన దివ్యనదులెన్నియో గలవు, వానిలో గల జలము ఎంత పావన మైనదో, పావమును రహిత మొనర్చునదో, ఆ నదీజలములు ఎన్ని కోట్ల జీవరాసులకు సౌఖ్యమును గలుగజేయుచున్నవో, ఆలాగున అప్పుడప్పుడే గాక, ఇప్పుడుకూడ కొందఱు దివ్యపురుషులు భారతదేశమున లేకపోలేదు అయితే దృష్టిని విశాలపరచి చూచేవారికి, వెదకువారికి కనబడకపోరు

భారతదేశములో కడుబీదవారలు, రోగగ్రస్తులు, దుర్గుణపరులు కొందరుండి యుండవచ్చును వారిని చూచి ఆ దేశీయులందురున్ను ఆలాగే యుందురని తలంచుట యెంత విచారణశూన్యమో ఆలాగున ఆచరణ లేనివారు సాధువేషధారులు కొందరుండవచ్చును వారి చూచి అందరుసాధువులు, సంన్యాసులు ఆలాగుననే యుందురని తలంచుట పొరపాటు, ఎందరు మహారాజులు పండితోత్తములు, భారతదేశములో గలరో, అదేరీతిగా బ్రహ్మనిష్ఠులు, సాధుపురుషులు, పరమపావను లెందరోగలరు, గృహస్థాశ్రమములో నుండే వారిలో కొందరు వీచవృత్తి జారచోరత్వాది హీనగుణములు గలవారుండిన అట్టివారనిచూచి గృహస్థాశ్రమములో నుండు వారందరు ఆలాగుననే యుందురని తలంచుట యెంత వివేకశూన్యమో! ఎందరో సత్పురుషులు ధర్మబద్ధముగా గృహస్థాశ్రమము జరుపువారు, అతిధి యజ్ఞాది పంచయజ్ఞపరులు, సాధుసజ్జన సేవకులు, ధర్మపరాయణులు గలరు, ఆలాగున సాధువులలో సంన్యాసులలో కొందరు హీనవృత్తితో కూడిన వారుండినను, అందరిని వారితో జమకట్టుట తగదు పూర్వకాలము ఈ బ్రహ్మవిద్యను చక్రవర్తులు, మహారాజులు, పండితప్రవరులు ఏలాగున గౌరవించినారో, ఆర్ష గ్రంధములను చదివినవారు తెలిసికొనకపోరు జనకచక్రవర్తి తన రాజధానిలో యాజ్ఞవల్క్యమహర్షిచే ఎంత బ్రహ్మవిద్యా ప్రబోధము చేయించెనో, బృహదారణ్యాక ఛాందోగ్యోపనిషత్తులు చదివిన వారికి తెలియకపోదు ఆలాగున దశరధ సార్వభౌముడు తన ఆస్థానమండపములో అనేక ఋషులు, రాజులు, మహారాజులుగల సభలో శ్రీ

వసిష్ఠమునీంద్రునిచే శ్రీ రామచంద్రుని నిమిత్తముగా జేసుకొని శ్రీ యోగవాసిష్ఠము ప్రబోధము చేయించిన విషయము వాసిష్ఠరామాయణము చదివిన వారందరు ఎఱింగియే యున్నారు ఈలాగున మను, ఇక్ష్వాకు, దిలీప, అశ్వపతి హరిశ్చంద్రాది మహారాజుల చరిత్రము చదివినవారందరును ఈ సత్యమును తెలుసుకొనియే యున్నారు ధర్మరాజు మొదలగు మహారాజుల కాలములోను, శ్రీ బుద్ధదేవుని కాలమున బింబిసారుడు మొదలగు మహారాజులున్ను, శ్రీ శంకరాచార్యుల కాలమున భారతీయ మహారాజులున్ను, శివాజిచక్రవర్తి కాలమున శ్రీ సమర్థ రామదాసు మొదలగు మహాత్ములచే లోకమంతటను ఏలాగున బ్రహ్మ విద్యను, ఆత్మజ్ఞానమును భగవద్భక్తిని ప్రబోధింపజేసిరో, విజ్ఞులు తెలిసికొనియే యున్నారు బ్రహ్మవిద్య యొక్క గొప్పతనమును తెలుపుటకొరకు కొందరి పేర్లు మాత్రమిచట నిరూపించడమైనది

మఱియు పరమఋషులను గురించి ఆలోచించిన శ్రీ సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది మహాయోగులున్ను, శ్రీ వసిష్ఠ, విశ్వామిత్ర, వ్యాస కపిల, భృగు, అగస్త్య, పతంజలి మొదలుగాగల దివ్య పురుషులు ఎంత విఖ్యాత స్థానము నలంకరించి యుండిరో, రారాజులేగాక, చక్రవర్తులు సహా యీ మహనీయుల పాదధూళిచే పవిత్రులైన చరిత్రమును విజ్ఞులు ఎఱుంగక యుండరు విద్యలలోను ఈ యాత్మ విద్యకు సమానమైన యమృతత్వమును గలుగజేసెడు విద్య మరియొకటి లేదని శ్రీ కృష్ణభగవానుడు గీతలో నుదహరించెను "ఆధ్యాత్మవిద్యా విద్యానామ్" విద్యలలో నీ యాత్మవిద్య యొక్కటియే విష్ణుస్వరూప మనియు, ముఖ్యమైన దనియు సెలవిచ్చిరి తక్కిన విద్యలెన్ని నేర్చుకొనినను అవి ఆత్మశాంతిని అమృత్త్వమును ముక్తిని కలుగజేయవు ఈ ప్రపంచ గౌరవమును, సుఖమును గలుగజేయవచ్చును అయితే అట్టి విద్యాధికులకు కూడ ఆత్మవిద్య లేనిచో మనశ్శాంతియు, నిరతిశయ సుఖమున్ను, ఈ లోకములోకూడ గలుగ జాలదు అయితే లోకహితము కొరకు పండితులు చేసిన పరిశ్రమ ప్రశంసింపదగినది అట్టివారివల్లనే యీ లోకము బాహ్యసౌఖ్యమును పొందుచున్నది దీనితో సహా బ్రహ్మవిద్యకూడ వారవలంబించి యుండినచో, ఇహపరసుఖముల రెండింటిని

పొందగలిగిన వారలే

**రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్ ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥ (7-12)**

ఈ బ్రహ్మవిద్య విద్యలలో రాజగుటచే రాజవిద్యయనియు, పరమ రహస్యమైనది, పావనమైనది, ఉత్తమమైనదియు, అనుభవమువలన తెలుసుకొనదగినదియు, అనుష్ఠించుటకు మిక్కిలి సులభ మైనదియు, ధర్మము లన్నిటికిని మూలమైనదియు, నాశరహిత మైనదియునై యున్నది

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యంతవంతః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥ (5-22)**

ఓ యర్జునా ! ఏవి విషయసంయోగము వలన గలిగిన సుఖములో అవి దుఃఖమునే గలుగజేయునవియు, ఉత్పత్తి నాశములు గలవియు నగును కాబట్టి బుద్ధిమంతుడు ఆ విషయసుఖములయందు రమించడు మఱియు ఇతరశాస్త్రము లుద్ఘోషించుచున్నది చూడుడు

**భగవద్భక్తిహీనస్య జాతిశ్శాస్త్రం జపస్తపః ।**
**అప్రాణస్యేవ దేహస్య మండనం లోకరంజనమ్ ॥**

భగవద్భక్తి లేనివాని ఉత్కృష్టమైన జాతియు, శాస్త్రము, జపము, తపము, ఇవన్నియు ప్రాణములేని శవమును ఎంతసుందరముగా నలంకరించినను, అది యేలాగున శోభించజాలదో, ఆలాగుననే యుండును

**అన్యవిద్యా పరిజ్ఞానమవశ్యం నశ్వరం భవేత్ ।**
**బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం భవేత్ ॥**

ఎన్ని శాస్త్రములు జదివినను, అవి యీ శరీరముతో కూడ తనను వదలిపోవును బ్రహ్మవిద్య యొకటి మాత్రమే తాను జీవించి యున్నపుడును దేహమును వదలిపోవునపుడున్ను తనతో కూడనుండి ఆత్మశాంతిని నిరతిశయ జ్ఞానసుఖము గలుగజేయును

**ఆచార హీనం న పునంతి వేదాః**
**యద్యవ్యధీతాః సహషడ్భిరంగైః ।**
**ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజంతి**
**నీడం శకుంతా ఇవ జాతపక్షాః ॥**

బ్రహ్మవిద్య యందు ఆచరణము లేనివానిని తాను చదివిన షడంగములతో కూడిన నాలుగు వేదములు కూడ పావన మొనర్చజాలవు దేహావసానకాలమున ఈ వేదములన్నియు, వానిని వదలిపోవును ఎట్లన పక్షులు తాము పెట్టిన గూటిని పిల్లలు పెరిగిన తర్వాత ఎట్లు వదిలిపోవుచున్నవో, ఇతనియొక్క స్థితియు నటువంటిదే యగును అనగా జీవించి యుండువరకు మాత్రమే ప్రపంచవిద్య యుపయోగపడునని ఉపనిషత్తు తెలుపుచున్నది

**వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్ ।**
**వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే ॥**

శాస్త్ర జ్ఞానము మాత్రము గల పండితులయొక్క వాగ్వైఖరియు, కవితా ప్రయోగశక్తియు, శాస్త్రమునకు టీకా, తాత్పర్య, రచనా కౌశలమున్ను, మహావిద్వత్తున్ను, భుక్తి కొరకేగాని, ముక్తికొరకు కానేరదు అని శ్రీ శంకరాచార్యులవారు వచించిరి

**పఠంతి వేదశాస్త్రాణి బోధయన్తి పరస్పరమ్ ।**
**న జానన్తి పరం తత్త్వం దర్వీ పాకరసం యథా ॥**

వేద శాస్త్రములు లెస్సగా పఠించినను, పరస్పరము బోధించు కొనుచుండినను, బ్రహ్మ నిష్ఠానుష్ఠానము చక్కగ చేయనిచో ఈ బ్రహ్మ తత్త్వము నెఱుంగజాలరు ఎట్లన అనేక క్షీరాన్నాది రసపదార్థములలో తిరుగుచుండినను గరిటె, ఆ పదార్థముల యొక్క రుచినెట్లు అనుభవించ జాలదో ఇతని యొక్క జీవితమున్ను ఆలాగుననే యుండును

**అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః ।**
**బ్రహ్మతత్త్వం న జానాతి దర్వీపహతచేతసః ॥**

ఋగ్యజుస్సామాధర్వము లను నాలుగు వేదములున్ను, ధర్మ శాస్త్రము లనేకములున్ను చక్కగ నధ్యయనము చేసినప్పటికిన్ని, విద్యాగర్వముచే చెడిన మనస్సు గలవాడు పరమాత్మ తత్త్వము నెఱుంగజాలడు

**యథాఽగాధ నిధేర్లబ్ధౌ నోపాయః ఖననం వినా ।**
**మల్లాభేఽపి తథా స్వాత్మచింతాం ముక్త్వా న చాపరః ॥**

ఏలాగున భూమి క్రిందనుండు నిధిని పొందవలసి యుండిన త్రవ్వుట తప్ప వేఱుపాయములేదో, ఆలాగున బ్రహ్మప్రాప్తిని పొందవలసి యుండిన హృదయ గుహాయందు బ్రహ్మచింతనము నిరంతరము చేయుట తప్ప మఱి వేరు మార్గము లేదు

**న్యాయాగమాభ్యాం సిద్ధం చ శ్రద్ధాహీనః పరాఙ్ముఖః ।**
**న బుధ్యతే శ్వేతకేతో ! శ్రద్ధస్వాంతర్ముఖో భవ ॥**

న్యాయ శాస్త్రము చేతనున్ను, వేదాగమములచేతనున్న ఏ యొక పరతత్త్వము శ్రవణమాత్రముచే తెలియబడెనో, అది అంతర్ముఖుడు గాని వానికి అనుభవమునకు రాదు కనుక నో శ్వేతకేతూ ! అంతర్ముఖుడవు కమ్ము, శ్రద్ధగలిగియుండుము అని ఉద్దాలకుండు శ్వేత కేతున కుపదేశించెను శ్రవణ జ్ఞానము, లేక శాస్త్ర జ్ఞానము మాత్రము చాలదనియు అంతర్దృష్టి గలిగి అనుభవజ్ఞానమును పొందవలయునని దీనియొక్క సారాంశము

**ఘటమధ్యే యథా దీపో బాహ్యే నైవ ప్రకాశతే ।**
**భిన్నే తస్మిన్ ఘటే చైవ దీపజ్వాలా చ భాసతే ॥**

**స్వకాయం ఘటమిత్యుక్తం యథా జీవో హి తత్పదమ్ ।**
**గురువాక్యసమాభిన్నే బ్రహ్మజ్ఞానం ప్రకాశతే ॥**

ఏలాగున కుండలోపలనుండు దీపము బాహ్యమున ప్రకాశించదో, ఘటమును భిన్నమొనర్చిన దీప మేలాగున ప్రకాశించునో, ఆలాగున నీ శరీరము ఘటమనియు, పరతత్త్వము దీపమనియు, గురువాక్యచింతనముచే అవిద్యారూపమగు ఘటమును ధ్వంస మొనర్చిన ఆత్మసాక్షాత్కార జ్ఞాన ముదయించుననియు

గ్రహించుము

**పతిహీనా యథా నారీ మాతృ హీనోయథా శిశుః ।**
**గురుహీనస్తథా ప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్ ॥**

భర్తలేని స్త్రీ యొక్కయు, తల్లిలేని శిశువు యొక్కయు జీవితము ఎట్లు నిరర్ధకమో, ఆలాగున గురుదేవుడు లేని మానవుని యొక్క జన్మమును నిరర్థకము

**సంసారార్ణవమగ్నానాం జంతూనామవివేకినామ్ ।**
**అగతీనాం గతి స్సాక్షాత్ జ్ఞానమేవ హి కేవలమ్ ॥**

జననమరణ రూపమగు ఈ సంసారసాగరములో పడియుండు వారును, ఆత్మజ్ఞానము లేనివారును, రెండవసహాయము లేనివారుననగు మానవులకు ఆత్మజ్ఞాన మొకటి మాత్రమే రక్షించునదిగా నుండును

**సంసారదుఃఖతప్తానా మాత్మజ్ఞానామృతాంభసా ।**
**తాపశాంతి ర్న చాన్యేన సత్యమేవ న సంశయః ॥**

సంసార తాపత్రయ దుఃఖముతో తపించెడు మానవులకు ఆత్మ జ్ఞానామృత మనెడు జలమొకటిమాత్రమే తాపశాంతిని గలుగజేయును మరి దేని వల్లను శమించదు ఇది సత్యము సందేహము లేదు

**అవిద్యాకామ కర్మాది పాశబంధం విమోచితుమ్ ।**
**క ః శక్నుయాద్వినాஉఽత్మానం కల్పకోటిశతైరపి ॥**

అవిద్యా కామకర్మాది పాశబంధనమునుండి విముక్తిని గలుగ జేయుటకు ఆత్మజ్ఞాన మొకటి తప్ప మఱియెవడున్ను శక్తిమంతుడు కాడు నూరు కల్పకోట్లకైన మరొకరీతిగ ఆపని చేయ తరము గాదు అనగా జ్ఞానమొకటి మాత్రమే బంధవిముక్తిని గలుగజేయుటకు సమర్థమై యుండును

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥ (4-38)**

ఈ లోకమునందు జ్ఞానముతో సమాన మైనదియు, పావన మైనదియు,

మరియొకటి లేనేలేదు గదా! అట్టి జ్ఞానమును కాలక్రమముచేత ధ్యాననిష్ఠగలవాడు తన ఆత్మయందు తనంతట తానే పొందుచున్నాడు

**యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురు తేఽర్జున! ।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ (4-37)**

ఓ యర్జునా! ఏ ప్రకారము చక్కగా రగులుచుండెడు నిప్పు సమిధలను భస్మము చేయుచున్నదో, ఆ ప్రకారముగానే జ్ఞానమనెడు అగ్ని సమస్తకర్మలను భస్మముగా చేయుచున్నది



# మానవజన్మయొక్క గొప్పతనము

**వాంఛంతి జన్మ మానుష్యం భువి దేవాశ్శతక్రతుః ।**
**చిద్విద్యాయాం పరోపాస్తౌ యతో నాన్యోధికారభాక్ ॥**

ఈ భూలోకమందు ముఖ్యముగా భారత భూమియందు దేవేంద్రుడున్ను, దేవతలున్ను మనుష్య జన్మమును పొందుటకు కోరుచున్నారు బ్రహ్మావిద్యయందుపాసనచేయుటకు మానవజన్మము తగినదేగాని మరి యేజన్మము గలవారికిన్ని సాధ్యము గాదు కావుననే జన్మములన్నిటిలోను మానవజన్మము శ్రేష్ఠమని చెప్పబడుచున్నది కారణము దేవతలు సహా మరల భూలోకమునందు మానవులై జన్మించిన మాత్రమే మోక్షమున కర్హులగుదురు ఊర్ధ్వలోకము లేదున్ను అధోలోకము లేదున్ను కర్మఫలము ననుభవించుట కేర్పడినవేగాని, కర్మాధికారము మధ్యలోకమగును ఈభూలోకమందుమాత్రమే సాధ్యమగును కావుననే దీనిని కర్మభూమి యని వ్యవహరింతురు అట్టి కర్మము సత్కర్మముమైన కావచ్చును, అసత్కర్మయైన గావచ్చును, మిశ్రకర్మయైన గావచ్చును. సత్కర్మయైనచో పుణ్యలోక ప్రాప్తియు, అసత్కర్మయైనచో పాపలోక ప్రాప్తియు మిశ్రకర్మయైనచో మనుష్యలోక ప్రాప్తియు గలుగును మరల కర్మ నిష్కామ కర్మయనియు, సకామకర్మయనియు ఇటు తెగలు

నిష్కామకర్మమైనచో అంతఃకరణశుద్ధియు తద్వారా ముక్తియున్ను గలుగును, సకామకర్మమైనచో కోరిన ఫలము మాత్రమే సిద్ధించును నిష్కామకర్మయొక్క యోగ్యతను గీతయందు విస్తారముగా గనందగును

**ఆహారనిద్రాభయమైధునాని**
**సామాన్యమేతత్పశుభిర్నరాణామ్ ।**
**జ్ఞానం నరాణామధికో విశేషః**
**జ్ఞానేన హీనః పశుభిస్సమానః ॥** **(ఉత్తరగీత)**

ఆహార నిద్రాభయ మైధునాదులు మానవులకున్ను, పశువులకున్ను సమానముగానే యుంటున్నవి జ్ఞానమొకటియే మానవునికి విశేషగుణము అట్టి జ్ఞానము లేనివాడు పశువుతో సముడని చెప్పుటకు కారణమైనది, ఈ విషయమై కఠోపనిషత్తు తెలిపినది చూడుడు

**యధాఽఽదర్శే తథాఽఽత్మని**
**యధా స్వప్నే తధా పిత్రులోకే ।**
**యధాఽప్సు పరీవ దదృశే తధా**
**గంధర్వలోకే ఛాయాతపయోరివ బ్రహ్మలోకే ॥**

మానవజన్మయొక్క విశిష్టత్వము - ఏలాగున మంచి నిలువుటద్దములో తన శరీరము స్పష్టముగా కనబడుచుండునో, ఆలాగున మానవుని హృదయమందు పరమాత్మ స్పష్టముగా కనుపడేలాగున గల సృష్టి గలదు పిత్రులోకములో గల జీవులకు ఆత్మజ్ఞానము స్పష్టముగా తెలుసుకొనే సృష్టి లేదు అచట తన శరీరము స్వప్నములో వికృత రూపము ధరించేలాగున నుండును గంధర్వలోకములో అనగా స్వర్గలోకములో నుండువారికికూడ ఆత్మావధారణము చేయదగిన సృష్టి లేదు దేవలోకములోను అస్పష్టముగానే ఆత్మ గోచరించును ఎట్లన నీటిలో ప్రతిబింబించిన తన శరీరమేలాగున స్వచ్ఛముగా ఉన్నదున్నట్లు కనుపించదో, దేవతలకు కూడ ఆలాగుననే యుండును సత్య లోకములో కూడ ఆత్మసాక్షాత్కారము గలుగజేనుకొనుటకు తగిన అంతఃకరణము

గలిగియుండలేదు అచట నుండువారికి ఎండలో కనుపించెడు తన ఛాయవలె నుండును, నీడలో తన శరీరమేలాటి రంగులు గలిగియుండునది ఎట్లు స్పష్టముగా కనుపించదో, పై సత్యలోక స్థితియు అట్లే యుండును ఈ శ్రుతివలన మానవ జన్మ యొక్క మహిమ యెటువంటిదో తెలుసుకొనవచ్చును

**నృదేహమాద్యం సుదృఢం సుదుర్లభం**
**ప్లవం సుకల్పం గురుకర్ణధారమ్ ।**
**మయాఽనుకూలేన నభస్వతేరితం**
**పుమాన్ భవాబ్ధిం న తరేత్స ఆత్మహా ॥**

బహుపుణ్య పుంజలభ్యమును, సర్వోత్తమమును, మిక్కిలి దృఢమైనట్టిదియు నగు నరదేహమనే మంచి కూర్పుగల నావను సర్వజన సాధారణముగాగాక, సద్గురువు అనే నావికుడు నడుపగా, మఱియు భగవత్ప్రసాదమనెడి యనుకూల మారుతముచే నడుపబడగా సంసారసాగరమును దాటలేనివాడు ఆత్మఘాతకు డనబడునని భావము ఇన్ని అనుకూలము లేర్పడియుండియు ఎవడు తరించ యత్నించడో వాడు ఆత్మహంతకునికి సమానుడు

**సృష్ట్వా పురాణి వివిధాన్యజయాత్మశక్త్యా**
**వృక్షాన్సరీసృపపశూన్ఖగదంశమత్స్యాన్ ।**
**తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ**
**బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥**

బ్రహ్మదేవుడు తన గొప్ప ఆత్మశక్తి చేత పూర్వము వివిధములైన వృక్షములను, సర్పములను, పశువులను, పక్షులను, ఈగలను, మత్స్యములు మొదలగు ననేక జీవులను సృష్టించి వాటికన్నిటికిని ఆత్మజ్ఞానమును తెలుసుకొను శక్తి లేనందువలన తన సృష్టియంతయు వ్యర్థమైపోయెనుగదా అని క్లేశమును పొందినవాడాయెను తర్వాత తనయాత్మ శక్తినంతయు కేంద్రీకరించి బ్రహ్మావలోకనము చేయతగిన బుద్ధి గలవానినిగా మనుష్యుని సృష్టించెను అది చూచి తన సృష్టి సార్థకమైనదని తలచి ఆనందమును పొందెను

## ఆత్మజ్ఞానిసుఖముయొక్క గొప్పతనము

**నాతః సుఖతరం కించిత్ త్రిషు లోకేషు విద్యతే ।**
**వీతతృష్ణస్య కామేభ్యో ముక్తసఙ్గస్య యత్సుఖమ్ ॥**

సమస్త విషయములనుండి విముక్తిని పొందిన జీవన్ముక్తునికి ఏ యాత్మసుఖము గలదో, దానికి మించిన సుఖము మూడులోకముల యందును మఱియొకటి లేదు

**న సుఖం సార్వభౌమస్య విద్యతే న బిడౌజసః ।**
**బ్రహ్మణో న సుఖం యత్స్యాత్ పునః కామవివర్జనాత్ ॥**

సమస్త కామములనుండి విముక్తిపొందిన బ్రహ్మనిష్ఠునకు ఏ యొక్క ఆత్మ సుఖముగలదో అట్టి ఆనందము సార్వభౌమునకున్ను దేవేంద్రునకున్ను కట్టకడకు బ్రహ్మదేవునికి సహ లేదు అట్లు కానిచో రారాజులు చక్రవర్తులు పూర్వకాలము రాజ్య సౌఖ్యములను త్యజించి వనమున కేగి తపమొనర్చెదరా ?



# మానవుల ద్వైవిధ్యము

సామాన్యముగా మానవులను నివృత్తి మార్గస్థులనియు, ప్రవృత్తి మార్గస్థులనియు రెండువిధములుగా చెప్పుదురు గీతయందు శ్రీ కృష్ణభగవానుడుకూడ ఈలాగుననే వచించెను

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ (2-69)**

దీని యొక్క సంగ్రహార్థమేమన సమస్త మానవులకు ఏది పగలుగా నుంటున్నదో ఆత్మనిష్ఠగల మునికి అది రాత్రిగా నుండును ఈ సత్యమును తెలుసుకొనిన మాత్రమే యీశ్వరసృష్టియొక్క వైచిత్ర్యము మనకు గోచరించును,

అప్పుడే దేహ సంబంధులతోను, వర్ణ సంబంధులతోను, ఆశ్రమ సంబంధులతోను గల సంబంధము యొక్క సత్యము గోచరించును నివృత్తి మార్గములో నుండు జాతులన్నియు నొకే జాతియనియు, ప్రవృత్తి మార్గములో నుండు జాతులన్నియు నొకేజాతియనియు సత్యముదయ మగును ప్రవృత్తి మార్గమున నుండే వారలలో నివృత్తి మార్గజీవు లుండినచో వీరి వర్తనము అన్నిటిలోను భిన్నముగానే యుండును. ప్రవృత్తి మార్గములో నుండే వారికి వర్ణాశ్రమముల ననుసరించి ప్రవర్తించుటయే ధర్మమని తోచును నివృత్తిమార్గములో నుండువారికి వర్ణాశ్రమములన్నియు కల్పితములనియు, అన్నిటిలోనుండు ఆత్మలేక దైవము ఒకటేయనియు, దాని ననుసరించి ప్రవర్తించుటయే సత్యమనియు ధర్మదృష్టి లేక జ్ఞానదృష్టి ఉదయమగును ఇట్టివారిని చూచి అయ్యో! మన సోదరులే వర్ణాశ్రమ ధర్మము నతిక్రమించి ప్రవర్తించుచున్నారే అని తలంచి ప్రవృత్తి మార్గస్థులు జాలిగలిగియుందురు నివృత్తి మార్గమున నుండేవాడు ప్రవృత్తి మార్గస్థుని చూచి ఓహో ! మనసోదరుడే ఆత్మజ్ఞానమునకు దూరుడై కర్మపాశముచేత బద్ధుడైపోవుచున్నాడని జాలి గలిగి వర్తించును

ఈ విషయమై వేమన యోగి చరిత్రమొకటి గలదు. వేమన యోగి రెడ్డిరాజు వంశములో పుట్టినవాడు ఒక రోజు వేమనముని దిగంబరుడై రోడ్డు ప్రక్క నొక చెట్టు క్రింద కూర్చొని యుండెను అత్తఱి రాజ్యము పాలించు ప్రభువగు అతని సోదరుడొకడు మేనాయెక్కి వెళ్ళు చుండెను వేమన యోగిని చూచి పల్లకి నుండి దిగి విరక్తి భావమును చూచి నిలచి యేడ్వ ప్రారంభించెను ప్రభువైన సోదరుని చూచి వేమన్న కన్నీరు కార్చుచుండెను అత్తఱి అచట చాలమంది జనులుండిరి, రాజ్యపాలకుడగు ప్రభువుతో ఏమి మీరు దుఃఖించుటకు కారణమని జనులడిగిరి, దానికి ప్రభువీలాగున జవాబు చెప్పెను 'ఈ కూర్చొని యున్న త్యాగమూర్తి మా తల్లిగర్భములో పుట్టినవాడు కడుదరిద్రునికైనను ఒక కట్టుబట్టయైన నుండును అదియును లేక దిసమొలతో ఎండ, గాలి, వాన, మంచులను సహించి వట్టి మట్టిలో చెట్టుక్రింద కూర్చుండుటచూచి నా మనస్సు ఓర్వజాలక హృదయము తల్లడించుచున్న'దని చెప్పెను అత్తఱి కొందఱు విజ్ఞులు సిద్ధపురుషుడగు

వేమనయోగితో మీ తమ్మునిని చూచి మీ నేత్రముల నుండి నీరు కారుటకు కారణమేమని యడిగిరి 'ఇతడు నా సోదరుడు మేమిరువురము నొక మాతృ గర్భములో జన్మించిన వారము, జ్ఞానహీనుడై కేవలము మాయా మోహములో బడిపోయినాడే యని తలంపు గలిగి సోదర ప్రేమతో జాలి గలుగుచున్న'దని వేమన సమాధానము చెప్పెను లోకముయొక్క రీతి యీలాగున నున్నది

ఈ విధముగానే శ్రీ గౌతమబుద్ధుని గురించి యొక చరిత్ర గలదు బుద్ధుడు బుద్ధత్వము పొందినపిమ్మట నొకసారి తాను జన్మించిన కపిలవస్తు నగరమునకు భిక్షుసంఘముతో వచ్చెను రారాజు ఏకపుత్రుడగు సిద్ధార్థుడు వీధిలో కావిబట్ట ధరించి మట్టి పాత్రమును చేతనుంచుకొని అన్నభిక్ష యెత్తుటను అతని ధర్మపత్నియగు యశోధరా మహారాణి సౌధాంతరాళములో నుండి చూచి తన మామయగు శుద్ధోదన మహారాజు దగ్గరకు పరుగెత్తి వెళ్లి దుఃఖ వ్యాకుల హృదయముతో 'నాయనా! యువరాజై యుండవలసిన మీ కుమారుడు అదిగో వీధిలో అన్నభిక్ష నెత్తుచున్నాడు' అని చెప్పెను ఆమాట వినగనే శుద్ధోదన మహారాజు పరుగెత్తివచ్చి బుద్ధదేవుని కరములను పట్టుకొని 'నాయనా! పుత్రసంతానములేక మహాక్లేశము గలిగి అనేక వ్రతములు, యజ్ఞములు చేసిన పిమ్మట మీరు పుట్టితిరి పుత్రసంతానములేని క్లేశమును హృదయము భరింపగలిగెను కాని, అనేక రాజులచే సేవింపబడిన మన వంశములో ఇట్టివారు పుట్టి యెప్పుడైన వీధిలో భిక్షమెత్తి యున్నారా? భంతే! రాజగృహమునకు రమ్ము, మీ యొక్క యీ దీనాతి దీనావస్థను చూచి నామనస్సు భరించజాలకున్నది' అని చెప్పిన వాక్యమును విని శ్రీ బుద్ధ భగవానుడు నాయనా! నీ వంశీయులు ఆలాగుననే యుండవచ్చును మా వంశీయులు ఆదిబుద్ధులు ఈ పవిత్రమగు భిక్షాన్నమును భుజించియే ఏ బంధములోను తగుల్కొనక పరమనిర్వాణమగు మోక్షమును పొందిరి నాకును మీకును గల సంబంధ మెట్టిదన బాటసారుల కొకరాత్రి ఒక సత్రములోగల సంబంధమెట్టిదో అటువంటి'దని చెప్పి తన దారిని పోయెను

ఇదేరీతిగా శ్రీ యేసుక్రీస్తును గురించిన చరిత్ర యొకటి గలదు ఏసుక్రీస్తు సర్వసంగ పరిత్యాగియై ఏకాంతమున చిరకాలముండి దైవజ్ఞానమును బడసిన

పిమ్మట జనపథములో బహుజనముల మధ్య ధర్మబోధలు చెప్పుచుండగా తన తల్లియగు మేరియు, ఇద్దఱు సోదరులున్ను దూరముగా నిలుచుండి ఏసునాథుని యొక్క అమృత ప్రవాహ సమానమగు జ్ఞానబోధలను పానముచేసి తన్మయులై అచ్చటనుండు ప్రధానులతో మమ్ము తీసుకొని వెళ్ళి మా ఏసునాథునకు నమస్కారము చేసే లాగున చేయవలెనని ప్రార్థించిరి ఆ వాక్యమును విని ముఖ్యులు శ్రీ ఏసుక్రీస్తువారికి చెప్పగా వెంటనే 'తన భక్తులు - తన వాక్యములను విని అనుష్ఠించువారి ప్రక్కకు ముఖము త్రిప్పి నేను చెప్పెడు దైవసందేశమును విని అనుష్ఠించువారు ఎవరుగలరో అట్టివారే నా సోదరులు వారే మా వారు' , అని సమాధానము చెప్పిరట ఇకను ఈలాటి కథలెన్నియో గలవు సంక్షిప్తముగా విజ్ఞులైన మీకు తెలుపడమైనది

కోడిగ్రుడ్లున్ను బాతుగ్రుడ్లున్ను, కోడిపెట్టచే ఒకే కాలమున పిల్లలగుచున్నవి అయితే బాతుపిల్లలు వెంటనే కాలువలోనికి గాని జలాశయములోనికి గాని దిగి, ఈది, నీటి కావలియొడ్డు చేరుచుండును కోడిపిల్లలు నీటి దగ్గరకు వెళ్ళి ఆగిపోవుచుండును ఆలాగున ఒకే మాతృ గర్భములో జన్మించిన అన్నదమ్ములు, అక్కచెల్లెంద్రైనను, నివృత్తి మార్గముతో బుట్టిన జీవులు సంసారసాగరమును ఈది మోక్షమను ఆవలి దరిని జేరుచుందురు ప్రాకృత జీవియైనచో ఆలాగున చేయజాలక ప్రకృతి బద్ధుడై యిచటనే ఆగిపోవును ఇదే మొట్టమొదట జీవులు రెండురకములు గలరని తెలుపుటకు కారణము మఱియు నొకే కాకిగూటిలోనే కాకిపిల్లలున్ను, కోయిలపిల్లలున్ను పుట్టుచుండును శైశవావస్థలో ఒకేరంగు, ఒకే ఆకృతి గలిగియుండును అయితే వసంతకాలము వచ్చినపుడు కోయిల స్వరము వేరుగాను, కాకి స్వరము వేరుగాను ఏర్పడునపుడు కోకిల, కాకి సంబంధమును విడిచి వెళ్ళిపోవుచుండును ఆలాగున ఒకే తల్లిగర్భవాసములో పుట్టిన వారలైనను కాలపరిపాకము వచ్చినపుడు నివృత్తి మార్గస్థుడు ప్రపంచమార్గము నతిక్రమించి విరక్తుడై వెళ్ళును తక్కిన వారు ప్రపంచములోనే ఆగిపోవుదురు శాస్త్ర మీలాగున చెప్పుటకు కారణమిదే

**కాకఃకృష్ణః పికః కృష్ణః కోభేదః పికకాకయోః ।**
**వసంత కాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః ॥**

దీనియర్థము పైన వివరించినదే మఱియు

**మాతా చ పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వర ః ।**
**బాంధవాశ్శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥**

పరమభక్తులు, ఆత్మజ్ఞానులు జగజ్జనియగు నీ పార్వతీ దేవియే తల్లియనియు, జగత్పితయగు పరమేశ్వరుడే తండ్రియనియు, దైవభక్తులే తన బంధువులనియు, మూడు లోకములు స్వంతదేశమనియు తలంతురు ఇదేరీతిగా విష్ణుభక్తులను గుఱించిన శ్లోకమొకటి గలదు

**మాతా చ కమలాదేవీ పితా దేవో జనార్దనః ।**
**బాంధవా విష్ణుభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥**

ఇచట శ్రీ లక్ష్మీ దేవియే తల్లియనియు, శ్రీ మన్నారాయణ మూర్తియే తండ్రియనియు, విష్ణుభక్తులే దేహబంధువులనియు మాత్రమే మార్పుగలదు ఈ విధముగ సాధువులయొక్క, జ్ఞానులయొక్క స్వరూపము నిరూపించడమైనది మఱియు

**అయం బంధురయం నేతి గణనా లఘుచేతసామ్ ।**
**ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥**

వీరు మా జాతివారు, వీరు మా దేహ సంబంధులు, వీరు మా కులమువారు గారు, వీరు మా జ్ఞాతులుకారు అని తలంచువారు సంకుచితమైన స్వల్పబుద్ధిగలవారు విశాలహృదయము గలవారు జనులందరిని తమ సోదరులవలెనే తలంతురు ఈ భూలోకమును తన కుటుంబమును వలె తలంతురు



# భగవద్గీత

భగవద్గీతయందు 18 అధ్యాయములు ఏల యుండవలయును? 16 గాని , 14 గాని, 12 గాని ఉండకూడదా? అని యనేకులు ప్రశ్నింతురు దీనిని గురించి అంతలోతుగా దిగి సమాధానము విచారణ చేయవలసిన పనియేమియు లేదు 16 గాని, 14 గాని, 12 గాని అధ్యాయములుండిన అప్పుడును ఇదే ప్రశ్న వచ్చుచునే యుండును 16 గాని 14 గాని, 12 గాని ఎందుకుండవలెనని 18 అధ్యాయములకు నేదేని విశేషరహస్య ముండినచో శ్రీ కృష్ణ భగవానుడే తెలిపియుండును లేక గీతా వాక్యములను ఛందోబద్ధముగా జేసిన శ్రీ వేదవ్యాసులైన తెలిపి యుండకపోరు అదియునుగాక గీతకు మూలాధారమైన మహాభారత మందైనను నిరూపింపక యుండరు మఱియు మహాభాష్యకర్తలగు శ్రీ శంకర, శ్రీ రామానుజ, శ్రీ మధ్వాచార్య ప్రభృతులుగాని, మఱియు వారి యనుయాయులుగాని, ఎవరైనను నిరూపించియే యుందురు ఒక గ్రంథమును రచించదలంచువారు తన భావములన్నియు ఎన్ని అధ్యాయములలో పూర్తి యగునో, అన్ని అధ్యాయములతో పూర్తిజేయుదురు అట్లు గాకపోయిన భాగవతము పండ్రెండు స్కంధములు, రామాయణము ఆరు కాండములు ఎందుకుండవలయునని ప్రశ్నించిన దానికెంత అర్థముండునో దీనికిని అంతయే తేలుచుండును మానవుడు ఎన్ని అధ్యాయములతో ఏ గ్రంథ మేర్పడియుండునో దానిని తెలుసుకొనుటకు ప్రయత్నము సలుపుటకన్న దానిలో గల సారమును గ్రహించి ఆచరించుటలో తన బుద్ధిని వినియోగ పరచిన ఎంతో మేలును పొందగలుగును కొందరు తన బుద్ధియొక్క చాకచక్యముచే దాని కేమేమో సంఖ్యలు వేసుకొని ఇన్ని అధ్యాయములకు ఇది కారణము, ఆలాగుననే కొన్ని మంత్రముల అక్షరములకు ఇది కారణము అని చెప్పుచుందురు ఇదంతయు అంత యవసరమైన పనికాదు

ఈ విషయమై ఉత్తరగీత యందు ఈ శ్లోకము గలదు

**నిర్మథ్య చతురో వేదాన్మునినా భారతం కృతమ్ ।**
**భారతోదధిమంధస్య గీతానిర్మథనస్య చ ॥**
**సారముద్ధృత్య తం కృష్ణో అర్జునస్య ముఖే హుతమ్ ॥**

నాలుగు వేదముల సారమను క్షీరము శ్రీ వ్యాసులవారు చక్కగా గ్రహించి

భారతమను గ్రంధము నొనర్చిరి శ్రీ కృష్ణమూర్తి అట్టిభారతమను పాల కడవను తన ధ్యానముచే పెరుగుగాచేసి 'గీతయను కవ్వముచేత చక్కగా మధించి సారభూతామృతమగు నవనీతమును గైకొని అర్జునున కుపదేశించెను ఇందువల్ల వేదసారమే భారతమనియు, భారతసారమే గీతయనియు తేలుచున్నది దీనిని బట్టి ఆలోచించిన భారత మేలాగున పదునెనిమిది పర్వములతో కూడినదో అట్టి పదునెనిమిది పర్వములసారమును అష్టాదశాధ్యాయములుగా జేయుట న్యాయముగా నుంటున్నది మఱికొంతమంది ప్రజ్ఞానిధు లీలాగున చెప్పుదురు పదునెనిమిది రోజులు భారతయుద్ధము జరిగినందుచేతను, పదునెనిమిది అక్షౌహిణుల సైన్యములతో కూడినదగుటచేతను గీతయు పదునెనిమిది అధ్యాయములతో కూడినదిగా చేయడమైనదని వచింతురు, మహాభగవద్గీత గీతామాహాత్మ్యమున సూతుడు నై మిశారణ్యమునులకు చెప్పునపుడు ఈ లాగున వచించిరి

**మోక్షస్థానం పరం పార్థ సగుణం వాఽథ నిర్గుణమ్ ।**
**సోపానాష్టాదశై రేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥**

ఓ యర్జునా ! మోక్షస్థానము సగుణరూపమైనను, లేక నిర్గుణ రూపమైనను పొందుట కొఱకు శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీత పదునెనిమిది అధ్యాయములనెడు సోపానములను నిర్మించెను కావున ఏ మానవుడై తే యీ సోపానములపై కెక్కునో వాడు పరబ్రహ్మమును పొందుచున్నాడు ఈ వాక్యముల నాధారము చేసికొని చూడగా గీత అష్టాదశాధ్యాయములతో కూడియుండుట సమంజసముగా నుంటున్నది ఈ వాక్యమును శ్రీ పరమశివుడు పార్వతీదేవి కుపదేశించినట్లు మహాభగవద్గీత మాహాత్మ్యమందు గలదు ఒక సౌధము నెక్కుటకు ఎన్నిమెట్లు కావలసియుండునో అన్నిమెట్లతో నిర్మింపబడిన, యిన్ని మెట్లతోనేల కట్టవలెనని అడిగినచో దానికి ప్రత్యేకరహస్య మేమియు లేదనియు, అన్నిమెట్లతోనది పూర్తియైనదని యేలాగున తెలుసుకొనుచున్నామో, ఆలాగున మోక్ష సౌధమునకు అష్టాదశాధ్యాయములను సోపానములను శ్రీ కృష్ణభగవానుడు నిర్మించినాడని గ్రహించుకొనిన చాలును ఇదియునుగాక మహా భగవద్గీత మాహాత్మ్యమున గీతకు

పదునెనిమిది పేర్లు తెలుపడమైనది ఈ పదునెనిమిది పేర్లననుసరించి, పదునెనిమిది అధ్యాయములుగా గీత యుండుటకుకూడా హేతువగుచున్నది ఆ పేర్లు ఇవి

**గీతా గంగా చ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।**
**బ్రహ్మ విద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తగేహినీ ॥**

**అర్ధమాత్రా చిదానందా భవఘ్నీ భయనాశినీ ।**
**వేదత్రయీ పరాఽనంతా తత్త్వార్థజ్ఞానమంజరీ ॥**

తా ॥ (1) గీత, (2) గంగ, (3) గాయత్రి, (4) సీత, (5) సత్య, (6) సరస్వతి, (7) బ్రహ్మ విద్య, (8) బ్రహ్మవల్లి, (9) త్రిసంధ్య, (10) ముక్తగేహినీ, (11) అర్ధమాత్ర, (12) చిదానంద, (13) భవఘ్ని, (14) భయనాశిని, (15) వేదత్రయి, (16) పర, (17) అనంత (18) తత్త్వార్థజ్ఞానమంజరి

మఱియు అష్టాదశాధ్యాయ సోపానములు సమష్టిరూపముగాను, అదే విధముగా అష్టాదశస్థానములు వ్యష్టిరూపముగాను బ్రహ్మవేత్తలు నిర్ణయించిరి

**దృశ్యం దేహం చ వాగాది శ్రోత్రాదీన్ద్రియపంచకమ్ ।**
**ప్రాణాదిపంచకం చైవ తథాఽన్తఃకరణమేవ చ ॥**

**ముక్తి సౌధస్య సోపానా అష్టాదశ ఇతీరితాః ।**
**ఏతాన్క్రమేణ చారుహ్య బ్రహ్మభూయాయ కల్పతే ॥**

1 దృశ్యము, 2 దేహము 3 వాక్పాణిపాదపాయూపస్థలు కర్మేంద్రియములు 4 త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు, జ్ఞానేంద్రియములు 5 ప్రాణాపాన ఉదాన సమానవ్యానములు పంచప్రాణములు 6 అన్తఃకరణము, ఈ పదునెనిమిదియు ముక్తియనెడు భవనమునకు మెట్లుగా చెప్పబడినవి వీటిని క్రమముగానెక్కి బ్రహ్మస్వరూపు డగుచున్నాడు దీని యందు దృశ్యము 1 దేహము 1 కర్మేంద్రియములు 5 జ్ఞానేంద్రియములు, 5 పంచప్రాణములు 5 అంతఃకరణము 1 మొత్తము 18

అంతఃకరణము మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారములతో కూడిన దైనను సంగ్రహముగా చెప్పునపుడు అంతఃకరణము ఒకటి మాత్రమను వ్యవహారము గలదు, ఈ పదునెనిమిది సంఖ్యకు సాక్షియై యుండు ఆత్మయే పరమాత్మగా నెఱుంగవలయును 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్యము ప్రజ్ఞానమే బ్రహ్మయని నిర్ణయించినది కావుననే గీతయందు కృష్ణభగవానుడు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" - సమస్త ప్రాణికోట్లలో క్షేత్రజ్ఞుడైయుండు ఆత్మయే నన్నుగా తెలుసుకొనుమని వచించెను

ఓమ్

## పంచదశాధ్యాయము

భగవద్గీత అష్టాదశాధ్యాయములతో కూడియుండగా భోజన సమయమున యతులు, పండితులు, భక్తులు, నైష్ఠికులు మొదలగువారు పంచదశాధ్యాయము నేల పారాయణము చేయవలయును? మఱి యేదేనిఒక అధ్యాయమును పారాయణము చేయరాదా? అనిప్రశ్న

సమాధానము - దీనికి సమాధానము మహాభగవద్గీత పంచదశాధ్యాయ మాహాత్మ్యమున తెలుపడమైనది, అదియుగాక బ్రహ్మవేత్తలు దీనిని గురించిన యొక కథను గూడ చెప్పుదురు అదేమన పూర్వకాల మొకగ్రామమున ఇద్దరు బ్రాహ్మణులు బ్రహ్మనిష్ఠులుగాను, పండితులుగా నుండిరి వారు ప్రతిరోజున్ను భగవద్గీతలో నొక అధ్యాయమును పారాయణముచేసి భుజించే నియమము గలవారై యుండిరి వారు తమ జీవిత మంతయు విద్యలోనే గడిపినందున గృహస్థాశ్రమము నవలంబించినపుడు జీవయాత్ర జరుపుట కొంత ప్రయాసముగా గనుపించుటచే ఆ రాజ్యమును పాలించెడు రాజు ధర్మాత్ముడుగాను, పండితులను చక్కగా సత్కరించువాడుగా నుండే సంగతి నెఱింగి అతనిదగ్గరకు వెళ్ళదలంచిరి వీరుండు గ్రామమునకు ముప్పైమైళ్ళ దూరమున రాజధాని యుండెను మార్గమధ్యము చాలవరకు అరణ్య ప్రదేశమగుటచే యాత్రికుల సౌకర్యార్థము మధ్యప్రదేశముననొక సరోవరమును, మండపమును నిర్మింపబడి యుండెను చల్లని వృక్షముల ఛాయతో

ఆ స్థలము ప్రశాంతముగా నుండెను

వీరుభయులున్ను తెల్లవారురఘామున స్నానాద్యనుష్ఠానములు నిర్వహించుకొని అప్పుడువండిన అన్నమును మూటగట్టుకొని పగలు 11 గంటల వేళకు పై జెప్పిన ప్రదేశమునకు జేరిరి స్నానమొనర్చి భోజనమునకు కూర్చుండు సమయమున మామూలు ప్రకారము గీతాపారాయణ మారంభించిరి ఆ దినమున వారికి వరుసప్రకారము 15 వ అధ్యాయము వచ్చెను ఆ 15 వ అధ్యాయము యొక్క పారాయణము సగమగునప్పటికి సమీపమున బాగుగా ముదిరియుండు మఱ్ఱిచెట్టు ఒకటి పెద్ద ధ్వనితో పటపట పగిలి దివ్యతేజోమయుడైన పురుషుడొకడు దాని నుండి ఆవిర్భవించి" మహాత్ములారా! నేనొక గంధర్వరాజును దుర్వాసమహర్షియొక్క శాపము వలన చాలకాలమునుండి బ్రహ్మరాక్షసుడనై తపించుచు ఈ వృక్షమునందుంటున్నాను దుర్వాసమహర్షి వేదాధ్యయనము చేయునపుడు ముసలివారైనందుచే స్వల్ప స్వరభేదము గలిగినది అది నేను విని మెల్లగా నవ్వితిని అందుచే నా మహర్షి కోపాక్రాంతుడై నన్ను బ్రహ్మరాక్షసునిగా నుండేలాగున శపించెను వెంటనే మహాభయంకరమగు బ్రహ్మరాక్షసుడనైతిని పశ్చాత్తాపపడి శాపవిమోచనమును వేడుకొనగా, ఆ ఋషిసత్తముడు కరుణగలవాడై ఎప్పుడైతే భోజనసమయమున నియమనిష్ఠగలవారు శ్రీ భగవద్గీత పంచదశాధ్యాయమును పారాయణము చేయుచుండగా నీవు వినెదవో అప్పుడు శాపవనిమోచనము గలుగునని యనుగ్రహించిరి నేటివరకు భోజనకాలమున పంచదశాధ్యాయము నెవరైన పారాయణము చేయుదురా యని నిరీక్షించుచుంటిని ఈ రోజు మహనీయులగు తమ కరుణవల్ల 15- వ అధ్యాయమును శ్రవణము చేసితిని, ధన్యుడనైతిని శాపవిముక్తుడనైతిని మీరు వెళ్ళెడుసంగతి నాకు తెలియును నాకింత గొప్ప యుపకార మొనర్చిన మీకు ప్రత్యుపకారముగా ఒక కార్యము చేయదలంచినాను మీరు రాష్ట్రపాలకుడను మహారాజు దగ్గఱకు వెళ్ళుచున్నారు మీరు రాజుగారి నేది కోరెదరో, ఆలాగున రాజుగారి జిహ్వాయందుండి ప్రేరణచేసెదను" అనెను. ఈ వాక్యమును విని పండితులు దైవానుగ్రహమని తలంచి శుభసమయమున రాజు సన్నిధానము జేరి తాము వచ్చిన వృత్తాంతమును మనవి చేసిరి రాజుగారు పండిత సభను సమకూర్చి వీరి పాండిత్యమును బాగుగా

గ్రహించెను మహాపండితులందురు హర్షించిరి అప్పుడు రాజుగారు మీ కేమి కావలయునని యడుగగా, జీవితయాత్ర సుఖముగా జరుగుటకు అను గ్రహించవలెనని తెలుపగా ఆ బ్రాహ్మణులు నివసించుగ్రామమును ప్రక్కన నుండు మఱియొక గ్రామమును, వారిరువురకు యావత్కాలము అనుభవించేలాగున దానమొసంగెను ఇప్పుడు ప్రపంచములో బ్రాహ్మణుల కునుసంన్యాసులకు కానుపించెడు అగ్రహారములు, మాన్యములు, అన్న సత్రములు, పారశాలలు పూర్వము ఈ లాగున యతీశ్వరులకు, విప్రోత్తములకు రాజులు, శ్రీ మంతులు దానమొసంగినవే వర్తమానకాలమున వానిని సంరక్షింపజాలక పోవుటయేగాక, వారసులు విభాగములు చేసికొని విక్రయించి జీవించుచున్నారు

భోజనముచేయునప్పుడు మూడు విధానములు గలవు 1 దైవభావముతో మంత్ర పూతముగా మౌనముగానుండి భుజించుట ఉత్తమపక్షమగును 2 అంతనిశ్శబ్దముగాను, దైవభావము గాను భుజింప శక్తిలేనివారు భగవత్కీర్తనలు, భగవన్నామోచ్చారణ చేసికొని భుజించుట మధ్యమ పక్షమగును 3 భోజనకాలములో ఇతర ప్రపంచ విషయములను వ్యాపారముల విషయములను , కోర్టు వ్యవహారములను, వార్తాపత్రికలలోని సంగతులను మాట్లాడుచు భుజించుట అధమపక్షమగును పూర్వకాలము యతులు, ద్విజులు దైవభావముతో మౌనముగా నుండి భుజించుటవలననే అప్పటిరాజులు మొదలగు వారు అగ్రహారాదులను దానమొసగిరి వర్తమాన కాలమున ఆలాగున చేయువారు అరుదైనందుచేతనే అట్టి దానములను, అన్న సత్రములను ఇప్పుడు హరిజనులు మొదలగు బీదవిద్యార్థులకు వినియోగ పరచుచున్నారు ఇది దాతలయొక్క లోపముకాదు సన్న్యాసుల యొక్కయు, బ్రాహ్మణుల యొక్కయు లోపమని గ్రహించుకొని జాగ్రత్తగలిగి యిప్పుడైనను వర్తింతురేని యిది స్థిరముగా నిలుచును లేనిచో అచిరకాలములోనే యిది క్షయించునని తలంచి, యతులను ద్విజులును జాగ్రత్త గలిగి మెలగిరేని శ్రేయస్సు నొందగలరు

ఒక పెట్టెయందు ఒక సుగంధవస్తువు నుంచిన అది యుండువఱకు దానియందు గల వస్త్రాదులన్నిటిలోను సువాసన వ్యాపించియుండును అది

అయిపోవుటకు ముందుగ ఇంకొక సుగంధవస్తువు నుంచి, ఎల్లప్పుడును సుగంధము నశింపకయుండును ఆలాగున అప్పుడప్పుడు పెట్టక పోయినచో సుగంధము నశించునట్లు పూర్వముండిన యతుల, విప్రుల విద్యా తపస్సుల వలననే లోకములో యశస్సు నిలువడమైనది వారి పరంపరవారు దానిని నిలుపకపోయినచో జనులకు వీరిపై విశ్వాసముండదు

మఱియు ఈ పంచదశాధ్యాయమందు వైశ్వానరోపాసనను గురించిన యొక శ్లోకము గలదు ఈ వైశ్వానరోపాసన ఛాందోగ్యోపనిషత్తునందు పంచాగ్ని విద్యను గురించిన స్థలమున విస్తారముగ చూడందగును

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥ (15-14)**

నేను వైశ్వానరుడను పేరు గల జఠరాగ్నినై సకలప్రాణుల శరీరములయందును ప్రవేశించి, జఠరాగ్నిని ప్రజ్వలింపజేయు ప్రాణాపానములను వాయువులతో చేరి భక్ష్యము , భోజ్యము, లేహ్యము, చోష్యమను పేర్లు గల నాల్గువిధములైన యాహారమును పచనము చేయు చున్నాను అని భగవద్వాక్యము ఈ లాగున దైవభావముతో భుజించువానికి పెట్టిన యన్నము సాక్షాద్భగవంతుడు భుజించే లాగున నుండును భగవంతునికి అన్నము పెట్టినవానికి ఏమి పుణ్యము గలుగునో ఆలాగున భగద్ధ్యానముతో భుజించువానికి పెట్టిన అన్నదాతలకు అట్టి ఫలముగలుగును ఆలాగున భుజించువానికి కొంత కాలమునకు తనలోగల భగవద్ జ్ఞాన ముదయ మగును భగవత్స్మరణ జేసి భుజించెడు పరమభక్తులకు, అన్నము పెట్టినదాతలకు, ఒక పుణ్యాత్మునకు పెట్టిన ఫలితము గలుగును భుజించువాడు కొంత కాలమునకు పుణ్యాత్ముడై మహాభక్తుడు కాగలడు ప్రపంచవ్యవహారములను మాట్లాడుచు భోజనము చేయువానికి అన్నము పెట్టెడుదాతలకు ఏలాటి పుణ్యమును గలుగదు భుజించువాడు ఎప్పటికిని పుణ్యాత్ముడుగాని, శుద్ధాత్ముడుగాని గాజాలడు ఈ విషయమై ఉత్తరగీతయందు శ్రీ కృష్ణభగవాను డుపదేశించినది చూడుడు

**కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం యోగాభ్యాసేన జీర్యతే ।**
**న నిస్తరతి దాతారం దశపూర్వాన్దశావరాన్ ॥**

పరమాత్మ ధ్యానము చేయువానికి అన్నము పెట్టినవాడు తనకంటె పూర్వులగు పది తరములవారిని, అపరులగు పదితరముల వారిని తరింపజేయును అనగా యోగవేత్త యగు వానికి అన్నము పెట్టిన పుణ్యము గతించిన పదితరములవారి పాపములను, రాబోవు పదితరములవారు చేయబోయెడి పాపములను సైతము పోగొట్టునని భావము

**యతిర్యస్య గృహే భుంక్తే తస్య భుంక్తే హరిస్స్వయమ్ ॥**
**హరిర్యస్య గృహే భుంక్తే తస్య భుంక్తే జగత్త్రయమ్ ॥**

జ్ఞాని ఎవని గృహమునందు భుజించునో ఆ యింట శ్రీ మహా విష్ణువు భుజించినటుల తలంచవలయును అట్టి శ్రీ మహావిష్ణువునకు తృప్తి కలుగునెడల జగత్త్రయము భుజించినటుల యగును

**యతి హస్తే జలం దద్యాద్భైక్షం దద్యాత్పునఃపునః ।**
**తద్భైక్షం మేరుణా తుల్యం తజ్జలం సాగరోపమమ్ ॥**

జ్ఞాని చేతియందు జలమిచ్చిన సాగరముతో సమానమగును భిక్షమిచ్చిన మేరువుతో తుల్యమగును, బ్రహ్మవేత్తకు భోజనసమయమున చేతిలో పోసెడు ఆపోశనమునకు జలమిచ్చుట యగును అది సముద్రమంతగ పెరుగును పెట్టిన భిక్ష మహామేరువువలె వృద్ధినొందును



# సందేశము

(శ్రీకాళహస్తి శ్రీ శుకబ్రహ్మాశ్రమ వార్షికోత్సవమునకు పంపినది)

పరిశుద్ధజ్ఞానము, శాంతియు, కరుణయుగల ప్రియమైన ఆత్మ సోదర సోదరీమణులారా! సర్వేశ్వరుని కృపచేతను, మహర్షుల కరుణచేతను లోకములో శాంతియు, కరుణయు వర్ధిల్లును గాక

వైశమ్పాయన జైమిన్యాది మహామునులు శ్రీ వ్యాసభగవానుని గురించి తమ ఆశయమేమని వినయపూర్వకముగా ప్రశ్నను జేయగా బాదరాయణముని యిటుల ఆనతిచ్చెను

**సర్వశాస్త్రపురాణేషు వ్యాసస్య వచనం ద్వయమ్ ।**
**పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥**

సమస్తములయిన వేదశాస్త్ర పురాణములయొక్క సారము రెండు వాక్యములలో దెలిపెద, పరప్రాణులకు మేలొనరించుటకన్న మించిన పుణ్యము లేదు ఇతర జీవులకు పీడ గలుగజేయుటకన్న మించిన పాపమున్ను లేదు ఇదియే తనయొక్క ఆశయమని వచించెను

ధర్మములో సామాన్య ధర్మమనియు, విశేష ధర్మమనియు ఇరుతెగలుంటున్నవి ఇప్పుడు తెలిపినది సామాన్య ధర్మమనియు, విశేష ధర్మము మరియొకటి గలదనియు చెప్పుచు, సామాన్యధర్మ మందారితేరిన వారికి విశేషధర్మ ముదయమగునని ఉపదేశించిరి అదేమనగా

**మర్త్యోఽహమితి సంధాయ మ్రియతే జాయతే చ సః ।**
**బ్రహ్మోఽహమితి సంధాయ ముచ్యతే న చ జాయతే ॥**

నేను మర్త్యుడనను భావన యెంత వరకుండునో, అంతవరకు వాడు జనన మరణముల పొందుచుండును నేను దేహముగాను మనస్సుగాను, బుద్ధిగాను, ఇంద్రియములుగాను వీటినన్నిటిని ప్రకాశింపజేసెడు జ్ఞానస్వరూపమగు బ్రహ్మమే అను బోధ యెప్పుడుదయమగునో, అప్పు డాపుణ్యజీవి, మరల జననమరణముల నొందదు శాశ్వతమైన ముక్తిని పొందును, ఇక మహర్షులందరి యొక్క ఆశయము నీక్రింద దెలిపెద

**జ్ఞానలభ్యం పరం మోక్షం ప్రాహుస్తత్త్వార్థచిన్తకాః ।**
**తద్ జ్ఞానం భక్తిమూలం చ భక్తిః కర్మవతాం తథా ॥**

ఉత్కృష్టమైన ముక్తి జ్ఞానమొకదానివలననే లభ్యమగును అట్టి జ్ఞానము భగవద్భక్తి వల్లనే సిద్ధించును అట్టి భక్తి నిష్కామ కర్మయోగము చేతనే గలుగును

అని తత్త్వార్థము నెఱింగిన బ్రహ్మవేత్తలందరును ఐక కంఠ్యముగా వచించుచున్నారు జ్ఞానము పండనియు, భక్తి పుష్పమనియు, నిష్కామ కర్మయోగము వ్రూను అనియు గ్రహింపనగును పుష్పము కొరకును, ఫలము కొరకున్ను మీరు చేయవలసిన దేమియు లేదు చెట్టును పెంచిన స్వయముగా పుష్పములు, ఫలములు ఆవిర్భవించును వృక్షమును సంరక్షింపక, ఫలములను గురించియు, పుష్పములను గురించియు గూరుచుండి కాలక్షేపము జేసినచో గలిగెడు ప్రయోజనమును మీరే ఆలోచించు కొనుడు

**నానుష్ఠానాత్ పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే ।**
**సత్యం సత్యం పునస్సత్యమితి మామక భాషితమ్ ॥**

మూడు లోకములలోను తన అనుష్ఠానమునకు మించిన కార్యము మఱియొకటి లేదు ఇది సత్యము, ఇది సత్యము, ఇది సత్యము ఇదియే ఈ ఉపాధి యొక్క ఆశయము

కాళిదాసమహాకవి చెప్పిన యొక ఉదాత్తోపదేశమును మీకు తెలిపి దీనిని సమాప్తిజేయ దలంచడమైనది ఇది బుద్ధిమంతు లందఱికిని ఆత్మోన్నతిని, జ్ఞానోన్నతిని, లోకోన్నతిని గలుగజేసెడు దివ్యమంత్రమని మరువకుడు

**పురాణమిత్యేవ న సాధు సర్వం నచాపి కావ్యం నవ మిత్యవద్యమ్ ।**
**సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః ॥**

పురాతనములని తలంచి అన్ని శాస్త్రములను అనుసరించి యుండవలయునని తలంచవలదు ఆలాగున నవీనములని తలంచి అన్నింటిని త్యజించవలదు ఈ రెండింటిలోను జనులకు నేది గ్రాహ్యమో ఏది త్యాజ్యమో, దానిని సత్పురుషులైనవారు పరీక్షించి అనుష్ఠించవలయును అట్టిశుద్ధమైన వివేకజ్ఞానము లేనివాడు ఎప్పుడు పరాధీనుడై యుండును లోకములోను ఆత్మలోను అతడు స్వతన్త్రుడుగా నుండజాలడు ఈ సభలోఉండు పుణ్యజీవులారా! మీరందఱును పరమ ఋషులయొక్క సన్తానములని మరువక యుందురుగాక అంతటితో తృప్తిని జెందక, ఇంకొక మెట్టులోనికి ప్రయత్న పూర్వకముగా

ప్రాకిచూచినచో మీరు సర్వేశ్వరుని యొక్క అంశ స్వరూపులను సత్యమును గనుగొనగలరు అప్పుడు మీరు చక్రవర్తి యొక్క కుమారుని స్థానమునకు జెందిన వారగుదురు అచ్చోట గలిగిన గొప్ప తనముతో తృప్తి నొందక ఇంకొక అంతస్తులోనికి బుద్ధి బలముచే, ధ్యానమహిమచే ఎక్కి చూచితిరేని మీరు సాక్షాత్ ఈశ్వరస్వరూపులే అను పరమ సత్యమును గనుగొనగలరు అప్పుడు యువరాజు చక్రవర్తియగు నటుల మీరును పూర్ణబ్రహ్మస్థితి నొందగలరు అట్టి పరమపావనమగు పూర్ణజ్ఞానమును పరమ కరుణానిధియగు సర్వేశ్వరుడున్ను, పరమ దయా స్వరూపులగు పరమ ఋషులున్ను మీకందరికిని గలుగులాగున దయతో ఆశీర్వదింతురుగాక! ఓమ్



# చాతుర్మాస్య మహావ్రత అవభృథస్నానము

## గోదావరీతీరం - 10-11-1951

ఈ పుణ్య దినమున వేలాది సాధువులతో భక్తులతో వేదోక్త ప్రకారము సంకల్పము జెప్పిన తర్వాత శ్రీ సద్గురు స్వాములవారు అందరిచేతను దీర్ఘముగా నోంకారము నుచ్చరింపజేసి, ఈ లాగున ఉచ్చైస్స్వరముతో ఉచ్చరించిరి

మనము చేసిన యీ చాతుర్మాస్య వ్రతకాలములో జపధ్యానపారాయణ ప్రార్థనాది తపస్సులు నాలుగుభాగములై యొకభాగముచే సర్వేశ్వరుడు సంతసించునుగాక! అని ఓంకారము నుచ్చరించి మునిగిరి

రెండవభాగముచే పరమ ఋషులు తృప్తులగుదురు గాక! అని ప్రణవము నుచ్చరించి మునిగిరి

మూడవభాగముచే దైవ జ్ఞానమునకు, దైవజ్ఞానప్రాప్తికరములగు శాస్త్రములకు దూరులగువారి ఆటంకములన్నియు ధ్వంసములగునుగాక! అని అందఱి చేతను

పలికించి, అందఱును గ్రుంకులిడిరి

నాలుగవ భాగముచే ఈ వ్రతకాలములో ఇచ్చటినుండి తపమొనరించిన వారియొక్కయు, దీనికి అన్నదానాదుల సహాయమొనరించిన వారియొక్కయు, ప్రపంచములో గల సర్వ మానవుల యొక్క అంతఃకరణములో గల సర్వపాపములు నశించి పవిత్రులగుదురు గాత! అని అందఱిచేతను చెప్పించి ఓంకారము నుచ్చరించుచు స్నానమాచరించిరి, ఇదియే శ్రీవారి మహాసంకల్పము

మఱియు "ఓ గోదావరి తల్లీ! తల్లిని ఆశ్రయించిన పసిబిడ్డలను ఆదరించినటుల మిమ్ము ఆశ్రయించి వచ్చిన మా అందఱిని, ఏలాటి అపాయమును గలుగునీయక రక్షించిన అమ్మా గౌతమీ! మీకు వందనములు, తనను ఆశ్రయించినవారిని తనవలెజేయుట ప్రకృతి సిద్ధ స్వభావము గదా! పరుసవేదిని తాకిన ఇనుము నది బంగారుజేయునట్లున్ను, అగ్నిలో ప్రవేశించిన కట్టెలన్నిటిని అగ్ని నిప్పుగా మార్చునట్లున్ను, నీలో ప్రవేశించిన అనేక రకములగు కాలువలద్వారా వచ్చెడు జలమునంతయు నీవు పుణ్యతీర్థముగా జేయునట్లు, మీయందు స్నానమొనరించెడు జీవులయొక్క పాపములను రహిత మొనరించి వారి యందు ఏ పాపములేకుండ జేయునట్లు, మీ యందు వేద వేదాంగపారంగతులగు విప్రులయొక్క, అంత్యజాతి అనబడు ఇతరమానవులయొక్క, శ్రేష్ఠమని తలంచెడు గోవుయొక్క దాహమును శమింపజేయునట్లున్ను, అట్లే కుక్కలు, పందులు మొదలగువానియొక్క దాహమును శమింపజేయునట్లున్ను, ఆలాగే స్వచ్ఛత గల హంసపక్షిని, నికృష్ట స్వభావము గల కాకిని సమముగా చూచి ఆదరించినట్లు గల స్వభావము మాకున్ను గలుగజేయుమా!"

మరియు ప్రణవస్వరూపమగు పరబ్రహ్మము నుద్దేశించి "ఓ సర్వేశ్వరా! మాకు మోక్ష విషయమై యేలాటి సందేహము లేదు ఒక్క సంశయము మాత్రము అప్పుడుప్పుడు గలుగుచున్నది అదేమనగా ఇంతకాల మొనరించిన మీ యందలి భక్తివల్లను, ధ్యాన జపతపశ్చర్యల వల్లను, బ్రహ్మ విచారములవల్లను మోక్షమును గలుగుజేసెదవేమో, అదొకటియే సందేహము అట్టి మోక్షము మాత్రము ఇప్పుడు వలదు వెంటనే మానవ జన్మమునే గోరుచున్నాము అట్టి జన్మములో బ్రాహ్మణుడై

పుట్టవలయుననిగాని, ధనవంతుడై యుండవలయుననిగాని, విద్యావంతుడై జన్మించ వలయునని గాని, సుందరగాత్రుడై ఆవిర్భవించవలయునని గాని సంకల్పము లేదు మానవుడై మాట్లాడుటకు నాలుకయు, అన్ని విషయములను గ్రహించుటకు తగిన యింద్రియములతో గూడిన జన్మమేదైనను జాలును అట్టి జన్మములో అర క్షణమైనను నిన్ను మరువక (జ్ఞానావరణమును గలుగ నీయక) మా ధర్మమును నిరంతరము సర్వజనులకు బోధించులాగుననుండు జన్మమును వెంటనే గలుగ జేయుము అంతియే చాలును అట్టి జన్మము లెంతవర కుండవలయుననగా ఈ జనులందఱు ఈశ్వరస్వరూపులు లేక ఈశ్వరాంశస్వరూపులు అను జ్ఞానము గలుగువరకున్ను , మానవులయొక్క ఉచ్చనీచావస్థలు వారి గుణములు ననుసరించి యుంటున్నవే గాని వర్ణమును గాని ఆశ్రమమునుగాని పట్టియుండలేదను సత్యమందరికిని తెలియువరకున్ను, ఈ జన్మముండునట్లు అనుగ్రహింపుము, తర్వాత జన్మరహితమయిన మోక్షమును గురించి ఆలోచించెదము అని వేదోక్తముగా సంకల్పము జేసి, యొక్కొక్కదానికి ఓంకారోచ్చారణను జేసి, గౌతమీ పుణ్యానదిలో స్నానమాచరించిరి ఇతరులచేతను ఈలాగున చెప్పించిరి ఓ పరమ పావన పుణ్యమూర్తివగు సర్వేశ్వరా! మేమున్ను మా గురుస్వాములవలె శ్రీ వారెప్పుడు ఎచ్చటెచ్చట జన్మమెత్తెదరో, అప్పుడు మేమున్ను గుంపులు గుంపులుగా జన్మించి, శ్రీవారు ప్రారంభించెడు ఆత్మోద్ధరణ లోకోద్ధరణ కార్యములలో పాల్గొనులాగున అనుగ్రహము జేయుమా! మాలో స్త్రీలు స్త్రీలుగాను, పురుషులు పురుషులుగాను జన్మమెత్తే లాగున ఆశీర్వదింపుమా!" అని ఉచ్చరించి స్నానమొనర్చిరి.

ప్రహ్లాదుడున్ను ఈ లాగుననే శ్రీ నరసింహమూర్తిని ప్రార్థించెను

**న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్ ।**
**కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తి నాశనమ్ ॥**

ఓ భగవంతుడా! నేను రాజ్యము గోరుటలేదు స్వర్గసుఖము నభిలషించుటయు లేదు కట్టకడకు పునర్జన్మరహితమయిన మోక్షమును గూడ ఇచ్ఛగించుటలేదు ఇక నాకు గల కోరిక ఏమనగా, ఈ ప్రాణికోట్లకు గల దుఃఖములన్నియు శమించులాగున మాత్రము కోరిక గలదు

ఈ వాక్యమును శ్రీ గాంధీగారు ఎల్లప్పుడు పఠించుచుందురు అనుయాయుల చేతను నిత్యము ప్రార్థనాకాలములో పఠింపజేయుచుందురు

# భక్తియోగము

(శ్రీ చాతుర్మాస్యవ్రతాశ్రమం, గోదావరితీరము, రాజమండ్రి)

**18-8-1951**

కొందరు భక్తిని తక్కువగా భావించి యోగసాధనలను తత్త్వ విచారమును తపస్సును గొప్పగానెంచి ప్రబోధములు సలుపుచుందురు కాని వారెంతకాలము యోగసాధనము సలిపినను, తత్త్వ విచారము చేసినను, తపమొనర్చినను విషయవిరక్తిగాని, ఆత్మవికాసముగాని, రాగద్వేష వినాశము గాని కనుపించుటలేదు మఱియు సామాన్య జనులకుండు కరుణయు వీరి యందు కానుపించుటలేదు వీరి హృదయమిట్లు సంకుచిత మగుటకు దైవ భక్తిని, భూతదయను, విషయవిరక్తిని విడిచియుండుటయే కారణము మరియు పూర్వకాలపు ఋషులు పొందిన స్థితిని పొందకపోవుటకును ఇదియే కారణము, భగవద్భక్తిచే ఎట్టి యున్నతస్థితినైనను మానవుడు పొందగలుగును ఎట్టి కష్టదశలోనున్నను భక్తుని భగవానుడు కాపాడుచుండును అందుచేతనే భగవత్కృపను మహాత్ములిట్లు వర్ణించియున్నారు "వత్సం గౌరివ వత్సలా" - ఆవు తనదూడ ననుసరించి యెట్లు తిరుగుచుండునో అట్లే భక్తుని భగవానుడు విడనాడియుండడు భగవానుని కృప అపారమైనది

భక్తి జ్ఞానవిషయములను గురించి మార్జాల మర్కటకిశోర న్యాయములను దృష్టాంతముగా జెప్పెదరు అనగా మార్జాలము (పిల్లి) తన బిడ్డలను పోషించునప్పుడు సమస్త కర్తవ్యములను తానే వహించును పిల్లలను ఎచ్చటికైనను చేర్చునప్పుడు తన నోటితో నేర్పుతో పట్టుకొనిపోవును మర్కటము (కోతి) అట్లుగాక బిడ్డల పోషణయందు అంతగా కర్తవ్యము వహించదు ఎచ్చటికేని పిల్లలను కొని పోవునపుడు పిల్లలు గట్టిగా తన్నుపట్టుకొనిననె తీసుకపోవును అట్లే భక్తుని క్షేమములను భగవానుడు సదా వహించుచుండును ఈ విషయమై భగవద్గీతయందు చెప్పినది

చూడుడు

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ (9-22)**

ఏ పరమభక్తులు ఇతరచింతలు లేనివారై పరమదైవమగు పరమాత్మనగు నన్ను ఎల్లప్పుడును ధ్యానించువారై సేవించుచున్నారో అట్లు సర్వకాలములయందు సమాహిత చిత్తులైన వారియొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను అని చెప్పియున్నారు

జ్ఞాన, యోగ, తపస్సుల విషయమట్లుకాక తనయందు తానాధారపడి యుండవలయును ఇది చాలా ప్రయాసమైన విషయము అందుచేతనే భక్తిలేనిదే జ్ఞానఫలము లభించుట దుర్లభమని మహాత్ములిట్లు వర్ణించారు

**యోగః కర్మ చ సాంఖ్యం చ తపో దానం వ్రతం శ్రుతమ్ ।**
**వ్యర్థం హి భక్తి హీనస్య వృష్టిహీనా కృషిర్యథా ॥**

యోగాభ్యాసము చేసినను, ఆడంబరయుతమగు అనేక యజ్ఞాది కర్మలనాచరించినను, సాంఖ్యవిచారము సలిపినను కృచ్ఛ చాంద్రాయణాది తపస్సుల సలిపినను వ్రతముల నాచరించినను, అనేక శ్రుతులను వినినను- వర్షములేకున్న కృషి యెట్లువ్యర్థమో అట్లే భక్తిలేనివానికి ఇవన్నియు వ్యర్థములని తెలిపినారు

మఱియు భగవద్గీత కర్మయోగమును గురించియు, జ్ఞాన యోగమును గురించియు తెలియజేయుచు, సామాన్యముగా ప్రతి అధ్యాయాంతమునందును భక్తికి ప్రాముఖ్యము నిచ్చుచు వచ్చినది ఈ విషయమై 6 అ 46 47 శ్లోకములు చెప్పినది చూడుడు

**తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ॥**

ధ్యాన యోగాభ్యాసము చేయుచున్న భక్తుడు కచ్ఛచాంద్రాయణాది తపస్సులను చేయువారికంటెను, శాస్త్రవిచారపరమగు జ్ఞానము గల వారికంటెను,

అగ్ని హోత్రాదికర్మలను చేయువారికంటెను శ్రేష్ఠుడని నా యభిప్రాయము కాబట్టి ఓ యర్జునా! నీవు యోగికమ్ము

**యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।**
**శ్రద్ధావాన్భజతే యో మాం సమే యుక్తతమో మతః ॥**

యోగులందరిలోను నెవడు నాయందు ఆసక్తమైన అంతరంగముతో భక్తియుతుడై నన్ను భజించుచున్నాడో అట్టివాడు యోగులలో ఉత్తముడని నాయొక్క అభిప్రాయము

మఱియు పదునొకండవ అధ్యాయమున తెలిపినది చూడుడు

**నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యధా ॥ (11-54)**

నన్ను ఏవిధముగా నీవు చూచితివో అటువంటి రూపముగల నేను వేదాధ్యయనముచేతను, తపస్సు చేతను, దానముచేతను, యాగము చేతను గూడ చూచుటకు శక్యుడను గాను

**భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వే న ప్రవేష్టుం చ పరంతప ॥ (11-54)**

ఇట్టి రూపము ధరించిన నేను తదేకనిష్ఠమైన అనన్యభక్తి చేతనే యధార్థముగా తెలిసికొనుటకున్ను, దర్శించుటకున్ను, తనలో నైక్యమగుటకున్ను సాధ్యమైన వాడగుచున్నాను

ఇంకను 14 వ అధ్యాయమునందు త్రిగుణాతీతుని లక్షణము చెప్పి కట్టకడకు అట్టిస్థితి భక్తిచేతనే పొందబడునని చెప్పినారు

**మాంచ యోఽవ్యభిచారేణ భక్తి యోగేన సేవతే ।**
**స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ (14-26)**

ఎవడు అచంచలమైన భక్తియను యోగముచేత నన్నే సేవించుచున్నాడో, వా డీత్రిగుణములను ప్రయాసము లేకనే అతిక్రమించి బ్రహ్మసాక్షాత్కార

జ్ఞానమును పొందుట కర్హుడగుచున్నాడు

ఈ శ్లోకములేగాక గీతలో ప్రతి అధ్యాయమునందును భక్తిని పేర్కొను శ్లోకములు చాలాగలవు వాటినన్నిటి నిప్పుడు ఉదాహరించ తలంచలేదు మఱియు అద్వైతమత స్థాపకులైన పూజ్యపాదులగు శ్రీ శంకరాచార్యులవారు భక్తియొక్క ప్రాముఖ్యమును వెల్లడించు అనేక స్తోత్రములను చేయుటే గాక భక్తియొక్క ఆవశ్యకతను గూర్చియు అనేక శ్లోకము లనేక గ్రంధములలో రచించియున్నారు కొన్నింటిని ఇచ్చట తెలిపెదము

**శ్రుత్వా తత్త్వమ సీత్యేవం బోధ్యమానోఽప్యనేకశః ।**
**న విజానాత్యయం తత్త్వమీశానుగ్రహవర్జితః ॥**

తత్త్వమసియను మహావాక్యమును పలుమార్లు శ్రవణము జేసినను, పలుసార్లు ఆ యర్థము బ్రహ్మజ్ఞానులచే బోధింపబడినను భగవంతుని యనుగ్రహము లేనివాడు జీవబ్రహ్మైక్యరూపమగు యధార్థతత్త్వము నెఱుంగజాలడు

మఱియు ప్రశ్నోత్తర మణిరత్నమాల యందిట్లు చెప్పియున్నారు

**అపారసంసార సముద్రమధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి ।**
**గురో కృపాళో కృపయా వదైతద్విశ్వేశపాదాంబుజదీర్ఘనౌకా ॥**

ప్రశ్న ॥ దయాసముద్రుడవైన ఓ గురువర్యా ! అనుగ్రహించి నాకీవిషయము తెలియజేయుము, అపారమైన సంసార సముద్రమునందు మునిగి పోవుచున్న నాకు దిక్కేది ?

ఉత్తరము ॥ సర్వేశ్వరునియొక్క పాదపద్మమనెడు ఉత్తమనావయే దిక్కు మఱియొక గ్రంధమునందు తెలిపినది చూడుడు

**ఆజీవితం త్రయస్సేవ్యా వేదాన్తో గురురీశ్వరః ।**
**ఆదౌ జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వనివృత్తయే ॥**

ఎంత యాత్మజ్ఞానముగలవాడైనను బొందిలో ప్రాణముండు వఱకు మూడు విషయములను విడనాడగూడదు అవి యెవ్వియన 1 వేదాంతవిచారము,

2 గురుదేవునియందుగల అపారభక్తి, 3 ఈశ్వరునియందు గల దృఢవిశ్వాసము ఇవి మూడును ఎల్లప్పుడును సేవనీయములు ఏలయన పూర్వము ఈ మూడింటివలననే జ్ఞానప్రాప్తి గలిగెను అందువల్ల కృతఘ్నుత్వము కలుగనీయక యుండుటకొఱకు ముక్తులైనను ముముక్షువులైనను వాటిని మరువకూడదు

ఇంకను శంకరులు ఎన్నియో శ్లోకములను భక్తియొక్క ఆవశ్యకతను గూర్చి తెలిపియున్నారు మఱియు లోకాతీతస్థితిని బోధించు అవధూతగీతయందు శ్రీ దత్తాత్రేయులవారు గ్రంథారంభమందిట్లు చెప్పియున్నారు

**ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।**
**మహాభయపరిత్రాణా ద్విత్రాణాముపజాయతే ॥**

అద్వితీయ పరబ్రహ్మ విచారము స్థిరమగుట కొఱకున్ను, మహాఘోర సంసారదుఃఖము తొలగించి రక్షించుటకున్ను పరమేశ్వరుని యొక్క కటాక్ష వీక్షణమైన అనుగ్రహముచే మాత్రము అజ్ఞానులైన జీవులకు జ్ఞానము గలుగుచున్నది

కావున అద్వైత ప్రతిపాదనాచార్యులగు, నిగ్రహానుగ్రహశక్తి సంపన్నులే ఇట్లు చెప్పియుండగా, భక్తి మార్గమును తక్కువగా భావించెడి వారలు ఆ మహనీయులకన్న ఎంత గొప్పవారలో ఆలోచించుకొనుడు



# విద్యాతపస్సులు

(25-1-51 లో ఇంటర్ లో చదువుచుండు ఒక విద్యార్థి ఇంగ్లీషు విద్యలో అరుచి గలిగి తపస్సునంగు అభిరుచి గలిగి వ్రాసిన లేఖకు ప్రత్యుత్తరము )

ప్రస్తుత కాలములో బి ఎ చదువుచుండు విద్యార్థులు మొదలు ఫస్టు ఫారము చదువు విద్యార్థుల వరకు అనేకులు ఇదే యభిప్రాయముతో వచ్చి చెప్పుచున్నారు వారు చెప్పునది సత్యము ఎంతో పవిత్రభావముతో చెప్పుచున్నారేగాని మరియొక విధముగాదు! అయితే ఫస్టుఫారమునుండి బి ఎ వరకు చదువుచుండు విద్యార్థులందరితోను, విద్యయందజాగ్రత్త చేయరాదనియే నేను తెలుపుచుందును పాశ్చాత్యవిద్య మనకేమియు నుపయోగపడదను సత్యము ప్రజ్ఞావంతులందరున్ను

అంగీకరించియే యున్నారు ఈ విద్య దైవవిషయమునకు ఉపయోగపడునది గాదనియు, బానిస జీవితమునకు దారితీయునదిగా ఉండుననియు విద్యార్థుల మతము అయితే యీ భావములను దూరీకరించి చదువవలయుననియే మా యాశయము వర్తమానకాలమున విద్య లేకపోవుటచేత సన్న్యాసులపై, సాధువులపై, గృహస్థులకు, ఉద్యోగులకు విశ్వాసములేదు అందువల్ల లోకము కొరకైనా విద్య యుండవలయును (1) వివేకానంద (2) రామతీర్థ, (3) రామమోహనరాయ్ (4) గాంధీగార్లు విద్యవల్లనే యింత యున్నతస్థితికి రాగలిగిరి అయితే వారు జ్ఞానముచేతనే యౌన్నత్యము పొందిననూ విద్య వారికి సహాయపడెను ఆధ్యాత్మిక జ్ఞానము ప్రపంచమంతటను బోధించవలసియుండిన నేటికీ ఇంగ్లీషు చాలా యవసరము మహాయోధుడైననూ, అస్త్రశస్త్రములు లేనిచో యుద్ధమునందు శత్రువుల నెట్లు జయింపగల్గును? యోధునకు శస్త్రమెట్టిదో, ఆధ్యాత్మికముగా శాస్త్రమటువంటిదే కావుననే శ్రుతి "విద్యాతపోభ్యాం పూతాత్మా" విద్యాతపస్సులవలననే ఆత్మ జ్ఞానము గల్గునని తెలిపెను విద్యకు ఇదేకాలము తపస్సు తర్వాత గూడ చేసుకొనవచ్చును విద్యార్థులకు ముఖ్యముగా (1) బ్రహ్మచర్యము, (2) భగవద్ధ్యానము, (3) శాస్త్రాధ్యయనము (4) సాత్త్వికాహారము (5) ఋజు ప్రవర్తన తపస్సని శ్రుతిచోదితము

**గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేత్ గ్రంథమశేషతః ॥**

మేధాసంపత్తి గలవాడు విద్యను బాగుగా అభ్యసించి జ్ఞానమున్ను, విజ్ఞానమున్ను కలిగినపిమ్మట శాస్త్రమును విడువవలయును కర్షకుడు పైరును పోషించి, పండించి ధాన్యమును తీసుకొని పిమ్మట గడ్డిని త్యజించునేగాని, గడ్డి యుపయోగము లేదని తలంచి మొదటనే త్యజించినచో ధాన్యం దొరకదు గదా? అరటిగెల పండ్లు పండు వరకు చెట్టునే పోషించుచున్నారు అయితే యా చెట్లు మనకు ఉపయోగము లేదు ఈ లాగున నుండవలయును మరియు

**ద్వే విద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మ పరం చ యత్ ।**
**శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥**

మానవుడు రెండు విద్యలు నేర్చుకొనవలయును (1) శబ్ద బ్రహ్మము, (2) పరబ్రహ్మము, శబ్ద బ్రహ్మమనగా శాస్త్రము పరబ్రహ్మమనగా ఆత్మజ్ఞానము అయితే శబ్దబ్రహ్మమందు నిష్ఠ కలిగినవాడు మాత్రమే పరబ్రహ్మమును పొందగల్గును అని శ్రుతి బోధించుచున్నది (అమృత బిందూపనిషత్తు) " స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే" అని గీత యందు గలదు అధ్యయనాభ్యాసము వాచిక తపస్సని శ్రీ కృష్ణమతము

**తపో విద్యా చ విప్రస్య నిశ్శ్రేయసకరం పరమ్ ।**
**తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే ॥**

మానవునికి విద్యయున్ను, తపస్సున్ను నిశ్శ్రేయస్సును (మోక్షమును) గలుగజేయుననియు, శ్రేష్ఠమైనదనియు, తపస్సుచేత పాపములన్నియు నశించుననియు, విద్యచేత అమృతత్వము (ముక్తి) గలుగుననియు మనువు వచించెను

గాంధీగారు విద్యావంతుడు కానిచో, ఇంగ్లీషు వారితో పోట్లాడి స్వరాజ్యమును సంపాదింపగల్గునా? ఒక వేళ దైవభక్తివల్లనూ, తపశ్శక్తి వల్లను ఆట్టిశక్తి గాంధీగారికి గలిగినదని తలంచిననూ, విద్యగూడ ఉండెనుగదా? ఇపుడు రాజకీయ తంత్రమును నడుపుచుండు నెహ్రూ పండితుడు, సర్దార్ పటేల్ మొదలగువారు విద్యావంతులు కారా? కావున స్వరాజ్యమునకై ననేమి, స్వారాజ్యమున కైననేమి విద్యా తపస్సులు రెండు నుండవలయునని మా యాశయము

# గీతాశయము

**(గాంధీకుటీరము - రాజమహేంద్రవరమున**

**గీతాజయంతి (23-9-51) నాడు శ్రీవారి అధ్యక్షోపన్యాసము)**

శ్రీభగవద్గీత యొక గొప్ప వెల్లువ వంటిది ఆ మహాప్రవాహము ప్రవహించునప్పుడు ఆవడుగు, చిన్నగుంట, నూయి, చిన్నకాలువ, చెఱువు,

పెద్దకాలువ, ఉపనది, మహానదులు మొదలగు అన్నిటిని నింపి మిగిలిన జలము సముద్రములోనికి వెళ్ళునట్లు, ఎవరెవరి హృదయము ఎంతకెంతకు విశాలత్వమును పొందునో, అంతకంతకు హృదయమున నిలిచి తక్కిన దంతయు అనంతములోనికి పోవుచుండును ఇట్టి మహిమాతిశయము ప్రపంచములో మఱియే యొక గ్రంథమునకు లేదు అందువల్లనే సామాన్య హృదయముగలవారి మొదలు శ్రీ శంకరభగవత్పాదుల వఱకుగల మహాశయులందరికిని గీతామృతము నిరతిశయానంద సుఖమును గలుగ జేయుచున్నది

**కృష్ణో జానాతి వై సమ్యక్ కించిత్కౌన్తేయ ఏవ చ ।**
**వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః ॥**

ఈ గీతామహిమను సంపూర్ణముగా శ్రీ కృష్ణభగవానుడొకడే యెఱుగు చున్నాడు అర్జునుడు కొంచెముగ దెలియుచున్నాడు శ్రీ వ్యాసమహర్షియు, శ్రీ శుక బ్రహ్మర్షియు యాజ్ఞవల్క్యమునియు, జనక మహారాజున్ను కొంచెము కొంచెముగా నెఱుంగుచున్నారు పంచభూతములు ఆకాశము వాయువు, అగ్ని జలము, పృథివి యేలాగున సర్వమానవులకు ఈహసౌఖ్యమునకు సమానముగా ఉంటున్నవో ఆలాగున గీతయు మోక్షముకొఱకు సర్వులకున్ను సమానముగానే యేర్పడినది

**రవిర్వాయుర్యథా వృష్టిర్లోకానాం హితకారణమ్ ।**
**తథా భవన్తి వేదాశ్చ సర్వేషాం మోక్షసిద్ధయే ॥**

దీనికన్న ప్రబల ప్రమాణమేమి కావలయును?

**సర్వశాస్త్రమయీ గీతా సర్వధర్మమయో హరిః ।**
**సర్వతీర్థమయీ గంగా సర్వతేజోమయో రవిః ॥**

ఏలాగున గంగాతీర్థము సర్వతీర్థమయమై యున్నదో, మఱియు సూర్యుడు సర్వతేజోమయుడై యుంటున్నాడో హరి యేలాగున సర్వధర్మమయుడై యున్నాడో, ఆలాగున గీతయు సర్వశాస్త్రమయమై యున్నది. సర్వధర్మముల ననుష్ఠించినను భగవద్భక్తి లేనిచో ఎటుల వ్యర్థమో, విష్ణుభక్తిగలవారికి ఇతరధర్మముల

ననుష్ఠింపకపోయినను మోక్షమెటుల గలుగునో, ఆ తీరున గీతాశాస్త్ర ధర్మానుష్ఠానముచే సర్వధర్మము లందులోనే యిమిడియున్నవి సర్వతీర్థములలో, స్నాన మాచరించినను గంగాస్నానము చేయనిచో ఎటుల తీర్థస్నాన మపూర్ణమగుచున్నదో, గంగాస్నానమాచరించిన, తీర్థస్నానము పూర్ణమగుచున్నదో- ఆలాగున అన్ని శాస్త్రముల చదివిన వాడయ్యు గీతాశాస్త్రము చదువనిచో నతని జ్ఞానమపూర్ణమే యగును గీతను చదివిన ఇతర శాస్త్రములను చదువకుండినను వాని జ్ఞానము పూర్ణమే యగుచున్నది అన్ని విధములగు దీపములుండినను సూర్యుని యందలి ప్రకాశమును ఎటుల అవి ఏవియు గలిగింపజాలవో, సూర్యడుదయించిన ఏ విధమైన దీపములతో అవసరము లేదో, అటులనే గీతా విజ్ఞాన ముదయించిన ఇతర జ్ఞానములతో పనిలేదు

**గీతా గీతం న యద్ జ్ఞానం తద్విద్ధ్యాసురసంజ్ఞకమ్ ।**
**తన్మోఘం ధర్మరహితం వేదవేదాన్తగర్హితమ్ ॥**

ఏ జ్ఞానము గీతను గానము జేయుట లేదో, ఆజ్ఞానము అసురజ్ఞానమని తలంచబడుచున్నది అది వ్యర్థమైనది మరియు ధర్మరహితమైనది. వేదములచేత, ఉపనిషత్తులచేత నిందితమైనది

**యస్మాద్ధర్మమయీ గీతా సర్వజ్ఞాన ప్రయోజికా ।**
**సర్వశాస్త్రమయీ గీతా తస్మాద్గీతా విశిష్యతే ॥**

ఎందువలననైతే భగవద్గీత ధర్మస్వరూపమైనదో, సమస్త జ్ఞానమునకు ప్రయోజనకారియో, మఱియు సర్వశాస్త్ర స్వరూపమయినదియో అందువలననే భగవద్గీత సమస్త శాస్త్రములందును శ్రేష్ఠమయినదని చెప్పబడుచున్నది శ్రీ భగవద్గీతకు ఎన్ని దివ్య నామములుగలవో చూడుడు

**గీతా గంగా చ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।**
**బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తగేహినీ ॥**
**అర్ధమాత్రా చిదానందా భవఘ్నీ భయనాశినీ ।**
**వేదత్రయీ పరాఽనంతా తత్త్వార్థ జ్ఞానమఞ్జరీ ॥**

1 గీతా 2 గంగా 3 గాయత్రీ 4 సీతా 5 సత్యా 6 సరస్వతీ 7 బ్రహ్మవిద్యా 8 బ్రహ్మవల్లీ 9 త్రిసంధ్యా 10 ముక్తగేహినీ 11 అర్ధమాత్రా 12 చిదానందా 13 భవఘ్నీ 14 భయనాశినీ 15 వేదత్రయీ 16 పరా 17 అనంతా 18 తత్త్వార్థజ్ఞానమఞ్జరీ - అని పేర్లు గలవు

**దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి ।**
**యథా న వేదైర్దానైశ్చ యజ్ఞతీర్థవ్రతాదిభిః ॥**

ఎటుల దేవకీనందనుడైన శ్రీ కృష్ణభగవానుడు గీతాపఠనముచే సంతుష్టుడగుచున్నాడో, అటుల వేదాధ్యయన దాన యజ్ఞ తీర్థ వ్రతాదులచే సంతుష్టుడగుటలేదు

**గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర విస్తరైః ।**
**యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా ॥**

ఏ గీత శ్రీ కృష్ణ పరమాత్మ యొక్క ముఖకమలమునుండి స్వయముగా బయలువెడలెనో అట్టి భగవద్గీతయే పఠింపదగినది విస్తారమగు ఇతరశాస్త్రములచే నేమి ప్రయోజనము?

**మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే ।**
**సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్ ॥**

మానవుల శరీరమున గల మాలిన్యము నశించుటకు ప్రతిదినము స్నానమాచరించవలయును. ఈ గీతయను గంగలో నొకసారి స్నానమొనర్చిన అనాదిగా వచ్చుచుండు ఈ సంసార మాలిన్యమంతయు నశించును

**సంసార సాగరం ఘోరం తర్తుమిచ్ఛతి యో నరః ।**
**గీతానావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥**

జనన మరణములనెడు ఘోరదుఃఖములకు కారణమగు ఈ సంసారసాగరమును దాటుటకు ఏ మానవుడు కోరుచున్నాడో, అతడు శ్రీ భగవద్గీతయను ఓడనాశ్రయించిన, సుఖముగా దాటవచ్చును

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥**

ఓ అర్జునా ! పురుషులు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొదలగు పాపజన్ము లెవరెవరు గలరో, వారందఱున్ను నన్నాశ్రయించి సర్వోత్తమమయిన మోక్షమును పొందుచున్నారు

ఈ భగవద్వాక్యమును ఆధారము జేసికొనక పోవుటయే హిందూ మతము పతనమగుటకు కారణము శ్రీ బుద్ధ, శ్రీ క్రీస్తు, శ్రీ మహమ్మదు మొదలగు ప్రవక్తలు ఈ సత్యమును నాధారము జేసికొనియే ప్రపంచములో తమ మతములను వ్యాపింపజేసిరి వారలందఱును పాపులను పవిత్రులుగా జేయుటకే ప్రయత్నించిరి మనవారో పాపములో పడియుండు వారిని పావనులుగా జేయుటకు ప్రయత్నింపక పోవుటయేగాక అట్టివారిని దూరముగా త్యజించిరి బుద్ధాది ప్రవక్తలు, రోగులకు ఔషధమిచ్చి రోగవిముక్తులుగా జేయుటకు యత్నించిరి మనవారో అమాయకులై జ్ఞానాజ్ఞాన విచారణలేక అజ్ఞానస్థితిలో ఉండువారిని దూరీకరించి పుణ్యాత్ములను దగ్గరకు చేర్చుకొనిరి ఇది వైద్యుడయినవాడు రోగులకు ఔషధమివ్వక ఆరోగ్యవంతులకు మందు ఇచ్చునటుల ఉన్నది అహో!! ఈవైద్యులెంత గొప్పవారు! అట్టిస్థితియే మన భారతదేశమునకు సంభవించినది వైద్యుడు తన ధర్మమును విపరీతముగా వినియోగపరచినటుల మన శాస్త్రజ్ఞులు, మఠాధిపతులు, మతకర్తలు ఇట్టి సంకుచిత భావము గలవారగుట చేతనే హిందూమతమున కిట్టి దురవస్థ ఏర్పడినది గీతామాహాత్మ్యమును శ్రీ విష్ణు భగవానుడు మొట్టమొదట ఎవరికి చెప్పిరో ఎవరు అడిగిరో ఆ సత్యమును తెలిసికొనిన, ఈ సత్యము బోధపడగలదు

ధరోవాచ - **భగవన్ పరమేశాన భక్తిరవ్యభిచారిణీ ।**
**ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో! ॥**

ఓ భగవంతుడా ! పరమేశ్వరుడా! ప్రభువా ! ప్రారబ్ధకర్మ ననుభవించువానికి పరమేశ్వరునియందు అచంచలమైన భక్తి యెటుల గలుగును ?

విశేషార్థము, దీని యందుగల భూదేవియొక్క ప్రశ్న యెంత విశాల భావముతో నున్నదో తెలియందగును ప్రారబ్ధమనుభవించెడు జీవులకు

అచంచలమైన భగవద్భక్తి యెటుల గలుగునని ప్రశ్నించెను ప్రపంచములో జన్మమెత్తిన జ్ఞానులు , అజ్ఞానులు, పండితులు, పామరులు, బ్రాహ్మణులు, అ బ్రాహ్మణులు, స్త్రీలు, పురుషులు అందరును ప్రారబ్ధకర్మచే గదా జన్మించిరి కావున అట్టివారందరున్ను తరించే మార్గము నడిగినదే గాని, సంకుచితమైన వ్యక్తిగత భావము దీనియందు లేదు శ్రీ విష్ణు భగవానుడు ప్రశ్నకు దగిన సమాధానమే జెప్పను

**విష్ణురువాచ- ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా ।**
**స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥**

ఎవడు గీతాభ్యాసమునందు నిరతుడై యుండునో అతడు ప్రారబ్ధకర్మ ననుభవించుచుండినను అట్టి కర్మచేత లిప్తుడు కానేరడు లోకమునందు అతడే ముక్తుడు అతడే సుఖియును నగుచున్నాడు -ఈ సత్యమును మనవారు ఎంతవరకు గ్రహించుకొన్నారో, తెలిసికొన వలయును

**మహాపాపాదిపాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।**
**క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా ॥**

ఎవరు గీతాపారాయణము జేయుదురో వారిని కమల పత్రమును జలమంటని విధమున మహాపాపాది పాపములు కొంచెము కూడ అంటవు

విశేషార్థము పంచమహాపాతకములే గాక ఉపపాతకములను జేసిన వారు సహా పవిత్రులగుదురని చెప్పుచుండగా ఇక సామాన్య మానవులను గురించి చెప్పవలయునా? మహాపాతకములను జేసిన పాపులు, ఇప్పుడు సామాన్యజనులలో ఉండరనియే తలంచెద -ఈసత్యమెరింగినచో వైద్యుడు రోగికి మందుఇవ్వవలయునా! రోగరహితున కివ్వవలయునా? యను సత్యము బోధపడగలదు

**గీతాయాశ్శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్ ।**
**ద్వౌత్రీనేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః ॥**

ఎవడు శక్తి గలిగియుండిన సంపూర్ణముగాని లేక, సగము గాని, లేక మూడింట నొక భాగముగాని, లేక ఆరింట నొకభాగముగాని, లేక యొక

యధ్యాయముగాని, అర్ధాధ్యాయముగాని, పదిశ్లోకములుగాని, 5 శ్లోకములుగాని, నాలుగు శ్లోకములుగాని, మూడు శ్లోకములుగాని, రెండు శ్లోకములుగాని, యొకశ్లోకముగాని, కట్టకడకు అర్ధశ్లోకముగాని పఠించుచున్నాడో, అతడుగూడ భగవత్కరుణకు పాత్రుడై తరించుచుండగా మఱల జనులారా! యేల గీతాపారాయణముచే తరించగూడదు? ఇక పారాయణము జేయుటకు శక్తిలేని ముసలివారు గూడ తరించుమార్గమును భగవానుడు ఉపదేశించెను

**గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।**
**వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥**

మహాపాపముతో గూడిన వాడయినను గీతార్థమును వినుట యందాసక్తుడగుచో వైకుంఠమును పొంది అచ్చట విష్ణువుతో కలిసి సంతోషముతో ఉండును

జనులారా! భగద్వాక్యమీలాగున ఉండగా మరల మీరు ఏల సందేహపడవలసి యుండును? ఏనుగున కుండవలసిన ఆహారము, చీమకక్కఱలేదు కదా! కడుపునిండు సుఖము, ఏనుగుకున్ను చీమకున్ను, ఒకే విధముగా నుండునటుల శక్తి కొలది ఒక్కశ్లోకమున్ను పారాయణముజేసిన జాలును కృతార్థులు గాగలరు ఇక ఒక సందేహము జనులలో వ్యాపించియున్నది అందుచేతను గీతాపాయణమునకు చాలామంది భయబడుచున్నారు ఆ సంశయమేమనగా గీతాపఠనములో అక్షరదోషములు వచ్చినచో లేక మమూలు పారాయణములో ఒక రోజు తప్పిపోయినచో మహాపాపముగలుగునని తలంచుచున్నారు ఈ విషయమై భగవానుడు ఉపదేశించినది చూడుడు

**నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।**
**స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥**

ఈ గీతాపారాయణము నందు ప్రారంభించినది మొదలుగా ఒక రోజు తప్పినను దోషములేదు ఈ గీతాపారాయణము యొక్క అల్పభాగము అయినను గొప్పదైన సంసారభయమునుండి రక్షించుచున్నది కావున భయపడకుడు!

# భక్తియోగము

**పొత్తపిలో జరిగిన సప్తాహమునకు పంపిన సందేశము**

1 పరిశుద్ధమైన జ్ఞానమున్నూ, శాంతియు, కరుణయుగల ప్రియమైన సోదరీ సోదరులారా! భగవత్ప్రాప్తికి (అనగా మోక్షమునకు) అనేక మార్గములు పరమఋషులు బోధించినారు వానిని నాల్గు విభాగములుగా చేసిరి కృతయుగమున జ్ఞానము, త్రేతాయుగమున యోగ తపస్సులు, ద్వాపరమున యజ్ఞయాగములు, కలియుగమున నిర్మలమైన భక్తియు సాధనములని తెలిపిరి ఇవి శాస్త్రములలో ప్రసిద్ధములు వానిని గురించి అనేక ఉపన్యాసములను మీరు వినియుందురు అనేక శాస్త్రములను పఠించి యుందురు అవి యన్నియు సముద్రములవలె అపారములు విస్తరించి యిప్పుడు తెలుపం బూనలేదు ఒక్కొక్క సంస్కారజీవి పై జెప్పినవానిలో నొక్కొక్క మార్గము నవలంబించును అయితే పై జెప్పిన నాల్గింటిలోను నాలుగు యుగములలోను భక్తి యొకటి కలిగియుండినమాత్రమే మోక్షము గలుగునని ఋషులందరు నంగీకరించిరి ఎంతశ్రేష్ఠములైన విత్తనము లైనప్పటికిన్నీ, సారవంతమైన భూమి గలిగియుండినను వర్షములేనిచో ఏలాగున వృక్షమై పూర్ణఫలము నివ్వజాలదో ఆలాగున పైజెప్పిన మార్గము లన్నిటిలోను భక్తి గలిగియుండిన మాత్రమే పూర్ణావస్థను పొందగలరు ఇప్పుడు భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు అష్టమాధ్యాయమున తెలిపిన దానిని నిరూపించెద

**అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।**
**తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥**

ఓ యర్జునా! ఏ యోగి యితరవిషయమైన చింత లేనివాడై బ్రతికి యున్నంతవరకును ఎడతెగక నన్ను స్మరించుచుండునో, సర్వకాలముల యందును సమాహితచిత్తుడైన అట్టియోగికి నేను సులభుడనై యుందును ఈ శ్లోకమునకు ముందు ఓంకారధ్యానపరముగా పరబ్రహ్మప్రాప్తిని పొందెడు విషయమై తెలిపి పిమ్మట ఈ శ్లోకము నుపదేశించుటవల్లను 'తస్యాహం సులభః పార్థ' అని ప్రయోగించుటవల్లను పైన చెప్పినది కఠిన మార్గమనిన్ని, ఇది సులభమార్గమనిన్ని స్పష్టమగుచున్నది సులభమార్గ ముండగా కఠినమార్గమును ఏల అనుసరించవలెను? సముద్రమునకున్ను నదులకున్ను పరస్పర సంబంధము గలిగియున్నట్లు

సర్వేశ్వరునికిన్నీ జీవులకున్నూ సంబంధము గలదు సముద్రములోనికి చేరువరకు మాత్రమే నదులు వేరుగాను సముద్రము వేరుగాను కనపడును సముద్రములో ప్రవేశించిన నదులన్నియు ఒకేమహాసముద్ర మగునట్లు, జ్ఞానముచేగాని, యోగతపస్సులచేగాని, యజ్ఞయాగములచేగాని, భక్తి యగు ఉపాసనా మార్గముచేగాని పరమాత్మని చేరువరకు మాత్రమే యీ భేదము లుండును భక్తి యోగమందు సర్వజనులకు సర్వకాలములలోను సర్వావస్థలలోను ఉపాసించుటకు ధ్యానించుటకు మార్గము గలదు అందుచేతనే యిది సులభమార్గమని చెప్పుటకు కారణమైనది తక్కినవి కఠినము లగుటయేగాక సర్వజనులకున్నూ అధికారముకూడ లేదు

2 ఇక మీరు ఆలోచించవలసినది నియమములను, అనగా అనుష్ఠానములను మనము సరిగా చేయుచున్నామా? అని మాత్రమే ఇచ్చుటనే చాలమందిన్నీ దారితప్పిపోవుచున్నారు కావుననే 'నానుష్ఠానాత్పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే' తన అనుష్ఠానములో కొరత గలుగక చూచుటకన్న మించిన కార్యము మూడులోకములలోను మరియొకటి లేదని పరమ ఋషులు వచించిరి కావున మీ అనుష్ఠానములో కొరత కలుగక చూచుకొనియున్న చాలును తప్పక మీరు ముక్తిని పొందగలరు ఇది సత్యము



# ఉత్తరాయణము

ఉత్తరాయణమనియు, దక్షిణాయణమనియు ప్రసిద్ధములు వీనిని దేవకాలమనియు, అసురకాలమనియు పెద్దలు వచింతురు ఈ ఉత్తరాయణము మకరసంక్రమణమునుండి ప్రారంభ మగుచుండును శాస్త్రములలో లోతుగ దిగిచూచిన దేవతలనియు, అసురులనియు పేర్లు గలవారు మనుష్యులనియే తేలుచున్నది దైవగుణమునుబట్టి దేవతలనియు, అసురుగుణమును బట్టి అసురులనియు కనబడుచుండును నిజముగా ఆలోచించిన ఇదే సత్యమని గోచరించును శ్రీకృష్ణభగవానుడు గీతలో దైవాసుర సంపద్విభాగమును గూర్చి 16-వ అధ్యాయమున ఈ ప్రకారముగానే చెప్పెను

**ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ॥ (16-1)**

ఓ అర్జునా! ఈ లోకమునందు దైవగుణముగల మానవులనియు, అసురగుణముగల మనుజులనియు రెండు తెగలుగలవారు గలరు "దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా" దైవగుణము గలవారు దైవమును అనగా మోక్షమును పొందుదురు అసురగుణము గలవారు భూత ప్రేత పిశాచములను పొంది బద్ధులగుదురు అయితే దైవగుణము గలవారు ఉత్తమగతిని పొందుట నైజము అసురగుణము గలవారు ఎల్లపుడు ఆలాగుననేయుండి బద్ధులగుటయా? వేరుగతిలేదా? యని సంశయింప బనిలేదు కావుననే భగవానుడు గుణములను గురించియే దైవాసురులు ఏర్పడుచున్నారని తెలిపెను గుణియగు ఆత్మయొకటియే పరిణామమును పొందక సనాతనమగు జ్ఞానగుణము గలిగియుండును సత్త్వాది గుణములు ఎల్లప్పుడు పరిణామ స్వభావము గలిగి యుండును కావున ఇప్పుడు ఉత్తరాయణము ప్రారంభమగుటచే దైవగుణములను సంపాదించుకొని అసురగుణములను త్యజించులాగున ప్రతివారును చూచుకొనవలయును వస్త్రములకు కారణమయిన దూది స్వతస్సిద్ధముగ తెల్లగనున్నప్పటికిని రక్త, కృష్ణ, పీత వర్ణముల ననుసరించి యేలాగున మారిపోవుచుండునో గుణములస్థితియు నీలాగున నుండును ఎరుపు, నలుపు రంగులుగల వస్త్రములైనను ద్రావకములో వేసి యుడకబెట్టి యుతికిన ఆ రంగులన్నియు వదలిపోవును అప్పుడు తనకిష్టమైన రోజారంగుగాని, పచ్చరంగుగాని యింకేరంగైనను వేసికొనవచ్చును కావుననే వస్త్రమునకు రంగులు స్వభావములు కావనియు అగంతుకములనియు చెప్పుటకు కారణము ఈ గుణములయొక్క పరిణామస్థితిని గీత 14-వ అధ్యాయమున శ్రీకృష్ణభగవానుడు విపులముగా తెలిపెను కావుననే

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే॥ (14-20)**

జీవుడు దేహోత్పత్తికి బీజభూతములగు సత్త్వరజస్తమోగుణములను మూటి నతిక్రమించి జననము, మరణము, వార్ధక్యము, దుఃఖములు అనువానిచేత

విడువబడినవాడై మోక్షమును పొందుచున్నాడు దైవగుణములు

**అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥**

**అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాన్తిరపైశునమ్ ।**
**దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥**

**తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత ॥ (16-1,2,3)**

ఓ యర్జునా! దైవాంశమునందు పుట్టినవారికి ఇట్టి దైవగుణములు గలుగుచున్నవి అవేవన 1 అభయము, 2 చిత్తశుద్ధియు, 3 జ్ఞానయోగమందుండుటయు, 4 దానమిచ్చుటయు, 5 బాహ్యేంద్రియ నిగ్రహము, 6 జ్ఞానయజ్ఞమును, 7 అధ్యయనమును, 8 తపస్సును, 9 కపటము లేకుండుటయు, 10 పరపీడావర్జనమును, 11 సత్యవర్తనమును, 12 కోపము లేకుండుటయు, 13 కర్మఫలత్యాగమును (సర్వసంగత్యాగమును), 14 శాంతిస్వభావమును (శమము), 15 కొండెము చెప్పకుండుటయు, 16 కరుణగలిగి యుండుటయు, 17 విషయలోలత్వము లేకుండుటయు, 18 మృదుస్వభావమును, 19 ధర్మవిరుద్ధ కార్యములలో లజ్జగలిగి యుండుటయు, 20 చంచలస్వభావము లేకుండుటయు, 21 బ్రహ్మతేజస్సు గలిగియుండుటయు, 22 ద్వంద్వముల సహించుటయు, 23 ఆపత్కాలమునందును ధైర్యము విడువ కుండుటయు, 24 బాహ్యాభ్యన్తరశుద్ధి గలిగియుండుటయు, 25 వరులకు ద్రోహము చేయకుండుటయు, 26 అభిమానము లేకుండుటయు - ఈ చెప్పబడినవే దైవగుణములు వీనికన్యమైన అసురగుణము లుండిన తొలగించుకొనవలయును "ఏతద్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా" ఇవి జ్ఞానగుణము లనియు దీని కన్యమయిన అసురగుణము లుండిన అది అజ్ఞానమనియు శ్రీకృష్ణభగవాను డుపదేశించెను కర్షకులు పొలములో వేసిన విత్తనములకు అన్యములగు కలుపులను తీసివేయునట్లు హృదయ క్షేత్రములో గల పై జెప్పిన దైవగుణముల కన్యములగు

అసురగుణము లుండిన తీసివేయవలయును అసురగుణములు ఈ 16వ అధ్యాయమునందే శ్రీకృష్ణభగవానుడు విస్తారముగ చెప్పెను అచ్చోట చూడవచ్చును ముఖ్యములగు కొన్ని అసురగుణములు మాత్రము ఇచ్చట తెలిపెద

**దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ (16-4)**

ఓ యర్జునా! ఇక అసురగుణముల వినుము 1 డంబము, 2 గర్వము, 3 దురభిమానము, 4 కోపము, 5 వాక్కారిన్యము, 6 అవివేకము - అను ఈ యారు దుర్గుణములు ముఖ్యములు మఱియు,

**ప్రవృత్తించ నివృత్తించ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ (16-7)**

అసురగుణములలో పుట్టిన జనులు ప్రవృత్తిమార్గమునుగాని, నివృత్తి మార్గమునుగాని ఎరుంగజాలరు వారియందు బాహ్యాభ్యంతర శుద్ధియు, సదాచార ప్రవృత్తియు, సత్యమును ఉండవు ఈ లక్షణములను చూచుకొనవచ్చును

**యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ (8-23)**

ఓ అర్జునా! యోగులు ఏ ఉత్తరాయణ కాలమునందు పోయిన వారగుచు పునర్జన్మ రాహిత్యమును పొందుచున్నారో ఆ కాలమును, ఏదక్షిణాయనకాలము నందు పోయినవారై పునర్జన్మమును పొందుచున్నారో ఆ కాలమును చెప్పుచున్నాను అనగా దైవగుణము గలవారు ఉత్తరాయణ మార్గముగాను, అసురగుణముగలవారు దక్షిణాయన మార్గముగాను పరలోకమునకు వెళ్ళుచుందురు

**అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్।**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ (8-24)**

అగ్ని అభిమానదేవతయు, జ్యోతి రభిమానదేవతయు, దివసాభిమాన దేవతయు, ఆరు మాసముల ప్రయాణముగల ఉత్తరాయణాభిమాన దేవతయునగు

సూర్యుడుండునట్టి శుక్లపక్ష మార్గమునందు బ్రహ్మవిదులైన జనులు పోయినవారగుచు పరబ్రహ్మమును పొందుచున్నారు ఇది ఉత్తరాయణమార్గము ఇచట అంతయు ప్రకాశమున్ను, తెలుపున్ను తెలియజేయబడినది

**ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ (8-25)**

ధూమాభిమానదేవతయు, రాత్ర్యభిమానదేవతయు, ఆరుమాసముల పరిమితిగల దక్షిణాయనాభిమాన దేవతయునగు చంద్రప్రకాశము గలది కృష్ణమార్గము ఆ మార్గమునందు పోయినయోగి మరలి వచ్చుచున్నాడు (పునర్జన్మమును పొందుచున్నాడు)

ఇచట సామాన్యులకు ఒక సంశయము గలుగును అదేమన కొందరు మహాత్ములు దక్షిణాయనమునందును, కొందరు మహాత్ములు ఉత్తరాయణము నందును దేహమును వీడుచున్నారు ఉత్తరాయణమున పోయినవారి కందరికి ముక్తియు, దక్షిణాయనమున పోయినవారి కందరికిని పునరావృత్తియు గలుగునా? కావుననే దైవగుణము గలవా డేకాలమున పోయినను ఆ మహాత్మున కది ఉత్తరాయణమనియు, అసురగుణముగలవా డేకాలమునందు పోయినను అతని కది దక్షిణాయనమనియు గ్రహించు కొనవలయును ఈ రహస్యమును ఉత్తరగీతయందు శ్రీకృష్ణభగవాను డుపదేశించెను ఉత్తరగీత అ 2

**దక్షిణే పింగళా నాడీ వహ్ని మండలగోచరా ।**
**దేవయానమితి జ్ఞేయం పుణ్యకర్మానుసారిణీ ॥**

దక్షిణమునందు అగ్నిమండల గోచరమైనదియు, పుణ్యకర్మముల ననుసరించి నట్టిదియు పింగళయను నట్టిదియు, నగు నాడి దేవయానమని తెలియదగినది ఇదే ఉత్తరాయణము.

**ఇడా చ వామనిశ్వాసా సోమమండలగోచరా ।**
**పితృయానమితి జ్ఞేయం వామమాశ్రిత్య తిష్ఠతి ॥**

ఎడమభాగమునందు శ్వాసముకలదియు, చంద్రమండల

గోచరమయినదియునగు ఇడ యనునాడిని పితృయానమని తెలియదగినది అది వామభాగము నాశ్రయించియున్నది ఇదే దక్షిణాయనము

గుణము ననుసరించియే మానవులలోని దైవాసురులు గలరని మొదటనే నిరూపింపబడినది దృష్టాంతముగ అసురకులమున ప్రహ్లాదుడు జన్మించినను దైవగణములో చేరినవాడాయెను కావుననే గీతలో " ప్రహ్లాదశ్చాస్మి దైత్యానామ్" అని తెలియపఱచబడినది దైత్యులలో ప్రహ్లాదుడు విష్ణుస్వరూపుడని భగవానుడే తెలిపెను ఆలాగున రాక్షసకులములో విభీషణుడు జనించినను దైవాంశములో జేరినవాడాయెను కావుననే శ్రీరామోదంతమున "విభీషణో విష్ణుభక్తిం వవ్రే సత్త్వగుణాన్వితః" విభీషణుడు సత్త్వగుణముతో గూడినవాడై విష్ణుభక్తిని వరించెను అని తెలుపబడెను విభీషణుని లక్షణము అధ్యాత్మరామాయణమున ఇట్లు వర్ణించడినది-

**తతో విభీషణో జాతశ్శాన్తాత్మా సౌమ్యదర్శనః ।**
**స్వాధ్యాయీ నియతాహారో నిత్యకర్మపరాయణః ॥**

రావణ కుంభకర్ణుల యనంతరము విభీషణుడు జన్మించెను ఎట్టివాడన శాంతాత్ముడును, సౌమ్యదర్శనుడును, అధ్యయనపరుడున్ను, నియమానుసారముగ నియమితాహారము భుజించువాడును, నిత్యకర్మ పరాయణుడునై యుండెను కావుననే రాక్షసకులములో జన్మించినను దేవగుణము గలవాడగుటచే దైవమును పొందుటకు కారణమయ్యెను కాన గుణమే ప్రధానముగాని కులము ప్రధానముగాదు

ప్రహ్లాదుని గుణములను చూడుడు-

**తనయందు నఖిలభూతములందు నొకభంగి**
**సమహితత్వంబున జరుగువాడు**
**పెద్దల బొడగన్న భృత్యునికైవడి**
**జేరి నమస్కృతుల్ సేయువాడు**
**కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన**
**మాతృభావము సేసి మరలువాడు**

తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనుల గావ జింతించువాడు

సఖులయెడ సోదరస్థితి జరుపువాడు
దైవతములంచు గురువుల దలచువాడు
లీలలందును బొంగులు లేనివాడు
లలితమర్యాదుడైన ప్రహ్లాదు డధిప.

ఆకారజన్మవిద్యార్థి వరిష్ఠుడై
గర్వసంస్తంభ సంగతుడు గాడు
వివిధమహానేక విషయసంపన్నుడై
పంచేంద్రియములచే పట్టుబడడు
భవ్యవయోబల ప్రాభవోపేతుడై
కామరోషాదుల గ్రందుకొనడు
కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన
వ్యసనసంసక్తి నావంకబోడు

విశ్వమందుగన్న విన్న యర్థములందు
వస్తుదృష్టి జేసి వాంఛ యిడడు
ధరణినాథ దైత్యతనయుండు హరి పర
తంత్రుడై హతాన్యతంత్రు డగుచు.

శ్రీవల్లభుడు దన్ను జేరిన యట్లైన
జెలికాండ్ర నెవ్వరి జేరమఱచు
సురారి దనమ్రోల నాడినయట్లైన
నసురబాలురతోడ నాడమఱచు
భక్త వత్సలుడు సంభాషించినట్లైన
బరభాషలకు మాఱుబలుకమఱచు
సురవంద్యు దనలోన జూచినయట్లైన
జొక్కి సమస్తంబు జూడమఱచు

హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినట్లైన నతడు
నిత్యపరిపూర్ణుడగుచు నన్నియును మఱచి
జడత లేకయె యుండును జడునిభంగి.

పానీయంబులు ద్రావుచుం గుడుచుచుం భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ నంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాదనం
ధానుండై మరచెన్ సురారిసుతు డేతద్విశ్వమున్ భూవరా!

వైకుంఠచింతా వివర్జితచేష్టుడై
 యొక్కడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనారూఢచిత్తుడై
 యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణుండింతియ కాని వేఱొండు లేదని
 యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుడను నిధానము గంటి నేనని
 యుబ్బి గంతులువైచు నొక్కచోట

బలుకు నొక్కచోట పరమేశు కేశవు
ప్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళితపులకుడై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు. (శ్రీమద్భాగవతము)



# పంచకోశములు

## యత్సత్యం తదుపాస్యతామ్

ఏది సత్యమో దానినే ఉపాసించవలయును

### 1. అన్నమయకోశము

కోశమనగా ఆచ్ఛాదకము కత్తిని ఒఱ యేలాగున కనపరచక మరుగు చేయుచుండునో, కోశకారక్రిమిని చర్మము ఏలాగున ఆచ్ఛాదనముచేసి తెలియకుండ చేయుచున్నదో, ధనమును పెట్టె యేలాగున కనపడనీయక చేయుచున్నదో, పొట్టు ఏలాగున విత్తనమును తెలియనీయక మఱుగుపఱచుచున్నదో, ఆలాగున ఆత్మను అన్నమయాది ఐదుకోశములు తెలియనీయక మరుగు పఱచుచున్నవి ఒక్క ఒఱ ఖడ్గమును కనుపడనీయక చేయుచుండగా పంచకోశములతో ఆచ్ఛాదనము చేయబడియుండు ఆత్మను ఏలాగున చూడగలము? అయితే ఒఱతీసివేయుటచే ఖడ్గమేలాగున స్పష్టముగా గోచరమగుచున్నదో, కోశకార క్రిమియొక్క చర్మమును తీసివేయగా నేలాగున దానిలోపలనుండు పురుగు కనబడుచుండునో, పెట్టె తెఱవగా లోపలనుండు ధనము ఏలాగున గోచరించుచుండునో, పొట్టును తొలగించగా విత్తనము ఏలాగున స్పష్టముగా తెలియబడున్నదో ఆలాగున ఆత్మానాత్మ విచారణమువల్ల అనాత్మ స్వరూపములగు పంచకోశములను నిషేధింపగా పంచకోశములకు సాక్షియగు ఆత్మ యెల్లరకున్ను గోచరమగును సృష్టిలోగల ప్రతి బీజములు, కాయలు, పండ్లు మొదలుగునవన్నియు, బెరడుచేత లేక పొట్టుచేత, చర్మముచేత ఆచ్ఛాదితములు చేయబడియే యున్నవి ఇది సృష్టియొక్క నియతి ఈలాగున ఆత్మయు అనాత్మచే మూయబడియే యున్నది అన్నమయకోశమనగా అన్నముచే ఉత్పత్తియైన స్త్రీ పురుషుల శుక్లశోణితములచే ఏర్పడి అన్నముచే వృద్ధినొంది అన్నములేనిచో క్షీణించి, క్షయించిపోవునదగుటచే ఈ దేహమునకు అన్నమయకోశమని పేరువచ్చినది

**దేహోఽయమన్నభవనోఽన్నమయస్తుకోశ**
**శ్చాన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః ।**

**త్వక్చర్మమాంసరుధిరాస్థిపురీషరాశిః**
**నాయం స్వయం భవితు మర్హతి నిత్యశుద్ధః ॥**

ఈ స్థూలదేహము అన్నమువలన నుత్పన్నమై అన్నమువలన జీవించుచు అన్నము లేనియెడల నశించునది కనుక అన్నమయకోశ మనబడును (ఖడ్గమును ఒఱ ఆచ్ఛాదించునట్లు ఆత్మ నాచ్ఛాదించుటవలన కోశమనబడును) ఈ దేహము త్వక్కు, చర్మము, మాంసము, రక్తము, ఎముకలు, పురీషము మున్నగువానియొక్క సముదాయమై మిక్కిలి హేయమైనది మఱియు నశ్వరమైనది కనుక నిట్టిదేహము నిత్యుడును పరిశుద్ధుడును నగు ఆత్మకాజాలదు (ఆత్మయనుట కర్హతయే లేదు)

**పూర్వం జనేరపి మృతేరపి నాయమస్తి**
**జాతః క్షణక్షణగుణోఽనియత స్వభావః ।**
**నైకో జడశ్చ ఘటవత్పరిదృశ్యమానః**
**స్వాత్మా కథం భవతి భావవికార వేత్తా ॥**

ఈ దేహము ఉత్పత్తికి బూర్వము లేనిది (జననకాలమందు మాత్రము ప్రతీతమై) మరణానంతరము ఉండదు ప్రతిక్షణమునను మారుచుండును సదా ఏకరూపమున నుండదు జడమై ఘటమువలె దృష్టనష్టస్వభావము గలది ఇట్టి నశ్వరశరీరము దాని భావవికారములను దెలిసికొనెడి నిత్యాత్మ యెట్లగును? (కాదనుట)

అరటిపట్టలు ఊచను(బొందెను) ఏలాగున మరుగు పఱచుచున్నవో, ఒక్కొక్కపట్టను తీసివేయుచో, బొందెను ఏలాగున పొందుచున్నారో, మౌంజీ బంధనముకొఱకు దర్భయొక్క పట్టలను తీసివేసి లోపలనుండు ఈనెను ఏలాగున గ్రహించుచున్నారో, ఆలాగున పంచకోశముల నొక్కొక్క దానిని నిరసించి సాక్షియగు చైతన్యాత్మను కనుగొనవలయును.

**పంచకోశాది యోగేన తత్తన్మయ ఇవ స్థితః ।**
**శుద్ధాత్మా నీలవస్త్రాది యోగేన స్ఫటికో యథా ॥**

స్వచ్ఛమైన స్ఫటికము, నలుపు, ఎఱుపు, పసుపు, వస్త్రముల యొక్క

సన్నికృష్టసంబంధముచేత ఆయయా స్వరూపమును వ్యవహారమునందు పొందినలాగుననే యీ పరిశుద్ధమైన ఆత్మయు అన్నమయాది కోశముల యొక్క తాదాత్మ్యాధ్యాసమువల్ల ఆయాస్వరూపమును బొందినట్లు తోచుచున్నప్పటికిని శ్రుతి యుక్త్యనుభవములచేత విచారించినట్లయితే ఆపంచకోశములతో నేమియు సంబంధ మాయాత్మకు లేదని చక్కగా తెలిసికొనవలయును

ఒక మానవుడు ఒక బనియన్, ఒకషర్టు, ఒకకోటు, ఈలాగున ఐదింటిని ధరించియుండునట్లు గ్రహించుకొనుడు ఈ ఐదింటిలో 1 గాని 2గాని, 3గాని, 4గాని తీసివేసినప్పటికిని శరీరమేలాగున కనుపించదో, ఐదింటిని తీసివేయునప్పుడు మాత్రమే దేహమెట్లు స్పష్టముగా కనుపించునో, ఆలాగున ఐదుకోశములును విచారణచేత తొలగించునప్పుడే చైతన్యాత్మ స్వరూపము గోచరించును అయితే ఐదుకోశములు లేనిచో మానవుడేలాగున జీవించగలుగునని సందేహము గలుగవచ్చును తొలగించుటనగా పంచకోశముల ధర్మములు ఆత్మకాదని విచారణచేసి, నిషేధించి సాక్షియగు శాశ్వతచైతన్యాత్మ స్వరూపుడు తానని తెలిసికొనుటయే యని గ్రహించవలయును

**దేహేన్ద్రియాదావసతి భ్రమోదితాం**
**విద్వానహన్తాం న జహాతి యావత్ ।**
**తావన్న తస్యాస్తి విముక్తివార్తా**
**వ్యస్త్వేష వేదాన్తనయాన్తదర్శీ ॥**

శాస్త్రవేత్త స్థూలదేహము, పంచేంద్రియములు, పంచప్రాణములు, బుద్ధి మొదలగువానిని దెలిసికొని సత్తాశూన్యములగు నీ దేహాది విషయములందు భ్రాంతిజెంది, నేను మనుష్యుడను, పండితుడను, కృశుడను, బధిరుండను అను నీమొదలగు నధ్యాసములు గలిగియుండును ఈ అహంతా మమతలు ఎంత పర్యంతము విడువకుండునో అంత పర్యంతము మోక్షమను శబ్దము వినుట మట్టుకేగాని వానికి ముక్తి యెంత మాత్రము ప్రాప్తింపదు ఆ విద్వాంసుండు వేదాంత సిద్ధాంతములను సంపూర్ణముగ దెలిసికొని వేదాంతవిచారపరు డయినప్పటికి భ్రమబుద్ధి విడువదేని (అపరోక్షజ్ఞానము కలుగదేని) వానికి తత్త్వజ్ఞానప్రాప్తి లేదు

నేను బ్రాహ్మణుడను, సంన్యాసిని బ్రహ్మచారిని, యోగిని, తపస్విని, స్త్రీని, పురుషుడను - ఈ భావములన్నియు దేహమునకు సంబంధించినవే, వీనిలో భావన కలిగియుండిన అదియు ఆత్మను కోశమువలె మరుగుపరుచును కావుననే జనకునికొఱకు అష్టావక్రమునీంద్రుండు ఈలాగున తెలిపెను

**దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక ।**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీ భవ ॥**

ఓ నాయనా! జనకమహారాజా! నీవు దేహమే నేను అను పాశముచేత చిరకాలమునుండి యీ సంసారమునందు బంధింపబడిన వాడవయినావు ఇప్పుడు దేహవిలక్షణ ఆత్మయను బోధమనెడు ఖడ్గముచే ఆ భవపాశమును ఛేదించి సుఖస్వరూపుడవు గమ్ము

దేహమునం దభిమానము గల్గి ఆత్మాభిమానము లేనివాడు దేవాలయమునం దభిమానము గల్గి దేవుని మరచినవానితో సమానుడు లేక గృహమందు అభిమానము గలిగి గృహయజమానిని ఉపేక్షించినవాని వంటివాడే యగును, శ్రీకృష్ణభగవానుడున్ను గీతయందు ఈలాగుననే వచించెను

**ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

ఓ యర్జునా! ఈ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది అనగా దీనిని క్షేత్రధర్మమును ఎవడెరుంగునో వానిని క్షేత్రజ్ఞుడని తెలియందగినది మూడు దేహములును, మూడు దేహముల దర్మములును ఏయాత్మ ఘటదృష్ట న్యాయముగా తెలిసికొనుచున్నాడో, అందువల్ల ఆత్మయీ మూండింటికిన్ని సాక్షిగా భగవత్స్వరూపముగా ఉన్నాడు ఇట్టి దేహస్థిరతకొఱకు, శాశ్వతత్వముకొఱకు, నిర్మలత్వము కొఱకు చేసెడు కల్పసేవనము హఠయోగాది గ్రంథములలో చెప్పబడిన ధౌతి, నేతి, వస్తి మొదలగు షట్క్రియలలోను, అసనములలోను మగ్నులయి అదే గొప్పదని తలంచువారు అశాశ్వతమైన దానిని శాశ్వతమని తలంచి భ్రమ నొందిన వారలే వీరున్ను సత్యము నుపాసింపక అసత్యము నుపాసించువారే. అయితే

శరీరేంద్రియముల శుద్ధి శాశ్వతాత్మను సత్యాత్మను కనుగొనుటలో ఉపయోగపడునని తలంచి కాయసిద్ధిని చేసికొను మాత్రమయిన మంచిదే అది అందరికిన్ని అవసరమే

**యద్వాచాఽభ్యుదితం నేదం యేన వాగువవద్యతే ।**
**తదేవ బ్రహ్మ విద్ధి త్వం నేదం యత్తదుపాసతే ॥**

ఏ బ్రహ్మస్వరూపము వాక్కుచే ప్రకాశింపజేయబడదో, ఏస్వయంప్రకాశమగు బ్రహ్మముచే వాగింద్రియము ప్రకాశింపజేయబడునో అదియే బ్రహ్మమని నీవు తెలిసికొనుము ఏనామరూపాత్మకమైన వస్తువు బ్రహ్మమని ఉపాసించెదవో అది యీ బ్రహ్మముకాదు -

ఓమ్

## 2 ప్రాణమయ కోశము

ఇది ప్రాణమయకోశ మనబడును కోశశబ్దార్థము మొదట నిరూపించడమైనది. ఖడ్గమును ఒఱ కనుపఱచనీయక మూసివేయునట్లు ఈప్రాణమయకోశము ఆత్మను తెలియనీయక మరుగుపఱచును ఒఱను తీసివేసిన కత్తి కనబడునట్లు ఐదుకోశములను నిషేధించిన ఆత్మగోచర మగును అనేకయోగులు, తపస్వులు మొదలైనవారలు ప్రాణాయామపరులై యుందురు వారిలో కొందరు తమకు సమానమైనవారలు మరియెవ్వరును లేరని తలంతురు ప్రాణనిరోధముచే ఘంటలు, దివసములు, వారములు, పక్షములు, కొన్ని నెలలవఱకు భూగర్భమందు పెట్టెలోనుండి పైనమట్టితో కప్పివేసియుండువారు ఇప్పుడుగూడ గలరు వారు సమాధి స్థితిలోనికి వెళ్ళునపుడు ఏ స్థితిలో ఉంటున్నారో తిరుగ లేచునప్పుడు అదేరీతిలోనే యుంటున్నారు ప్రత్యేకమైన ఆత్మవికాసముగాని, విజ్ఞానోదయము గాని కనుపించుటలేదు వీరు ఐదంతస్థుల మేడపై ఉండువారిని చూచుట కొఱకు రెండవ యంతస్థులోపలనుండి చూచేలాగున నుంటున్నారు ఐదంతస్థులు దాటినతర్వాత కనబడదగినవారిని రెండవ అంతస్థులోనుండి ఎట్లు చూడగలరు? లేక పంచప్రాకారములతో కూడియుండు దేవాలయమందుండు దేవుని,

రెండవప్రాకారములో నుండి యెట్లు దర్శింపగలరు? లేగ ఐదుకోటలతో కూడియుండు సార్వభౌముని రెండవకోటలో నుండి దర్శించుటకుగాని, మాట్లాడుటకుగాని, సంగతి తెలిసికొనుటకును ఎట్లు సాధ్యపడును? ఆలాగున రెండవకోశమగు ప్రాణమయములో చిక్కుకొనినవాడు ఐదుకోశముల కావలనుండు పరమాత్మనెట్లు దర్శింపగల్గును? ఎట్లైక్యము చేయగల్గును? ఐతే ఈ ప్రాణనిరోధము వ్యర్థమని మామతము గాదు దానివల్ల దేహేంద్రియముల శుద్ధియు, శీతోష్ణముల సహనమున్ను గలుగునదేగాక బ్రహ్మావధారణమునకున్ను దీర్ఘాకాలము చిత్తైకాగ్రతతో బ్రహ్మాచింతనము చేయుటకు తగిన శక్తి గలుగును గాలిలేనిచోట నిశ్చలముగా వెలయుచుండు దీపమువలె నతనిమనస్సు ఎంతకాలమైనను చనలములేక యుండవచ్చును సముద్రములో ప్రయాణముచేయు నావకు అనుకూలమైన వాయువు గలిగియుండిన, తెరచాప సహాయముచే వేగశక్తి గలిగి గమ్యస్థానము ఎంతత్వరలో చేరవచ్చునో, ఆలాగున ద్వంద్వములతో గూడిన సంసారసాగరమును తరించ ఇచ్ఛగల ముముక్షువునకు ఈ ప్రాణసంయమము అంత యుపకరించును అయితే ఇది సాధనమేగాని, సాధ్యముమాత్రము కాదని జ్ఞప్తిలో నుంచుకొనవలయును ఇది గమ్యము కాదనియు, గమనమనియు, హృదయములో నుంచకపోయిన, అహంకారము జనించుటకు కారణమగును ఎండాకాలములో కప్పలు, చిన్నరకము ఎంద్రకాయలు, కొన్ని నత్తగుల్లలు, భూమిలోపల ఆరుమాసములుండి వానాకాలము వచ్చినపుడు మరల బయటకు వచ్చుచుండును, అయితే కప్ప కప్పగాను, ఎంద్రకాయ ఎంద్రకాయగాను, నత్తగుల్లలు నత్తగుల్లలుగాను వచ్చుచుండునేగాని, మరి యేవిధమైన పరిణామము కలిగి వచ్చుటలేదు, ప్రాణసంయమముగల యోగికి, ఒక నూరుసంవత్సరములుగాని, వెయ్యి సంవత్సరములుగాని, పదివేల సంవత్సరములుగాని, యౌవన ప్రాయముతో, సుందరగాత్రముతో జీవించుట ఒకలెక్కలో జేరినదేకాదు దైవానుగ్రహముగలిగిన భక్తుడుగాని బ్రహ్మజ్ఞానముగలిగిన జ్ఞానిగాని పైన నిరూపించిన యోగిని, ఒక దీర్ఘజీవిగా మాత్రమే తలంచునుగాని, మరియేమియు అబ్బురపడడు ఇట్లు చెప్పుటచే ప్రాణాయామమును బొత్తిగా త్రోసివేయవలదు బుద్ధిసూక్ష్మతకు,

ఆరోగ్యమునకు ఇది యెంతయో యుపయోగపడును

**నైవాత్మాపి ప్రాణమయో వాయువికారో**
**గన్తాఽగన్తా వాయువదన్తర్బహిరేషః ।**
**యస్మాత్కించిత్క్వాపి న వేత్తీష్టమనిష్టం**
**స్వం వాన్యం వా కించన నిత్యం పరతన్త్రః ॥**

ప్రాణమయకోశము సయితము ఆత్మకాదు ఇది వాయువికారము "ప్రాణో నాత్మా భవితుమర్హతి, వాయువికారాత్" ఈ అనుమానమువలన ప్రాణమునకు, అనాత్మత్వము సిద్ధించుచున్నది మఱియు ప్రాణము బాహ్యావాయువువలెనే, లోపలకు వెలుపలకును గమనాగమనముల జేయును అందువలన ప్రాణము ఆత్మకాదు కనుకనే ప్రాణము ఇష్టానిష్టములను ఎంతమాత్రము ఎప్పుడును, దెలియజాలదు ఆ ప్రకారమే తననుగాని, అన్యమునుగాని యెంతమాత్రము ఎఱుంగదు ఎల్లప్పుడు పరతంత్రమైనది అనగా ఆత్మాధీనమై, ఆత్మప్రసాదముననే, క్రియాసమర్థ మగుచున్నది

**కర్మేంద్రియైః పంచభిరంచితోఽయం**
**ప్రాణో భవేత్ప్రాణమయస్తు కోశః ।**
**యేనాత్మవానన్నమయోఽన్నపూర్ణాత్**
**ప్రవర్తతేఽసౌ సకలక్రియాసు॥**

వాగాది పంచకర్మేంద్రియములతో గూడిన ప్రాణమే ప్రాణమయ కోశమనంబడును ఈ ప్రాణమయకోశ సంశ్రయమువలన అన్నమయ కోశము అన్న పూరితమై, ప్రాణాపానాది వాయుపూరితమై ఆత్మశబ్దవాచ్యమగు అహంప్రతీతికి విషయమై, ప్రాణయుక్త స్థూలశరీరము గమనాది సకలక్రియలందును బ్రవర్తింపగలుగుచున్నది ఇట్లు అన్వయ వ్యతిరేకములచే విచారింపగా అన్నమయకోశమువలెనే ప్రాణమయకోశము సయితము ఆత్మకాదు అని అభిప్రాయము

అన్నమయకోశములను నడుపుటలో ప్రాణమయము ముఖ్యమగుట వలన

దీనికి ప్రాణమయకోశమని పేరు వచ్చినది వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలనెడు కర్మేంద్రియములైదున్ను ప్రాణాపానవ్యానోదాన సమానము లనెడు పంచప్రాణములతో కూడినదగుటచే ఇది ప్రాణమయకోశ మనంబడును

**హృది ప్రాణో గుదేఽపానస్సమానో నాభిసంస్థితః ।**
**ఉదానః కణ్ఠదేశస్థో వ్యానస్సర్వశరీరగః ॥**

హృదయమందు ప్రాణము, గుదస్థానమందు అపానము, నాభిస్థానమందు సమానము, కంఠదేశమందు ఉదానము, సర్వశరీరమందు వ్యానము స్థితిచేయుచున్నవి వీని ధర్మములు పంచీకరణశాస్త్రమందు గనందగును

కంఠోపనిషత్తు చూడుడు -

**న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన ।**
**ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ ॥**

ప్రాణముచే గాని, అపానముచేతగాని, ఒకానొక మనుష్యుడున్ను జీవించుటలేదు ఏయాత్మయుండగా ఈ ప్రాణాపానములు ఆశ్రయించియున్నవో అట్టి ప్రాణాపాన వ్యతిరిక్తములైన ఆత్మచేతనే (మర్త్యులు) ప్రాణములను ధరించుచున్నారు

ప్రేరేపింపబడున దగుటచేతనే ప్రాణశబ్దము కలిగినది ఆత్మ ప్రేరణచేత ప్రాణములు పనిచేయుచున్నవి ప్రాణాయామము చేయువారికి ఇది స్పష్టముగా గోచరించును ఎట్లన ఇన్ని మాత్రలకాలము పూరించవలయును ఇన్ని మాత్రల కాలము కుంభించవలయును, ఇన్ని మాత్రలకాలము రేచించవలయును హృదయమందుగాని, భ్రూమధ్యమందుగాని నాభియందుగాని, నిలుపవలయును బాహ్యాకుంభకమందుగాని, ఆంతరకుంభకమందుగాని నియమించ వలయును - అనుకార్యములను చేయించుటవల్ల ప్రాణము జడము, ప్రేరేపించు ఆత్మయే చైతన్యము స్థూలసూక్ష్మములకు చిన్నది, పెద్దది యని భేదమేగాని వస్తువు ఒకటియే ఈ స్థూలమైన వాయువు ఎటువంటిదో సూక్ష్మమైన ప్రాణవాయువును అటువంటిదే అందువల్లనే జడమని చెప్పుటకు కారణమైనది స్థూలమైన వాయువును జీవులు

పీల్చుచున్నవి సూక్ష్మమైన లోభాగములోగల వాయువును బయటకు విడుచుచున్నారు పూరక రేచకములు చేయువారికి ఇది స్పష్టముగా కనబడుచునేయున్నది వాయుశక్తిచే ఎన్నియో యంత్రములు, ఎన్నియో విధములగు పనులను చేయుచున్నవి ఇది వాయువు తన స్వబుద్ధితో చేయుచున్నదా లేక ప్రజ్ఞగల మానవుడు చేయించుచున్నాడా? అని తెలుసుకొనిన ఈ శరీరమగు యంత్రమును ప్రాణవాయువుచే ఏ యాత్మ నడుపుచున్నదో యా సత్యము తెలియగలదు మఱియు నిద్రలో ప్రాణవాయువు నాసికారంధ్రములద్వారా బయటికి వచ్చి పోవుచున్నది అత్తరి శబ్దస్పర్శ రూపరస గంధముల జ్ఞాన మేదైన ప్రాణవాయువునకు కలదా! కాలసమయముగూడ ప్రాణవాయువు ఎరుంగగలదా! ఇటువంటి జడమైన ప్రాణనియమమును గొప్పగా తలంచువారి ప్రజ్ఞయేమని చెప్పవచ్చును

ఈ విషయమై కౌషీతకీ ఉపనిషత్ యొక్క వివరణమగు ఆత్మపురాణమున ఆజాతశత్రుడగు కాశీరాజునకును బాలాకియను బ్రాహ్మణునికిన్ని గల సంవాదము చదివిన ఈతత్త్వము ఎల్లరకును తేటపడును ఈ గాధ చాలా పెద్దదగుటచే సంగ్రహముగా మాత్రము ఇచ్చుట వ్రాయబడును

గర్గగోత్రోత్పన్నుడును బలాకనామముగలవాడును నగు ఒక బ్రాహ్మణుడు షడంగసహితముగ నాలుగు వేదముల నధ్యయనము చేయువాడై ధర్మనిష్ఠుడుగా నుండెను వానికి బాలాకియను పేరుగల యొక పుత్రుడు పుట్టెను ఆ బాలాకి పితృసమానుడుగనే వేదవేదాంగములయందు కుశల బుద్ధిగలవాడాయెను ఐనను-నేను సర్వబ్రాహ్మణులందు శ్రేష్ఠుడనియు, నాతో సమానముగ ఎవడును విద్వాంసుడు లేడనియు ఇట్లు విద్యామదముచేతను, ధనమదముచేతను, యౌవనమదముచేతను ఆవిష్టుడైన ఆ బాలాకి బ్రాహ్మణునకు ధర్మమందు నిష్ఠ గలుగలేదు ఆ బాలాకి సకలదేశస్థపండితులను జయించుటకొఱకు హిమాచలమునుండి సేతుబంధ రామేశ్వర పర్యంతము కురు పాంచాల కాశీ మిధిలాది సకలదేశములందు సంచరించుచుండెను సకలదేశములందు ప్రసిద్ధకీర్తిగలవాడును, అత్యంత వాచాలత గలవాడును, ఆత్మభిన్నములైన సకలానాత్మపదార్థములను ఎరిగినవాడును, ఆత్మసాక్షాత్కార రహితుడును, ప్రాణమునే

ఆత్మయని యెరిగినవాడు నయిన, ఆ బాలాకి బ్రాహ్మణుడు పాంచాలాది దేశములందు స్థితి గలవారైన బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యాదులైన అనేక పండితులను జయించెను జయముచే పుష్టుడై, అత్యంతాభిమానముచే యుక్తుడై, ఆ బాలాకి కాశీదేశస్థ పండితులను జయించుటకొఱకు కాశీదేశమునకు వచ్చెను అచ్చట ఒక కాశీరాజును విడిచి తక్కిన కాశీదేశమందు గల సమస్తపండితులను జయించెను

మరల ఆ బాలాకి బ్రాహ్మణుడు అజాతశత్రు నామకుడైన కాశీరాజును జయించుటకొఱకు ఆ రాజువద్దకు వచ్చెను

సకల ధర్మాత్మపురుషులందు ప్రముఖుడును, వినయముచే యుక్తుడును, సత్యమందు స్థితిగలవాడును, మాహాత్ముల సేవయందు తత్పరుడును, తన బలముకన్న అధికబలముగల శత్రువెవడును భూమండలముమీద పుట్టకుండుటవలన అజాతశత్రువని నామము పొందినవాడును అథవా - కామ క్రోధాహంకారాది శత్రువర్గము నశించుటవలన అజాతశత్రువని నామము పొందినవాడును, శత్రుమిత్రాది సకల జనులందు సకల పదార్థములందు సమానబుద్ధి గలవాడునునైన, ఆ అజాతశత్రు రాజుయొక్క సభను పొంది ప్రసంగము లేకయే మదాంధుడైన ఆబాలాకి, రాజునుగూర్చి యిట్లనియెను - ఓ రాజా! నీవు బ్రహ్మజ్ఞాన రహితుడవు జననమరణరూప సంసారసముద్రమందు మునుగిన వాడవు కావున నీకు నేను బ్రహ్మోపదేశము చేసెదను, సావధానుడవై శ్రవణము చేయుము" ఈ ప్రకారమగు బాలాకివచనము వినుటచే రాజు అత్యంత హర్షనిర్భరుడై వానినిగూర్చి యిట్లనెను, ఓ బాలాకీ! "నీకు నేను బ్రహ్మోపదేశము చేసెదనని" నీవు పలుకుచున్నావు, ఆ వచనముచే నా హృదయమందు పరమానంద మయినది

ఓ బాలాకీ! నీవు ఉపదేశము చేయుము చేయకపొమ్ము, నీకొఱకు సహస్రగోవుల దానము చేసెదననిచెప్పి రాజు అప్పుడే శాస్త్రవిధిపూర్వకముగా వెయ్యిగోవులను దానము చేసెను ఆ బాలాకి తనగురువునుండి బ్రహ్మస్వరూపము నెట్లెరింగెనో అట్లే బ్రహ్మోపదేశము రాజునకు చేయ నారంభించెను

వ్యష్టిరూపముగలదైన అధ్యాత్మము, సమష్టిరూపము గలదైన అధి దైవము ఏవిగలవో, ఆ అధ్యాత్మ అధి దైవరూపప్రాణమే బ్రహ్మము ఈ ప్రకారముగ

అవ్యాకృత బ్రహ్మపర్యంతము విశేషప్రాణరూప బ్రహ్మమును బాలాకి యెరిగియుండెను దానినట్లే రాజునకు కథనముచేసెను అయినను అవ్యాకృతమునకన్న అతీతమైన నిర్గుణ బ్రహ్మమును బాలాకి యెరుగనే లేదు ఇక రాజునకేమి చెప్పును? బాలాకి కృతోపదేశము విని విని ఆ బాలాకినిగూర్చి రాజు "ఇదినేను మొదలే యెరిగియున్నాను, ఇదినేను మొదలే యెరిగియున్నాను" ఈ ప్రకారవచనముచేతను, నిషేధ బోధక హస్తచేష్టచేతను, ఆయాసంగతి యొక్కఖండన ప్రవాహమును నడిపెను (ఈమధ్య అనేక విషయములుగలవు అదియిచ్చట వ్రాయలేదు) ఓ బాలాకీ! నీకు పూర్వోక్తమునకన్న అధికజ్ఞానముగల పక్షమందు నాకు చెప్పుము ఈ ప్రకారమైన రాజవచనము విని, బాలాకి యిట్లనెను హేరాజన్! నే నెట్టి బ్రహ్మోపదేశము చేసితినో, అదియే నాగురువు నాకు బోధించినది, దానికన్న అధికోపదేశము చేయలేదు కావున పూర్వోక్త కార్య బ్రహ్మస్వరూపముకన్న భిన్నమైన నిర్గుణబ్రహ్మ స్వరూపము నే నెరుగను'-రాజు-ఓ బాలాకీ! ఏ పరమాత్మ జగదుత్పత్తి స్థితిలయములకు కారణమగునో, ఆపరమాత్మయే బ్రహ్మ శబ్దమున కర్థము ఆపరమాత్మయే బ్రహ్మశబ్దజనన జ్ఞానమునకు విషయము ఈ ప్రకారమైన రాజవచనము వినినపుడు సకలాభిమాన రహితుడై, ఆ బాలాకి, రాజునే తన గురువుగా నిశ్చయించు కొనెను

రాజు-ఓ బాలాకీ! ప్రాణాది జడపదార్థములకన్న భిన్నమై దేశకాలవస్తు పరిచ్ఛేదరహితమై స్వప్రకాశానంద స్వరూపమై యే ఆత్మకలదో వానిని నీవు బ్రహ్మరూపముగా నెరుగుము ఈ ప్రకారమైన రాజవచనము విని ఆ బ్రాహ్మణునకు విశ్వాసము కలిగెను అట్టి బాలాకి బ్రాహ్మణుని గురించి అన్వయవ్యతిరేకములచే జడప్రాణమునకు అనాత్మత బోధనచేయుటకొఱకు రాజు తాను ఆసనమునుంచి లేచి బాలాకియొక్క హస్తమును పట్టుకొని రహస్యార్థము, సభయందుపదేశము గూడదను యభిప్రాయముచే అంతఃపురమందు ప్రవేశించెను అచ్చట అంతః పురద్వార దేశమందు ఒక పురుషుడు నిద్రించుచుండెను సకలేంద్రియములు చేష్టారహితములై కేవలము ప్రాణము మాత్రము వానియందు చలించుచుండెను ఆ సుప్త పురుషుని సమీపమున నా ఇద్దరును స్థితులై, బాలాకికి అభిమతమైన

ప్రాణాత్మతను నివృత్తి యొనర్చుటకై రాజు ప్రాణనామములచే ఉచ్చస్వరమున నా సుప్త పురుషుని మేల్కొల్ప నారంభించెను హే ఆదిత్య! హే చంద్రమా! హే బృహత్! హే పాండునీరగా! ఈ ప్రకారముగా ప్రాణముయొక్క సమష్టి రూప ప్రతిపాదితములైన నామములను ఉచ్చస్వరములచే నుచ్చారణచేసి రాజు ప్రాణమును పిలిచెను అయినను ప్రాణము మేల్కొనలేదు ఎందుకనగా ప్రాణము అచేతనము దృష్టాంతము జడమైన ఘటమును ఓ ఘటమా! ఓ కంబుగ్రీవా! ఓ జలధారీ! ఇత్యాదినామములచే పిలిచినను, ఆ ఘటము తన్ను ఎరుగదు పిలుచువానిని ఎరుగదు అందువలన ఘటము అచేతనము, అట్లే ప్రాణమున్ను అచేతనము, ఇట్లు రాజు చెప్పుటచే బాలాకి, ఘటన్యాయముగ ప్రాణ మచేతనమని నిశ్చయించుకొనెను

దీనివల్ల ప్రాణమయకోశమును జడముగా తెలియుడవ్వైనది ఐదుకోటలతోకూడిన రాజభవనమునకు అన్నమయము మొదటికోట యనియు, ప్రాణమయము రెండవకోటయనియు, కర్మేంద్రియము లైదున్ను ప్రాణమును స్థూలశరీరమును సంరక్షించునట్లు ద్వితీయకోటను పాలించువారలే కర్మేంద్రియములైదున్ను ప్రాణమున్ను ఉండునట్లు గ్రహించవలయును ఈ విషయమై కేనోపనిషత్తు చెప్పినది చూడుడు

**యత్ప్రాణేన ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే॥**

ఏ బ్రహ్మము (ఉచ్ఛ్వాస నిశ్వాసరూపముగనుండు) ప్రాణవాయువుచే (వాసనలను గ్రహించునట్లు) గ్రహింపజాలదో (చైతన్యస్వరూపమగు) ఏ బ్రహ్మముచే ప్రాణము చేష్టగలదిగా నగుచున్నదో, అదియే బ్రహ్మమని నీవు తెలుసుకొనుము నామరూపక్రియలు గల దీనిని, నీవు బ్రహ్మముగా ఉపాసన చేయకుము

## 3. మనోమయకోశము

ఇది మూడవ కోశమగును ఇప్పటికి మనము రెండుకోశములు దాటి

వచ్చినాము మూడవదిన్ని కోశమగుటచే కత్తిని ఒఱ మూసిపెట్టునట్లు ఈ మనోమయకోశమున్ను ఆత్మను తెలియనీయక మరుగుపఱచును 5 అంతస్థులపై నుండువానిని మూడవ అంతస్థులో నుండువాడు ఏలాగున చూడజాలడో, ఆలాగున మనోనిగ్రహము గలిగి సంకల్పరహితులై యుండువారు తమను అందరికన్న గొప్పవారుగా తలంచి మోసపోవుచున్నారు అయితే మనోనిగ్రహముతో సహా మనోనిర్మలత్వము గూడ కలిగియున్నచో వారు చాలవఱకు మంచివారే, ఆలాగున మనోనిర్మలత్వము లేనిచో మనో నిరోధముగాని, ప్రాణనిరోధము గొప్పదని తలంచినచో తన్ను తాను వంచించుకొనినవాడే యగును అన్నమయ, ప్రాణమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములమధ్య ఈ మనోమయకోశ ముండును ఇచట మానవునియొక్క శక్తియంతయు, గుణములన్నియు గలిగియుండును ఈ స్థితి లోనికి వచ్చిన మానవుడు మానవత్వముయొక్క పూర్ణవికాసమును పొందిన వాడగును అన్నమయ ప్రాణమయకోశములు రెండున్ను పశుత్వముతో నున్ను, మనోమయకోశము పూర్ణమానవత్త్వముతోను, విజ్ఞానమయ ఆనందమయ కోశములు దేవత్వముతోను కూడియుండును ఈ మనోమయకోశము దాటినచో తరువాత దేవత్వముతో సమీపించిన వాడగుటచే మరల అతనికి మనోజయమందు ప్రయాసముండదు సంకల్పములుగూడ చాలవరకు శాంతినొందును మరల అతనికి ఆధ్యాత్మిక ప్రయాణములో అంత యాటంకములు ఉండవు

అన్నమయ ప్రాణమయములు రెండున్నూ తమోగుణముతోను, మనోమయము రజోగుణముతోను, విజ్ఞాన ఆనందమయ కోశములు సత్త్వగుణముతోను కలిసియుండును కావుననే పశ్వాదులు తమోగుణముతో కూడినవనియు మనుష్యులు రజోగుణముతో కూడినవారనియు, దేవతలు సత్త్వగుణముతో కూడిన వారనియు చెప్పుదురు మనోమయములో నున్నప్పుడు తుఫాను చెలరేగి భయంకర కల్లోలములచే ఒడుదుడుకులుగల సముద్రములో ప్రయాణముచేయు నావయొక్క స్థితి గలిగియుండును ఈ అవస్థ దాటడము దుస్తరము అత్తరి కొన్ని ఓడలు మునిగిపోవుటగూడ సంభవించును కావుననే సంసారసాగరము దాటుటలో మనోనిగ్రహము చాలక చాలమందిన్ని పడిపోవుట

(పతనమొందుట) జరుగుగుచున్నది ఇచట ప్రకృతియొక్క ప్రతిఘటన మహాశక్తి వంతమై యుండును అచ్చోట దాటుటకు పూర్వపుణ్యాబలమున్ను, గురుదేవుని యనుగ్రహమున్ను, సర్వేశ్వరుని కరుణయున్ను, మహాత్ములగు ఋషుల ఆశీర్వాదమున్ను గలిగియుండవలయును ఇది దాటినచో మరల ప్రశాంతమై కల్లోలము లణగిన సముద్రములో, అనుకూలవాతావరణమున్ను ఏర్పడిన సాగరమునందు ఓడలో ప్రయాణము చేయువారికి ఎంత అనుకూలమున్ను, సంతోషమున్ను గలగియుండునో ఎంత నిరుపద్రవముగా ఉండునో, మనోమయము దాటిన వారికిన్ని అంత ఆనందము గలిగియుండును

**జ్ఞానేంద్రియాణి చ మనశ్చ మనోమయః స్యాత్**
**కోశో మమాహమితి వస్తువికల్పహేతుః ।**
**సంజ్ఞాది భేదకలనాకలితో బలీయాం**
**స్తత్పూర్వ కోశమభిపూర్య విజృంభతేఽయమ్॥**

శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియములును, మనస్సును గూడి మనోమయకోశ మనంబడును ఇందు మనస్సు ప్రధానమగుటవలన నిది మనోమయకోశమని చెప్పబడుచున్నది ఆత్మను ఆచ్ఛాదించి యుండుటవలన కోశమనంబడును ఈ మనోమయకోశము నాది, నేను, నా వస్తువులు, నా శత్రువులు, నామిత్రులు అను నీ మొదలగు నభిమానమునకును, నేను బ్రాహ్మణుడను, నేను సన్న్యాసిని, నేను స్త్రీని, నేను పురుషుడను నీ మొదలగు అహంభావముతో గూడిన వస్తుకల్పనకును హేతువగుచున్నది మఱియు నామజాత్యాది భేదకల్పన జేయుచు బలీయమైనదై ప్రాణమయకోశమునందు వ్యాపించి విజృంభించుచున్నది

**పంచేంద్రియైః పంచభిరేవ హోతృభిః**
**ప్రచీయమానో విషయాజ్యధారయా।**
**జాజ్వల్యమానో బహువాసనేన్ధనైః**
**మనోమయాగ్నిర్దహతి ప్రపంచమ్ ॥**

పంచేంద్రియములనెడి హోతృపంచకము విషయములనెడి ఆజ్యధారలచే

నతిశయించి వృద్ధియగును (అనేకజన్మ) వాసనలనెడు ఇంధనములచే నత్యంత ప్రచండమై యీ మనోమయకోశరూపాగ్ని ప్రపంచమును దహించుచున్నది

న హ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా
మనో హ్యవిద్యా భవబన్ధహేతుః ।
తస్మిన్వినష్టే సకలం వినష్టం
విజృంభితేఽస్మిన్సకలం విజృంభతే ॥

మనస్సుకంటె అవిద్య వేరుగ లేదు మనస్సే అవిద్య అనగా మనస్సునుండి అవిద్య పరిణమించి సంసారరూప బంధమునకు గారణమగుచున్నది మనస్సు నశించినయెడల కర్తృత్వభోక్తృత్వరూప సకల బంధములున్ను వినష్టమగును మనస్సు విజృంభిచెనేని సకల కర్తృత్వ భోక్తృత్వరూప సంసార విస్తృతి కలుగుచున్నది

సుషుప్తి కాలే మనసి ప్రలీనే
నైవాస్తి కించిత్సకలప్రసిద్ధేః ।
అతోమనః కల్పిత ఏవ పుంసః
సంసార ఏతస్య న వస్తుతోఽస్తి ॥

సుషుప్తి కాలమందు మనస్సు లయింపగా అనగా మనస్సు కారణరూపమును పొందియుండగా ద్వైమెంతమాత్రము స్ఫురింపదు ఇది లోకానుభవమే ఈ హేతువు వలన పురుషునకు కర్తృత్వ, భోక్తృత్వ రూప బంధము మనఃకల్పితమేకాని వాస్తవముగ లేదు ఇట్లు తెలిసికొనిన పురుషునకు సంసారబంధమే లేదని అభిప్రాయము

తస్మాన్మనః కారణమస్య జన్తో
ర్బన్ధస్య మోక్షస్య చ వా విధానే ।
బన్ధస్య హేతుర్మలినం రజోగుణై
ర్మోక్షస్య శుద్ధం విరజస్తమస్కమ్ ॥

ఈ జీవుని బంధమునకును, మోక్షమునకును, మనస్సే కారణము రోజుగుణ సంసర్గముచే మలినమై బంధహేతువగుచున్నది. రజోగుణ తమోగుణ

రహితమై శుద్ధసత్వప్రధానమగు మనస్సు మోక్ష హేతువగుచున్నది

**వివేక వైరాగ్యగుణాతిరేకా**
**చ్ఛుద్ధత్వమాసాద్య మనో విముక్త్యై ।**
**భవత్యతో బుద్ధిమతో ముముక్షో**
**స్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్యమగ్రే ॥**

పూర్వోక్త వివేక వైరాగ్యాది గుణములు వృద్ధియగు కొలది మనస్సు పరిశుద్ధమై మోక్షసాధనమగును, కనుక బుద్ధిమంతుడగు ముముక్షువు నిరంతర దృఢాభ్యాసమువల్ల వివేక వైరాగ్యాదులను సమగ్రముగా సంపాదింపవలెను

**మనోనామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు ।**
**చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః॥**

ధన, వనితాది విషయ ప్రపూర్ణమైన మహారణ్యమందు మనస్సనెడి పెద్దపులి సర్వదా సంచరించుచుండును కావున మోక్షాసక్తులగు సాధువు లావిషయారణ్యమున ప్రవేశింపకుందురుగాక!

**తన్మనః శోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా ।**
**విశుద్ధే సతి చైతస్మిన్ముక్తిః కరఫలాయతే ॥**

కావున మోక్షేచ్ఛగల పురుషుడు మనస్సును శుద్ధపరచవలెను మనస్సు పరిశుద్ధమగునేని ముక్తి హస్తామలకమువలె స్వతః సిద్ధమగును

**దృగ్దృశ్యౌ తౌ పదార్థౌ ద్వౌ పరస్పర విలక్షణౌ ।**
**దృగ్బ్రహ్మ దృశ్యం మాయా స్యాత్ ఇతి వేదాంతడిండిమః ॥**

దృక్కనియు, దృశ్యమనియు రెండు పదార్థములు గలవు ఇవి రెండును పరస్పర వ్యతిరేకస్వభావముకలవై యున్నవి ఇందు దృక్కు బ్రహ్మముగాను, దృశ్యము మాయగాను ఉన్నది అని వేదాంతభేరి మ్రోగుచున్నది

ఈ దృగ్దృశ్య ప్రమాణముచే మనస్సు దృశ్యమనియు మనస్సు యొక్క వృత్తిని ప్రకాశింపజేయువాడు ఆత్మయనియు అర్థమగుచున్నది ఈతత్త్వమును

ఏకాంతమున, ఏకాగ్రబుద్ధితో చూచిన గోచరమగును అప్పుడు మనోమయకోశము దాటవచ్చును అత్తరి మనోనిగ్రహము సులభముగా గలుగును మనస్సునకు నావలనున్నవాడు మనోనిగ్రహము చేయజాలడు మనస్సునకు ఆవల వెళ్ళునప్పుడు మాత్రమే మనోనిరోధము చేయగలుగును దీనికి ఒక దృష్టాంతము తెలిపెద ఒక పోలీసు సబ్ ఇన్స్పెక్టరు ఉన్నాడని తెలిసికొనుడు అతనియొక్క వృత్తులు మంచివి కావు అయితే అతని క్రిందనుండు జవానులు ఏమిచేయగలరు? అతని స్వభావము ననుసరించి ప్రవర్తించవలసియుందురు అయితే అతడు సూపరింటెండెంటు దగ్గరకు వెళ్ళునప్పుడు ఇతని చేష్టలెవ్వియు అచ్చట చెల్లవు మంచి సూపరింటెండెంటు ఆజ్ఞకు ఇతడు బద్ధుడై యుండవలసియుండును మనస్సు సబ్ ఇన్స్పెక్టర్ వంటిదనియు, విజ్ఞానమయ కోశము సూపరింటెండెంటు వంటిదనియు గ్రహించవలెను సంకల్పవికల్పాత్మకము మనస్సు బుద్ధి నిశ్చయాత్మక స్వరూపము సబ్యిన్ స్పెక్టర్ ఎన్ని విషయములు చెప్పినను సూపరింటెండెంటు దానిని త్యజించుటకుగాని గ్రహించుటకుగాని సవరణచేయుటకు గాని అధికారము గలిగియున్నట్లు విజ్ఞానమయకోశమున ప్రవేశించినచో మనస్సుచే గలిగెడు సంకటములెవ్వియు ఈ ఆత్మనిష్ఠునికి ఉండవు మనస్సు కన్న ఆత్మసాక్షిగా నుండుదానిని గ్రహించుటకు నొక యుపాయము తెలిపెద ఇది ముముక్షువులు స్వబుద్ధిచేతనే కనుగొనవలసి యుందురు, నామనస్సిప్పుడు అశాంతిగానున్నది నా మనస్సిప్పుడు ప్రశాంతముగానున్నది పూర్వము నా మనస్సు క్రూరముగా నుండినది ఇప్పుడు సాత్త్విక గుణముతో కూడినది నా మనస్సు దానిపై పోవుచున్నది అను మొదలగు వ్యవహారములచేత మనస్సు దృశ్యమని తెలిసికొనవచ్చునుగదా! పై జెప్పిన ప్రాణమయ కోశముకన్న మనోమయకోశము పైన నుండుటచేత దీనికి అధికారమున్ను శక్తియున్ను అధికరించియున్నది ఇది సార్వభౌముని కోటయొక్క మూడవ ప్రహరీలోపల నుండుటవల్ల అధికారమెక్కువ కలదయ్యెను ఈ మనస్సు ప్రాణమయ దేహాదులను నడిపే అధికారము గలదై యున్నది అయితే ఐదుకోటలకావల నుండు సార్వభౌముని మూడుకోటలలో నుండువాడెట్లు చూడగల్గును? కావున మానసిక శక్తిచేత, మనోజయముచేత, తాను సర్వజ్ఞుడనైతినని తలంచి మోసపోకూడదు ఈ విషయమై కేనోపనిషత్తు చెప్పినది చూడుడు -

**యన్మనసా న మనుతే యేనాహుర్మనోమతమ్ ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

ఏ బ్రహ్మస్వరూపము మనస్సుచే తలంచుట కశక్యమో ఏ బ్రహ్మస్వరూపముచే మనస్సుయొక్క స్వరూపము తెలిసికొనబడునో, అని చెప్పుచున్నారో అదియే సమస్తమున కాత్మయగు బ్రహ్మస్వరూపముగా నీవు తెలిసికొనుము మనస్సుతో కల్పింపబడిన ఆయా నామరూపములతో కూడినవానిని బ్రహ్మముగా ఉపాసన చేయకుము

అట్టి బ్రహ్మమును ఏల అందరున్ను ఎరుంగుట లేదని దానిని గురించి అనుభూతి ప్రకాశము తెలిపినది చూడుడు -

**న్యాయాగమాభ్యాం సిద్ధం చ శ్రద్ధాహీనః పరాఙ్ముఖః ।**
**న బుద్ధ్యతే శ్వేతకేతో! శ్రద్ధస్వాంతర్ముఖో భవ ॥**

అంతర్ముఖుడు కానివానికి న్యాయమువలనను, ఆగమము వలనను సిద్ధించిన వస్తువు తెలియబడదు కనుక నోశ్వేతకేతూ! శ్రద్ధగలిగి యుండుము అంతర్ముఖుడవు కమ్ము

మరియు ఆత్మపురాణమున తెపిపినది చూడుడు రాజు - బాలాకీ! మనస్సుయొక్క వృత్తిరూప ప్రకాశమేది కలదో అది స్వతంత్రముగ నెవనిని ప్రకాశముచేయదు అది చైతన్యాత్మయొక్క అపేక్షచేతనే పదార్థములను ప్రకాశము చేయును ఆ చైతన్యాత్మయొక్క అభాసమును గ్రహణముచేసి ఆ మనోవృత్తిరూప ప్రకాశము తన జడభావమును పరిత్యాగము చేయుచున్నది అథవా నానాప్రకార జ్ఞానముకలది అంతఃకరణమని శాస్త్రమందు చెప్పబడినది అదియును చైతన్యాపేక్షచేతనే సంభవించినది స్వయముగ అంతఃకరణము చైతన్యమైన పక్షమందు దానికి ఒకే ప్రకారజ్ఞానము సర్వదా గావలసినది అట్లగుటలేదు చైతన్యాపేక్ష అంగీకరించిన పక్షమందు ఆ దోషముండదు ఎందుకనగా ఏకాలమందు ఇచ్ఛాదులకు విలక్షణమైనట్టి చైతన్యముయొక్క ప్రతిబింబ గ్రహణయోగ్యత పుట్టునో ఆకాలమందే జ్ఞానముండును అన్యకాలమందుండదు ఈ ప్రకారమగు

నానాజ్ఞానము అంతఃకరణమందు సంభవించును ఈ జ్ఞానము తప్తాయః పిండన్యాయముగా నొందును ఇనుమునందు కాలేశక్తి లేనప్పటికిని అగ్ని సంయోగముచే దహనశక్తి ప్రకాశము గలిగినట్లుండును మనస్సునందు గల శక్తియు ఇటువంటిదే అమృతబిందూపనిషత్తు ఈ విషయమై తెలిపినది చూడుడు -

**మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాఽశుద్ధమేవచ ।**
**అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామ వివర్జితమ్ ॥**

మనస్సు శుద్ధమనియు అశుద్ధమనియు రెండు విధములు కామాది విషయములతో కూడిన మనస్సు అశుద్ధమనియు, కామాది విషయదోష రహితమయిన మనస్సు శుద్ధమనంబడును

**మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయో ।**
**బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥**

మానవులకు బంధమోక్షములను గలుగజేయుటలో మనస్సే కారణమగుచున్నది విషయాసక్తమైన మనస్సు బంధము కొఱకున్ను, నిర్విషయమైన మనస్సు మోక్షముకొఱకున్ను హేతువగుచున్నది

ఈ వాక్యముయొక్క సత్యమును తెలిసికొనక పోవుటవల్ల కొందరు నిషిద్ధాచారపరులై యుండియు పాపపుణ్యములకు మనస్సే కారణమని చెప్పుదురు ఈ శ్రుతి వాక్యముయొక్క పూర్వపాద అర్థమును మాత్రము వారు గ్రహించిరేగాని ఉత్తర పాదార్థమున చెప్పినది చూడకపోయిరి విషయాసక్త మనస్సు బంధమును కలుగజేయుచున్నదనియు, నిర్విషయమైన మనస్సు మోక్షము నిచ్చుచున్నదనియు వారు తెలిసికొనజాలకపోయిరి మరియు కార్యకారణముల ధర్మము ఎరింగియుండిన ఆలాగున చెప్పియుండరు కారణరూపమునుండి యేర్పడిన కార్యరూపము కారణవ్యతిరిక్తము గాజాలదు బీజము కనబడక పోయినను ఫల, పల్లవ, పుష్పలతాదులతో గూడిన వృక్షమును చూచి యేలాగున బీజమును దెలిసికొనుచున్నామో ఆలాగున మానవుని సంస్కారబీజములు కనుపించక పోయినను కార్యరూపములగు ప్రవృత్తులవల్ల కారణరూపము గ్రహించుకొనవచ్చును.

వీనియన్నిటియొక్క సారమేమన శుద్ధమన్సైనచో శుద్ధమైన, వర్తమున్ను అశుద్ధమనస్సైనచో అశుద్ధమైన వర్తనమున్ను కలిగియుండును

**యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తి రిష్యతే ।**
**అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ॥**

ఏ కారణమువల్ల నిర్విషయస్థితి బొందిన మనస్సునకే మోక్షము కలుగునని చెప్పబడెనో ఆ కారణమువల్ల ముముక్షువైనవాడు ఎల్లప్పుడున్ను మనస్సును నిర్విషయ మొనర్చుటకు యత్నించవలయును

ఇక నీ మనస్తత్త్వవిషయమై శ్రీ సీతారామాంజనేయము తెలిపినది చూడుడు -

**మనంబె స్థూలసూక్ష్మముల్ ప్రమాతృమానమేయముల్**
**మనంబె కామరాగ రోష మత్సరాది వృత్తులున్**
**మనంబె సర్వధర్మముల్ మనంబె బంధమోక్షముల్**
**మనంబె దృశ్యమంతయుం గ్రమంబుచే నెఱింగివన్.**

**సర్వసంసారమును మానసమున నొదవు**
**సర్వసంసారమును మానసమున నుండు**
**సర్వసంసారమును మానసమున నడగు**
**సర్వసంసారమును మానసంబెయగును.**

అది యెట్లంటేని

**మనసు సుషుప్తియందెనసి గ్రుగ్గిన నేమియు దోపకుండి య**
**మ్మన మటు మేలుకొన్నను సమస్తజగంబులు గల్గి తోచు, నీ**
**ఘనతర బంధమోక్షమయ కారణకార్యములెల్ల దానయై**
**యనిశములో వెలిందిరుగు నారయ నెమ్మన మట్లుగావునన్.**

## 4. విజ్ఞానమయ కోశము

దీనికిన్ని విజ్ఞానమయకోశమని పేరు గలగియుండుటచే కోశకారక్రిమిని

చర్మము కనపడనీయక చేయునట్లు ఇదిన్నీ ఆత్మను కనపఱచక ఆచ్ఛాదన మొనర్చును 3 అంతస్థులుదాటి వచ్చినను, 4-వ అంతస్థులో ప్రవేశించినను, 5-వ అంతస్థుపైనుండు ప్రభువును ఏలాగున చూడడో ఆలాగున విజ్ఞానమయకోశములో ప్రవేశించినను ఆత్మను దర్శింపజాలడు మనోమయకోశములను సంరక్షించువారికన్న, విజ్ఞానమయకోశములను పాలించువారు మరింత అధికులు, ప్రజ్ఞావంతులుగా నుందురు ఏలన మూడవ కోటను పాలించెడు ఉద్యోగులకన్న నాల్గవకోటను సంరక్షించెడువారు అధికులై బుద్ధిమంతులై యున్నట్లు ఇచ్చటగూడ గ్రహించుకొనవలయును పైపై అధికారుల ఆజ్ఞానుసారము క్రింది క్రింది ఉద్యోగస్థులు ప్రవర్తించునట్లు ఇచ్చోటను మనము గ్రహించు కొనవలయును జ్ఞానేంద్రియములైదున్ను బుద్ధియున్ను జేరి విజ్ఞానమయకోశ మగుచున్నది వీరు దేహమనెడు రాజ్యమును పాలించేవారిలో దొడ్డవారలు ప్రధాన మంత్రియొక్క ఆజ్ఞానుసారము తక్కిన ఉద్యోగస్థులందరు నడువవలసినవారై యుండునట్లు ఈ విజ్ఞానము ననుసరించియే తక్కిన యింద్రియములన్నియు పనులు చేయుచుండును

**బుద్ధిర్బుద్ధీంద్రియైః సార్థం న వృత్తిః కర్తృలక్షణః ।**
**విజ్ఞానమయకోశః స్యాత్పుంసః సంసారకారణమ్ ॥**

క్షణిక విజ్ఞానరూపమగు బుద్ధి జ్ఞానేంద్రియ పంచక సహితమును వాని వృత్తులతోడను, కర్తృత్వాద్యహంకారముతోడను గూడి, విజ్ఞానమయ కోశమనబడును ఈ విజ్ఞానమయకోశము పురుషునకు జన్మ మృత్యురూప బంధహేతువు కాబట్టి ఆత్మ కుపాధియైనను బుద్ధి ఆత్మకాజాలదు

**అనువ్రజచ్చిత్ప్రతిబింబశక్తి ర్విజ్ఞాన సంజ్ఞః ప్రకృతేర్వికారః ।**
**జ్ఞానక్రియావానహమిత్యజస్రం దేహేంద్రియాదిష్వభిమన్యతే భృశమ్ ॥**

హారమునందలి సూత్రమువలె జాగ్రదాద్యవస్థాత్రయమునందును, అనుగతమగు చైతన్యముయొక్క ప్రతిబింబము విజ్ఞానమయకోశ మనబడును ప్రకృతివికారమగు ఈ విజ్ఞానమయకోశమే జీవుడనబడును. ఈ జీవుడు, ఇది

శరీరము ఇది ఘటము నను నీ మొదలగు జ్ఞానముకలిగి నేను చేయుచున్నాను, నేను వ్రాయుచున్నాను అను నీ మొదలగు క్రియలందు కర్తృత్వాభిమానము గలిగి సంసార సుఖ దుఃఖముల ననుభవించుచుండును

దేహాది నిష్ఠాశ్రమ ధర్మకర్మ
గుణాభిమానః సతతం మమేతి।
విజ్ఞానకోశోఽయ మతి ప్రకాశః
ప్రకృష్ట సాన్నిధ్య వశాత్పరాత్మనః ॥
యదాత్మధీః సంసరతి భ్రమేణ ॥

ఈ విజ్ఞానమయకోశము పరమాత్మకు నత్యంత సన్నిహితమై యుండు కారణమున అతిప్రకాశమానమై జడములగు దేహేంద్రియాదులను ప్రకాశింపజేయుచు దేహస్థమై వర్ణాశ్రమ ధర్మములందును తత్తత్కర్మము లందును సత్త్వాదిగుణములందును తాదాత్మ్యమును పొంది సర్వదా వర్తించుచుండును ఈ హేతువు వలన విజ్ఞానమయకోశము ఆత్మకు ఉపాధియగును మఱియు దేహాదికమందు ఆత్మబుద్ధిగలిగి భ్రాంతిచే సంసారమందు పరిభ్రమించును

ఉపాధి సంబన్ధ వశాత్పరాత్మా
హ్యుపాధిధర్మానమభాతి తద్గుణః ।
అయోవికారానవికారవహ్నివ
త్సదైక రూపోఽపి పరః స్వభావాత్ ॥

అవికారియగు వహ్ని కాల్చబడిన యినుముయొక్క ఆకృతిని పొంది వికృతిగా కనబడునట్లు పరమాత్మబుద్ధి రూపోపాధియొక్క తాదాత్మ్య సంబంధమువలన కర్తృత్వభోక్తృత్వాది ఉపాధి ధర్మవిశిష్టుడైనట్లు తోచునే గాని స్వభావముచేత సర్వదా ఏకరూపుడు బుద్ధిధర్మము లాయన కెంత మాత్రమును లేవు

యావద్భ్రాన్తి స్తావదే వస్య సత్తా
మిథ్యా జ్ఞానోజ్జృంభితస్య ప్రమాదాత్ ।
రజ్జ్వాం సర్పో భ్రాంతికాలీన ఏవ
భ్రాన్తేర్నాశే నైవ సర్పోఽపి తద్వత్ ॥

త్రాడును చూచి యది సర్పమనుకొనుట బుద్ధిప్రమాదము ఎంతవరకు నీ మిధ్యాజ్ఞాన ముండునో, అంతవరకుమాత్రమే సర్పభ్రాన్తి యుండును ఆ భ్రాంతి తొలగగనే బుద్ధి తొలంగి యధార్థమగు త్రాడు మాత్రమే శేషించును ఆ విధముననే ఎంతకాలపర్యంతము జన్మ, మరణరూప, జీవత్వ ధర్మప్రతీతిరూపభ్రాంతి నిలిచియుండునో, అంతపర్యంతము మిధ్యాకల్పిత జీవసత్త యుండును ఆ భ్రాంతి నివారణ కాగా జీవభావము తొలగి ఆత్మసత్త స్ఫురించును

**అతో నాయం పరాత్మా స్యాద్విజ్ఞానమయ శబ్దభాక్ ।**
**వికారిత్వాజ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వ హేతుతః ॥**
**దృశ్యత్వాద్వ్యభిచారిత్వా న్నానిత్యో నిత్య ఇష్యతే ॥**

పూర్వోక్త కారణములవలన విజ్ఞానమయకోశము పరాత్మ కాదు ఏలయనిన నీ విజ్ఞానమయకోశము వృద్ధి క్షయాది వికారములు గలది జడము, పరిచ్ఛిన్నము అనగా నేకదేశి (ఒక యావరణములో నిమిడి యుండునది) దృశ్యము, వికారి, అనిత్యము కనుక పరమాత్మ కాదు వికారియనగా నా బుద్ధి యిప్పుడు మందమైనది పూర్వము తీక్ష్ణముగా నుండెను లేక నా బుద్ధికి ఇప్పుడు జ్ఞాపకశక్తి అధికరించినది పూర్వము జ్ఞాపకశక్తి యుండునదికాదు ఈలాటి పరిణామము వికారిత్వ మనంబడును ఆత్మ యెల్లప్పుడు నిర్వికారియై స్వయంప్రకాశమై బుద్ధ్యాది వికారములను చూచువాడగుటచే సనాతనుడు

ఇక ఆత్మపురాణమున తెలిపినది చూడుడు ఏదేది జడమో, పరిచ్ఛిన్నమో, దృశ్యమో అదియున్ను, తత్సాధనమున్ను వాస్తవముగా ఆత్మయందు వర్తింపవు ఈలాగున కార్యకారణ భావరహితమైన స్వయం ప్రకాశాత్మయే విజ్ఞానమయభోక్తకు వాస్తవస్వరూపము ఓ బాలాకీ! పూర్వపు నా ఉపదేశమువలన విజ్ఞానమయభోక్తాత్మను ప్రాణముకన్న భిన్నముజేసి ఎరుగుచున్నను విజ్ఞానమయభోక్త మిధ్యగాన తద్‌జ్ఞానమువలన మోక్షము గానేరదు శుద్ధాత్మయొక్క జ్ఞానముచేతనే యగును

ఆత్మబోధము -

**నిషిధ్య నిఖిలోపాధీన్ నేతి నేతీతి వాక్యతః।**
**విద్యాదైక్యం మహావాక్యైర్జీవాత్మ పరమాత్మనోః ॥**

సమస్తమైన కించిత్‌జ్ఞత్వ సర్వజ్ఞత్వాది రూపోపాధులను నేతినేతి అనే వేదవాక్యమువల్ల త్రోసివేసి ప్రతిబింబరూపమైన కించిద్‌జ్ఞని యొక్క సర్వజ్ఞనియొక్కయు భేదనివృత్తిపూర్వకమైన ఐక్యమును, భేదనివృత్తి పూర్వకమైన అఖండానందస్వరూపార్థమును తెలియజేసెడి మహావాక్యములచేత తెలిసికొనదగినది

**ఆత్మాఽవభాసయత్యేకో బుద్ధ్యాదీనీంద్రియాణ్యపి ।**
**దీపో ఘటాదివత్స్వాత్మా జడైస్తైర్నావభాస్యతే ॥**

రాత్రికాలమున గృహాంతరాళములోగల సామగ్రులన్నియు దీపముచేత ప్రకాశింప బడినప్పటికిని దీపము ఇంటిలోపలగల యే వస్తువుల చేతను ప్రకాశింపజేయబడునట్లు ఆత్మ అంతఃకరణాది వృత్తులన్నిటిని ప్రకాశింప జేసినప్పటికిన్ని బుద్ధ్యాద్యహంకారము మొదలైనవి, ఆ ఆత్మను ప్రకాశింపజేయనేరవని ముముక్షువు తెలిసికొనవలసినది

**జీవన్ముక్తిస్తు తద్విద్యాత్పూర్వోపాధి గుణాంస్త్యజేత్ ।**
**స సచ్చిదాది ధర్మత్వాద్భజే ద్భ్రమరకీటవత్ ॥**

లోకమందు పురుగును తుమ్మెద తీసికొనివచ్చి చేయవలసిన ఓంకారాది నాదప్రకారముగా చేసినమాత్రముచేతనే ఈ పురుగు తన్ను బాధించునను భయముగలదై తన తలంపును చలించకుండ దాని (తుమ్మెద) యందు ఉంచినమాత్రముచేత తనయందు పూర్వమున్న పురుగు ధర్మమును వదలి భ్రమరస్వరూపమును పొందినట్లు శ్రవణాదులచేత ఆత్మను విచారింపగా జీవధర్మమును వదలి సచ్చిదానందరూపమైన బ్రహ్మస్వరూపమును బొంది వృత్తిరహితమై యుండుటయే జీవన్ముక్తియనియు ముముక్షువు తెలిసికోవలసినది

అమృతబిందూపనిషత్తు-

**ఏక ఏవాత్మా మన్తవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు ।**
**స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులకు సాక్షియైయుండు ఒకటే యగు ఆత్మ మననము

చేయందగినది స్థానత్రయముల కతీతమగు ఆత్మను బొందినవానికి మరల పునర్జన్మము లేదు

## 5 ఆనందమయకోశము

ఆనందమయమున్ను ఒకకోశమగుటచే ఘటమందుండెడు దీపము ఘటావరణముచే ప్రకాశింపక ఉండునట్లు ఈ ఆనందమయకోశమున్ను స్వప్రకాశమైన ఆత్మను ఆచ్ఛాదనము చేయుచున్నది ఐదు కోటలలోపల నివాసము చేయుచుండు ప్రభువును నాలుగు కోటల దాటినవాడైనను ఎట్లు చూడజాలడో దీనియొక్క స్థితియు ఆలాగున నుండును లేక నాలుగు ప్రాకారములు దాటివచ్చిన భక్తులైనను నైదవ ప్రాకారములోపలఉండు దేవుని ఎట్లుచూడజాలరో దీనియొక్క స్థితియు ఆలాగున నుండును ఐదవకోశముగూడ దాటిన ప్రాకార పంచకమును దాటినవాడు దేవుని దర్శించునట్లు ఇతడున్ను పరమాత్మను దర్శింపగల్గును

**ఆనన్ద ప్రతిబింబ చుంబిత తనుర్వృత్తిస్తమోజృంభితా**
**స్యాదానన్దమయః ప్రియాదిగుణకఃస్వేష్టార్థలాభోదయః ।**
**పుణ్యస్యానుభవే విభాతి కృతినా మానన్దరూపః స్వయం**
**భూత్వా నందతి యత్రసాధుతనుభృన్మాత్రః ప్రయత్నం వినా ।**

తమోగుణ పరిణామమగు ఆనందప్రతిబింబయుక్త సూక్ష్మాంతఃకరణ వృత్తి ఆనందమయకోశ మనబడును ఈ ఆనందమయకోశము ప్రియ మోద ప్రమోదాది గుణములు గలది ఇష్టవస్తు ప్రాప్తి వలన పుణ్యపురుషులకు పుణ్య ఫలానురూపమున ప్రకాశించును అంతర్ముఖమైన బుద్ధివృత్తిగలవారలను తాను స్వయముగా ఆనందరూపమై ప్రసన్నులుగ చేయును అట్టి ఆనంద స్వరూపమున పవిత్రశరీర ధారులగు మహాత్ములకు నప్రయత్నముగనే ఆనందప్రాప్తి యగును

అవి (1) ఇష్టవస్తువును జూచుటవలన గలుగు సుఖము ప్రియము

(2) ఇష్టవస్తు ప్రాప్తివలన గలుగు సుఖము మోదము

(3) ఇష్టవస్తువు యొక్క అనుభవమువలన కలుగు తృప్తి ప్రమోదము

ఇచ్చట దృశ్యవస్తువులచే గలిగెడు ఆనందమునే ఆనందమయకోశమని తెలుపడమైనదేగాని ఆత్మానందము కాదని గ్రహించుకొనవలయును

ఆనందమయకోశము పరిణామము గల దగుటచే తాను దృశ్యమగుటచేతను కోశమని నిరూపించడమైనది

**ఆనన్దమయకోశస్య సుషుప్తౌ స్ఫూర్తిరుత్కటా ।**
**స్వప్న జాగరయోరీషదిష్టసందర్శనాదినా ॥**

సుషుప్తి యవస్థయందు (వృత్తులంతఃకరణమందు లీనమై యుండుటవలన) ఆనందమయకోశముయొక్క ప్రతీతి అధికమై యుండును స్వప్నజాగ్రదవస్థల యందు ఇష్టవస్తు సందర్శనాది బాహ్యకారణములవలన ఆనందమయకోశ ప్రతీతి తక్కువై యుండును

**పంచానామపి కోశానాం నిషేధే యుక్తితః శ్రుతేః ॥**
**తన్నిషేధావధిః సాక్షీ బోధరూపోఽవశిష్యతే ॥**

యుక్తిచేతను శ్రుతిప్రమాణములచేతను అన్నమయాది పంచకోశములను నిషేధింపగా సర్వసాక్షియు బోధస్వరూపుడును నగు పరమాత్మ శేషించును

**యోఽయమాత్మా స్వయంజ్యోతిః పంచకోశ విలక్షణః**
**అవస్థాత్రయ సాక్షీ సన్నిర్వికారో నిరంజనః ।**
**సదానన్దః సవిజ్ఞేయః స్వాత్మత్వేన విపశ్చితా ॥**

అట్లు శేషించిన పరమాత్మ స్వయంప్రకాశస్వరూపుడు, పంచకోశ విలక్షణుడు, జాగ్రదాద్యవస్థాత్రయమునకు సాక్షియునై స్వమహిమతో ప్రకాశించుచుండును నిరంజనుడు, సర్వదా ఆనందస్వరూపుడునగు అట్టి పరమాత్మయే తన యాత్మస్వరూపముగ తత్త్వజ్ఞానియైనవాడు తెలిసికొనవలెను దీనియందుగల పంచకోశములను గురించిన భాగమంతయు వివేకచూడామణి ననుసరించి వ్రాడయమైనది

ఆత్మబోధము-

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞాన చక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్ ॥**

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాడు తప్ప అందరును చూచినప్పటికిని వాడు ఆ సూర్యుని చూడనేరనట్లు సచ్చిదానందాత్మ సర్వత్ర వ్యాపించి యున్నప్పటికిని శ్రవణాదులవల్ల విచారించి తెలిసికొన్న ఆత్మజ్ఞానియే ఆ యాత్మను తన్నుగా జూచుచున్నాడుగాని దేహేంద్రియాదులను ఆత్మగా భ్రమించిన అజ్ఞాని చూడలేనందున అందరికిని ఆ యాత్మ యగపడదనుట

అనాత్మాది పంచకోశములనుండి ఆత్మను ఏలాగున వేరుపరచవలయునో ఆ విధానము శాస్త్రముచే నిరూపింపబడినది చూడుడు

**యధా తిలగతం తైలం గూఢం తిష్ఠతి సర్వదా ।**
**తధా త్వం సర్వలోకేషు గూఢ స్తిష్ఠసి శంకర! ॥**

ఏలాగున నువ్వులలో నూనె అంతట గూఢముగా స్థితి చేయుచున్నను కనుపించుట లేదో ఆలాగున ఓ సర్వేశ్వరా! నీవు సమస్తములోను గూఢమై యుండుటచే తెలియుటలేదు నువ్వులను గానుగలోపోసి యాడుటచే నూనె యేలాగున కనబడుచున్నదో ఆలాగున ధ్యానజ్ఞానములచే నీవున్ను వ్యక్తమగుచున్నావు

**యధాకాష్ఠ గతో వహ్నిః సంస్థితోఽపి న లభ్యతే ।**
**మూఢైస్సర్వత్ర సంస్థోఽపి తధా త్వం నైవ లభ్యసే ॥**

ఏలాగున అగ్ని యెల్లప్పుడున్ను కట్టెయందున్నప్పటికిన్ని లభించుటలేదో, యెవరైతే కట్టెను మధింతురో వారికేలాగున అగ్ని లభించునో, ఆలాగున శరీరాది పంచకోశములలో ఆత్మ యెల్లప్పుడున్ను వ్యాపించి యుండినను ప్రయత్నహీనులైన మూఢులచే లభింపబడునది కాదు

**యధా దధిగతం సర్పి ర్నిగూఢత్వేన సంస్థితమ్ ।**
**చరాచరేషు భూతేషు తధా త్వం దేవ సంస్థితః ॥**

ఏలాగున పెరుగునందు (పాలయందు) ఘృతము అంతట ఉన్నప్పటికిన్ని కనుపించుటలేదో, తరచువారికి మాత్రము ఏలాగున లభించుచున్నదో, ఆలాగున ఓ సర్వేశ్వరా! నీవు చరాచర భూతములలో ఎల్లప్పుడును స్థితి గలిగియుండినను ఆత్మచింతన ధ్యానానుష్ఠానములు చేయనివారికి కనపడువాడవు కావు

**యథా జలం ధరావృష్ఠాత్ఖనన్నాప్నోతి మానవః ।**
**తథా త్వాం పూజయన్నిత్యం మోక్షమాప్నోత్యసంశయమ్॥**

ఏలాగున భూమియంతర్భాగములో ప్రవహించు జలము పై భాగమున కనపడకపోయినను, నూయి త్రవ్వెడు మానవుండు ఏలాగున ఉదకమును పొందుచున్నాడో, ఆలాగున సర్వేశ్వరా! నీ వంతట నుండువాడవైనను నిన్ను ధ్యానించనివారు తెలిసికొనుటలేదు పూజించువాడు పొందుచున్నాడు అతడు ముక్తినిగూడ బడయుచున్నాడు దీనియందేలాటి సందేహమున్ను లేదు

**ఏవమాత్మారణౌ ధ్యాన మథనే సతతం కృతే ।**
**ఉదితాఽవగతి జ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥**

లోకమందు అరణి అనగా కొయ్యమీద కొయ్యనుంచి చిలికిన మాత్రముచేత అగ్నిహోత్రము పుట్టి ఆ కొయ్యలను దహించునట్లు అంతఃకరణమందు మనస్సునుంచి ధ్యానముచేత దృఢముగా భావించినచో జ్ఞానము గలిగి మూలాజ్ఞానమును బొత్తుగా నశింపజేసి సర్వపరిపూర్ణుని జేయుచున్నది

**ఆత్మాన మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।**
**ధ్యాన నిర్మథనా భ్యాసా ద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥**

ఆత్మను క్రిందఅరణిగాను ప్రణవమును పై అరణిగాను చేసి అనగా జీవాత్మయందు పరమాత్మ స్వరూపమగు ప్రణవము నమర్చి ధ్యానమనెడు మథనమును ఎవడు చేయుచున్నాడో, దారువునందు గుప్తమై యుండు అగ్ని, మథనమువల్ల ప్రజ్వలించునట్లు తనలో నిగూఢమైయుండు ఆత్మను చూడగల్గును

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః ।**
**జీవస్సర్వ మలాన్ముక్త స్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

అపరంజిబంగారు మలినలోహముతో కలిసి తన సువర్ణత్వము తెలియక హీనత్వము పొందినప్పటికిన్ని దానికి జేయవలసిన పుటాది సంస్కారములచేత దానియందుండు మాలిన్యము నివర్తింపబడి బంగారు తనకు తానే ప్రకాశించునట్లు జీవుడును శ్రవణాద్యభ్యానమువల్ల సకల సంసారహేతుభూతమైన మూలాజ్ఞానమువల్ల నివర్తింపబడినవాడై తనకు తానే ప్రకాశించుచున్నాడు

**యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽవ్యహం యుతః ॥**

**యథైవహి సువర్ణాదిక్షారాదేః శోధితం శుభమ్ ।**
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥**

ఏలాగున బంగారము, వెండి, రాగి, ఇత్తడి మొదలగు లోహములతో కలసిపోయి తెల్లబంగారమైన స్వల్పమైన వెలగల దగుచున్నదో ఆలాగున జీవుడుగూడ ఈశ్వరస్వరూపుడై యున్నప్పటికిన్ని అహంకారాది ప్రకృతిగుణములతో కూడినప్పుడు దీనావస్థను పొందుచున్నాడు అయితే ఈ జీవునిగతి యింతేనా? కాదుకాదు ఏలాగున తెల్లబంగారము స్పుటము చేయునప్పుడు శుద్ధబంగార మగుచున్నదో అపుడేలాగున పూర్వముండిన విలువను పొందుచున్నదో ఆలాగున సంస్కారముచే జీవుడున్ను శుద్ధుడై శివత్వమును పొందుచుండును

**తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా ।**
**నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలమ్ ॥**

**జీవస్య తండులస్యేవ మలం సహజమవ్యలమ్ ।**
**నశ్యత్యేష న సందేహ స్తస్మాదుద్యమవాన్భవ ॥**

కర్మ, మాయ, అవిద్య, అజ్ఞానము జీవునకు జన్మాంతర కర్మచే పుట్టుకతోగూడ వచ్చునదైనను చేయవలసిన క్రియలు చేయగా ఆకర్మ నశించును ఎట్లన బియ్యము పుట్టుకతో తౌడు పొట్టులతోకూడ వచ్చినదైనను దంచుటచే ఏలాగున తొలగిపోవునో, రాగి పుట్టుకతో చిలుముతోగూడ వచ్చినదైనను స్పుటము చేయుటచేత ఏలాగున నివర్తిగలుగుచున్నదో ఆలాగున జీవునియొక్క

మాలిన్యమున్ను చేయవలసిన క్రియవల్ల నశించును జీవునకు జన్మాంతరకర్మ బియ్యమునకువలె తౌడు పొట్టులున్ను, తామ్రమునకు చిలుమున్ను సహజమై యున్నప్పటికిన్ని చేయవలసిన క్రియవల్ల నశించునట్లు జీవుని మాలిన్యమున్ను తప్పక నశించును సందేహములేదు కావున ప్రయత్నపరుడవు కమ్ము అని వాసిష్ఠము



# సామరస్యము

ఏ సామరస్యమనగా గృహస్థులయొక్కయు, సన్న్యాసుల యొక్కయు పరస్పరసామరస్యమని గ్రహించుకొనవలయును

ప్రపంచములో నేకార్యమయినను సాధించవలసియుండిన వీరుభయులును పరస్పరము సంబంధముతో నుండవలయును పూర్వ ఋషులనుండి నేటివరకాలోచించినను ఈ సత్యము గనుపించుచునే యున్నది వేదకాలములో పరమ ఋషులు లోకక్షేమముకొరకు అహింసాపరమగు యజ్ఞముల నాచరించిరి ఆలాటి యాగములకు కావలసిన సంభారము లన్నిటిని భూపాలురు, శ్రీమంతులును సమకూర్చిరి నేటికిని ఎచ్చటనైనను ఆధ్యాత్మిక జ్ఞానసంబంధ సభలుగాని, సత్రయాగములుగాని, సప్తాహములుగాని జరుగుచుండిన ఆధ్యాత్మిక జ్ఞానసమ్పన్నులగు మహాత్ములు ధర్మబోధలను చేయుచున్నారు వీరికిని అతిథులకును భోజనాది సౌకర్యము లన్నిటిని గృహస్థులు జేయుచున్నారు ఆధ్యాత్మిక జ్ఞానములేని వట్టి గృహస్థులు మాత్రము సమావేశమైనను అచ్చోటికి జిజ్ఞాసులెవరైన ఏతెంతురా? అన్నపానాదులకు అనుకూలపడని స్థలమున సన్న్యాసులు మాత్రము సమావేశమైన అచ్చోటికి ముముక్షువు లెవరైనను అరుదెంతురా? అనాదినుండి సృష్టిలోనే యీశ్వరుం డీనియమము నేర్పరచియున్నాడు కావుననే గీతలో

**దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః ।**
**పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥**

ఈ యజ్ఞముచేత దేవతలను తృప్తిపరచుడు ఆ దేవతలు మిమ్ము తృప్తి

పొందింతురుగాక! అన్యోన్యము తృప్తిని పొందుచున్నవారై, మీరుభయులు మిక్కిలి శ్రేయస్సును పొందుడు అని చెప్పబడెను

ఇచ్చట దేవతలనగా దైవజ్ఞానమును దెలిపెడు సన్న్యాసులనియు, యజ్ఞము జేయువారు గృహస్థులనియు గ్రహించుకొనవలయును ఈ గృహస్థులయొక్కయు, యతులయొక్కయు అనుష్ఠానము సరిగా నుండినచో నుభయులును పొందెడు గమ్యస్థాన మొకటియేయని శ్రీ కృష్ణభగవానుని ఆశయము వారుభయుల ధర్మమును ఇరువురును అనుష్ఠించిన మోక్షము సమానమని భగవదాశయము

**సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।**
**ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విన్దతే ఫలమ్ ॥**

శాస్త్రజ్ఞానము లేనివారు కర్మయోగమును, జ్ఞానయోగమునున్ను భిన్నమార్గములనుగా జెప్పుచున్నారు వీరు పిల్లవారివంటివారలు పండితులు అనగా శాస్త్రజ్ఞానము గలవారటుల చెప్పరు

నిష్కామకర్మయోగమందైనను లేక జ్ఞానయోగమందైనను రెండింటిలో ఒక్కదానినైనను చక్కగా నాచరించినవారు ఒకే మోక్షమునే పొందుచున్నారు అనగా గృహస్థుడైనను, సన్న్యాసియైనను వారి కేర్పడిన విధిని చక్కగా ననుష్ఠించిన ఉభయులును ఒకే గమ్యమునే జెందెదరు వీరిలో ఒకడధికుడు, ఒకడు కనిష్ఠుడని చెప్పుటకు లేదు వారివారి స్థానములలో వారు వారధికులే సన్న్యసించినమాత్రమున సన్న్యాసికి విధించిన అనుష్ఠానము లేనిచో అతడేమి యాధిక్యమును పొంద గలుగును? అలాగున గృహమేధికి విధించియుండు విధులును లెస్సగా అనుష్ఠించు గృహస్థునకెటు లాధిక్యత లేకపోవును? ఆత్మజ్ఞానము ఒకజాతికిగాని, ఒక ఆశ్రమమునకుగాని సంబంధించినది గాదు ఆత్మశుద్ధిగలవా రెవరైనను దానిని పొందగలరు

**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥**

ఏమోక్షస్థానము సాంఖ్యయోగులచేత పొందబడుచున్నదో, ఆ మోక్షస్థానము

నిష్కామకర్మయోగులచేతను పొందబడుచున్నది ఎవడు నిష్కామకర్మ యోగముయొక్క లక్ష్యమున్ను, సన్న్యాసయోగముయొక్క లక్ష్యమున్ను ఒకటియని చూచుచున్నాడో వాడే చూచినవాడు తక్కినవాడు చూడనివాడు అనగా నీలాగున నుభయులయొక్క లక్ష్యమొకటియే యని చూచువాడే శాస్త్రజ్ఞానదృష్టి గలవాడగును అటుగాక భిన్నముగా గాంచువాడు శాస్త్రజ్ఞానదృష్టిలేనివాడని భగవదాశయము ఈ విషయమై కొన్ని ధర్మసార ప్రమాణములు క్రింద నిరూపింపబడుచున్నవి

**సన్న్యాసినాం చ గృహిణాం సామరస్య ప్రవర్తకః ।**
**పరస్పరాన్నదానాది తపో జ్ఞానవిధిర్మతః ॥**

గృహస్థులు అన్నము, వస్త్రము, పుస్తకము, కుటీరము మొదలయిన వానిని యతీశ్వరులకు నొసగి పోషించుటచేతను, బ్రహ్మనిష్ఠులగు యతులు గృహస్థులకు జ్ఞానబోధ చేయుటచేతను వీరిరువురికి పరస్పర సామరస్యము గలదు

**యతయో గృహిణశ్చైవ పటౌతప్రోతభావవత్ ।**
**అన్యోన్యం సహవర్తేరన్ లోకధర్మస్తథా శ్రుతః ॥**

వస్త్రమునకు పడుగు పేకలవలె లోకధర్మమును నడుపుటలో యతులును, గృహస్థులును సహాయకారణభూతులై సమానభావము గలిగి యున్నారు ఒక పడుగుచేతగాని, ఒక పేకచేతగాని వస్త్రనిర్మాణము గానటుల కేవలము యతులచేతగాని, కేవలము గృహస్థులచేతగాని లోకయాత్ర చక్కగా జరుగజాలదు

**జలాగ్నిభ్యాం యథా యన్త్రః లోకస్య గమనే తథా।**
**ఋషిభిర్గృహిభిర్ధర్మః సిద్ధ ఏవేతి నిర్ణయః ॥**

ఏలాగున నిప్పుచేతను, నీరుచేతను రైలుమొదలగు యన్త్రములు నడచుచున్నవో, ఆలాగున యతులచేతను, గృహస్థులచేతను ఈ ప్రపంచ పురోగమన మొంటున్నది వట్టినీరుచేతగాని, వట్టి నిప్పుచేతగాని యన్త్రము గదలనటుల పై జెప్పిన యిరువరుల పరస్పరసంబంధము లేనిచో లోకము పురోగమనము చేయజాలదు

**జగతామభివృద్ధ్యర్థం సూర్య చంద్రమసౌ యధా ।**
**ఇహాముత్రసుఖావాప్త్యై గృహిసంయమినౌ స్మృతౌ ॥**

సూర్యునియొక్కయు, చంద్రునియొక్కయు సహాయము చేతనే ఈలోకములోగల ప్రాణికోట్లున్ను సస్యకోట్లున్ను అభివృద్ధిజెంది సౌఖ్యముతో నుంటున్నవి ఒక సూర్యునిచేతగాని, చంద్రునిచేతగాని, ఒకప్రాణిగాని, తృణముగాని జీవింపజాలదు కావున మానవుల ఇహ సుఖమునకుగాని పరసుఖమునకు గాని పై జెప్పిన యుభయుల పరస్పరానుకూలభావము తప్పక యుండవలయును ఒక గృహస్థునిచేతగాని, ఒక యతిచేతగాని ప్రపంచాభివృద్ధికరమగు ఏ కార్యమున్ను జరుగజాలదు

**ప్రాణాపానౌ సమౌ స్యాతాం సుఖం జీవతి నాన్యధా ।**
**తధా భిక్షుగృహస్థౌ చేత్ విశ్వశ్శాన్తిం నిగచ్ఛతి ॥**

ఒక ప్రాణవాయువుచే గాని, ఒక అపానవాయువుచేతగాని ఏ జీవియు జీవింపజాలదు ప్రాణాపానములు రెండును సమానముగా నడచిన మాత్రమే జీవులు సుఖముగా జీవింపగలరు ఆలాగున ఒక సంసారిచేతగాని, ఒక సన్న్యాసిచేతగాని లోకము సుఖమును బడయజాలదు వీరుభయులయొక్క పరస్పర సంబంధముచేతనే లోకము పరమశాంతిని, పరమసుఖమును పొందగలుగును అనగా ఉచ్ఛ్వాసనిశ్వాసములు సమానస్థితిలో లేనిచో నేజీవియు బ్రతుకజాలని స్థితిని అందరెరింగియే యున్నారు

**దేహచిత్తోభయం శుద్ధం భవేల్లోకస్సుఖైకభూః ।**
**తధా బిక్షుర్గృహీ శుద్ధౌ స్యాతాం లోకో ఽ పి ముక్తిభాక్ ॥**

ఒకడు దేహసౌఖ్యము గలిగియున్నను, మనస్సు చెడిపోయిన ఎటుల సుఖముగా జీవింపజాలడో, మఱియొకడు మనస్సు నిర్మలముగా నుండువాడైనను, దేహము రోగముచే పీడింపబడినచో, ఏలాగున సౌఖ్యము నొందజాలడో, స్థూలదేహమున్ను మానసిక దేహమున్ను (సూక్ష్మ దేహమున్ను) శుద్ధములుగా నుండిన ఎటుల పరమశాంతిని పరమసౌఖ్యము నొందగల్గునో ఆలాగున గృహస్థులున్ను

యతులున్ను శుద్ధులై వారివారి ధర్మములను చక్కగా నముష్ఠించినప్పుడే యీలోకము పరమసౌఖ్యము పొందగలుగును

**ఉభాభ్యామేవ చక్రాభ్యాం రథస్య గమనం యధా।**
**తధా భిక్షుగృహస్థాభ్యాం ప్రపంచస్య గతిర్మతా ॥**

ఏలాగున ఒక చక్రముమాత్రముచే బండి సరిగా నడువజాలదో, రెండు చక్రములును సరిగానుండిన బండి ఏలాగున సుఖముగా గమనము జేయగలుగునో, ఆలాగున ఒక గృహస్థుడు మాత్రము చక్కగా నుండినను లేక ఒక పరివ్రాజకుడు మాత్రము లెస్సగా నుండినను, ప్రపంచము తన గమ్యస్థానము జేరజాలదు కావున యతియు, గృహియు ఒక్కొక్కరు పరస్పరము అనుకూలపడినమాత్రమే యీ లోకము ఉచ్చస్థానమునకు వెళ్లగలుగును ఇది వేదసమ్మతము

**దేహాత్మనోస్సదా శుద్ధౌ శుద్ధో జీవతి మానవః ।**
**తధా దేహాత్మరక్షాభ్యాం లోకస్సర్వత్ర సౌఖ్యభాక్ ॥**

ఒకని దేహముమాత్రము శుద్ధముగా నుండినను, ఆత్మశుద్ధముగా లేకపోయిన ఎటుల శాంతిని పొందజాలడో, ఆలాగున మఱియొకడు ఆత్మ మాత్రము శుద్ధముగా నుండినను దేహము వ్యాధిగ్రస్తమయినచో, ఏలాగున శాంతి ననుభవింపజాలడో, దేహమున్ను ఆత్మయు శుద్ధముగా నుండిన మాత్రముననే ఎటుల పరమానందము ననుభవింపగల్గునో ఆలాగున ఒక గృహస్థుడు సమ్పన్నుడై ధర్మాత్ముడై యుండినను చాలదు అదేరీతిగా ఒక భిక్షువున్ను బ్రహ్మజ్ఞాన సమ్పన్నుడై యుండిన చాలదు వీరుభయులుగూడ వారివారిస్థితిలో లెస్సగా చరించినమాత్రమే యీ ప్రపంచమున ఇహ పరసుఖముల రెంటిని అనుభవింప గలుగుదురు శ్రీబుద్ధ శ్రీశంకరాచార్య ప్రభృతులకాల మీలాగున నుండుటచేతనే సంసారులున్ను, సన్న్యాసులున్ను పరమసౌఖ్యపదవి నధిష్ఠింపగలిగిరి

**యతీనాం స్థూలదేహస్తు పోష్యతే గృహిభిస్సదా ।**
**తధా విరక్తైర్గృహిణా మాత్మశుద్ధిర్వితీర్యతే ॥**

గృహస్థులు బ్రహ్మనిష్ఠాపరులగు యతులయొక్క దేహసంరక్షణము

జేయవలయును ఆలాగున సన్న్యాసులు సంసారములో నుండువారి యాత్మను సంరక్షింపవలయును ఆలాగున ఉభయులును జేయునప్పుడే యుభయులకును ఆత్మశుద్ధి గలిగి యుభయులును కృతార్థులగుదురు ఏకాంతమున నేకాగ్రచిత్తము గలిగి బ్రహ్మచింతనము జేయక పోయినచో, ప్రకృతికి పరమగు పరమాత్మజ్ఞానమును సంపాదించి యతులు లోకమునకు ధర్మబోధ జేయజాలరు అట్టివారికి దేహపోషణ సంబంధకార్యమేదైన నుండినచో సంకల్పరహిత బ్రహ్మత్వము నొందజాలరు అందువలన గృహస్థులు తప్పక అట్టివారికి సహాయపరులై యుండవలయును గృహస్థుడు ప్రకృతికి పరమైయుండు పరమాత్మజ్ఞానమును పొందుటకు తగిన చిత్తనిరోధ మేకాగ్రతల జేయజాలనందుచే వీరి ఆత్మజ్ఞానముకొరకు యతియు యత్నించవలయును అనగా గృహస్థులు సంపాదించిన అన్న వస్త్రాదులను సన్న్యాసుల కిచ్చుటయు, సన్న్యాసి సంపాదించిన జ్ఞానధనమును గృహస్థుల కిచ్చుటయు అవశ్యయముగా నుండవలయును అయితే సన్న్యాసి పొందిన జ్ఞానము గృహస్థులు ఏల పొందకూడదని ప్రశ్న యొకటి జనింపవచ్చును గృహస్థులైనను చిత్తనిరోధము చిత్తైకాగ్రతయు గలుగజేసికొనినప్పుడు తక్కిన కర్మలన్నిటిని తప్పక సన్న్యసించవలసియుండును లేనిచో అతని జ్ఞానజ్యోతి గాలిలో పెట్టిన దీపమువలె ఉండునని శ్రీకృష్ణభగవాను డుపదేశించెను కావుననే ఆరవ యధ్యాయమున "నివాతదీపవచ్చిత్తం సమాధిరభిధీయతే" అని తెలిపెను

**ఏవం ప్రవర్తితో లోకః ముక్తిం గచ్ఛతి శాశ్వతీమ్ ।**
**తస్మాద్గృహీ సంయమీ చ సహభావేన భ్రాజతామ్ ॥**

పై జెప్పిన ప్రకారము యతులును, గృహస్థులును పరస్పరసహాయభూతులై ప్రవర్తించునప్పుడే యీలోకము శాశ్వతమయిన సుఖమును పొందగలుగును కావున గృహాశ్రమియు, యత్యాశ్రమియు పరస్పరము మిత్రభావముతో ప్రవర్తించి ప్రకాశింతురుగాక సౌఖ్యము నొందుదురుగాక!



# ముక్తి యెప్పుడు గలుగును?

ముక్తి ఎప్పుడు గలుగును అని అనేకు లడుగుదురు  దానికి సరియైన సమాధానము-మన బంధ మెప్పుడు తెగునో అప్పుడు కలుగు ననుటయే  ముక్తి యెప్పుడు కలుగునని యడుగువారు బంధ మననేమియో దానిని తెలిసికొనవలసి యుండును  "దృగ్దృశ్యయోస్సంబంధోబంధః"  ఆత్మకు అనాత్మయగు దృశ్యవస్తువులతో గల సంబంధమే బంధమనబడును  ఒకపశువును స్తంభమునకు కట్టివేసిన నెట్లు బంధించినదగునో ఆలాగున పశువగు జీవుని సంసారపాశముతో దృశ్యములో బంధించుట యేదిగలదో దానినే బంధనమందురు  దేహముతో బంధించుటయు బంధనమేయగును  కావుననే పశు, పాశము, పతి అని శైవశాస్త్రములు చెప్పుచుండును  అందువలనే పశుపతియని పరమశివునకు పేరువచ్చినది  దీని నాధారముజేసికొనియే  పశుపతిమతము అనగా శైవమత మేర్పడినది  కట్టబడిన పశువును విమోచనము కలుగజేయుటకు ఒక మానవుడెట్లు అవసరమో ఆలాగున సంసారపాశముతో కట్టబడిన జీవునికి విముక్తి కలుగజేయుటకు ఈశ్వరానుగ్రహ మవసరము  బంధనములో చిక్కుకొనియుండు పశువు స్వయముగా ఏలాగున విముక్తిని చేసికొనజాలదో ఆలాగున ఈశ్వరసహాయము లేనిచో జీవుడు స్వయముగా మోక్షమును పొందజాలడని ఆ మతముయొక్క సిద్ధాంతము  ఇంచుమించుగా ప్రపంచమునగల ప్రతిమతస్థులును దీని నంగీకరించియే యున్నారు  పేర్లు మాత్రము వేరువేరుగా నుండవచ్చును  అందరి సిద్ధాంత మొక్కటే  భగవంతుడని లేక గురుదేవుడని చెప్పినను ఈ యర్థములోనే సమాప్తమగును  పాశమునుగూర్చి గీత గుణత్రయ విభాగయోగమున ఈలాగున తెలుపడమైనది

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

ప్రకృతిజనితములగు సత్త్వ, రజ, స్తమస్సులనెడు మూడు గుణములు, ఈ గుణములకంటె వేరైన నాశరహితుడైన ఆత్మను దేహమునందు బంధించుచున్నవి

ఈ త్రిగుణములు జీవుని ఏలాగున బంధించునో ఆ విషయమును క్రింది

శ్లోకము నిరూపించుచున్నది

**సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ।**
**జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత ॥**

1 సత్త్వగుణము సుకుమారత్వముచేతను, 2 రజోగుణము బాహ్యకర్మాడంబరముచేతను, 3 తమోగుణము ఆత్మను మరుగుపఱచి ప్రమాదాలస్య నిద్రాదులచేతను జీవుని బంధించును ఇచ్చట సత్త్వగుణము గూడ ప్రకృతిసంబంధమని తెలుపడమైనది ఇట్లుండగా రజస్తమోగుణములు సంపూర్ణముగ నశింపకయు సత్త్వగుణము పూర్తిగా కలుగకయు నుండెడు ముముక్షువులు జిజ్ఞాసువులు భక్తుల స్థితినిగూర్చి యేమి చెప్పవలయును? ఈ పదునాల్గవ అధ్యాయమున విస్తారముగ త్రిగుణములను గురించి కనుగొనవచ్చును మఱల ఈ అధ్యాయాంతమున మూడుగుణములనుండి విముక్తియు భగవాను డుపదేశించెను

**గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

జీవుడు దేహసంబంధమయిన సత్త్వ, రజ, స్తమస్సు లనెడు మూడుగుణముల నతిక్రమించి జనన, మరణ, వార్ధక్య, దుఃఖములు అను వానిచేత విడువబడినవాడై మోక్షమును పొందుచున్నాడు శ్రుతియు ఈలాగుననే తెలుపుచున్నది

**అనాత్మభూతే దేహాదావాత్మబుద్ధిస్తు దేహినామ్ ।**
**సాఽవిద్యా తత్కృతో బంధస్తన్నాశో మోక్ష ఉచ్యతే॥**

అనాత్మస్వరూపములైన దేహాదులయందు ఆత్మబుద్ధి ఏది గలదో దానికి అవిద్యయనియు, మాయయనియు, అజ్ఞానమనియు పేర్లు వీనియొక్క నాశమే మోక్షమనబడును

ఈ విషయమై శ్రుతిస్మృతు లనేకవిధములుగా తెలుపుచున్నవి అదంతయు విస్తారమే యగును ఇది సంగ్రహముగా చెప్పడమయినది

మోక్షము ఎప్పుడు గలుగుననను ప్రశ్నకు సమాధానము చెప్పుటకు సాధ్యము కాదు ఏలనన జీవులయొక్క పూర్వసంస్కారము ననుసరించివారు శుభేచ్ఛాది అనేకభూమికలను పొందియుందురు అనగా 1 శుభేచ్ఛ, 2 విచారణ, 3 తనుమానసి, 4 సత్త్వాపత్తి, 5 అసంసక్తి, 6 పదార్థాభావన, 7 తురీయము, 8 తురీయాతీతము వీనినే 1 యమ, 2 నియమ 3 ఆసన, 4 ప్రాణాయామ, 5 ప్రత్యాహార, 6 ధారణ, 7 ధ్యాన, 8 సమాధులని ఎనిమిదిమెట్లుగా యోగశాస్త్రములో తెలుపడమైనది పూర్వజన్మములో ఏయే భూమికలోనికి ఈ జీవుడు వచ్చియున్నాడో ఈ జన్మములో అచ్చటనుండి పై భూమికలోనికి వెళ్ళవలసి యుండుటచే కాలనిర్ణయము చేయుటకు సాధ్యము గాదు ఈ క్షణముననైన పొందవచ్చును లేక కొన్నాళ్ళకైన పొందవచ్చును లేక దేహావసాన సమయము నందైనను పొందవచ్చును మఱియొక జన్మముననైన లేక అనేక జన్మములకైన పొందచ్చునని చెప్పుటకే సాధ్యమగును ఎగువ తిరుపతి శ్రీవేంకటేశ్వర మూలస్థానమును జేరుటకు ఏడుకొండలు గలవు ఈ దినమొకడు ఒక కొండ నెక్కునప్పటికి అస్తమయమగుటచే అచ్చట మండపములో పరుండి యుండెను ఆలాగున ఈ దినమే ఒకడు రెండు కొండలు, మఱియొకడు నాలుగుకొండలు, ఇంకొక డారు కొండలవఱకు వెళ్ళిపోవునని తలంచుడు వారందరును సూర్యుడస్తమించగా ఆయాకొండలయందుగల మండపములయందు నిద్రించిరి మఱురోజున ప్రాతఃకాలమున అందరును ప్రయాణము చేసిరనుకొనుడు వారలలో ఎవరెవరు ఎంతముందుకు వెళ్ళియున్నారో వారు త్వరలో దేవునిసన్నిధిలో జేరగలరు తక్కినవారు క్రమముగ ఏలాగున వచ్చెదరో ముక్తియొక్క స్వరూపమును ఈలాగున నుండును దీనినిబట్టియే శ్రీరంగనాథస్వామి దేవాలయమునకు సప్తప్రాకారము లేర్పడినవి దీనికి సప్తావస్థలను పేర్లును గలవు పూర్వ ఋషులు స్థూలమును సూక్ష్మమును కనుగొనుటకొఱకే బాహ్యక్రియలన్నియు ఏర్పాటుచేసికొనిరి దీనివలన బుద్ధి వికసించునప్పుడు అంతరార్థమును తెలిసికొనగలరనియే పరమ ఋషుల మతము కావుననే భక్తి గలుగునప్పుడు బాహ్యకార్యములో ఎక్కువగా ప్రవృత్తి కలుగుటకును, క్రమముగా ఆత్మశుద్ధి కలిగి రాగా రాగా బాహ్యకర్మలనుండి క్రమముగా అంతరాత్మలోనికి ప్రవేశించుటకు కారణమగుచున్నది ఈ సత్యము

ప్రతిమహాత్మునియందును గోచరించుచున్నది బౌద్ధమతములోను ఈ భేదములు కనబడుచునేయున్నవి వారిలోను 1 శ్రావకుడు, 2 సకృదాగామి, 3. అనాగామి, 4 అర్హత్ అనుభేదములు గలవు అదియును పై జెప్పినవిధానము ననుసరించియున్నది గీతలో ఈ సత్యమును స్పష్టముగా భగవాను డుదేశించెను

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ॥**
**తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

ఎప్పుడైతే నీయొక్కబుద్ధి అజ్ఞానకాలుష్యమును దాటగలదో, అప్పుడు ఇక వినదగిన అర్థమును వినిన అర్థమును నిర్ణయార్థము పొందెదవు "యదా" అను ప్రయోగమునకు ఎప్పుడైతే "తదా" అప్పుడు అని అర్థము ఇచ్చట ఎప్పుడైతే మూలప్రకృతిని దాటునో అప్పుడే ఇదివరలో మహాత్ములచేగాని శాస్త్రముచేగాని వినిన అర్థమును పొందగలడు, దీనికన్న అన్యముగ ఇక వినదగినది మఱియొకటి లేదను తత్త్వజ్ఞాన ముదయమగును

**యదా సంహరతే చాయంకూర్మోఽజ్ఞానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

తాబేలు అవయవములట్లు ఈ బ్రహ్మనిష్ఠుడు ఎప్పుడు సమస్తములైన దృశ్యవిషయములనుండి ఇంద్రియములను మరలించుకొనుచున్నాడో అప్పుడు ఆయోగియొక్క జ్ఞానము స్థిరమైన దగుచున్నది

ఇది ప్రత్యాహారస్థితిగల యోగిలక్షణమగును ఇచ్చటను "యదా" అని ప్రయోగమును చేసియున్నారు ఇట్టిస్థితి తమకు గలిగినదా యని ప్రతిసాధకుడు తనలో తాను విచారణచేసికొనవలయును.

**యదా హి చేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।**
**సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥**

ఎప్పుడైతే ఇంద్రియవిషయములందును కర్మలయందును సక్తుడు కాడో అప్పుడు సమస్తసంకల్పములను విడిచినవాడు అగుచున్నాడు అప్పుడు యోగారూఢుడు అగుచున్నాడు

ఇచ్చటను "యదా" అని ప్రయోగించడమైనది

**యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే ।**
**నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥**

నియమింపబడిన మనస్సు ఎప్పుడు ఆత్మయందే నిలకడ గలిగియున్నదో అప్పుడు వాడు సమస్తకోరికలనుండి అపేక్ష లేనివాడై యోగసిద్ధిని పొందినవాడని చెప్పబడుచున్నాడు ఇచ్చటను "యదా" ప్రయోగము కనబడుచున్నది

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

అనేక జన్మములలో ఆచరించిన పుణ్యసంస్కారమువలన అంతఃకరణము శుద్ధమై కడపట సమస్తమును వాసుదేవమయమను జ్ఞానము గలవాడగుచు నన్ను పొందునట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు ఇచ్చట అనేక జన్మములని చెప్పుటచే మందమతులకు బుద్ధిమాంద్యమునకు దారిచూపుచున్నది ఏలనన ఇప్పుడు తొందరపడిన మోక్షము దొరకునా? అనేక జన్మములు జరుగవలయునని శ్రీ కృష్ణభగవానుడే చెప్పియుండలేదా? యను సందేహము గలుగుచుండును దీని అర్థమది కాదు ఇప్పటికి అనేక జన్మలనుండి చేసిన భక్తి జ్ఞాన తపస్సులచేతనే ఇప్పుడు మోక్షేచ్ఛ ఏర్పడినదని గ్రహించుకొనవలయును ఇప్పుడు ముక్తిద్వారము చెంతకు వచ్చితిమి ఇక మోక్షద్వారము దగ్గఱలోనే యుంటున్నదని గ్రహించవలయును

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।**
**అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥**

పట్టుదలవలన యత్నించుచున్నయోగి అయితేనే కల్మషరహితుడై అనేక జన్మములయం దభ్యసించుటవలన పొందదగిన యోగసిద్ధిని పొందినవాడగుచున్నాడు పిమ్మట సర్వోత్తమమైన మోక్షమును పొందుచున్నాడు

**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్యహృది శ్రితాః।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

ఎప్పుడైతే ఈ సాధకునియొక్క అంతఃకరణములోగల సమస్త సంస్కారములు, వాసనలు, వృత్తులు నశించునో అప్పుడు ఇచ్చటనే ఈ దేహముతో కూడియుండగనే అమృతత్వమును (మోక్షమును) పొందుచున్నాడు అని కఠశ్రుతి



# సంయమ ప్రయోజనము

వైరాగ్యమను భూమియందుమాత్రమే ఆధ్యాత్మికవ్యవసాయము ఆనందప్రదముగా ఫలించునుగాని, విషయవాసనలను చవిటిభూమియందు చక్కగా నభివృద్ధినొందజాలదు బాహ్యవిషయములయందు ప్రవర్తించెడి యింద్రియములను నిగ్రహించుకొలది మనస్సునకు ఏకాగ్రత గలుగుచుండును పరిశుద్ధాంతః కరణమునందే పరమాత్మ ప్రకాశించును నిర్మలమైన అద్దమునందు సూర్యబింబము ప్రతిబింబించునట్లు, మలినమైన అద్దమునందు ప్రతిబింబించదు సూర్యకిరణములు సాధారణమైన అద్దముయొక్క క్రిందిభాగమునున్న పీచు దూది మొదలగువాని నెట్లు దహింపజాలదో అట్లే సత్త్వగుణములతోకూడిన హృదయమందు ప్రతిఫలించిన ఆత్మ కర్మకట్టెలను భస్మమొనరింపజాలదు సూర్యకాంతదర్పణముపై బడిన సూర్యకిరణములు దర్పణముయొక్క క్రిందిభాగముననున్న పీచు దూది మున్నగువాని నెట్లు దహించుచున్నవో అదేవిధమగా విశుద్ధ సత్త్వగుణ ప్రధానమైన అంతఃకరణమునందలి ఆత్మజ్ఞానాగ్ని కర్మకట్టెలను భస్మము చేయగల్గును అయితే సత్త్వగుణముగూడ అతిక్రమించి విశుద్ధసత్త్వమునకు వెళ్ళవలెనంటే అల్పస్వల్పప్రయత్నములతో సాధ్యము గాదు ఎట్లన బలిష్ఠమైన పశువును కట్టివేయుటకు స్తంభమున్ను త్రాడున్ను గట్టిగా నుండవలెను ఈ రెండింటిలో నేది దృఢముగా లేకపోయినను త్రాడును తెంచుకొనిగాని, స్తంభమును విరచుకొనిగాని, ఇతరభూములలో ప్రవేశించి పైరులను పాడుచేయుట వ్యవసాయదారులందరికి విదితమే అట్లే ప్రకృతి సుఖముల ననుభవించుచు ప్రబలమైయున్న మనస్సును నిగ్రహించవలసి యుండిన ప్రణవధ్యానమనెడు త్రాడుతో, జాగ్రత్స్వప్నసుషుప్తులకు సాక్షిగా నున్నటువంటిన్ని, సర్వమునకు

ఆధారమైనటువంటిన్ని, సుస్థిరమైనటువంటిన్ని, ఆత్మయను అచంచల స్తంభమునకు కట్టివేయవలెను అప్పుడు మాత్రమే మనస్సు అనర్థదాయకములగు ప్రాపంచిక విషయములయందు ప్రవేశించక స్వస్వరూపానుసంధానమునందే నిమగ్నమగును ఆ యవస్థ గలుగవలెనన్న ధ్యానాదులచేతనే గలుగవలెను ఆత్మాకారస్థితియందు ఆత్మకన్యముగా నేదియు భాసించనందున మనస్సే ప్రధానమను వేదాంతమేమగునో విజ్ఞు లెఱుంగుదురుగాక

గానుగయెద్దు ప్రతిరోజు గానుగచుట్టునున్న 20 గజముల వలయమునందు పరిభ్రమించుచున్నదేగాని, ఆ వలయము నతిక్రమించి ఒక అడుగైనను పెట్టుట లేదు అట్లుగాక ఆ యెద్దును సూటిగా వదలిన ఎంతో దూరము వెళ్ళియుండెడిది అట్లే రైలుడ్రైవరున్ను, గార్డున్ను మద్రాసు నుండి బెజవాడవరకువచ్చి ఆగిపోవుదురు బెజవాడనుండి మరల మద్రాను వెళ్ళుచుందురు వారెన్నిరోజులు ప్రయాణముచేసినను, మద్రాసు బెజవాడ మధ్యప్రదేశమును, అందలి విశేషమును తెలిసికొనెదరుగాని, బెజవాడ దాటి వెళ్ళనందుచే ఆయావిషయములను గ్రహింపజాలరు అట్లుగాక మున్ముందు వెళ్ళసాగిన హిమాలయమువరకు వెళ్ళగలిగెడివారు మఱియు మద్రాసు హిమాలయముల మధ్యనుండెడు ద్రావిడ, ఆంధ్ర, ఒరిస్సా, బెంగాలీ, హిందీ, మొదలగు భాషలను వినెదరు ఆయాదేశముల యందలి దృశ్యముల నవలోకింతురు అచ్చటచ్చటి అచారవ్యవహారములను తెలిసికొనెదరు అందువలన ప్రతిరోజు, వెయ్యియో, రెండువేలో, నియమ ప్రకారము జపమొనరించుచు అంతటితోనే తృప్తినొందుచు నెంతకాలము జపముచేయుచున్నను, పూర్వపు స్థితికంటె ఉత్తమస్థితిని పొందజాలరు కనుక క్రమముగా ధ్యేయాకారస్థితికి వెళ్ళుటకు ప్రయత్నించవలెను కావుననే జప, ధ్యాన, లయములని మూడంతన్న లేర్పడినవి వారమున కొకపర్యాయము మౌనమవలంబించి, ఉపవాసముండి, ఆరోజు చేయవలసిన పనులను ముందురోజుగాని, లేక మరుసటి రోజుగాని, నిర్వహించుకొనునట్లేర్పాటు చేసికొనవలయును ఆహారమును కూడా ముందుగా సిద్ధము చేసికొని జప ధ్యానాదులలో ప్రవేశింపవలెను లేనిచో మధ్య మధ్య తనవలన కావలసిన

పనులవిషయమైగాని, అధవా తన ఆహార విషయమైగాని, మనస్సు బహిర్ముఖమగుచుండును అందుచే మనస్సు ఆత్మాకారముగా పరిణమించుట కవకాశములేకపోవును ఆ రోజు జపధ్యానములు మామూలుగా జేసిన చాలును ఎక్కువచేయ నక్కరలేదు నిరంతరము ఆత్మభావములో నుండుటకై యభ్యాసమొనరించవలెను అట్టి సమయములలో పూరి హల్వ మొదలగు గురుపదార్థములను భుజింపక, లఘువుగా జీర్ణమగు పాలు, ఫలములు మాత్రమే కొద్దిగా నొకపూట భుజించవలెను అదియు రాత్రికాలమైనచో మంచిది ఈ విధముగా నభ్యాసము చేయుచున్నను పూర్వపువృత్తులు, వాసనలు, సంకల్పములు మనస్సును ఆత్మాకారస్థితినుండి విషయములవైపునకు, చెట్టు నెక్కుచున్న వానిని మఱియొకడు కాళ్ళుబట్టి క్రిందికి లాగువిధమున మరలింప చూచుచుండును అపుడపుడు తటస్థించు ప్రతిబంధములకు భయపడక "అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా'' అని శ్రీకృష్ణభగవానుడు గీతలో నుపదేశించినట్లు, దృఢమైనట్టి సంగరహితమనే శస్త్రములచే ఛేదించవలయును సామాన్యపూజాప్రార్థనాదులచే సాధ్యముగాదనియు తెలిసికొనవలయును చేవగల చందనపు వృక్షమును, తగరపుకత్తితోగాని, ఇనుప కత్తితోగాని, ఛేదించ ప్రయత్నించిన అవి మణగిపోవుచుండునేగాని, ఛేదన క్రియనెట్లు చేయజాలవో, అట్లే సాధారణ జపధ్యానాదులు అనాది అజ్ఞాన మూలప్రకృతిని హతమొనర్పజాలవు

పరిశ్రమచేయక పవిత్రులైనవారెవరును గాన్పించరు మహాత్ముల జీవితములను చదివిన ఆ విషయము స్పష్టము గాగలదు నిరంతరము ఆత్మభావముగల దృఢజ్ఞానులు ప్రబోధకులుగా లేనికారణముచే ఆధ్యాత్మికవిద్య అభివృద్ధినొందక మనస్సే ప్రధానమను వేదాంతము ప్రబలినది మనస్సే ప్రధానమను మాయావేదాంతములో తగుల్కొని జననమరణరూపమగు సంసారములో మ్రగ్గక, అతీంద్రియజ్ఞాను లెట్లు విరక్తులై దైవత్వమును పొందిరో, అట్టి విరక్తి నలవరచుకొనవలయును అతీంద్రియజ్ఞానులను జూచి అభ్యాసకులు మనమంతటిస్థితికి వెళ్ళగలమా యని భయపడనక్కరలేదు బి ఏ యం.ఏ పరీక్షలందుత్తీర్ణులై ఉన్నతస్థానముల నలంకరించిన ఉద్యోగు లేవిధముగా ప్రధమమున, ఎ బి సి డీ ల నుండి ప్రారంభించి పరిశ్రమచే పట్టభద్రులైరో

అదేవిధముగా ప్రస్తుత అభ్యాసకులున్ను, సాధనానుష్ఠానములచే క్రమముగా నతీంద్రియజ్ఞానులు గాగలరు అతీంద్రియజ్ఞానమునకు వైరాగ్యమను సారవంతమైన భూమిని సంపాదించవలెను

**వైరాగ్యం పుష్కలం న స్యాత్ నిష్ఫలం బ్రహ్మచింతనమ్ ।**
**తస్మాద్రక్షేత విరతిం బుధో యత్నేన సర్వదా ॥**

సంపూర్ణవైరాగ్యము లేనిచో, తామొనరించు బ్రహ్మచింతనాదులన్నియు ఫలప్రదములు గాజాలవు కావున అభ్యాసియగువాడు నిరంతరము ప్రబల ప్రయత్నముతో విషయలంపటమగు యింద్రియ మనంబులను స్వాధీనపరచుకొని విరాగమును రక్షించుకొనవలెను కొందరి హృదయములు విషయవాసనలు, వృత్తులు, సంకల్పములతోగూడి సారహీనమైన చవిటిభూములవలె నుండును ప్రస్తుతము అమెరికావారు పనికి మాలిన ప్రదేశములను ఎలక్ట్రిక్ కరెంటుచే భస్మమొనరించి ఏలాగున సుక్షేత్రములుగా తయారుచేయుచున్నారో, రాయలసీమాదులలో చవిటి భూములకు అరణ్యప్రదేశములందలి కొన్ని ఆకులువేసి చవిటిని విఱుగగొట్టి సస్యవృద్ధి నెట్లుగావించుచున్నారో, అట్లే అభ్యాసి తనహృదయము విషయవాసనాదులచే నిండి ఆత్మజ్ఞానమునకు అవకాశము గలుగజేయలేదని యెప్పుడు తెలిసికొనుచున్నాడో అప్పుడే భక్తి, విరక్తి, శాంతము మొదలగు సద్గుణములతో చక్కబెట్టుకొనవలెను అష్టావక్రగీతయందు మోక్షమెట్లు లభించునని జనకచక్రవర్తి అష్టావక్రమునీంద్రుని ప్రశ్నింపగా, ఆ మహనీయుడిట్లు సమాధాన మొసంగెను

**ముక్తిమిచ్ఛసి చేత్తాత విషయాన్ విషవత్త్యజ ।**
**క్షమార్జవం దయాతోషం సత్యం పీయూషవద్భజ ॥**

నాయనా! ప్రకృతిబంధమునుండి విముక్తినొందవలెనని నీ కభిలాషయుండిన ప్రాపంచికసుఖములను విషతుల్యములుగా భావించి విడువుము సహనము, ఋజుత్వము, దయ, సంతోషము, సత్యము మొదలగు సుగుణములను అమృతమువలె సేవింపుము ఈ విధముగా ననేక విషయములను బోధించి, ఆఖరున మోక్షమన నేమిటో - బంధమనగా నెట్టిదో తెలిపి తన కర్తృత్వమునుకూడ వదలుకొనచున్నాడు (దీనిని చేయుము, దీనిని వదలుము, అని

విధినిషేధములద్వారా చెప్పక నీ యిష్టప్రకారము చేయుమని బోధించుచున్నారు )

**మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యధేచ్ఛసి తధా కురు ॥**

విషయసుఖములయందలి నిరసనభావమే మోక్షము విషయాసక్తతయే బంధము యధార్థమాలోచించిన విజ్ఞానమింతయే యని విశదమగుచున్నది కావున నీవు దేని నభిలషించుచున్నావో, దానికి తగిన సాధనసామగ్రిని సమకూర్చుకొనుము భగవద్గీతయందు కృష్ణపరమాత్మ అర్జును నుద్దేశించి సర్వధర్మములను బోధించి, చివర 18-వ అధ్యాయమున అష్టావక్రమునీంద్రునివలెనే తనపై భారము నుంచుకొనక అర్జునుని చేతనే ఆ భారమును వహింపజేయుచున్నాడు

**ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైతదశేషేణ యధేచ్ఛసి తధా కురు ॥**

రహస్యము లన్నింటికంటె నతిరహస్యమైనదియు, ఆత్మజ్ఞాన పరమైనదియు నగు ఈ గీతాశాస్త్రమును నేను నీకు చెప్పితిని ఈ యాత్మజ్ఞాన సాధనమగునట్టి దీనియొక్క సకలార్థములను చక్కగా నాలోచించి పిమ్మట నీకేది యిష్టమో దానిని చేయుము

**అత్యంతవైరాగ్యవతస్సమాధిః సమాహితస్యైవ దృఢప్రబోధః ।**
**ప్రబుద్ధ తత్త్వస్యహి బంధముక్తిః ముక్తాత్మనో నిత్యసుఖానుభూతిః ॥**

పరిపూర్ణవైరాగ్యవంతునకే సమాధి సిద్ధించును మనో నిగ్రహము గలవానికే ఆత్మయే నేనను దృఢజ్ఞానము గలుగును ఆత్మసాక్షాత్కారము నొందినవారలే బంధవిముక్తు లయ్యెదరు ముక్తాత్ములే నిత్యనిరతిశయ సుఖానుభవము నొందుదురు కనుక ఆత్మసాక్షాత్కారము నభిలషించు ప్రతివారును, ప్రధమమున వైరాగ్యమను భూమిని సంపాదించవలెను తదుపరి అదను ననుసరించి దానియందు ఆధ్యాత్మిక వ్యవసాయము చేసిన అతీంద్రియజ్ఞానులు గాగలరు



# శ్రీ భగవద్గీతాష్టాదశాధ్యాయ

# ముక్తిసోపానయజ్ఞము

(పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుతాలూకా నాయుడుగూడెమున 2-4-1953 తేది నుండి 19-4-1953 తేదీవరకు 18రోజులు జరిగిన శ్రీ భగవద్గీతాష్టాదశాధ్యాయ ముక్తిసోపాన యజ్ఞమునందు శ్రీసద్గురు మలయాళస్వాములవారు అనర్గళముగా బోధించినదానిలో సంగ్రహముగా నిది వ్రాయబడినది కుంభవృష్టి వర్షించునప్పుడు చిన్నముఖముగల పాత్రమునందు పడిన జల మెంతమాత్రమో, ఇదియు నంతమాత్రమే యని గ్రహించవలెను )

## 2-4-1953

గురుసేవయన గురువుగారు ఆచరించి బోధించినట్లు శిష్యుడు ఆచరించుటయేగాని గురువుపాదములొత్తుట, బట్టలుతుకుట మొదలగునవి మాత్రము పూర్ణమైన గురుసేవకాదు అయితే దీనివలన ప్రయోజనము లేదని భావించవలదు ఇదియు నొకవిధమగు గురుభక్తిని సూచించి గురునను గ్రహమునకు పాత్రునిగా జేయును పరిపూర్ణ ఫలము నొందవలెనంటే గురువు ఆచరించిన ఆచరణగలిగియే యుండవలెను అప్పుడే భవరోగము శమించును చెట్టునుబెట్టి నీరు మొదలగువానిచే సరిగా పోషించుటయే మనపని ఫలింపజేయుట పుష్పింపజేయుట మన పనిగాదు అది ఆయా సమయము వచ్చినపుడు సహజముగనే జరుగుచుండును అరటిపండు పచ్చిగానున్నపుడు లోపలిగుజ్జునుండి తొక్కను వేరుచేయు టెట్లు సాధ్యము గాదో, బాగుగాపండినపుడు సులభముగా ఎట్లు విడదీయుచున్నామో, అట్లే మనము చేయవలసిన సాధనలు నియమముగా జేయుచువచ్చిన క్రమముగా అంతఃకరణమందలి వాసనలు, వృత్తులు, సంకల్పములు నశించును సంకల్పరహితమైన మనస్సు ఆత్మాకారముగా పరిణమించును అపుడు మేఘమువదలిన సూర్యునివలె ఆత్మజ్ఞానము ప్రకాశించును జ్ఞానులు సర్వకార్యములు నిర్వహించుకొనుచు ఆత్మశాంతిని గోల్పోక యుందురు ఎట్లన,

**పుంఖానుపుంఖవిషయేక్షణతత్పరోఽపి**
**బ్రహ్మావలోకనధియం న జహాతి యోగీ ।**
**సంగీతతాలలయవాద్యవశంగతాఽపి**
**మౌళిస్థకుంభపరిరక్షణధీర్నటీవ ॥**

నర్తకి శిరస్సుపై నొక ఘటమునుంచుకొని సంగీతము, తాళము, లయ, వాద్యాదుల కనుగుణముగా నృత్యాదు లొనరించుచున్నను లక్ష్యమును శిరస్సుపైనున్న ఘటమునం దుంచి ఘటము నెట్లు క్రిందబడకుండ రక్షించుకొనుచున్నదో, అట్లే జ్ఞానియు ఆయా కార్యములను ఒకదాని వెనుక నొకటివంతున చేయుచున్నను అద్వితీయ పరబ్రహ్మమును అవలోకించుచునే యుండును ఈ స్థితియందుండియే జనకచక్రవర్తి మొదలగు వారు రాజ్యమును పాలించుచుండియు విదేహముక్తులైనట్లు వినుచున్నాము సూర్యోదయకాలమందు మనుష్యునినీడ చాల పొడవుగానుండి క్రమముగా మధ్యాహ్నమునకు తగ్గితగ్గి నీడయే లేకపోవునట్లు జ్ఞానికి నేలాటి విషయ ప్రవృత్తులు, ప్రకృతిగుణములు నుండకూడదు పునాది దృఢముగా లేనియెడల సౌధమెట్లు నిలువజాలదో, అట్లే శమదమాద్యనుష్ఠానములేని వేదాంతమున్ను స్థిరతనొందజాలదు బోధకులు ఫలాపేక్షతో ప్రజల యుద్దేశములకు లోబడి బోధించుటవలననే వేదాంతమునకు పతనము కలిగినది కావున బోధకులు, సాధకులు వారి వారి ధర్మమందు శ్రద్ధ గలిగి అనుష్ఠానపరులై యుండవలెను అనుష్ఠానమునకు మించినది మూడులోకములలో నేదియు లేదనియే మహాత్ముల యభిప్రాయము

## 3-4-1953

నీటిలో గలసిన ఉప్పు నీరుగా మారునట్లును, కర్పూరము అగ్నిసంబంధమువలన జ్యోతిరూపముగా మారునట్లును ప్రార్థనాధ్యానాదులు దైవభావముతో జేసినయెడల దృశ్యాకారముగానున్న మనస్సు ఆత్మాకారముగా మారును ఈ విధముగా నిరంతరము అభ్యాసము చేయవలయును దీనివలన కర్తృత్వ భోక్తృత్వాదులతో కూడిన జీవత్వభ్రాంతి నశించి నిత్య శుద్ధ ముక్త స్వరూపుడగు పరమాత్మయే నే ననుభావము దృఢమగును "యద్భావం తద్భవతి" - ఎవరు ఏ భావము గలిగియుందురో వారు ఆస్థితిని తప్పక పొందగలరు ఈ యభిప్రాయముతోనే శ్రీరామచంద్రమూర్తి ఆంజనేయులవారి నిట్లు ప్రశ్నించిరి నాయనా! నీవు నాయందు ఏభావముగలిగియున్నావు అని అందులకు ఆంజనేయులు-

**దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః ।**
**ఆత్మబుద్ధ్యా త్వమేవాహం ఇతి మే నిశ్చితా మతిః ॥**

దేహబుద్ధితో తమకు దాసుడను, జీవదృష్టితో మీ యంశమును, ఆత్మబుద్ధితో మీరే నేనను భావము గలిగియున్నానని సమాధానము చెప్పెను అంటుమామిడిచెట్ల వ్యాపారముచేయువారు, సామాన్య మామిడి విత్తనములనువేసి మొలిపించి కొద్దిగా వృద్ధిపొందిన తర్వాత, రసాలు మొదలగు శ్రేష్ఠమైన అంటుమామిళ్ళకొమ్మలను, పై మొక్కలకు అంట్లు గట్టుదురు అవిరెండును సరిగా నంటుకొనువరకు జాగ్రత్తగా పోషించుచుందురు అప్పుడపుడు అంటు గట్టియుండు మొదటిమొక్కకు పుట్టుచుండు కొమ్మలను అభివృద్ధిచెందనీయక కోసివేయుచుందురు లేనిచో క్రమముగా అంటుగట్టిన శ్రేష్ఠశాఖను నశింపజేయును అట్లే జీవ భావమను మొక్కకు బ్రహ్మభావమను అంటుగట్టిన వారును జీవసంబంధమైన వాసనలు, వృత్తులు, సంకల్పములు, గుణములను శాఖలను పెంపొందనీయక సదా జాగరూకులై యుండవలెను అట్లొనరించుటవల పులుపు వగరు మొదలగు మొక్కలు, తీపిగల బంగినపల్లి, నీలము మొదలగు మ్రానులుగా మారునట్లు, జీవత్వము నశించి శివత్వము స్థిరమగును ఈయవస్థ నభిలషించువారు మొదట సోమరిదేవతకు తర్పణమువిడచి సోఽహంపరులు గావలయును ఇంద్రియములు ఆ యా విషయములలో ప్రవర్తించుచున్నను తత్సాక్షియైన ఆత్మకు ఏవిధమగు హాని సంభవించదని చెప్పెడు ఆచరణశూన్యులైన వాచావేదాంతులకు వశపడకూడదు ఈవిషయమును గురించి శ్రీరామకృష్ణపరమహంసగారిట్లు చెప్పిరి ఉప్పుబస్తా నీటిలో తడువకనే చల్లగాలిసోకినను కరిగిపోవును అట్లే విషయవాసనామాత్రముచే హృదయము మాలిన్యము నొందుచుండగా దాని యనుభవవిషయమై వేరు చెప్పవలయునా? కాన ఓ ముముక్షువులారా! ఇంద్రియసుఖములకు లోబడక వేదాంతముయొక్క పరమసత్యమును గ్రహించి జాగరూకులై మెలంగుడు

## 4-4-1953

బంగారు, వెండి, రాగి, ఇత్తడిలోహములతోగాని, మట్టితోగాని

తయారుచేయబడిన పాత్రలైనను అవి గుండ్రముగా, చతుష్కోణముగా, ముక్కోణముగా నుండినను, విరోధము లేదు అపాత్రల నుంచువారు స్త్రీలైనను, పురుషులైనను, ఏజాతివారైనను, ఏమతమువారైనను ప్రతిబంధములేదు కాని పాత్రలలోని జలము మాత్రము నిర్మలముగా నిశ్చలముగా నుండిన సూర్యుని గాని, చంద్రుని గాని ప్రతిబింబము స్పష్టముగా గోచరించును అట్లే యెవరి హృదయము మలిన, చలన రహితముగా నుండునో అట్టి హృదయమందు ఆత్మ ప్రతిబింబించును వేద వేదాంగముల నధ్యయనము చేసిన పండితుడైనను బంగారుపాత్రలోని నీరు బురదగా నుండినను, చలించుచున్నను బదరికాశ్రమములో పెట్టినను సూర్యప్రతిబింబ మేలాగున గాన్పించదో ఆలాగున నెవరి హృదయమైనను మల, విక్షేపములతో గూడియుండిన ఆత్మప్రతిబింబము గోచరించదు బురదనీటిని చిల్లగింజచే శుద్ధమొనరించు కొనునట్లు నిష్కామ పుణ్యకర్మచే మలదోషమును రహిత మొనర్చుకొనవలయును ఈశ్వర భావనాయుక్తమగు నుపాసనచే విక్షేపమును నశింపజేసికొనవలయును ప్రతియొక్కరి మనస్సున్ను ఉన్నతస్థితిని పొందవలయుననియే అభిలషించుచుండును అట్టి యున్నత స్థితిని పొందిన మహనీయులు ఏప్రాయమున ఏప్రయత్నముతో తమ లక్ష్యసిద్ధిని పొందిరో వారి జీవితచరిత్రముల పఠించిన విశదగును యౌవనావస్థలో విషయసుఖముల ననుభవించి యింద్రియముల పటుత్వము తగ్గిన తరువాత ఈశ్వర ధ్యానాదు లొనరించవచ్చునని కొందఱు తలంచుచున్నారు అట్లైనప్పుడును సాధ్యముగాదు శ్రీశంకర, శ్రీబుద్ధ, శ్రీ ఏసుక్రీస్తు, శ్రీవివేకాంద మొదలగు మహాత్ములందరు యౌవనదశయందే తీవ్రవైరాగ్యముతో ఏకాంతప్రదేశమున దైవధ్యానతత్పరులై ఆత్మసాక్షాత్కారము నొందిరి వారనుభవించిన ఆత్మానందమునే ప్రపంచమునకు ప్రబోధించిరి రసవంతమగు యౌవనతరుణమును గుర్తించి చెఱకునుకోసి గానుగలోవేసిన రసము లభించును దానిచే పంచదారచేయనగును అట్లుగాక ముదిరి, వెన్ను తీసినతర్వాత చెఱకును కోసి మిషనులో వేసి రసమును తీయదలచినవారి ప్రయత్నమేవిధముగా ఫలవంతముగాదో, అదేవిధముగా శక్తిసామర్థ్యములు క్షీణించిన వృద్ధావస్థయం దొనరించు ప్రార్థనాధ్యానాదులచే పూర్ణప్రబోధము గలుగజాలదు కాని కొంత సంస్కార మేర్పడును అందువలన

పుణ్యలోకప్రాప్తియు, రానున్న జన్మము ఉత్తమమైనదిగాను, పవిత్రమైనదిగాను ఏర్పడి ఆ జన్మములో పూర్ణజ్ఞానము గలుగును దీనినే గీతయందు భగవాను డిట్లుపదేశించెను

**ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥**

మఱియు " న హి ప్రమాణం జంతూనా ముత్తరక్షణజీవనే" అన్నట్లు పై క్షణములో నేమయ్యెదమో చెప్పశక్యముగాదు అందులకు నే ప్రమాణమును గాన్పించదు కావున ప్రాపంచిక విషయములందు ప్రవర్తించుచు వృద్ధావస్థకై నిరీక్షించక సచ్చిదానన్దస్వరూపుడగు పరబ్రహ్మభావమునందు స్థిరులగుటకై యిప్పుడే (ఈ క్షణమందే) ప్రయత్నించుడు ఇచట మలవిక్షేపములను మాత్రమే నిరూపించడమైనది ఇవి రెండును బ్రహ్మజ్ఞానమునకు ప్రబలదోషములు ఆవరణమను మఱియొక దోషము కూడ గలదు అది శ్రవణ మనన నిదిధ్యాసములచేత తొలగవలెను

## 5-5-1953

రంగులరాట్నమునకు అమర్చిన గుఱ్ఱము, ఒంటె మొదలగు వాహనములపై ఎక్కినవారును, ఆ వాహనములును తిరుగుచున్నను వాటికాధారమైన మూలస్థంభమెట్లు తిరుగక నిశ్చలముగానుండునో అట్లే సంసారచక్రమందుండువారు ఇంద్రియవిషయముల నధిష్ఠించి జననమరణములను కాలచక్రమునందు తిరుగుచున్నను సంసారమునకు మూలమగు ఆత్మమాత్రము చలనము నొందక సాక్షియై యుండును అది స్థూల సూక్ష్మ కారణ దేహముల కతీతముగా నున్నది ఆ స్థితిని పొందినపుడే ముక్తిని బడయగలరు అందుకొఱకే శ్రీభగవద్గీతయందలి 18 అధ్యాయములు 18 మెట్లుగా నిర్మింపబడినవి సోపానముల నెక్కునపుడు గోడను గాని, ఇనుప కమ్మినిగాని పట్టుకొని ఎక్కవలెను లేనిచో క్రిందపడిపోదురు కావున ముక్తిసౌధమును అధిరోహించదలచిన ఆయా యధ్యాయములలో శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడిన ఆచరణయను కమ్మిని అలంబనము గావించుకొనియే యెక్కవలెను దైవాలయమును సుందరముగా నిర్మించి దేవుని

ప్రతిష్ఠచేయనిచో కర్త తత్ఫలమును పొందజాలని విధమున శరీరమను మందిరమున జప ధ్యాన, ఆత్మచింతనాదులచే పరమాత్మను ప్రతిష్ఠ చేయనియెడల జన్మసాఫల్యము నొందజాలరు హృదయక్షేత్రమందు క్షేత్రజ్ఞుడైన పరబ్రహ్మమును చూడగలిగినపుడే ఈ సంసారసాగరమును దాటుటకు సమర్థులగుదురు పడవలు మొదలగువానికి తెరచాపలు, తెడ్లు వగైరా యుండినను చుక్కాని లేనిచో పడవలు గమ్యస్థానమెట్లు చేరజాలవో అట్లే ఆత్మసాక్షాత్కారమను చుక్కాని లేనియెడల భవసాగరమును దాటజాలరు ఆసన ప్రాణాయామాదులెన్ని యున్నను వాటితో తృప్తినొందక స్వస్వరూపానుసంధాన పర్యంతము ప్రయత్నించవలెను ప్రవర్తననుబట్టి ప్రతివారిస్థితియు తెలిసికొనవచ్చును కాబట్టి జాగ్రత్స్వప్నసుషుప్తులకు సాక్షియైన పరమేశ్వరునిలో నైక్యమగుటకు శ్రద్ధ ముఖ్యమైనది శ్రద్ధగలవారికి ఒక అగ్నిమిణుగురు దొరకినను దానిని పీచునందుగాని, దూదియందుగాని ఉంచి సన్నపుల్లలు వేసి, మెల్లగా జ్వలింపజేసి, తదువరి పెద్దకట్టెలు వేసి గొప్ప అగ్నినిగా ప్రజ్వలింపజేయుచున్నారు శ్రద్ధలేనివారికి పళ్ళెరమునిండుగా అగ్నిని నిచ్చినను, దానిని నెచటనో పారవేసిన బూడిదయై పోగైపోవును, అదే విధముగా శ్రద్ధగలవారు ఒక్క పర్యాయము శ్రవణముచేసినను ఒక మంచివాక్యమును వినినను దానిని ఆచరణయందుంచుకొని నిత్యనిరతిశయానందమును పొందుచున్నారు శ్రద్ధలేనివారు సర్వదా శ్రవణము చేయుచున్నను తగినట్లు అనుష్ఠించని కారణమువలన పూర్వమున్న స్థితియందుంటున్నారేగాని ఉన్నతస్థితికి వెళ్ళజాలకున్నారు కనుక ప్రతివారును శ్రవణము జేసిన దానిని ఆచరణయందుంచుకొన్నప్పుడే తత్ఫలమును పొందగలరు

## 6-4-1953

టెలిగ్రాం ఆఫీసునకు అనేక ప్రాంతములనుండి వార్తలు వచ్చుచుండును ఇవి ధ్వనిరూపముగానే యుండును ధ్వనిని గ్రహించుటకు పరికరమైన మిషను, ఈశబ్దమున కీయర్థమని తెలిసికొనజాలదు మిషనుకంటె విలక్షణముగానున్న మనుజుడు ఆ శబ్దముల కర్థమునెట్లు గ్రహించుచున్నాడో అట్లే యింద్రియములు

విషయములను గ్రహించుటకు సాధనములేగాని, విషయముల యథార్థమును తెలిసికొనునని గావు దేహేంద్రియ సంఘాతమునకు విలక్షణమైన ఆత్మచేతనే సర్వము గ్రహింపబడుచున్నది ఇంద్రియములద్వారా బహిర్ముఖమైన మనస్సును ఆత్మవిచారముచే అంతర్ముఖముగా త్రిప్పినపుడే ఈశ్వరస్వరూపము (ఆత్మస్వరూపము) గోచరించును ఇందులకు గురుదేవుని యనుగ్రహమున్ను అవసరము గురుమూర్తివలన నుపదేశమునొందినవారిలో కొందరు గురుమహారాజుకంటె ఉన్నతస్థితియందును, కొందరు సమానస్థితియందును, మరికొందరు తక్కువస్థితియందును ఉంటున్నారు శిష్యులెంత గొప్ప వారైనను గురుదేవుని యందు విశ్వాసమును మాత్రము విడువరాదు విశ్వాసము నందలి మహిమ యెట్టిదో యీ క్రింది కధవలన విశదమగును

ఒక గ్రామముయొక్క సమీపవనమున రామకృష్ణయ్య యను నొక సాధువుగారు తప మొనరించుచుండిరి ఆ తోటకున్ను గ్రామమువకున్ను మధ్య నొక నదియుండెను ప్రతిరోజు ఒక ముసలమ్మ భోజనము తీసుకొని వెళ్ళి సాధువుగారికి పెట్టుచుండెను ఒకరోజు వర్షమువలన ప్రవాహ మధికముగా నుండుటచే నదిని దాటజాలక ఆమె గృహమునకు తిరిగివచ్చెను మరుసటిరోజు యథాప్రకారము భిక్షతీసుకొని సాధువుగారి దగ్గరకు వెళ్ళెను అమ్మగారూ! నిన్నటిరోజు ఏల భోజనము తీసుకరాలేదని సాధువుగారడిగిరి స్వామీ! నది యెక్కువగా ప్రవహించుటచే రాజాలకపోతినని ఆమె చెప్పెను అందులకు సాధువుగారు నా పేరు చెప్పియుండిన నది మార్గ మిచ్చియుండెడిదిగదా యనెను స్వామీ! నా కది తెలియలేదని చెప్పి సాధువుగారికి భిక్షనొసంగి ముసలమ్మ యింటికి వెళ్ళెను కొద్దిరోజులకు మరల నదీప్రవాహ మెక్కువగా నుండుటవలన దాటుటకు సాధ్యము గాకుండెను. అప్పుడు ముసలమ్మ నదియొడ్డున నిలిచి, రామకృష్ణయ్య సాధువుగారికి భిక్షతీసుకవెళ్లవలెను నాకు దారి యివ్వవలసినదని నదిని ప్రార్థించగా గురుదేవునియందు మిక్కిలి విశ్వాసముగలవా రగుటచే ముసలమ్మ ప్రార్థన నంగీకరించి నది దారినొసంగెను ముసలమ్మ మామూలుప్రకారము అనాయాసముగా సాధువుగారి సమీపమునకు వెళ్లెను నదీ ప్రవాహము తీవ్రముగా నున్నదే యెట్లు రాగలిగితివని సాధువుగారు ప్రశ్నించగా, స్వామీ! తమ పవిత్రనామ

స్మరణముచే త్రోవనిచ్చెను అందువలన రాగలిగితి ననెను తదుపరి భిక్షనొసంగి మరల తమ గురుపదధ్యానముచే నదినిదాటి స్వగృహము చేరెను పిమ్మట రామకృష్ణయ్య తనలో నింతటి మహిమగలదనియు, దానిచే సర్వమును సాధించగలనను దురభిప్రాయముతో రామకృష్ణయ్య యను నామము నుచ్చరించుచు నదిలో దిగెను నీరు తగ్గలేదు ముసలమ్మ రామకృష్ణానందయని స్మరించినదేమో యని తానును రామకృష్ణానంద యన నారంభించెను కాని నది మార్గమివ్వలేదు నీరు కంఠమువరకు వచ్చెను వారిని కొందఱు రామకృష్ణసాధు అని, రామకృష్ణస్వామి అని, రామకృష్ణయోగి యనియు పిలచుట గలదు అందువలన ముసలమ్మ యే పేరు చెప్పినదో యను సందియముతో పై నామములన్నియు నుచ్చరించుటకు యత్నించెను కాని ప్రయోజనము లేకపోయెను చివరకు నదిలో మునిగిపోయెను కనుక ఎట్టివారికైనను అహంకారమువలన గలుగు అనర్థమిట్టిదని తెలియనగును

ఆత్మవస్తువు పరిమితిలేనిది కాబట్టి గురుదేవుని యనుగ్రహముచే పొందిన జ్ఞానమును తమ ప్రయత్నమువలన నభివృద్ధిజేసికొనిన వారెందరో గలరు శ్రీరామకృష్ణపరమహంసగారు తన గురువగు తోతాపురికంటెను, ఏసుక్రీస్తు తన గురువగు జాన్ కంటెను శంకరాచార్యులు, తన ఆచార్యులగు గోవింద భగవత్పాదాచార్యుల కంటెను మఱియు ననేక మహాత్ములు తమ తమ గురుదేవులకంటె గొప్ప స్థితిని పొందియుండిరి ఏనుగు, గుఱ్ఱము మొదలగువాటిని ఎంత శ్రద్ధగా పోషించినను వాటి పరిమితి నతిక్రమించి వృద్ధినొందజాలవు ఆత్మ పరిమితిరహితమైనది కనుక శ్రద్ధతో ధ్యానానుష్ఠానములు చేయుకొలది ఆత్మజ్ఞాన మభివృద్ధి నొందుచునే యుండును

## 7-4-1953

సూర్యకాంత దర్పణమును మలినము లేకుండా శుభ్రపరచి యేజాతివారైనను స్త్రీలుగాని, పురుషులుగాని, సూర్యునకు సమ్ముఖముగాను నిశ్చలముగాను పట్టుకొనిన ఆ యద్దమునందు పడిన సూర్యకిరణముల యొక్క వేడిమిచే దర్పణముయొక్క క్రిందిభాగముననున్న దూదిగాని, పీచుగాని దహింపబడుచున్నది అట్లే మనస్సను అద్దమును నిర్మలముగాను, నిశ్చలముగాను ఉంచుకొనిన

ఆత్మసాక్షాత్కారమును బొంది, నిత్యనిరతిశయానందమును బడయగలరు ఈ మధ్య రష్యావారొక అద్దమును కనిపెట్టిరి అదేమన సూర్యకిరణములద్వారా కొంత వేడిమిని గ్రహించి ఆ వేడిమిచే 1 టన్ను ఇనుమును కరగించిరట మున్ముందు బొగ్గు, నీటితో అవసరములేకుండ సూర్యరశ్మిద్వారా రైళ్ళు మొదలగు వాటిని నడిపించవచ్చుననియు తెలిపిరి ఏయంత్రమైనను సరియైన మట్టములో నుంచినమాత్రమే బాగుగా పనిచేయును అదేవిధముగా శరీరమను యంత్రమును ధ్యానకాలములో చక్కగా నుంచినపుడుమాత్రమే మనస్సు ధ్యేయాకారస్థితి నొందును బుద్ధ, క్రీస్తు, రామకృష్ణపరమహంస, వివేకానంద మొదలగువారి ధ్యానకాలములోగల ఫోటోలనుచూచిన దీని యధార్థము స్పష్టమగును. ఈ విషయమై గీత 6-వ అధ్యాయమందు విశేషముగా నిరూపింపబడినది ఇంతమాత్రముతో తృప్తినొందక భావనావిషయమై శ్రీ శంకరులు వివేకచూడామణియందు చెప్పినదియు గమనించవలెను "భజేద్భ్రమరకీటవత్" కీటకము నిరంతరము భ్రమరమును భావన జేసిచేసి భ్రమరరూపమును పొందునట్లు సర్వదా ఆత్మభావన చేయుటచే మనమున్ను ఆత్మాకారము నొందగలము మానవుని అవస్థ భావన ననుసరించియే యున్నది "దుర్లభం త్రయమేవైత ద్దేవానుగ్రహహేతుకం మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః'' - మానవత్వము నొందుటయు, మోక్షాపేక్ష కలిగియుండుటయు, మహాత్ముల ఆశ్రయము లభించుటయు, ఇవి మూడున్ను ఈశ్వరానుగ్రహముచే గలుగునేగాని అన్యధా సాధ్యముగావు ఈ యజ్ఞమునందు పాల్గొనిన మీకెల్లరకు పై మూడును దైవకరుణవలన లభించియే యున్నవి గనుక పవిత్రులమనియు, పుణ్యాత్ములమనియు దృఢభావన గలగియుండుడు పాపపుపనులు చేయకుడు అని శ్రీవారు శ్రోతలకు ధైర్యోత్సాహములు గలుగజేసిరి భావనను గురించి "శ్రీశైలశిఖరందృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" ఇత్యాదిశ్లోకములకు కొన్ని కధలనుకూడ బోధించిరి

## 8-4-1953

పూర్వము కరెన్సీనోట్లు వెయ్యి, అయిదువేలు, పదివేలు వరకు నుండెడివి ప్రస్తుతము నూరువరకే యున్నవి అవి పైసాకు 5,6 వంతున లభించెడి పలుచని

రఫ్ కాగితములయినను చక్రవర్తిముద్ర యుండుటచే వాటికంతటి విలువగలిగెను జాతి మత వివక్షతలేక ఎవరియొద్ద యుండినను నోట్లనెట్లు గ్రహించుచున్నామో, అట్లే ఏ జాతి వారైనను దైవగుణముగలవారు పూజ్యులే వీరినుండి దైవజ్ఞానము నందరు పొందవచ్చును భక్తి, జ్ఞానము, శాంతి, కరుణ, మున్నగునవి లేనివారు వర్ణాశ్రమములచే నెంత గొప్పవారైనను, చక్రవర్తిముద్రలేని నానా రంగులతో సుందరముగా తయారుచేయబడిన సబ్బుబిళ్ళలు మొదలగువాట్లపై నుండెడి కాగితమువలె నిరర్థకులని గ్రహించవలెను "మధులుబ్ధో యథాభృంగః పుష్పాత్పుష్పాంతరం వ్రజేత్" - మధువు నభిలషించు తుమ్మెద ఒకపుష్పమునుండి మఱియొక పుష్పముపై వ్రాలి రేకులకు కేసరములకు ఏవిధమైన హానిగలుగనీయక ఎట్లు మధువును (తేనెను) గ్రోలుచుండునో, అట్లే జ్ఞానాసక్తుడగువాడు ఎవరెవరియందు ఏయే శ్రేష్ఠగుణములు గలవో, వారి వారి నాశ్రయించి వారి ప్రకృతిగుణముల గ్రహించక, తనకు కావలసిన సద్గుణములనుమాత్రము గ్రహించుచుండవలెను కొందరు సామాన్య ప్రబోధకులగుటకు, కొందరు విశేషప్రబోధకులగుటకు, వారొనరించిన సాధనానుష్ఠానములు కారణములేగాని ఈశ్వరపక్షపాతము గాదు ఎలక్ట్రిక్‌కరెంటు తంతులన్నిటిలోను సమానముగా నుంటున్నను గృహములం దమర్చబడిన బల్బుల ననుసరించి ప్రకాశము హెచ్చు తక్కువగా నెట్లు బడయగలుగుచున్నామో, అదేవిధముగా ఆత్మ (పరబ్రహ్మము) దేశ కాలవస్తువులచే పరిచ్ఛిన్నముగాక, వీట్లన్నిటికి అతీతమై ప్రకాశించుచున్నది అయినను, తమతమ హృదయ సంకోచ వైశాల్యముల ననుసరించి హెచ్చు తక్కువగా గోచరించుచున్నది ఎలెక్ట్రిక్ మిషనుకు దూరముగానున్న భవనమైనను, కరెంటువైరు అమర్చుకొనినవా రెట్లు దీపములు వెలిగించుకొనుచున్నారో, మిషనుకు సమీపగృహమైనను వైరు నమర్చనివారు ఆ ప్రకాశము నెట్లు దర్శింపజాలరో, అట్లే శిష్యుడు గురువు యొక్క సమీపమున నుండినను, మనస్సు గురుపదధ్యానమందు లగ్నముగానియెడల ఆత్మసాక్షాత్కారము నొందజాలడు గురువునకు దూరముగా నున్నను, నిర్మలాంతఃకరణముగల శిష్యుడు సద్గురుధ్యానానుష్ఠానాదులచే గురుకృపకు పాత్రుడై శాశ్వతసుఖము నొందుచున్నాడు దూరసమీపములు దేహమునకేగాని మనస్సునకు లేవు ఎంతదూరప్రదేశముల యందలి

విషయములనైన స్మరించినవెంటనే మనస్సు చూడగల్గుచున్నది మనస్సునందు స్ఫురించిన యభిప్రాయమే మతమనబడుచున్నది శ్రీవ్యాసాశ్రమమున గల శ్రీశంకర, బుద్ధ, రామానుజ, మధ్వ, క్రీస్తు, ఛాయాపటములనుచూచిన యొకరు మున్నగు వారి మీయాశ్రమములో మతకర్త లందరిఫోటోలున్నవి అందరినిన్ని సమానముగా పూజించుచున్నారు మీ మతమేమని శ్రీవారి నడిగిరట అందులకు శ్రీవారు యావన్మంది మతకర్తలయొక్క మతికి అవలయుండి, యేది మతిని ప్రకాశింపజేయు చున్నదో, అదియే మా మతమనియు, అది దేశకాలపాత్రలకు లోబడునది గాదనియు, జ్ఞానమునకు సంబంధించినదనియు సమాధాన మొసంగిరట రామతీర్థస్వామి అమెరికా వెళ్ళినప్పుడొక ఫాదరీవచ్చి మీరు ఏమతమునకు సంబంధించినవారని స్వామివారిని రెండుమూడు పర్యాయములు అడుగగా, కొంతసమయము తూష్ణీంభావముతోనుండి తదుపరి ఒకవస్తువునుజూపి ఇది యెవరిదని అడిగిన సమాధానము చెప్పవచ్చునుగాని, ఆకాశమెవరిదని అడిగిన ఏమిచెప్పగలమని సెలవిచ్చెను అందరును మౌనము వహించిరి తాను వృత్తి, సంకల్పములకు లోబడక, వాటినతిక్రమించి వెళ్ళినపుడే ఆత్మజ్ఞానానుభవము గలుగును

## 9-4-1953

మీరు మీయింటివద్దనుండి యిచటికి వచ్చేటపుడు మీమిత్రులతో ఏప్రాపంచిక విషయములనో మాట్లాడుకొంటూ వచ్చియుండెదరు ఇచటికి వచ్చినపిదపకూడా మనస్సు ఆ భావనయే గలిగియుండును మనము దేనిని భావనచేయుచున్నామో తదాకారముగా పరిణమించే స్వభావము మనస్సునకు గలదు మనస్సొక కమేరావంటిది కమేరా తనకు సమ్ముఖముగానున్న వస్తువును ఆకర్షించి తనలో ప్రతిఫలింపజేసికొను శక్తిగలిగియున్నది అందువలననే ఫోటోగ్రాఫరు ఫోటోతీయించు కొనువారిని సరిగా కూర్చుండబెట్టి మిషనుద్గరఅకు వెళ్ళి చూచును ఏదేని లోపముండిన కాళ్ళుచేతులు కదలించవద్దు, అటు ఇటు చూడవద్దు, వంకరగా నుండకూడదు అని వారిని చక్కపరచి తర్వాత ఫోటో తీయుచున్నాడు అట్లు తీయుటచే ఫోటోలు అందముగా తయారగుచున్నవి లేనిచో వికారముగా నుండును

కనుకనే బహిర్ముఖముగానున్న మనస్సును అంతర్ముఖముగా త్రిప్పుటకొఱకే హరికథలు మొదలగునవి ప్రారంభించునపుడు ముఖ్యముగా ఆధ్యాత్మిక సభల ప్రారంభమందును దైవప్రార్థనలు చేయుచున్నారు మనస్సును ఏకాగ్రపరచినపుడు మాత్రమే ఆధ్యాత్మిక ప్రబోధముల నవగాహనము చేసికొనగలము భజన ప్రార్థనాదులుకూడా భక్తితో నొనరించవలెను భక్తి వర్షమువంటిది సారవంతమైన భూమిని చక్కగాదున్ని, మంచి యెరువువేసి, శ్రేష్ఠమగు విత్తనములు సకాలములో వేసినను వర్షము లేనియెడల ఆ బీజము లెట్లు వృద్ధినొంది ఫలింపజాలవో, అట్లే యోగముగాని, కర్మగాని, సాంఖ్యముగాని, (జ్ఞానముగాని,) తపస్సు, దానము మొదలగు వేవిగాని భక్తిరహితములైనచో ఫలింపజాలవు పై దృష్టాంతమునకు ప్రస్తుతము రాయలసీమను గ్రహించవచ్చును రాయలసీమ ప్రజలు ఎంతో శ్రమపడి కృషిసలిపినను వర్షాభావముచే సస్యములు ఫలవంతములు గాకపోవుటయు, ఆకారణమువలన కరువుకాటకములు సంభవించుటయు, మనము పత్రికలలో చదువుచున్నాము ప్రత్యక్షముగా చూచిన వారును కొందఱుగలరు

**యోగః కర్మ చ సాంఖ్యం చ తపో దానం వ్రతం శ్రుతమ్।**
**వ్యర్థం హి భక్తిహీనస్య వృష్టిహీనా కృషిర్యథా॥**

దీనియొక్క భావమే పైన తెలుపబడినది పరమాద్వైతమును ప్రబోధించిన శ్రీమచ్ఛంకరాచార్యులున్ను ప్రశ్నోత్తరమణిరత్నమాలలో ఈ విధముగా తెలిపిరి

**అపారసంసార సముద్రమధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి ।**
**గురో కృపాళో కృపయావదైతద్విశ్వేశపాదాంబుజ దీర్ఘనౌకా ॥**

పై శ్లోకమున సంసారమును సముద్రముగా వర్ణించిరి సముద్రమునందు ఒకదానివెనుక నొకటివంతున గొప్పఅలలు వచ్చుచునే యుండును సంసారమందును, సుఖదుఃఖములను కెరటములు గమనాగమనములతో నుంటున్నవి జననమరణములను సుడులును గలిగియున్నవి కామక్రోధ లోభ మోహాదులను క్రూరజంతువులును గలవు సముద్రమెట్లు అగాధమైనదో, అట్లేసంసారమున్ను అనాదియని గ్రహించవలెను సముద్రసదృశమైన సంసారమందు

మునుగుచున్న నాకు తరణోపాయమేమియని కృపానిధియగు గురువును శిష్యుడు ప్రార్థించగా పరమదయామూర్తియైన గురువుగా రీవిధముగా తెలుపుచున్నారు నాయనా! భయపడకుము పరమేశ్వరుని పాదకమలములయందలి భక్తియను విశాలమైన, దృఢమైన నావను సంపాదించుకొనుము దానిచే సులభముగా సంసారసముద్రమును దాటగలవని సెలవిచ్చిరి శ్రీకృష్ణ భగవానులున్ను భగవద్గీతలో నిట్లు బోధించిరి

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున ।**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥**

ఓ యర్జునా! నా మహిమను తెలిసికొనుటకు, నా నిజ స్వరూపమును చూచుటకు, చివరకు నాలో విలీనమగుటకున్ను, అనన్యమైన భక్తిమార్గము తప్ప ఇతర సాధనములచే సాధ్యముగాదని తెలిపిరి కావున భగవదనుగ్రహమునకు పాత్రులు గావలయుననిన భక్తిమీదనే ఆధార పడవలయును

## 10-4-1953

వర్ణాశ్రమములే ముఖ్యమని తలంచు పూర్వాచారపరాయణులు కొందరు నవీనపద్ధతుల నంగీకరించరు ఇప్పటి యువకులలో కొందఱు ప్రాచీనపద్ధతుల నవలంబించక యింగ్లీషుభాష నభ్యసించి తదనుగుణ్యముగా నవీనపద్ధతియే సరియైనదని తలంతురు. యధార్థమాలోచించిన వీరుభయులున్ను కొంత సవరణ చేసికొనవలసియున్నారు దీనినిగూర్చి కాళిదాస మహాకవి పూర్వమే తెలిపియున్నారు

**పురాణమిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవమిత్యవద్యమ్ ।**
**సంతః పరీక్ష్యాన్యతరద్భజన్తే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః ॥**

పురాతనమైనది సర్వము శ్రేష్ఠమనియు, అధునాతన మంతయు నికృష్టమనియు తలంచువారు మూర్ఖులు ప్రజ్ఞావంతులు పర్యాలోచనజేసి ప్రాచీన, నవీనపద్ధతులలో దేశకాలముల ననుసరించి కొన్నిటిని త్యజింపవలసియు, కొన్నిటిని గ్రహించవలసియు నున్నారు యోగవాసిష్ఠమందును వసిష్ఠులు ఆలాగుననే తెలిపిరి

**యుక్తియుక్త ముపాదేయం వచనం బాలకాదపి ।**
**అన్యత్తృణ మివత్యాజ్య మప్యుక్తం పద్మజన్మనా ॥**

యుక్తియుక్తమైన వాక్యము బాలునియందుండినను, దానిని గ్రహించవలెను యుక్తియుక్తముగాని వాక్యమును బ్రహ్మదేవుడు చెప్పినను తృణీకరించవలెను శ్రీ వివేకానంద మొదలగు నవీన బోధకులు ఈ పద్ధతినే యవలంబించిరి శ్రీ వ్యాసాశ్రమమువారున్ను ఈ మార్గము నవలంబించియే ప్రవర్తించుచున్నారు ప్రాచీన ఋషిసంప్రదాయ అనుష్ఠానమును విడనాడకయు, నవీనదేశకాలస్థితి ననుసరించి ప్రవర్తించుటయు, నిజమైన ధర్మమగును ప్రాచీనమార్గము మాత్రమే అవలంబనీయ మనియు, నవీనపద్ధతి అనాదరణీయమనియు వాక్కుతో మాత్రము సనాతనులనువారు చెప్పుచున్నారేగాని వారిలో నవీనయంత్రములను, ఔషధములను, తంతి తపాలులను, వస్త్రపుస్తకాదులను ఉపయోగపరచని వారెవరున్నారు? అట్లుపయోగపరచక జీవింపవలసియుండిన అదిసాధ్యముగాదు అట్టివారి జీవితము మృగజీవితముకన్న ఎక్కువైనదిగాదని తప్పనిసరిగా చెప్పవలసియే యున్నది ఈ అంధవిశ్వాసమును హృదయకుహరాంతరాళమునుండి వెడలగొట్టినవారే స్వరాజ్యమును పొందగలిగిరి ఈ దివ్యశక్తి హృదయాంతరాళములో నుదయించువరకు పరులకు బానిసలై, దాసులై సేవకులై భారతీయు లుండిరి దీనికన్న నీచమైనది, దీనమైనది మఱియొకటి గలదా? కావున ప్రాచీన, నవీనపద్ధతుల సమయానుకూలముగా స్వీకరించినప్పుడే మనము వ్యావహారికముగాను పారమార్థికముగాను అభివృద్ధి నొందగలుగుదుము ప్రస్తుతము మనవారు మనకు స్వరాజ్యము వచ్చినప్పటినుండి దేశమును రక్షించుకొనుచున్నారంటే పాశ్చాత్యులనుండి గ్రహించిన పద్ధతి ననుసరించియేయని తలంచవలెను అయితే మనువు మొదలగువారువ్రాసిన ధర్మశాస్త్రముల ననుసరించి పూర్వపురాజులు రాజ్యమును పాలించలేదాయని అనవచ్చును కాని, అప్పటి పరిస్థితులు వేరు, ఇప్పటి వాతావరణము వేరు అందువలననే వివేకానంద, రామతీర్థ, గాంధీజీ మొదలగువారు ప్రాచీన, నవీనపద్ధతుల సమ్మేళనపరచి ప్రథమమున వారాచరించి తదుపరి యితరులచే ఆచరింపజేసి, వారి వారి కార్యముల నిర్వహించుకొనిరి

మొదట గాంధీగారి యుద్యమమును జూచి సనాతనుల మనుకొను కొందఱు ఇతడు నాస్తికుడని నానావిధముల దూషించిరి ఎంద రెట్లు దూషించినను వాటియందు లక్ష్యముంచక, వారు పట్టినపట్టు విడువక, జాతి మత భేదముల నించుకైన లెక్కించక, సమత్వబుద్ధితో, సత్యాహింసలతో, స్వరాజ్యమును సంపాదించిరి ప్రస్తుతము గాంధీజీ భగవంతుడని వారి విగ్రహముల నచటచట ప్రతిష్ఠించి భజన ప్రార్థనాదులు జరుపుచున్నారు ఈ మహాత్ముని తల్లిగారు దైవమందు మిక్కిలి భక్తిగలవారు అట్టి మహాతల్లిగర్భమందు జనించుటవలననే వీరికి బాల్యమునుండియే మాతృభక్తియు, దైవవిశ్వాసము మొదలగు సద్గుణములు అలవడినవి గాంధీగారు బారిష్టరుచదువుటకు ఇంగ్లండునకు వెళ్ళదలచినపుడు తల్లిగారు రెండుషరత్తుల కోరిరి ఒకటి మాంసాహారము చేయకుండుటయు, రెండు అచటి స్త్రీలను ముట్టకుండుటయు ఇందులకు గాంధీజీ సమ్మతించి తల్లియనుజ్ఞను వడసి ఇంగ్లండుకు వెళ్ళెను పై రెండు విషయములలోనెన్ని కష్టములు సంభవించినను సహించుకొని తల్లిగారి అభీష్టమును సఫలమొనర్చిరి దీనివలన వారికి గల మాతృభక్తి యెట్టిదో తెలియనగును దేశోద్ధారకులును, మాతా పితరులయందు భక్తిగలవారును, గురుదైవముల యందు విశ్వాసముగల వారును అగు సంతానములను గోరు తల్లిదండ్రులు సద్గుణసంపన్నులును, నియమ నిష్ఠాపరులును గావలయును ఒక ఇంజనును దృఢముగాను, చాలకాలము పనిచేయునది గానుండునట్లు తయారుచేయదలచిన, ముందుగా ఏయే లోహములు ఎన్నెన్ని భాగములు చేర్చవలెనో తెలిసికొని ఆ ప్రకారము తయారుచేసినచో వారు తలంచినట్లు ఆ ఇంజను గట్టిగానుండి యెక్కువకాలము పనిచేయును అట్లే సతీపతులు ధర్మానుష్ఠానపరాయణులై యుండినమాత్రమే సత్సంతానమును బడయగలరు

## 11-4-1953

**స్మరణాత్కీర్తనాద్వాపి శ్రవణాచ్చ జపాదపి ।**
**బ్రహ్మ తత్ప్రాప్యతే నిత్యమోమిత్యేతత్పరాయణమ్ ॥**

ఓంకారమును స్మరించువారును, ఉచ్చరించువారును, శ్రద్ధతో శ్రవణము చేయువారును, జపమొనరించువారును, పవిత్రహృదయులై ముక్తులగుదురు కొన్ని

యెండుకట్టెలు మండునపుడు మధ్య మధ్య పచ్చికట్టెలుండినను ఎండుకట్టెల సహాయమువలన పచ్చికట్టె లెట్లు భస్మమగుచున్నవో, అట్లే మహాత్ములొనరించు ప్రార్థనాదులలో పాల్గొనిన పాపులున్ను మహాపురుషుల సంగమమువలన పవిత్రులగుదురు కాని దేహముతో కలిపి ప్రార్థన లొనరించినంత మాత్రముచేతనే పునీతులు గాజాలరు మనస్సును ఏకాగ్రపరచి దైవభావమందుంచవలెను కుమ్మరివాడు ఘటాదులను తయారుచేసి, ఆవమందుంచి అగ్నినిపెట్టును శెగ బయటికి రాకుండునట్లు చల్లనిగాలి లోపలికి ప్రవేశింప కుండునట్లును, జాగ్రతగా చూచుచుండును ఏ విధముగనైన శీతవాయువు లోపల ప్రవేశించిన అచ్చటనున్న వేడిమి తగ్గిపోయి ఆ పాత్రలు కాలక పచ్చివిగానే యుండును నీటిలో ముంచగనే విచ్చిపోవును కాలనిపాత్రలుకూడ కాలినవాటిలో కలిసియున్నవేగదా? వీటికీగతి గలుగుటకు కారణమేమన బయటినుండివచ్చిన చల్లనివాయువు సంబంధమేయని గ్రహించవలెను అదేవిధముగా దేహములతో మహాత్ముల సమీపమున నున్నప్పటికిని వాక్కుతో ప్రణవాదిమంత్రముల నుచ్చరించుచున్నను, మనస్సును ప్రార్థనయందు లగ్నపరచక, విషయోన్ముఖముగా నుంచినయెడల కాలని ఘటములగతియే గలుగునని మరువకూడదు కాలని పాత్రలమట్టిని కుమ్మరి నీటిలోనుంచి మృదువైన తర్వాత కాలితో బాగుగా మర్దనజేసి చక్రముపై పెట్టుచున్నాడు అట్లేమనస్సును ఏకాగ్రపరచనివారున్ను ప్రకృతిచే త్రొక్కబడి నానాదుఃఖము లనుభవించి మరల జననమరణ కాలచక్రముపై కెక్కవలసియున్నారు మనస్సును అంతర్ముఖముజేసి దైవభావముతో పాల్గొనని కారణముచే ఆత్మశాంతి నొందకున్నారు అందువలన ఈశ్వరుడు అందరి హృదయములయందు సర్వదా ప్రకాశించుచున్నను, ఎవరిహృదయము విషయవాసనలచే మలినముగానుండునో వారికి ఆత్మసాక్షాత్కారము గలుగదు ఎట్లన, లైటులోపలనున్న దీపము వెలుగుచున్నను, లైటునకమర్చిన అద్దము మసి, దుమ్ముచేత మలినమైయుండిన దీపము ప్రకాశించదు లైటుచిమ్నీని తుడిచి శుభ్రముగానుంచిన దీపము బాగుగా ప్రకాశించును ఒకరోజుమాత్రము తుడిచి, మరల తుడవకయుండిన పూర్వమువలెనే మలినమై దీపప్రకాశము సరిగా గాన్పించదు కనుక ప్రతిరోజూ చిమ్నీని శుభ్రరచుచుండిన దీపము బాగుగా ప్రకాశించుచుండును అట్లే

మలబద్ధకముగలవారు రాత్రి పరుండునప్పుడు చూర్ణమునో, లేహ్యమునో, మాత్రలనో సేవించెదరు దానివలన ఉదయము మలబద్ధకములేక సాఫుగా విరేచనమగును అందుచే నారోగ్యముగా నుందురు ప్రతిరోజు అదేవిధముగా ఔషధమును పుచ్చుకొనుచుండవలెను ఏరోజు మందుతీసుకొనలేదో, ఆరోజు మలబద్ధకము పోగొట్టుకొనదలచినవారు ప్రతిరోజు భవన్నామస్మరణచేసినచో భవరోగము నశించును మొదట కష్టమని తోచినను భగవద్ధ్యానాదులు చేయుచు రాగా రాగా కొంతకాలమునకు అదియే మిమ్ముల నా సమయమునకు ప్రేరేపించును ప్రతివారును ఒకవ్రతమును శీలించవలెను అది ఏకాదశి, ప్రదోషము, సోమవారము మొదలగువ్రతము గాదు మరేమనగా ప్రాతఃకాలమున లేచి భగవద్ధ్యాన ప్రార్థనాదులను చేయనిదే మంచినీరుకూడ పుచ్చుకొనను అని దృఢనిశ్చయులై యుండిన మాత్రమే సంసారబంధమునుండి విముక్తులగుదురు, తరించుట కవకాశమున్ను ఏర్పడును

## 12-4-1953

బ్రహ్మదేవుడు ఇంద్రియములను బహిర్ముఖము గలవిగా సృష్టించెను అందుచేతనే యవి బాహ్యవిషయములందు పరుగిడుచున్నవి కాని ఒకానొక ప్రజ్ఞావంతుడు ఇంద్రియములను అంతర్ముఖముగా నొనరించి ఆత్మానుభవము నొందుచున్నాడు ఈ విషయము కఠోపనిషత్తులో "పరాంచిఖాని'' అను మంత్రమందు చెప్పబడియున్నది మనస్సు త్రాసుపైనున్న ముల్లువంటిది త్రాసున కిరుప్రక్కల రెండు తట్టలుండును ఏతట్టలో వస్తువు లధికముగా నుండునో ఆవైపే ముల్లు వ్రాలుచుండును ఆ ముల్లును మధ్యకు తీసుకరావలసి యుండిన అధికముగానున్న తట్టలోనుండి కొన్నివస్తువులను తీసివేయవలెను అపుడు ముల్లు స్వయముగా మధ్యభాగమునకు రాగలదు తట్టలోని వస్తువులను తీయక ముల్లును మరల్చుటకెంత ప్రయత్న మొనరించినను ఎట్లు సాధ్యముగాదో అట్లే యింద్రియములు ప్రాకృత విషయములందు ప్రవర్తించున్నంతవరకు మనస్సు ఆత్మాకారస్థితి నొందజాలదు మనస్సును ధ్యేయబ్రహ్మమం దుంచవలెనన్న ఇంద్రియములను శబ్ద స్పర్శాదులనుండి విముఖముల చేయవలెను

కార్యోపాధియైన జీవుని కారణోపాధియైన యీశ్వరునిగా మార్చదలచిన యెంత పరిశ్రమచేయవలెనో చూడుడు జీవస్వరూపుడైన ఆంజనేయుల విగ్రహమును ఈశ్వరస్వరూపుడైన శ్రీరామచంద్రమూర్తినిగా తయారుచేయవలెనంటే ఆంజనేయుల విగ్రహమును ముక్కలు ముక్కలుగాచేసి మూసలోవేసి కరిగించి, తదుపరి శ్రీరామచంద్రమూర్తి ఆకారములో గల మూసలో పోసిన కొంతసేపటికి శ్రీరామచంద్రమూర్తిగా తయారగుచున్నది అట్లే నందికేశ్వర విగ్రహమును ఈశ్వర విగ్రహముగా చేయవలెనన్న పైక్రమమునే అవలంబించవలెను కావున కించిద్జ్ఞుడైన జీవుని సర్వజ్ఞుడగు ఈశ్వరునిగా జేయుటకు, ప్రకృతిగుణము లను లోహమును వివేక మను సుత్తెతో విరుగగొట్టి, ప్రణవధ్యాన మను అగ్నితో కరిగించి, దైవగుణములను నీరుగామార్చి, ధ్యేయమను మూసయందు పోసిన జీవత్వము పోయి శివత్వ మేర్పడును ఋషులు, యోగులు, మహాత్ములు ధ్యానానుష్ఠానములచే దైవభావములో మనస్సును నిలిపి ధ్యేయాకారమును పొందిరి ఈ స్థితి మాటలచేత మాత్రము పొందజాలము మాటలచేతనే సాధ్యమగునెడల శంకరులు, వ్యాసులు, శుకమహర్షి మొదలగువారు తపోధ్యానాదులు జేసియే యుండరు విశ్వామిత్ర, వసిష్ఠ, వామదేవ నారదాదులు, ఏమంత్రముల జపించి ఆత్మానుభవము నొందిరో ఆ మంత్రములనే మనము జపించుచు ఆ స్థితికి రాకపోవుటకు కారణమేమన, వారు భావన సరిగా నున్నదా లేదా యని భావమందే మనస్సు నుంచిరి మనము రోజుకు వెయ్యో రెండువేలో జపించవలెననుకొన్న లెక్కయందే మనస్సు నుంచితిమి అందువలననే మంత్రజపముచే లభించు ప్రయోజనమును పొందజాలకున్నాము పరబ్రహ్మస్వరూపము ప్రతి అణువునందును ప్రకాశించుచునేయున్నది కాని మీరు మీ మనస్సును మార్పుచేసికొనకపోవుటచే చూడజాలకున్నారు మనమెవరిని మహాత్ములను కొనుచున్నామో, వారివారి జీవితముల జదివిన వారెట్టి పరిశ్రమచే నట్టిస్థితికి రాగలిగిరో తెలిసికొనగలము మహాత్మాగాంధీజీ యెన్ని కష్టములు సహించుటచే ప్రఖ్యాత పురుషోత్తము డయ్యెనో మనమందర మెఱుగుదుము

## 13-4-1953

ఆత్మ పునీతము కావలయునన్న ప్రాకృత, అప్రాకృతవిద్యలు రెండును నవసరమే కావున ప్రతివారును రెండువిద్యలయందు నిపుణులు గావలెను ప్రాకృత

విద్యయందుమాత్ర ముత్తీర్ణుడైన "భుక్తయే నతు ముక్తయే" అన్నట్లు అన్నవస్త్రాదులు సుఖమునుమాత్రము గలుగజేయునేగాని, ముక్తి నివ్వజాలవు శాస్త్రజ్ఞానము లేనివాడై ఆత్మజ్ఞానము గలవాడగుచో తానుమాత్రము శాంతినిపొంది, ఎచ్చటనో ఏకాంతముగా నుండవచ్చునేగాని సభలలో ధైర్యముగా ఆధ్యాత్మిక ప్రబోధమొనర్చి, అన్యుల యజ్ఞానమును, వారికిగల సందేహములను పోగొట్టజాలడు కనుక రెండువిద్యలు నేర్చుకొన్నపుడే సంపూర్ణజ్ఞాని కాగలడు అమృతబిందూ పనిషత్తునందు ఈ విధముగా జెప్పబడినది

**ద్వేవిద్యే వేదితవ్యే తు శబ్దబ్రహ్మ పరం చ యత్ ।**
**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥**

ఇచట శబ్దబ్రహ్మమన ప్రాకృతవిద్యయనియు, పరబ్రహ్మమన ఆత్మవిద్య యనియు గ్రహించవలెను దేనివలన అవిద్య (అజ్ఞానము) నశించుచున్నదో దానినే ఆత్మవిద్య యనెదరు కనుక పండితులగు ప్రతివారును తమయందుండు అజ్ఞానము నశించినదా? లేదా? అని చూచుకొనవలెను అవిద్య నశించుటకు బ్రహ్మవిద్యయే ముఖ్యసాధనము ఎట్లన పాషాణములోగల సమస్తదోషములు నశించవలయునన్న అగ్నిచే స్ఫుటము గావించవలసి యుండును అప్పుడుమాత్రమే అది సమస్తవ్యాధులను నశింపజేయగలుగును అట్లే మనస్సును ప్రాపంచికవిషయ రహిత మొనర్చుకొనవలయునన్నచో జ్ఞానాగ్నిచే తప్తమొనర్చవలెను అట్లు చేయుటచే ఆత్మశాంతి లభించును అగ్నిచే శుద్ధ మొనర్చబడని పాషాణము రోగులయొక్క మృత్యువునకు కారణ మగునట్లు, జ్ఞానముచే వాసనా రహితముగాని మనస్సు జన్మకు కారణమగుచున్నది కావుననే శంకరులు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదునబి, గాంధీజీ మొదలగు మహాత్ములు జ్ఞానాగ్నిచే తమ సమస్తదోషములను రహిత మొనర్చుకొనిరి. మఱియు శాస్త్రజ్ఞానము గలవారగుటచే అనేకవిధముల ప్రబోధించి ప్రజలయొక్క అజ్ఞానావరణమును తొలగించి జ్ఞానభాస్కరుని ప్రకాశింపజేసిరి "జ్ఞానాదేవతు కైవల్యమ్" ఆత్మజ్ఞానముననే మోక్షము సిద్ధించుచున్నదని శ్రుతి జెప్పుచుండగా, శాస్త్రజ్ఞానముచే ప్రయోజనమేమని అడుగవచ్చును శాస్త్రజ్ఞానములేక ఆత్మజ్ఞాన

ముదయించదు కనుక శ్రోత్రియ బ్రహ్మనిష్ఠునికడ కేతెంచి విధిప్రకారము శ్రవణముచేసి మనన నిదిధ్యాసము లొనరించిన ఆత్మసాక్షాత్కారము గలుగును ఎట్లన మనకు కావలసినవి ఫలములే యైనను, మొదట చెట్టును చక్కగా పోషించిన యెడల ఫలమును పొందగలము కొమ్మలు, ఆకులు మొదలగునవి మనము భుజించుటలేదు గదా యని చెట్టును చక్కగా పోషించనియెడల తత్ఫలితమునెట్లు పొందజాలవెూ, అట్లే మోక్షమునకు జ్ఞానమే ముఖ్యసాధనమైనను జ్ఞానముగలుగుటకు గ్రంథపఠనమున్ను అవసరమే అయితే జీవిత మంతయు అధ్యయనము జేయుచుండ వలసినదేనా? లేక దానికేదేని అవధి గలదా? అనిన అదియు నుపనిషత్తునందే జెప్పబడినది

**గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పర: ।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషత: ॥**

ధాన్యము నభిలషించు కర్షకులు, తమకు కావలసినది ఫలమే యైనను, సకాలమున వ్యవసాయముచేసి విత్తనములజల్లి పైరును చక్కగా పోషించుచున్నారు ఫలించిన తదుపరి ధాన్యమును తీసికొని గడ్డినెట్లు వదలుచున్నారో, అట్లే మోక్షాసక్తుడగు మేధావంతుడును వేదాంతగ్రంథముల నధ్యయనము జేయవలెను శాస్త్రజ్ఞానముచే ఆత్మజ్ఞానము సంపూర్ణముగా గలిగినపిదప గ్రంథపఠనమును విడువలెను కావున ప్రాకృత, అప్రాకృత విద్యల రెంటిని నభ్యసించవలెను

## 14-4-1953

పరమేశ్వరుడు సర్వప్రాణికోట్ల భౌతికసుఖములకొఱకు పంచభూతములను సమానముగా సృష్టించెను అదేవిధముగా పరమాత్మజ్ఞానము కొఱకు వేదములను, ఉపనిషత్తులను, భగవద్గీతను సృష్టించెను ఆకాశము యొక్క పని అవకాశమును గలుగజేయుట (శబ్దమును కర్ణముద్వారా వినిపింపజేయుట) ఆకాశము తనయొక్క కార్యములో నేయొక్క పక్షపాతములేక శబ్దమును అందరికి సమానముగా నందజేయుచున్నది రెండవది యగు వాయువున్ను జాతి మత వివక్షతలేక అందరియొక్క ఉష్ణమును శమింపజేయుచు ఆనందపరచుచున్నది మూడవదియైన

అగ్నియు (సూర్యుడు) బ్రహ్మచర్యాది ఆశ్రమముల లెక్కించక యెల్లరకు సమానమైన ప్రకాశమును కలుగజేయుచున్నది నాల్గవదియగు జలమున్ను మనుష్య పశ్వాది భేదముల పాటించక స్నానము చేసినవారియొక్క దాహమును శమింపజేయుటయందును సమదృష్టి గలిగియున్నది ఐదవదియగు భూమియు బ్రాహ్మణాది వర్ణముల నపేక్షింపక యెవరు ఏ బీజమును పెట్టి యెంత శ్రద్ధతో పోషించుచున్నారో, వారివారి పరిశ్రమకు తగినట్టియు బీజానురూపమైనట్టియు ఫలమును ఇచ్చుచున్నది పంచభూత కార్యములందు ప్రతివారికి ఎట్లు హక్కుగలదో అట్లే వేదములను, ఉపనిషత్తులను, భగవద్గీతను అధ్యయనము చేయుటకు అందరికిని జన్మహక్కుగలదని ఘంటాపథముగా జెప్పవచ్చును అయితే మీహక్కును మీరు సరిగా వినియోగ పరచుకొనని కారణముచే అజ్ఞానావస్థలో బడవలసివచ్చినది స్వరాజ్యము సంపాదింపదలంచినవారు అనేక చరిత్రలను, ఆంగ్లభాషను చదివి అనేక కష్టములకోర్చి ఇది జన్మహక్కని స్వరాజ్యమునెట్లు సంపాదించిరో, అట్లే స్వారాజ్యమును సంపాదించుటకును సంస్కృతము, వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత చదివి మహనీయులవద్ద శ్రవణముచేసి దైవ ధ్యానానుష్ఠానపరు లైనప్పుడే ఆత్మరాజ్యమును బడయుగలరు స్వరాజ్య స్వారాజ్యములు రెండును హస్తగతమైనపుడే నిత్య నిరతిశయానంద మనుభవించగలము విదేశ (జర్మనీ మొదలగు) రాజులు స్వరాజ్యములను సంపాదించి స్వారాజ్యమును సంపాదించని కారణముచే తమరాజ్యములను ఛిన్నాభిన్న మొనర్చుకొని అనేక దుఃఖములకులోనై చివరకు మృత్యువు వాతబడిరి స్వారాజ్యమును సంపాదించవలెనన్న అవిద్యయను రాజ్యమునకు సంబంధించిన కామక్రోధాదులను పారద్రోలవలెను కావుననే యిట్టి ఆత్మరాజ్య సంపాదన సోమరులకు సాధ్యపడునది గాదు కాన యీ యుద్యమములో ప్రవేశింపదలచువారు మొట్టమొదట వేదమంత్రములతో పవిత్ర తీర్థస్థలములో సోమరిదేవతకు తర్పణమొనర్చి సోఽహంభావముచే దైవధ్యాన తత్పరులైనపుడే ఆత్మరాజ్యమును బొంది పూర్ణసుఖము ననుభవించగలరు.

## 15-4-1953

భక్తియే పరమాద్వైతమునకు సాధనము సౌధమునకు సోపానమెట్లు

యవసరమో అట్లే అద్వైతానుభవము పొందుటకు భక్తియు నావశ్యకము అందువలననే "ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా" అని శాస్త్రము చెప్పుటకు కారణము పరమాద్వైత మతస్థాపకులగు శ్రీ శంకరాచార్యులును భగవద్భక్తి తత్పరులై శివానందలహరి మున్నగు అనేక గ్రంధముల రచించిరి ఇంకను అద్వైతసిద్ధియను ఉత్కృష్టగ్రంధమును రచించినవారు శ్రీ మధుసూదన సరస్వాతిస్వాములవారు శ్రీశంకరాచార్యులవారి యనంతరము ఇంతగొప్ప మేధావంతు డవతరించి యుండలేదు వారు తన అద్వైతసిద్ధియను గ్రంధముయొక్క ప్రారంభమున నొకశ్లోకమును వ్రాసియున్నారు

**దాసోఽహమితి యా బుద్ధిః పూర్వమాసీ జ్జనార్దనే ।**
**దాకారోఽవహృతస్తేన గోపీవస్త్రావహారిణా ॥**

పూర్వము దాసోఽహం (నీకు నేను సేవకుడను) అను భావముతో శ్రీ కృష్ణనుపాసించువాడను ఆవిధముగా నుపాసన చేయగా చేయగా గోపికలయొక్క అజ్ఞానావరణమును తొలగించిన శ్రీ కృష్ణపరమాత్మ దాసోహమను మూడక్షరములలో దాకారమును అపహరించెను అని తనకుగల శ్రీకృష్ణభక్తిని సూచించిరి మఱియు దాకారము లోపించగా "సోఽహం" అను భావమిప్పుడు గలిగినదనియు స్ఫురించుచున్నది అందువలన గ్రంధముయొక్క అభిప్రాయమున్ను విశదమగుచున్నది అట్టి అద్వైత భావము లేక సోఽహం సోఽహమని వాక్కుతో నుచ్చరించుటకంటె దాఽసోహం దాసోఽహమనుటయే శ్రేష్ఠము, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాంశ సంభూతుడగు శ్రీ దత్తాత్రేయులు అవధూతగీతలో నిట్లు తెలిపియున్నారు

**త్వద్యాత్రయా వ్యాపకతా హతా తే**
**ధ్యానేన చేతఃపరతా హతా తే ।**
**స్తుత్యా మయా వ్యాపకతా హతా తే ।**
**క్షమస్వ నిత్యం త్రివిధావరాధాన్ ॥**

అంతట వ్యాపించియుండు భగవంతునిగూర్చి తీర్థయాత్ర చేసినను, క్షేత్రయాత్రచేసినను భగవంతు డొచోటమాత్ర మున్నాడను భావముతో చేసినట్లగుచున్నది అప్పుడు భగవంతునికి గల సర్వవ్యాపకత్వమును

న్యూనపఱచినట్లగుచున్నది ఇది మొదటి అపరాధము భగవంతుని ధ్యానించుటచే భగవంతుడు మనోలయుడను భావముతో అతని యొక్క, మనస్సునకు అతీతమైన శక్తిని పోగొట్టినట్లగుచున్నది ఇది రెండవ యపరాధము భగవంతుని స్తోత్రము చేయుటచే భగవంతునికిగల సర్వవ్యాపకత్వమును సందేహించి స్తుత్యర్థములకు పరిమితమైన వానినిగా భగవంతుని చెప్పినట్లగుచున్నది ఇది మూడవ అపరాధము భగవంతుడు కాయమునకు, మనస్సునకు, వాక్కునకును తెలిసికొన శక్యము కానివాడని యీ శ్లోకముయొక్క భావము కాబట్టి యీ మూడు అపరాధములను క్షమించుమా యని పరమేశ్వరుని ప్రార్థించెను దీనివలన సాకారభక్తి యెంత అవసరమో ద్యోతక మగుచున్నది కాని ఆ సాకారభక్తి నిరాకారముగా పరిణమించినపుడే పూర్ణభక్తి యగును కావుననే హరికథలు జెప్పువారును, భజనలు చేయువారును, ఒకానొక సమయమున నిశ్చేష్టులై మౌనమును వహించి భగవదాయత్తచిత్తు లగుదురు దీనికే రామకృష్ణ పరమహంసగారొక యుదాహరణమును జెప్పిరి ఒకపుడు ఒక ఉప్పుబొమ్మ తన జన్మస్థానమగు సముద్రమును జాచుటకై వెళ్ళి అందు ప్రవేశించిన దట తాను ప్రవేశించుకొలది తన యాకారము విలీనమై సముద్రాకారము నొందుచుండెను అట్లే మనస్సున్ను తనకు కారణభూతమగు పరమాత్మను ధ్యానించి తదాకారము జెందును ఇదియే భక్తియొక్క పరమావధియని గుర్తించనగును

## 16-4-1953

గీర్వాణభాష చాల కఠినమైనదనియు, ఆ శబ్దముల నుచ్చరించుట అందరికి సాధ్యము గాదనియు అనేకులు భయపడి సంస్కృతమును చదువుటకు యత్నించుట లేదు కాని ఒక్కమూగవానికి తప్ప మాటలాడు ప్రతిమానవునకును సాధ్యమగునదియే ప్రస్తుతము సాహిత్య, వ్యాకరణ, తర్క, వేదాంత శిరోమణులయందుత్తీర్ణులై, అధ్యాపకులుగా పనిచేయుచున్న బ్రాహ్మణేతరు లెందరో గలరు వారెట్లు చదువగలిగిరి? దీనికి గొప్ప మేధాసంపత్తియు నక్కరలేదు ఆసక్తి, శ్రద్ధయు నుండిన చాలును ఇవి రెండును లేనివాడు మేధావంతుడైనను ప్రయోజనము లేదని క్రింది శ్లోకముచే విశదమగుచున్నది

**ఆస్థా స్వాస్థా యది స్యాతాం మేధయా కిం ప్రయోజనమ్ ।**
**తే ఉభే యది న స్యాతాం మేధయా కిం ప్రయోజనమ్ ॥**

కావున ఆసక్తి, శ్రద్ధ గలవారందరు చదువగలరు మొదట కొంత కష్టముగా నుండినను కొన్నిశబ్దములు, ధాతువులు కంఠస్థము కాగా కావ్యముల చదువుట కారంభింతురు అప్పుడు విద్యార్థుల కొకవిధమగు నుత్సాహము, ఆనందము గలుగుచుండును ఎట్లన ఎండిన ఖర్జూరము ప్రథమమున నమలుటకు కఠినముగా నుండినను, నమలుకొలది మృదువై మాధుర్యము నొసంగునట్లని తెలియవలెను వాక్కొక హార్మోనియం వంటిది హార్మోనియమును ప్రతిరోజు వాయించుచుండిన ఆ యా శబ్దములు (సరిగమపదనిసలు) సరిగా పలుకుచుండును కొంతకాలము దానిని కదలించక అట్లే యుంచిన త్రుప్పుపట్టిపోవును మనకవసరము వచ్చినపుడు మరల వాయించిన అపశబ్దముల పలుక నారంభించును దానికి గల చిలుము మొదలగువాటిని తీసివేసి శుభ్రపరచి సరిగా అమర్చినయెడల యథాప్రకారము స్పష్టముగా పలుకగలదు అట్లే వ్యాకరణ శాస్త్రమందు జెప్పిన ప్రకారము అనగా "అ కుహ విసర్జనీయానాం కంఠః, ఇచుయశానాం తాలు" అని ఆ యా శబ్దములకు కొన్ని స్థలములు నిర్ణయించియున్నారు ఆ విధముగా నభ్యసించిన యెడల ఎల్లరు సులభముగా స్పష్టముగా నుచ్చరించగలరు శబ్దములను శుద్ధముగా పలుకుటకు ప్రయత్నించక యిష్టమువచ్చినట్లు మాట్లాడుచుండుటచే అపశబ్దములే తఱచుగా వచ్చుచుండును సుశబ్దస్థానముల కదలించనందున ఆయా ప్రదేశములు చిలుముపట్టిపోయినవి దానిని వదలించుటకు శ్రేష్ఠమగు పండితులచెంత కరుదెంచి వారు చెప్పినట్లుచ్చరించుచుండిన కొంతకాలమునకు పండితులవలె సర్వగ్రంథముల చదువుటకు సమర్థులు గాగలరు విద్యలేనిచో అస్వతంత్రులయి జీవించవలయునేగాని స్వతంత్రముగా సంచరింపజాలరు. వేదాంతగ్రంథము లన్నియు సంస్కృతభాషలో నుండుటవలన అట్టి సంస్కృతవిద్య నభ్యసించుటయే శ్రేయస్కరము, సంస్కృతము నందరు చదువకూడదను కాలము కాలగర్భములో కలిసి పోయినది ప్రస్తుత మన్నిజాతుల వారికి అవకాశ మేర్పడినది. ప్రయత్నించిన పండితులగుటకు ఏలాటి సంశయము లేదు.

## 17-4-1953

ఎవరు శ్రవణము చేసినట్లనుష్ఠించుట లేదో అట్టివారు సర్వదా శ్రవణము చేయుచున్నను తత్ఫలితమగు ఆత్మశాంతినిగాని, మోక్షమును గాని పొందజాలరు బీజము నొకడబ్బీలో నెంతకాల ముంచినను అది అంకురించి, చిగిర్చి, పుష్పించి ఫలింపజాలదు అదే విత్తనమును భూమిలో నుంచి నీరుపోసి చక్కగా పోషించిన, పంచభూతముల అనుకూలమున్నచో, వృక్షమై ఫల పల్లవాదులతో నేలాగున తులదూగుచుండునో, ఆలాగున భక్తియను బీజమును మనస్సను భూమియందుంచి ధ్యానానుష్ఠానములచే పోషించిన జ్ఞానమను వృక్షమై, మోక్షమను ఫలముతో ప్రకాశించును కాని భూమి మృదువుగాను, సారవంత మయినదిగాను ఉండక చవుడుగాను, నున్నవురాళ్ళు మొదలగువాటితో కంకరగానుండిన అంకురమెట్లభివృద్ధినొందదో, అదేవిధముగా హృదయము కఠినముగాను, విషయవృత్తి గలదిగా నుండిన జ్ఞానాంకురము పెంపొందదు కనుక మొదట మనస్సును రాగద్వేషాది రహితముగాను, మృదుస్వభావ యుక్తముగా నుంచుకొనవలెను, మఱియు నీరున్ను మంచిదిగా నుండవలెను అట్లుగాక ఉప్పునీరుగా నుండినను అభివృద్ధిజెందురు కావున మనము భుజించు ఆహారమున్ను సాత్త్వికముగా నుండవలెను రాజస తామసాహారముల త్యజించవలెను అయితే అనేకులు సాత్త్వికాహారమును భుజించుచున్నను వారికి దైవజ్ఞానము ప్రకాశించుట లేదేయని ప్రశ్నించవచ్చును అందులకు సమాధాన మేమన వారు భుజించునది సాత్త్వికాహార మైనను లంచము, బ్లాకుమార్కెట్టు, అసత్యసాక్ష్యము మొదలగు అధర్మములచే నార్జించిన ధనముతో కొన్న పదార్థములైనచో అది సాత్త్వికాహార మనిపించుకొనదు ధర్మయుక్తముగా సంపాదించిన ధనముతో కొన్న వస్తువులచే తయారుచేయబడిన ఆహారమే సాత్త్విక మనబడును అట్టి ఆహారముచే మాత్రమే జ్ఞాన మభివృద్ధియగును చెట్టు పెద్దది యగుటకు అగ్నితత్త్వమున్ను ఆవశ్యకమే అనగా సూర్యరశ్మి సోకక నీడలో నున్నచెట్టు వృద్ధినొందదు సూర్యరశ్మి ఉదయము మొదలు సాయంత్రమువరకు తగులుచున్నచో చెట్లు శీఘ్రముగా పెరుగును జ్ఞానవృక్షమున్ను ఉదయము, సాయంత్రము కొద్దిగా ధ్యానము చేయువారికి

సామాన్యముగా మాత్రమే యభివృద్ధి నొందును అఖండజ్ఞానము గలుగవలయునన్న నిత్యనిరంతరమున్ను ధ్యానము చేయుచుండవలెను మీరు పెంచుచున్న చెట్టునకు వాయుతత్త్వమున్ను అవసరమే అయితే విషవాయువుగా నుండక, మలయమారుతముగా నుండవలెను చెట్టుపైనొక మూత వేసియుంచిన గాలిలేని కారణముచే అది యెండిపోవును మనుష్యులే గాక పశుపక్ష్యాదులు కూడ గాలి లేనిచో జీవింపజాలవు కనుక మీ మనస్సులో పాపసంకల్ప, దుష్టసంకల్పములను విషగాలిని వీచనివ్వక సత్సంకల్పములను పైరుగాలి వీచునట్లొనరించిన యెడల మీ జ్ఞానవృక్షము దిన దిన ప్రవర్ధమాన మగుచుండును మఱియు చెట్టునకు ఆకాశతత్త్వము అనగా తగిన యవకాశ ముండవలెను పెరుగుచున్న వృక్షమునకు తగిన యవకాశము లభించనియెడల చక్కగా పెరుగదు అందువలన సంకుచిత హృదయముతో, స్వార్థబుద్ధితో ఎంతకాలము జపధ్యానాదు లొనరించినను మీ జ్ఞానవృక్షము పూర్ణముగా వికసింపజాలదు కావున ఉన్నతాశయములతో హృదయమును విశాలపరచ యత్నించవలెను పంచభూతముల సంపూర్ణసహాయముతో వృక్షమును పెంచువారు ఏ జాతివారైనను, ఏ మతము వారైనను, ఏయాశ్రమము వారైనను, స్త్రీలైనను, పురుషులైనను ఆవృక్షముయొక్క ఫలముల నెట్లనుభవించు చున్నారో, అట్లే జ్ఞాన వృక్షమును పంచశీలములతో ధ్యానానుష్ఠానములచే పెంపొందించువా రెవరైనను తత్ఫలమగు ముక్తిని తప్పక బడయగలరు

## 18-4-1953

ఈశ్వరాంశ సంభూతుడగు జీవుడు అజ్ఞానమువలన సచ్చిదానందమగు తన స్వరూపమును మరచి అసజ్జడ దుఃఖాత్మకమగు దేహమే తానని భావించుచున్నాడు ఎట్లన-

**గ్రహావిష్టో ద్విజః కశ్చిచ్ఛూద్రోఽహమితి మన్యతే ।**
**గ్రహనాశాత్ పునః స్వీయం బ్రాహ్మణ్యం మన్యతే యథా ॥**

ఒకానొక బ్రాహ్మణునకు గ్రహమావేశించిన తన గోత్రసూత్ర నామములను

మరచి తన నిత్యకృత్యములగు సంధ్యావందనాదులకు స్వస్తిజెప్పి గ్రహసంబంధ నామాదుల నుచ్చరించుచు తదనురూపముగా ప్రవర్తించుచుండెను వారిని మంచి మాంత్రికుని దగ్గరకు తీసుకవెళ్ళి గ్రహోచ్చాటనమునకు తగిన కార్యకలాపముల జరిపించి ఆ గ్రహమును వెళ్ళగొట్టించిరి గ్రహ మెప్పుడు బ్రాహ్మణుని వదలిపోయినదో, వెంటనే యధార్థమును తెలిసికొని తానంతవరకు నొనరించిన దుష్కృత్యములకు పశ్చాత్తాపపడి అతడు తనకర్తవ్యమును నిర్వహించు కొనగలుగుచున్నాడు అట్లే

**మాయాఽఽవిష్టస్తతో జీవో దేహోఽహమితి మన్యతే ।**
**మయానాశాత్పునః స్వీయం రూపం బ్రహ్మోఽస్మి మన్యతే ॥**

అజ్ఞానవశాత్ దేహావే నేననుభావముగల జీవుడు శ్రోత్రియు బ్రహ్మనిష్ఠునియొక్క సదుపదేశములచే ఆత్మజ్ఞానము నొంది తన స్వరూపము నింతవరకు తెలియనీయక తన్నావరించియున్న అజ్ఞానమును రహిత మొనర్చుకొనుచున్నాడు తదుపరి నేను దేహము గాను, ఇంద్రియాదులును గాను వీటన్నిటికి విలక్షణమై సాక్షిగానుండు కేవల పరమాత్మ స్వరూపుడ ననుభావము గలవాడగును మాంత్రికుడు గ్రహమును పారద్రోలినంత మాత్రముతోనే తృప్తి నొందక మరల యెప్పుడైనా ఆవేశించగలదను సందియముచే నొక రక్షాబంధమును గట్టి దానిని జాగ్రతగా కాపాడుకొనవలెననియు చెప్పెను అదేవిధముగా అజ్ఞానమును నశింపజేయుటకు ఆత్మజ్ఞానమును సంపాదించినను, దానిని రక్షించుటయం దత్యంత జాగరూకుడై యుండవలెను కనుకనే కైవల్యనవనీతమను గ్రంధమందు జ్ఞానరక్షయను నొక భాగము ప్రత్యేకించి వ్రాయబడియున్నది ధనమార్జించినవారు చోరుల కాధనము లభ్యపడకుండునట్లు పహరా మొదలగునవి యేర్పఱచి ఆ ధనము నెట్లు సంరక్షించు కొనుచున్నారో, అట్లే జ్ఞాన ధనము నపహరించుటకు కామక్రోధాదులను దొంగలు కాచుకొనియే యున్నారు అట్టివారి కవకాశమివ్వక యుక్తాహారము, వివిక్తవాసము, బ్రహ్మచింతనము - ఇవి మూడును దేహపతన పర్యంతము విడువకుండిన జ్ఞానమును రక్షించుకొనగలరు ఇవి గలవారెప్పుడును పతితులు గాజాలరు ఎవరైనా పతితులైనారంటే ఆ మూడింటిలో నేదోయొకటి లోపించినదనియే తెలిసికొనవలెను కేవలము జ్ఞానరక్షకొఱకేగాక కృతఘ్నుత్వ

నివారణమునకున్ను తన యాచరణ వదలకూడదని క్రింద శ్లోకముచే తెలియబడుచున్నది

**ఆజీవితం త్రయస్సేవ్యా: వేదాంతో గురురీశ్వర: ।**
**ఆదౌ జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వ నివృత్తయే ॥**

కావున జ్ఞానముగలిగిన తర్వాత నియమనిష్ఠ లక్కరలేదని చెప్పువారి వాక్కులకు వశపడక సదా నియమపరులై యుండవలెను

## 19-4-1953

సర్వేశ్వరుని కృపచేతను, మహర్షుల కరుణచేతనున్ను ఈ భగవద్గీతాష్టాదశాధ్యాయ ముక్తిసోపాన యజ్ఞము నిర్విఘ్నముగాను, విజయవంతముగాను సమాప్తినొందినది ఈ యజ్ఞములో పాల్గొన్న మీ రెల్లరు పవిత్రుల మైతిమనియు, ధన్యుల మైతిమనియు భావించవలెను ఏలనన భజగోవింద శ్లోకములో నిట్లు చెప్పబడియున్నది

**భగవద్గీతా కించిదధీతాగంగాజల లవకణికా పీతా।**
**సకృదపి యేన మురారిసమర్చా తస్య కరోతి యమోఽపి న చర్చామ్ ॥**

ఎవరైతే కొంచెమైనను గీతాధ్యయనము చేసియున్నారో, ఒక బిందువైనను గంగాజలమును పానము చేసియున్నారో, ఒకమారైనను భగవంతుని పూజించి స్మరించి యున్నారో, అట్టివారినిగూర్చి యముడు ఏవిధమైనచర్య తీసుకొనజాలడు కావున మీరు ఈ పదునెనిమిది దినములు 18 అధ్యాయములు పారాయణము జేయుటయేగాక దానిని గూర్చిన యనేక ధర్మరహస్యములను శ్రవణము చేసియున్నారు మఱియు నపుడపుడు భక్తులచే తీసుకరాబడిన పవిత్రగంగాజలమును పానముజేసి యున్నారు భగవంతునిగూర్చిన భజనలు, ప్రార్థనలు, హరికథలు, పూజలు మున్నగువాటిలో పాల్గొనుచునే యున్నారు కనుక, మీరు ధన్యాత్ములనుటలో సంశయము లేదు మఱియు గీతా మాహాత్మ్యములో శ్రీమన్నారాయణమూర్తి భూదేవితో నిట్లు చెప్పిరి

**మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।**
**క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నళినీదళమంభసా ॥**

ఎంత మహాపాపములు (బ్రహ్మహత్య గోహత్యాదులు) చేసిన వారైనను భక్తిశ్రద్ధలతో గీతాధ్యానము జేసినయెడల తామరాకును నీరు అంటనట్లు, ఆ పాపములేవియు వారిని స్పృశింపజాలవు కావున మీలో మహాపాపములు జేసినవారెవరును ఉండరు ఎవరైన సామాన్యపాపములు జేసినవారుండిన వారి పాపములన్నియు ఈ పారాయణాది పవిత్రకార్యములలో పాల్గొనినందున నశించిపోయినవని వేరుగా జెప్పనక్కరలేదు

**గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా ।**
**వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥**

గీతాపారాయణము చేయుటకు శక్తిలేనివారు శ్రద్ధాభక్తితో వినుచుండినను వారుకూడా మహాపాపులైనను, వైకుంఠములో శ్రీ విష్ణుభగవానునితోనుండి భగవదానందనమును పొందుదురు కాబట్టి పాపఫల మనుభవించుటకు నరకమునకు వెళ్ళనవసరము లేదు ముముక్షువు లగుటచే పుణ్యాకర్మలను నిష్కామబుద్ధితో చేయుచున్నారు అందువలన పుణ్యాకర్మఫలమగు స్వర్గమందును ప్రవేశింపనక్కరలేదు ఇచటనే తీవ్రముగా జపధ్యానాదు లొనరించిన ఈ జన్మమందే ముక్తులయ్యెదరు ఒకవేళ ఆరూఢస్థితిని పొందక అభ్యాసావస్థలోనే శరీరపతన మేర్పడినను మోక్షాభిలాషు లగుటవలన స్వర్గనరకముల ననుభవింపక 10 మాసములలోనే మరల రాగలరు ఈ జన్మములోనే ప్రతిబంధములచేత ఆత్మ సాక్షాత్కారము కాలేదో అట్టి ప్రతిబంధములు లేని ప్రదేశములోను అట్టి కుటుంబములోను జన్మించెదరు కావున మీరేమి భయపడ నక్కరలేదు

ముఖ్యముగా స్త్రీలు చేయవలసిన దేమనగా - మీ భర్తలు, మీ తల్లిదండ్రులు గృహకార్య భారమంతయు వారే వహించుకొని యీ 18రోజుల కార్యక్రమములో పాల్గొను సదవకాశమును మీకు గలుగజేసి నందులకు మీరు మీమీ గృహములకు వెళ్ళిన వెంటనే మీ భర్తలకు, మీ మాతాపితరులకు కృతజ్ఞతాపూర్వక వందనము

లర్పించవలెను మీరు భగవద్ధ్యాన పారాయణ జప ధ్యానానుష్ఠానములలోను, బ్రహ్మవిచారములోను ఆసక్తులై యున్నారు ఆ విషయములో నేలాటి కొఱతయు మీ యందులేదు ఈ సంఘ మంతయు నతి పవిత్రమైనదే అయితే ఒక కొరతమాత్రము గలదు, అదేమన, ధ్యానాద్యనుష్ఠానములలో ఇప్పుడు గలిగియుండు శ్రద్ధాసక్తులవలె కొంత శాస్త్రపఠనమందును, సంస్కృత విద్యయందును శ్రద్ధగలిగియుండిన మరల మీకు ఏలాటి లోపమున్ను ఉండదు అయితే సంస్కృతవిద్యయందు మీకు ఆసక్తి లేకపోవుట కొక కారణము గలదు అదేమన, సంస్కృతము చదువుకొన్న పండితులు చాల మందుండియు, వారికి బ్రహ్మవిద్యయందు ప్రవృత్తి లేకపోవుటచేతను, మామూలు సంసారులవలె వారిలో చాలమంది యుండుట వలనను ఈ విద్యలో నేమి విశేషత గలదని మతియం దొకవిధమగు నమ్మకము గలిగిపోయెను అట్టి తలంపు మీకు గలిగిన దొకవిధముగ నిజమయినను మీబోటి యనుష్ఠానపరులకు విద్యయున్ను కొంతయుండిన చాల మేలు గలుగును ఏలనన, సంస్కృతములోగల ప్రామాణ్యశ్లోకములను గ్రహించి తద్వారా లోకమునకు బ్రహ్మవిద్య నుపదేశించుటకు శక్తి గలుగును

అదియునుగాక అబ్రాహ్మణులకు, స్త్రీలకు బ్రహ్మవిద్య యందధికారము లేదని యెవరైన శుష్కపండితులు ఎచ్చోటనైన సంస్కృత శ్లోకములచే నిరూపించునపుడు దానిని ఖండించి శమదమాది గుణములు గల మానవుల కందరికిన్ని బ్రహ్మవిద్య కధికారము గలదని తెలుపుట కది యెంతో యుపయోగపడును అదిన్ని మనసంఘములో నొక అంగముగా నుండవలెను పరాధీనమునుండి మన రాజ్యమునకు గాంధీమహాత్ముడు మొదలగు పుణ్యాత్ములు విముక్తిని గలుగజేసినను, ఆధ్యాత్మ లోకములో ఇంకను సర్వజనులకు స్వాతంత్ర్యము లేకనే యుంటున్నది ఈ యస్వాతంత్ర్యమునుండి జనులకు విమోచనమును గలుగజేసి (ఆత్మ స్వాతంత్ర్యము గలుగజేసి) స్వారాజ్యములో (ఆత్మరాజ్యములో) సర్వులకు స్వాతంత్ర్యము గలుగజేయుటయు మనకొక ముఖ్యాంగమయి యుండవలెను అయితే విశాల బుద్ధియు, నిర్మల హృదయముగల పండితు లెవరున్ను స్వాతంత్ర్యము లేదని చెప్పరు ఆధ్యాత్మిక జ్ఞానవాసనయు,

సార్వాత్మైక్యబుద్ధియు లేని కొందఱు పండితులు మీకు బ్రహ్మవిద్యయందు, ప్రణవోపాసనయందు, ఉపనిషత్పఠనమునందు, భాష్యత్రయ పఠన, పారన శ్రవణముల యందధికారము లేదని చెప్పుదురు అట్టివారిలో చాలమంది కాలగర్భములో కలిసిపోయిరి ప్రస్తుత మచ్చటచ్చట మూలమూలలో కొందఱున్నట్లు వినుచున్నాము వారును అచిరకాలములో పంచభూతములలో కలిసిపోయెదరు అపుడు ఈ ప్రతిబంధము లేవియు నుండవు వర్తమానయుగములో నావిర్భవించియుండు పండితులు సరళహృదయములు, సర్వాత్మైక్య బుద్ధిగలవారు గుణము ననుసరించి అందరికిన్ని ఆత్మ స్వాతంత్ర్యము, బ్రహ్మవిద్యయం దధికార ముండవలెనని చెప్పువారగుటచే, రానున్నకాలము వారిదగుటవలన ఇకమీద ప్రతిబంధకము లెవ్వియు నుండవని నిశ్చయించుకొనవచ్చును

ఓం అసతో మా సద్గమయ, ఓం తమసో మా జ్యోతిర్గమయ,

ఓం మృత్యోర్మా అమృతం గమయ ॥

అసత్తునుండి నన్ను సత్తునకు చేర్చుము అంధకారమున నున్న నన్ను ప్రకాశమునకు గొనిపొమ్ము, మృత్యువునుండి అమృతమును పొందింపజేయుము

**ఓం సర్వేషాం స్వస్తిర్భవతు, ఓం సర్వేషాం శాంతిర్భవతు ।**
**ఓం సర్వేషాం పూర్ణంభవతు, ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**



# దివ్యజీవన సమాజము

పరిశుద్ధమైన జ్ఞానమును, శాంతియు, కరుణయు గల దైవాత్మ స్వరూపులగు సోదరసోదరీరమణులారా! ఈ దివ్యజీవన సమాజము భారత దేశములో నావిర్భవించుట దేశమునకేగాక మానవులకున్ను శ్రేయోదాయకము, శుభసూచకము స్వరాజ్యసిద్ధి గలిగిన యీ కాలములో స్వారాజ్యసిద్ధియు గలుగునప్పుడే మానవుం డిహపరసుఖములను బొందగలుగును స్వరాజ్యము మాత్రము సిద్ధించి స్వారాజ్యము అనగా, ఆత్మరాజ్యము లభించనిచో, అతని జీవితము ఆరోగ్యముగల ఒక మృగ

జీవితమునకన్న నెక్కువ యేమియు గలుగదు కావుననే మన సమాజ నిర్మాతలగు శ్రీ శివానందస్వాములవారు ఈ సంఘమునకు దివ్యజీవనమను పావన నామకరణ మొనర్చిరి

1 దివ్యజీవ జీవనమని వినునప్పుడే ప్రాకృత జీవనముతో సంపూర్ణముగా కాలము గడపక దివ్య జీవనముగూడ గడుపవలయునని యర్థమగుచున్నది దివ్యజీవనమనగా స్వప్రకాశమగు దైవజీవతమని తెలియనగును అది అప్రాకృతమైన దైవజ్ఞానముతో గూడినదగును అట్టి జ్ఞానములేని మానవజీవితము పశుత్వమునకన్న నెక్కువ ఉచ్చస్థానమును బొందినదిగాదని శాస్త్రము తెలుపుచున్నది ఈ జీవనముచే జఠరాగ్ని శమించి శరీరబలము గలుగును కాని దివ్యజీవనము తాపత్రయాగ్నిని చల్లార్చి ఆత్మబలమును గలుగజేయును దీనికి ప్రతిరోజున్ను నొక యనుకూల సమయమును ప్రతివారున్నూ ఏర్పాటుచేసికొని సాధన చేయుచుండవలయును బ్రహ్మముహూర్తమునుండి మొదటి యామము అనగా ఉదయము 9 గంటల లోపల నుండుట మంచిది కావుననే పరమ ఋషులు ప్రాతఃకాలమునకు బ్రహ్మ ముహూర్తమని పేరు బెట్టిరి ఏకార్యమైనను శుభముహూర్తమున జేయుటెంత శ్రేయస్కరమో, యీధ్యానానుష్ఠానములున్నూ బ్రహ్మముహూర్తములోనే జేయుటమంచిది

శరీర మొకయంత్రమువంటిది గడియార మేలాగున సమయమునకు మన ప్రయత్నము లేకనే గంట కొట్టుచున్నదో, ఆలాగున నొక సమయము తప్పక ధ్యానమున కేర్పాటుచేసిన మనస్సు మొదలగు ఇంద్రియము లన్నియు మన విశేష, ప్రయత్నము లేకయే ధ్యానోన్ముఖములై పరమశాంతిలోనికి, ఉపరతిలోనికి, ఆత్మసన్నిధిలోనికి, దైవభావములోనికి, నిశ్చంచలస్థితిలోనికి తీసికొని వెళ్ళుచుండును ఇదియే నియమిత సమయముచే గలిగెడు ప్రయోజనము మీలో నెవరైనను నియమితాహారము, నియమిత నిద్ర, నియమిత పరిశ్రమము గలిగియుండినచో, గడియార సహాయము లేకనే నిద్రనుండి జాగరణము, ఆకలియు, విసర్జనమున్నూ అప్రయత్నముగనే గలుగుచుండును అయితే యెల్లప్పుడున్నూ అనివార్యకారణముచే నిర్వహింపక పోయినను, భోజనమునకు ముందుగా తప్పక

కొంతవరకైన అట్టిజపధ్యాన పారాయణాదులు చేసియే భుజింపవలయు ననెడి నొక వ్రతమును బూనిన మాత్రమే యీ సంసారములో మీకు తరణోపాయము లభింపగలుగును అట్లుగానిచో సేతు స్నానమునకు వెళ్ళి సముద్రములోగల కల్లోలములు అణగిన తరువాత స్నాన మొనర్చవలయునని తలంచెడివాని యొక్క గతియే లభించును సముద్ర ముండువరకును అలలు ఉండనే యుండును ఆలాగున సంసారమునందుండు వరకును ఒక కార్యముపై మఱియొక కార్యము, నొక సంకల్పముపై మఱియొక సంకల్పము వచ్చుచునే యుండును కావుననే సంసారమును సాగరముగా వర్ణించడమైనది

**శాంతే సముద్రకల్లోలే స్నానమిచ్ఛతి మూఢధీః ।**
**తథైవ శాంతేసంసారే జ్ఞానమిచ్ఛతి దుర్మతిః ॥**

2 తనభర్త యింటికడనుండ, భర్తకు భోజనము పెట్టక ముందుగ భుజించు స్వభావముగల నారి యెట్టిదియో, గురుశుశ్రూషా నిరతుడగు అంతేవాసి భిక్షాన్నము తెచ్చిగాని, లేక పచన మొనర్చిగాని గురుదేవునికి పెట్టక ముందుగ భుజించు వాడెట్టి గుణము గలవాడో, దేవతారాధనపరుడగు అర్చకుండు నైవేద్యము సమకూర్చి భగవదారాధన జేయక భుజించు వాడెట్టి లక్షణము గలవాడో ఆలాగున మానవున కేర్పడిన దైవకార్యములను జేయక భుజించువాడును అట్టివాడే యగునని మీలో మీరే నిశ్చయించు కొనవలయును పైజెప్పిన ముగ్గురున్నూ ఎట్లు పాపగుణము గలవారో, ఆలాగున దైవకార్యము లొనర్చక భోజనము చేయరాదని దృఢమగు నొకవ్రతమును మీ రనుష్ఠించినమాత్రమే యీ సంసారమునుండి తరించగలరు

3 రాత్రియందలి కారుచీకటిలో నొకప్రకాశమైన దీపమునుండి మీరెంతకెంతకు దూరముగ వెళ్ళెదరో అంతకంతకు అంధకారమయములోనికి, ఏమియు కనుపించని స్థితిలోనికి బోవునట్లు స్వప్రకాశమై, జ్ఞానమయమై, ఆనందఘనమై యుండు నాత్మలోనుండి మనోబుద్ధిలోనికిన్నీ, జ్ఞానేంద్రియము లోనికిన్నీ, కర్మేంద్రియములోనికిన్నీ,దేహములోనికిన్నీ, దృశ్యములోనికిన్నీ ఎంతకెంతకు జారిపోయెదరో, అంతకంతకు గాఢాంధకార అజ్ఞానములోనికి దిగిపోతున్నారమని తలంచుకొనవలయును పై జెప్పినవారు మఱల దీపము దగ్గరకు

రాగారాగా ఏలాగున చీకటి నశించి, వస్తువులు గనపడుచు, దీపము దగ్గఱలోనికి వచ్చినప్పుడు తమస్సులేని స్థితి గలుగుచుండునో, ఆలాగున మీ మనస్సును దృశ్యమునుండి, దేహమునుండి, వాగాది కర్మేంద్రియములనుండి, చక్షురాది జ్ఞానేంద్రియముల నుండి, బుద్ధ్యాది అంతరింద్రియములనుండి క్రమముగా నాత్మలోనికి లయపరచులాగున చేసికొనిన అమృతత్వమును, మోక్షమును, దైవత్వమును ఈ జన్మములోనే బొందగలరు అది శివము, అమృతము, అద్వైతము ఓమ్

ఈ సత్యమునే శ్రీభగవద్గీత మూడవ అధ్యాయమున నిష్కామ కర్మయోగమును నుపదేశించుచు వచ్చి కట్టకడకు 42, 43 శ్లోకములలో భగవాను డుపదేశించడ మైనది దీనివల్ల నిష్కామ కర్మయోగముచే అంతఃకరణశుద్ధి గలిగి రాగా రాగా, మేఘము వదలినప్పుడు సూర్యుడు స్వయముగా ప్రకాశించునట్లు ఆత్మజ్ఞానోదయమున్నూ గలుగునట్లు గ్రహించుకోవలయును అనగా నిష్కామకర్మయోగము సరిగా ననుష్ఠించుచూ వచ్చిన అదియే నైష్కర్మ్యసిద్ధిని గలుగజేయునను భావమును హృదయములో నుంచియే శ్రీకృష్ణభగవాను డిట్లుపదేశించుటకు గారణమైనది

**ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥**

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥**

దీనియర్థము పైన నిరూపించినదే ఈ విషయమునే కఠోపనిషత్తుగూడ తెలుపుచున్నది

**ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥**
**మహతః పరమవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః ।**
**పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ॥**

ఈ స్థితి గలుగునప్పుడే మానవుని దేహమనెడు దేవాలయమునందు, దేవతను ప్రతిష్ఠిత మొనర్చినట్లు జన్మసార్థకత నొందగలుగును లేనిచో ప్రతిష్ఠ లేని పాడుదేవాలయము వంటిదే యగును



# శాంతి పత్రికకు పంపిన సందేశము

శాంతిపత్రిక మధ్యకాలమున నిలిచిపోయి మరల ఇప్పు డారంభించు టెంతయు సంతోషకరము ఆధ్యాత్మిక విషయమును బోధించు పత్రికలు భారతదేశమున తక్కువగనే యున్నవి అందు ముఖ్యముగ నాంధ్రదేశమున మిక్కిలి తక్కువ పత్రికద్వారా మహాశయములు గలవారియు, మహాత్ములయు, శాంతి సుఖముల ననుభవించిన దివ్యపురుషులయు సందేశములు మనకు లభించును ఒక్కొక్క దివ్యపురుషుని చెంత కరిగి ధర్మసందేశముల గ్రహించుట ప్రయాసము పత్రిక మహనీయుల సందేశముల మన కొకేపరి లభింపజేయుచున్నది మఱియు మహనీయులు రచించిన గ్రంథముల తెప్పించుకొని చదివినను, ఒకపరి పఠించి వాని నొకచోట పెట్టివేసెదము పత్రిక అట్లుగాక నెల నెలకు వచ్చుచుండుటవలన మాటిమాటికి చదువుట సంభవించుచున్నది అందువలన మనస్సు నిర్మలమగును తత్త్వజ్ఞానరత్నముల సమకూర్చ గలుగుదుము మానవునికి సుఖమును గలుగజేసెడి వెన్నివస్తువు లుండినను శాంతిలేనిచో నిష్ప్రయోజనము హృదయ నైర్మల్యము గలవారి కెల్లఱ కీవిషయము తెలియును ఎంతయో గొప్పవారును 'నాకు మనశ్శాంతిలేదు, దానికేదైన యుపాయ ముపదేశింపు'డని పెద్దల నడుగుచుందురు అట్టి హృదయశాంతి గలుగజేసెడి యిలాంటి పత్రికలెంతయో అవసరము సాధుపురుషులు జ్ఞానధనము గలవారే యెక్కువమంది యుందురుగాని ప్రపంచధనము గలవారు చాల నరుదుగ నుందురు ప్రపంచధనసహాయము లేనిచో ప్రకృతితో సంబంధపడిన పత్రికా నిర్వహణము జరుగదని గృహస్థ భక్తులు తెలిసికొనవలసి యుందురు శ్రీకృష్ణభగవానుడు గీతలో "అశాంతస్య కుతస్సుఖమ్" అని యుపదేశించిరి శాంతిలేనివారికి సుఖమెచ్చట? అనగా ఇచ్చటగాని బదరికాశ్రమాది పుణ్యప్రదేశములందుగాని, ఏకాంతమందుగాని, పరలోకమందుగాని

సౌఖ్యము లేదని భావము శాంతిచే గలిగెడు సుఖమెట్టిదో దీనిచే తెలిసికోవచ్చును

**దానమిజ్యా తపశ్శౌచం తీర్థం వేదా(శ్రుతం తథా ।**
**అశాన్త మనసః పుంస స్సర్వ మేత దపార్థకమ్ ॥**

శాంతిలేని మానవునియొక్క దానము, యజ్ఞము, తపస్సు, శౌచము, తీర్థాటనము, వేదాధ్యయనము, శాస్త్ర శ్రవణము, ఆలాగున నికనేయే పవిత్రకర్మలు గలవో, అవియన్నియు నిష్ప్రయోజనములు కావున మనశ్శాంతిని కలుగజేసికొనవలయును

కళాయిలేనిపాత్రలో నెట్టి మంచిపదార్థముల వండినను చిలుము పట్టి వికారయుతములయి తనకును, ఇతరులకును ఎట్లుపయోగించవో, అట్లే శాంతిలేనిచో మానవునకు పై జెప్పిన గుణములన్నియు కలిగినను సౌఖ్య మబ్బదు కఠోపనిషత్తు ఉపదేశించునది చూడుడు-

**నిత్యో నిత్యానాం చేతశ్చేతనానా**
**మేకో బహూనాం యో విదధాతి కామాన్ ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా**
**స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్ ॥**

ఒక్కడేయగు పరమాత్మ యనేకులకు వారివారి కర్మలకు తగిన ఫలముల నిచ్చుచున్నాడు ఆ పరమేశ్వరుడు నాశము లేనివానిలో నిత్యుడు చైతన్యముగల ప్రాణులలో చేతనస్వరూపుడు బుద్ధిగుహ యందున్న యా పరమాత్మ నే యాత్మజ్ఞానులు చూచుచున్నారో, అట్టివారికే నిత్యమైన శాంతి లభించును తదితరులకట్టి శాశ్వతశాంతి లేదు

**ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా**
**స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

ఏకమయినవాడును, సర్వజగంబును స్వాధీనముగా గలవాడును

సర్వభూతముల కంతరాత్మ స్వరూపుడును అగు ఏ పరమాత్మను శుద్ధవిజ్ఞానఘన స్వరూపుని అనేక విధములు గలవానినిగ నెవడు చేయుచున్నాడో, ఏవిద్వాంసులు స్వశరీర హృదయాకాశాంతర్గతమగు బుద్ధి గుహయందును ఉన్న ఆ యాత్మను చూచుచున్నారో వారికే శాశ్వతమైన సుఖము ఇతరుల కట్టి సుఖము లేదు

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు

**ఓం తత్ సత్**

---

# తాపత్రయము

ఇచ్చట వ్రాయంబూనిన తాపత్రయము వేదాన్త శాస్త్రములలో పేర్కొనిన తాపత్రయము కాదు, సామాన్యముగా జనులు చెప్పుచుండు తాపత్రయమని గ్రహించుకొనవలయును అనగా పుత్రులపై, పౌత్రులపై, వారి భార్యలపై గల తాపత్రయమని తెలియందగినది ఈ ముగ్గురియొక్క సౌఖ్యములు కావలసిన విద్యా ధనారోగ్యములను గురించిన తాపత్రయ ముండవలయును ఈ విషయమై భర్తృహరి తెలిపినది చూడుడు,

**ఆయుర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం**
**తస్యార్ధస్య పరస్య చార్ధమపరం బాలత్వ వృద్ధత్వయోః ।**
**శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే**
**జీవే వారితరంగచంచలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్ ॥**

మర్త్యులకు జీవితకాలము నూరుసంవత్సరముల పరిమితి గలది దానిలో సగము రాత్రియందు గడచును మిగిలిన సగము బాల్య వృద్ధత్వదశలలో గడచును మిగిలినకాలము రోగములచేతను, వియోగములచేతను కలిగిన దుఃఖములతో గూడినదై సంసారనిర్వహణ సేవలతో గడుపబడుచున్నది కావున నీటియలలవలె మిక్కిలి యస్థిరమైన జీవితమున సుఖమెక్కడిది? అనగా జ్ఞానసుఖము నార్జించుటకు సమయమెక్కడ?

విశేషార్థము- నూరింటిలో ఏబదివత్సరములు రాత్రులలోను, బాల్యమున

పదమూడు వత్సరములును, వార్ధక్యమున పన్నెండు సంవత్సరముల కాలమును గడచును ఇప్పుడు డెబ్బదియైదేండ్లయినది ఇక మిగిలినది 25 సంవత్సరములు అది శుభాశుభములచేతను, రోగములచేతను, సంసారకార్య సేవాదులతోను గడచునప్పుడిక మిగిలినదేమి యుండును? ఇది కృతయుగ మానవజీవితమును గురించి నూరువర్షములని గ్రహించవలయును కలియుగమున పూర్ణాయుస్సు అరువది సంవత్సరములు ఐతే కొందరు 70 గాని 80 వర్షములుగాని జీవించవచ్చును ఆ ప్రకారము విభజించిన కలియుగమున 15 సంవత్సరములు మంచివిగ మానవునకు లభించును ఈ కాలము లోపలనే వాడు జ్ఞానమునుగురించి యత్నించవలయును

**యావత్స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరాదూరతః**
**యావచ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్ క్షయో నాయుషః ।**
**ఆత్మ శ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్**
**సన్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః ॥**

ఎంతపర్యన్త మీదేహ మారోగ్యవంతమై స్వస్థతగ నున్నదో, ఎంతవఱకు ముదిమి దూరముగ నుండునో, ఎంతవఱ కింద్రియముల పాటవము తప్పిపోలేదో, ఎంతలోపల ఆయుస్సు క్షీణించలేదో అంతకులోపలనే విద్వాంసునిచేత ఆత్మశ్రేయస్సు కొఱకు గొప్ప ప్రయత్నము చేయబడదగినది, అటుగాక అంత్యదశలో ప్రయత్నపడుట గృహము దహించుచుండగా నీటికై బావి త్రవ్వునట్లుండును

జలాశయము ముందుగనే యుండినచో నిప్పు రగులునప్పుడే నీటితో చల్లార్చవచ్చును అట్లుగాక అప్పుడే బావి త్రవ్వుటకు ప్రారంభించిన నేమగును? కాలిపోవును ఆలాగున వార్ధక్యాగ్నిచే శరీరము దహింప ప్రారంభించుటకు ముందుగనే ఆత్మ జ్ఞానామృత జలమును సిద్ధముచేసికొన వలయునని భావము

**వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ**
**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహమ్ ।**
**ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివామ్భో**
**లోకస్తథాఽప్యహితమాచరతీతి చిత్రమ్॥**

జర(ముదిమి) పెద్దపులివలె చంపుటకు నిరీక్షించుచున్నది రోగములు శత్రువులవలె దేహమును బాధించుచున్నవి జీవితము పగిలిన కుండనుండి నీరు కారిపోవునట్లు నిమిషనిమిషమునకు నశించుచున్నది అట్లైనను మనుజుడు ఆత్మహితమునకు ప్రయత్నింపక ఆత్మకు బంధకరమగు అహితమునే చేయుచున్నాడు! ఇదెంత యాశ్చర్యము!

చిల్లిబడిన కుండనుండి ఒక్కొక్కబొట్టు నీరు జారిపోవునట్లు శరీర ఘటమునుండి ఒక్కొక్క యుచ్ఛ్వాస నిశ్వాసములు పోవునప్పుడు ఆయుస్సు నశించుచున్నదని గ్రహించుకొనవలయును పశు పక్ష్యాదులకన్న మానవునకు తాపత్రయ మెక్కువ కనబడుచున్నది గృహస్థులు పుత్రుల ముఖమును చూచినపిమ్మట తపముకొఱకు వనమున కేగవలయుననియు, పౌత్రునిచూచిన తప్పక యేకాంతమున కేగవలయుననియు శాస్త్రము చెప్పుచున్నది మొదటిది యుత్తమమనియు, రెండవది మధ్యమమనియు, అట్లుగా కెల్లప్పుడు సంసారమునందే జీవించుట అధమమనియు శాస్త్రనిర్ణయము పశ్వాదులే మనకు సృష్టినియమమును బోధించుచున్నవి. ఆవు, కుక్క, కోడి, కాకి మొదలగునవి తమ సంతానము స్వయముగ జీవించుశక్తి గలుగునంత వఱకుమాత్రము మమత్వముగలిగి శిశువులను పోషించుచుండును స్వయం పోషణశక్తి గలిగినపిమ్మట తమ సంతతులతో నేలాటి సంబంధమును కలుగజేసికొనక నిస్సంగులై సుఖముగ జీవించుచున్నవి సృష్టికర్త దీనికన్న పరమోపదేశము మరి ఏ యుపదేశము చేయవలయును? ఆలాగున మానవుడును తమ సంతానములకు విద్య చెప్పి వివాహముచేసి, యుద్యోగముచేతగాని, మఱియొక విధముగగాని స్వయముగ జీవనము గడుపువఱకే మమత్వము గలిగియుండవలయును, అట్లయినచో ఈ జీవి కెంతయో శాంతియు, సౌఖ్యమును గలుగును పుత్రీపుత్రులు స్వయముగ జీవితము గడుపు స్థితి గలుగునప్పుడు గృహస్థాశ్రమములో నుండినను విరక్తి గలిగి యుండుటయో, ప్రత్యేకముగ నుండుటయో, వానప్రస్థాశ్రమము నాశ్రయించుటయో గలిగియుండిన పరమార్థచింతన గలిగి జన్మసాఫల్యమును చేసికొనవచ్చును ఇప్పుడు అట్లుగాక కొడుకులు గలిగినను, మనమలు గలిగినను, ముదిమనుమలు

గలిగినను తృప్తిజెందక వారిసేవలోనే యావత్కాలము వినియోగపఱచినచో నీ జీవి యెప్పుడు దైవానుగ్రహామునకు పాత్రుడై తరించగల్గును? కొడుకులు తల్లియని లేక తండ్రియని పిలిచెడి పర్యంతము సంసారము నందుండవలయును అవ్వయనిగాని, తాతయనిగాని పిలుచునప్పుడే ముదునలివారలని యర్థమగుచున్నది అపుడైన వైరాగ్యము గలిగి యాత్మచింతన చేయకపోయినచో పశువులకన్న హీనస్థితిలో నుండువారని గ్రహించుకొనవలయును కావున జాగ్రత్త వహించుడు. ఈ విషయమై శ్రీ కృష్ణభగవానుడు తెలిపినది చూడుడు

**ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥**

ఎవరి మనస్సు సమానస్థితి యందుండునో వారు జీవించియున్నప్పుడే జననమరణములకు కారణమైన ప్రకృతిని జయింతురు బ్రహ్మము ప్రకృతిదోషరహితమై అన్నిటిలోను సమానముగ నున్నది కావున అట్టి స్థితి గలవారుమాత్రమే పరబ్రహ్మమునం దుండగలరు (బ్రహ్మము నొందగలరు.)



# కర్మయోగరహస్యము

కర్మయోగ తత్త్వము తెలిసికొనుటలో పండితులు సైతము సందేహము కలిగియున్నారు ఏలయన తనకుగాని, ఇతరులకుగాని ప్రయోజనము లేని కర్మను ఎట్లు జేయ సాధ్యపడును? ఏకార్యమైన జేయునప్పుడు దానియందు మమత్వములేక చేసినచో నది బాగుండును అట్లుగాక బాగుండనీ, లేక పోనీ, యని ఉదాసీనభావముతో చేసిన ఆపని చక్కగ నెఱవేరగలుగునా? కావున స్వార్థమునకైనను పరార్థమునకైనను కర్తృత్వ బుద్ధి యుండియే తీరవలయునని వారి ఆశయము అట్లయిన కర్తృత్వము బంధమనియు, అకర్తృత్వము ముక్తియనియు శాస్త్రము నిరూపించుచున్నది ఈ రెండిటిలో ఇదమిత్థమని యెట్లు నిర్ణయింపగలుగును?

దీనికి సరియయిన సమాధానము గలదు అయితే కొంత

శాస్త్రపరిచయమున్ను, బ్రహ్మనిష్ఠయున్ను గలిగియుండవలయును దీనికే స్వార్థమనియు, నిస్స్వార్థమనియు పేర్లు అన్యుడొకడు జీతముకొఱకుగాని, నిత్యకూలికొఱకుగాని, భోజనముకొఱకుగాని, మఱియొక ఫలము నుద్దేశించిగాని, ఒకరిదగ్గర పనిచేయునప్పుడు అది శుద్ధముగాను, స్థిరముగాను, ధన నష్టము గలుగనీయక యుండవలయుననెడి పావనబుద్ధి గలవారరుదు ఆ పని యెట్లుపోయిన మనకేమి, మన జీతము లభించిన చాలుననెడి బుద్ధియే సాధారణ మానవులకుండును స్వంతకార్యము నొకడు జేయునపుడు జీతమును కోరడు ఆపని శుద్ధముగాను, సుస్థిరముగాను, వ్యర్థ ధనవవ్యయము గలుగనీయక, యుండవలయునని యెట్లు తలంపుగలిగి ప్రవర్తించునో, ఆకర్మయొక్కయు, నిష్కామకర్మయొక్కయు రహస్యమీలాగున నుండును ఉభయులున్ను చేయుపని యొకేవిధముగనే బాహ్యమునకు కనిపించినను అంతరంగమున భావనలో మాత్రము మార్పుగలదు

నిష్కామకర్మయోగి యయినను కర్తృత్వము వహించి కార్యము చేయనిచో ఆ పని నిరర్థక మయిపోవును అయితే ఇతని కర్తృత్వము ఆ పని శుద్ధముగా జరిపేదానిలోనేగాని, దానిచే గలిగెడి ఫలమునందు లేదు ఇదే స్వార్థ నిస్స్వార్థకర్మలయొక్క రహస్యము నిష్కామబుద్ధితో జేయువాడు ఈశ్వరార్పణ బుద్ధితోగాని, గురుదేవుని కృపకు పాత్రుడు కావలయుననెడి తలంపుతోగాని, లేక తనధర్మమును చక్కగ నిర్వహించ వలయుననెడి తలంపుతోగాని జేయుటవలన దైవానుగ్రహము, గురుదేవుని యనుగ్రహము గలుగుటవలనను, స్వధర్మమును చక్కగా నాచరించుటవలనను నతని హృదయము మిక్కిలి పావన మగును పాపములన్నియు నశించును అందువలన నాత్మజ్ఞానోదయము గలిగి జీవన్ముక్తి లభించును స్వార్థబుద్ధితో జేసినవానికి ఆత్మయందు పవిత్రభావన లేకపోవుటచే, హృదయనైర్మల్యమున్ను, పుణ్యాభివృద్ధియున్ను, పాపక్షయమున్నూ గలుగనందుచే నతడు బద్ధుడగును ఇదియే కర్మయోగములో గల కీలకము భగవద్గీతయొక్క మర్మమంతయు నిచటనే గలదు ఇది సామాన్యబుద్ధి గలవారికి గోచర మగునది గాదు ప్రపంచములోగలఎక్కువ మానవులున్నూ జాతి, కుల, దేహములనే

జూచెదరుగాని అంతరాత్మను జూచువారు కోటికొకడైన నెట్లరుదుగా నుందురో, ఈ కర్మాకర్మలయొక్క తత్త్వమున్ను ఆలాగుననే యుండును కావుననే గీతయొక్క యర్థము అగాధబుద్ధి గలవానికే యవగాహన గాగలదని ప్రజ్ఞానిధులు తెలుపుచున్నాము

**సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।**
**కుర్యాద్విద్వాంస్తథాఽసక్త శ్చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥ (3-25)**

ఓ యర్జునా! ఆత్మజ్ఞానము లేనివాడు కర్మఫలము నాకు కావలయునని యెట్లు తలంపుగలవాడై యేవిధముగా శ్రద్ధాభక్తులతో కర్మలను చేయుచున్నాడో, అట్లు ఆత్మజ్ఞానము గలవాడును, ఆ ప్రకారముగనే శ్రద్ధాభక్తుల నవలంబించి కర్మఫలమునందు ఆసక్తి లేనివాడయి లోకక్షేమము నుద్దేశించి కర్మలను చేయవలయును అని భగవానుడు తెలిపెను మఱియు “యోగః కర్మసు కౌశలమ్” అని యుపదేశించుటకున్ను ఇదియే కారణము కర్మలోగల కుశలత్వమే యోగశబ్దమునకు భగవాను డుపదేశించిన యర్థము

**తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥ (3-19)**

ఫలాభిలాషనువదలి విధిచోదితమైన కర్మను చేయువాడు పరమపురుషార్థమగు మోక్షమును పొందును, కావున నీవు ఫలాభిలాష వదలి చేయందగిన కర్మను చేయుము ఈ శ్లోకమును చెప్పుటకు ముందుగా జనకుని గురించి సాక్ష్యమిచ్చెను

**కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః (3-20)**

జనకుడు మొదలకు రాజర్షు లనేకులు ఇట్టి నిష్కామకర్మ యోగానుష్ఠానముచేతనే ఆత్మశుద్ధి గలవారై మోక్షమును బొందిరి

**కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ (4-17)**

శాస్త్రములచే విధింపబడిన కర్మలయొక్కయు, శాస్త్రములచే నిషేధింపబడిన

వికర్మలయొక్కయు, ఏమియు చేయక యూరకుండుటయను అకర్మలయొక్కయు స్వరూపమును తెలిసికొనవలయును, ఏలయనిన ఈ కర్మాకర్మ వికర్మములయొక్క తత్త్వము తెలిసికొనుట మిక్కిలి ప్రయాసకరమైనది కావుననే "గహనా కర్మణో గతిః" అని యుపదేశించబడినది ఇచట ఆకాశమును దృష్టాంతముగా నిరూపించెను, పృథివ్యాది నాలుగు భూతములు గోచరించునుగాని ఆకాశమేలాగున గోచరముగాదో, ఆలాగున కర్మయొక్క రహస్యము మిక్కిలి సూక్ష్మమయినది కావుననే క్రిందిశ్లోకము "కవయోప్యత్ర మోహితాః" మహాపండితులు గూడ ఈ కర్మ మర్మములో మోహితులై యున్నారని యుపదేశించుచున్నది

**కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥(4-16)**

కర్మమనగా నెట్టిదో, ఆకర్మమనగా నెట్టిదో తెలియంజాలక యీ కర్మాకర్మముల విషయమై మహావిద్వాంసులుగూడ మోహమును జెందియున్నారు కాబట్టి ఏ కర్మాకర్మములను తెలిసికొని దుఃఖకరమైన అజ్ఞానమునుండి విడివడగలవో అట్టి కర్మరహస్యమును నీ కొఱకు చక్కగా నుడివెదను మహాశాస్త్రవేత్తలే దిక్కుతెలియక యుంటున్నారని తెలుపగా నిక సామాన్యజనుల గుఱించి మరల చెప్పవలయునా యని భావము

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।**
**శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః (3-8)**

ఎవరెవరు ఏయే స్థితిలో నుందురో వారికి తగిన యనుష్ఠానము చేయకుండుటకన్న చేయుట మేలైనది కాబట్టి నీవు శాస్త్రముచే నియమింపబడిన యనుష్ఠానమును చేయుము ఏలయనగా కర్మము చేయకుంటివేని జీవయాత్రగూడ జరుగదు "శరీరయాత్రాఽపి" అని భగవానుడు తెలిపెను మోక్షము పోని, స్వర్గము పోనీ, సుఖముగా జీవించుటకైనను కర్మ చేయనిచో జీవింపజాలరని యెంత జాలిగలిగి తెలిపెనో చూడుడు ఇది యిప్పుడు ప్రత్యక్షముగదా! ఎందరో ద్రిమ్మరులై, సోమరులై తిరుగాడువారు అన్న వస్త్రములకైన లేక సంకటపడుచున్నారుగదా!

# స్వరాజ్య స్వారాజ్యములు

భారతీయులకు స్వరాజ్యము వచ్చినప్పటినుండి దీనినిగురించి యొక వ్యాసము వ్రాయువలయునని తలంపు గలుగుచుండెను మన పూర్వ ఋషులకాలమునుండి స్వరాజ్యమువలె స్వారాజ్యమునుగూడ మహర్షులు ఉపదేశించుచు వచ్చుచుడిరి స్వారాజ్యమనగా ఆత్మరాజ్యము దీనికి స్వరాజ్యముకన్న ఎక్కువ యాధిక్యము నిచ్చుచువచ్చిరి 'స్వారాజ్యసిద్ధి' యను నొక యున్నతగ్రంధముగూడ సంస్కృతభాషలో గలదు ఆత్మరాజ్యము లేక మనోరాజ్యము లేక సంకల్పరాజ్యము దీని కాధిక్య మిచ్చుటకు కారణ మేమనగా, ఇది సూక్ష్మదేహమునకు సంబంధించినది ఇది స్థూలదేహమును స్థూలప్రపంచమును నడుపుచుండును పనులు చేయువారికన్న జేయించువాడు అధికుడు గావలసియుండునుగదా ప్రపంచములో కార్మికులచే కార్యములను జేయించెడి ఇంజనీరు ఎంతముఖ్యుడో, దేహము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు వీనిచే కార్యములను చేయించునది మనస్సు గాడ అంతే ముఖ్యమగుచున్నది ఇంజనీరు ఆజ్ఞ ననుసరించి కార్మికులు కర్మలను చేయునట్లు మనస్సును అనగా సంకల్పము ననుసరించియే దేహేంద్రియాదులు అన్నిపనులను చేయుచుండును కావుననే "ఇన్ద్రియాణాం మనశ్చాస్మి" అని గీతలో భగవాను డుపదేశించెను

ఉపనిషత్తులును ఆలాగుననే చెప్పుచున్నవి "మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః" అని తెలుపుటకు నదియే కారణము ఒక యంత్రము పనిచేయుచుండుటను మనము చూచుచున్నాము అయితే మనకు కనబడునవి బాహ్యములగు చక్రములు మొదలయినవి మాత్రమే లోభాగములో గల సూక్ష్మమయిన మరలు, దానిని నడిపెడు ఎలక్ట్రికల్ కరెంటు మొదలగునవి గోచరించుటలేదు మన కన్నులకు కనబడని విద్యుచ్ఛక్తి ఒకటియే నిజముగా నీ యంత్రమునకు ప్రాణాధారమయి నడుపుచుండునట్లు కొంత ఆలోచించిన గోచరమగును ఆలాగుననే మానవుని వాక్పాణి పాదపాయూపస్థములనెడు కర్మేంద్రియముల ఐదింటిని, త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణములను జ్ఞానేంద్రియము లయిదింటిని, దేహమును నడుపునది మనస్సే అయితే విద్యుచ్ఛక్తి మాత్రముండి యన్త్రములేనిచో అప్పుడున్ను పని జరగదు యంత్రము మాత్రముండి కరెంటు

లేనిచో అప్పుడున్ను ఏపనియు జరుగజాలదు రెండున్ను మంచిస్థితిలో నుండిన మాత్రమే లెస్సగా పని జరుగునట్లు స్వరాజ్యమున్ను స్వారాజ్యమున్ను చక్కనిస్థితిలో నున్నప్పుడే, ఉభయరాజ్యములున్ను శాంతిని సౌఖ్యమునున్ను పొందగలుగును స్వరాజ్యము మన హస్తగతముగా లేనిచో ప్రపంచములో మంచి కార్యముల చేయదలంచినను, ఎటుల నిర్వహింపజాలమో, ఆలాగున స్వారాజ్యముగూడ స్వాధీనముగా లేనిచో లోకములో మంచికార్యముల జేయుటకుగాని, ఆత్మ శాంతిని పొందుటకు గాని అవకాశము గలుగదు అంతియేగాదు మంచిప్రభువు లేక ప్రధాని లేనిచో, రాజులేని రాజ్యమేలాగున అరాచకమగునో, ఆలాగున ఆత్మజ్ఞానము లేనివారిచే పాలింపబడు రాజ్యమున్ను, అరాచకముగానే యుండును చక్కని డ్రైవర్‌లేని యంత్రముయొక్క స్థితియు లేక బస్సు మొదలయినవాని గతియు, యోగ్యుడగు చుక్కాని లేని నావయొక్క గమనమున్ను ఏలాగుననుండునో, ఆలాగున ఆత్మరాజ్యము అనగా ఆత్మస్వరూప జ్ఞానము లేనివారిచే నడుపబడు కార్యములన్నియు, దేశములన్నియు దుర్గతినే పొందును

కొద్దికాలము క్రిందట జరిగిన యుద్ధమే దీనికి తార్కాణము హిట్లర్, ముస్సోలినీ, జపాన్ చక్రవర్తి మొదలయిన వారలు స్వతంత్రులై తమతమ రాజ్యములను పాలించువారై యుండిరి వారు స్వతంత్రరాజులై స్వరాజ్యముగలవారై యుండిరి కాని ఆత్మరాజ్యము అనగా ఆత్మజ్ఞానము లేనివారగుటచే వారి రాజ్యములున్ను వారలున్ను పతితు లయిరి తమకున్ను తమ రాజ్యములకున్ను నాశమునే తెచ్చుకొనిరి ఈ విషయమై గాంధీగారు పదేపదే చెప్పుచుండెడివారు మనకు స్వరాజ్యమే గొప్పదిగాదు ఆత్మరాజ్యము కావలసియుండును అయితే స్వరాజ్య స్వాతంత్ర్యము లేనిచో ఆత్మస్వాతంత్ర్యమునూ, ఆత్మ శాంతిని, ఆత్మసౌఖ్యమునున్ను పొందజాలమని చెప్పువాక్యముల వినువారు చాలమంది యుందురు కావుననే ఆ దివ్యపురుషుడు ప్రతిరోజూను ప్రాతఃకాలమున గీతాపారాయణమున్ను, సంధ్యాకాలమున భగవత్స్మరణమున్ను ధ్యానమున్ను చేయుచు ప్రజలకు ధర్మోపన్యాసముల చేయుచుండిరి అందువల్లనే ఇట్టి మహోన్నతమగు రాజ్యమును సునాయాసముగా సంపాదింప గలిగిరి మఱియు జనులందరికిని వారిపై దైవబుద్ధి

గలుగుటకున్ను, వారి వాక్యములను వేదవాక్యములవలె జవదాటక వర్తించుటకున్ను అదే కారణము ఈ ఆత్మశుద్ధి లేక ఆత్మజ్ఞానము గలుగనిచో, స్వరాజ్యము వచ్చినను నిలుపశక్తి గలిగియుండరనిగూడ మరల మరల చెప్పుచునే యుండిరి ఇప్పుడుండు లోకనాయకులుగూడా ఆత్మశుద్ధిలేనిచో, ఆత్మజ్ఞానము గలుగనిచో, శ్రీ గాంధీగారు మనకు సంపాదించి యిచ్చిన రాజ్యమును నిలబెట్టజాలమని చెప్పుచున్నారు కాని, ఆలాగున ప్రవర్తించుచున్నామా? అని వారివారి ఆత్మలో వారే చూచుకొనిన ఈ సత్యమును సుస్పష్టముగా తెలిసికొనగలరు ఈ దేహమును రాజ్యమునుగాను, యజ్ఞశాలనుగాను వర్ణించెడు శాస్త్రము లనేకములు గలవు శ్రీ కృష్ణభగవానుడున్ను ఈ సత్యమునే యుపదేశించెను "నవద్వారే పురే దేహీ" అని ప్రయోగించుటకున్ను యిదియే కారణము తొమ్మిది ద్వారములతో కూడిన యీ శరీరమనెడు పురమందు భగవానుడు (ఆత్మ) నివసించుచున్నాడని తెలుపబడినది గీతయందు నవద్వారములను మాత్రమే నిరూపించెను శిరస్సునందు నేత్రములు రెండు, కర్ణములు రెండు, నాసికద్వారములు రెండు, జిహ్వ యొకటి - యీ ఏడున్ను, అధోభాగమున పాయు ఉపస్థలు అను రెండున్నుచేరి తొమ్మిదిద్వారము లగుచున్నవి ఈ నవద్వారములు పశుపక్ష్యాదు లన్నిటికిని గలవు ఈ ద్వారములద్వారా అనుభవించెడు సుఖదుఃఖములు మానవులకున్ను పశుపక్ష్యాదులకున్ను సమానములే కావుననే

**ఆహారనిద్రాభయమైథునాని సామాన్యమేతత్పశుభిర్నరాణామ్ ।**
**జ్ఞానం నరాణామధికో విశేషః జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః ॥**

ఆహారనిద్రాభయమైథునాదులు పశువులకున్ను, మానవులకున్ను సమానములు ఇక మానవునికి విశేషమేమనగా ఆత్మజ్ఞానమనియు, అదిలేనివాడు పశువులతో సమానుడనియు ఉత్తరగీతయందు శ్రీకృష్ణభగవానుడే ~~తెలిపెను~~ శ్రీభగవద్గీత సామాన్యజనులుగూడ తెలిసికొని అనుష్ఠించి తరించులాగున ఉపదేశింపబడెను ఉపనిషత్తు విశేషస్థితిలో నుండు జనులకు/ అర్థమగులాగున ఉంటున్నది కావుననే భగవద్గీతవలె వ్యాపకము గాక పోయినది గీతయొక్క భావము ఇన్ద్రియములకు గోచరించులాగున ఉంటున్నది అనగా మనస్సు చేతను, బుద్ధి

చేతను గ్రహించులాగున ఉన్నది ఉపనిషత్తో మనోబుద్ధుల కతీతమై వెలుగుచుండు ఆత్మను గురించి, దైవమునుగురించి తెలుపుచుండును ఇన్ద్రియజ్ఞానము గలవారికి గీత అర్థమగుచుండును అతీన్ద్రియజ్ఞానము గలవారికి మాత్రమే ఉపనిషదర్థము గోచరమగును కాబట్టియే కఠోపనిషత్తులో మానవునికి పదునొకండు ద్వారములనుగురించి తెలిపిరి

**పురమేకాదశద్వార మజస్యావక్రచేతసః ।**
**అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే ఏతద్వైతత్ ॥**

పదునొకండు ద్వారములుగల నగరము ఋజుప్రవృత్తిగల యేకరూపమయిన విజ్ఞానముగల యే పరమాత్మకు నివాసస్థానముగా ఉంటున్నదో, అట్టి పరమాత్మను ధ్యానించి (యెఱింగి) దుఃఖింపడు అట్టివాడు రాగద్వేషాదులచే వినిర్ముక్తుడై సంసారబన్ధమునుండి విముక్తుడగుచున్నాడు మామూలుగా జనులకు పశువులకుగల నవద్వారములు గాక యిచట రెండు ద్వారముల నెక్కువగా వర్ణించిరి అవియే బ్రహరన్ద్రమనియు, కుండలినీ బోధయనియు, (ఆత్మప్రబోధమనియు) యోగ శాస్త్రములలో వర్ణింపబడినవి ఈ రెండు ద్వారములు తెరువబడునప్పుడే ఆత్మదర్శనము, ఈశ్వరదర్శనము, బ్రహ్మప్రాప్తి గలుగును ఒక దేవాలయముయొక్క తలుపు మూయబడి యున్నప్పుడు లోభాగముననుండు దైవవిగ్రహము ఎట్లు గనబడదో, తెరువబడినప్పు డేలాగున సుస్పష్టముగా గాంచనగునో, ఆలాగున ఈ బ్రహ్మరన్ద్రము తెరువబడువరకు ఆత్మదర్శనము గలుగదు

అజ్ఞానదశ యందిది మూయబడి యుండును విజ్ఞానోదయకాల మందిది తెరువబడును రాత్రియందు కమలము ముకుళించియుండును సూర్యోదయ మగునప్పుడు వికసించును దానిలోపల గల అతిసుందరమగు కాయతోకూడిన కేసరములు గోచరించును ఆ విధమున హృదయకమల మెంతవరకు సంకుచితమై యుండునో, అంతవరకు ఆత్మదర్శనము కాదు హృదయపుండరీక మెప్పుడు వికసించునో, అప్పుడే ఆత్మదర్శనము గలుగును తామరపువ్వు వికసించుటకు సూర్యప్రకాశ మెటుల అవసరమో, ఆలాగున హృదయకమల వికసనమునకు

దైవతేజస్సు, దైవకరుణయు అవసరము కావున తపస్సుచేత, దైవభక్తిచేత, యోగసాధనచేత, సత్యప్రవర్తనముచేత అన్తఃకరణము శుద్ధము గావలయునని శాస్త్రము వచించురహస్యము పై పేర్కొన్న ఒక్కదానిచేతగాని లేక కొన్నిటిచేతగాని యీ ఆత్మవికాసము (ఆత్మశుద్ధి) గలుగును

పత్తికాయ, టెంకాయచెట్టుగెల మొదలగునవి పగులువరకున్ను దానిలోపలనున్న నిర్మలమగు దూదిగాని, టెంకాయయొక్క మనోహరమగు పువ్వుల గుత్తిగాని యెట్లు గోచరముగాదో, ఆలాగున హృదయకమలము వికసించువరకు మానవునియందుగల దివ్యత్వము దైవత్వము గోచరము గాదు హృదయ వికాసము గలుగునప్పుడు అదివరకుండిన తన స్వభావము లన్నియు దూరములై దివ్యత్వమగు, అమృతత్వమగు అవస్థ నూతనముగా తనయందేర్పడును ఇదియే ముక్తాత్మునకున్ను బద్ధాత్మునకున్ను గల భేదము

**ఏక ఏవాత్మా మన్తవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు ।**
**స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులకు కారణము లయిన స్థూల సూక్ష్మ కారణ దేహములలోను వెలుగుచుండు ఆత్మ యెల్లప్పుడును ఒకటియే ఈ మూడవస్థలకున్ను మూడు దేహములకున్ను సాక్షియై యీ మూడింటిని సదా ప్రకాశింప జేయునదియై స్వప్రకాశమై యుండు తురీయాత్మను పొందినవానికి పునర్జన్మ లేదు అనగా అతడు ముక్తుడగును అతడే యీ శరీరమనెడు దేవాలయములోగల దేవుడు అతడే దేహమనెడు రాజ్యమునకు ప్రభువు

ఇతనిని ఎఱుంగనివాని రాజ్యము రాజులేని రాజ్యమువంటిదే యగును ఈ విషయమై అనేక శాస్త్రములు స్వరాజ్య స్వారాజ్యముల గురించి వర్ణించుచున్నవి అదంతయు వ్రాసిన గ్రంధము పెరిగిపోవును కావుననే శ్రుతియగు కఠోపనిషత్తునుండియు, స్మృతియగు భగవద్గీతనుండియు సంగ్రహముగా తెలుపడమైనది శ్రీభగవద్గీతకు అంతరార్థమని ఒకటి గలదు దానియందు కురుక్షేత్రమును, పాండవ దుర్యోధనాదులను ఈలాగున వర్ణించిరి కురుక్షేత్రమును

దేహమునుగాను, పాండవులను సుగుణములగాను, దుర్యోధనాదులను దుర్గుణములనుగాను, అర్జునుని జీవునిగాను, కృష్ణపరమాత్మను భగవంతునిగాను నిర్ణయించిరి స్వరాజ్యమనెడు రాజ్యములో నేలాగున సుజనులు దుర్జనులున్ను గలరో, ఆలాగున స్వారాజ్యమగు దేహములో సుగుణ దుర్గుణములుగూడ ఉంటున్నవి ధర్మతత్త్వములో సంశయము గలిగిన అర్జునుడు శ్రీ కృష్ణభగవానుని యనుగ్రహమువలన ధర్మరహస్య మెరింగి ప్రవర్తించి విజయమును పొందినట్లు ధర్మరహస్యమునందు సంశయముగల జీవుడున్ను పరమాత్మ అనుగ్రహమువలననే ధర్మసూక్ష్మము నెఱింగి విజయమును పొందవలసియుండును రాజ్యభ్రష్టులయిన అర్జునాదులు శ్రీకృష్ణుని ఆదేశము ననుసరించి ప్రవర్తించుటవలన స్వరాజ్యమును పొంది రాజ్యపట్టాభిషిక్తులయిరి ఆ తీరున జీవుడుగూడ పరమాత్మకృపకు పాత్రుడయిన మాత్రమే విజయమును పొంది మోక్షసామ్రాజ్యమును పొందగలుగును కావున స్వరాజ్యమందు ప్రవర్తించు వారందరు సర్వేశ్వరుని కృపకు పాత్రులగులాగున నుండవలయును రాజేలాగున దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి ధర్మముతో రాజ్యమున్ను పాలింపవలసి యుండునో, ఆలాగున యాత్మ తనయొక్క జ్ఞానము గలిగి దుర్గుణముల నెల్లప్పుడు అణచి సుగుణములను సంరక్షించుచుండ వలయును ఇదియే స్వరాజ్య స్వారాజ్యముల యొక్క రహస్యము ఈ స్వరాజ్య స్వారాజ్యములను గురించి మానవ సృష్టిలో మొదటివాడును, ధర్మశాస్త్రములకు ప్రప్రథముడును నగు మనుమహర్షి మనుస్మృతియందు స్వరాజ్యమును నడుపు వాడెటు లుండవలయునో ఈ క్రింది శ్లోకమున వివరించిరి

**ఇన్ద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశమ్ ।**
**జితేన్ద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః ॥**

ఇన్ద్రియములను జయించుటకు రాత్రింబవళ్ళు యోగము ననుష్ఠింపవలయును అట్టి జితేంద్రియుడగు రాజే సమస్తప్రజలను వశములో నుంచుకొని రాజ్యమును పాలింప సమర్థుడగును

పూర్వము మనువు, ఇక్ష్వాకుడు, జనకుడు మొదలయిన రాజు లిట్టివారలే కావుననే అట్టివారి రాజ్యము మంగళకరమై యుండెను

వ్యష్టికి సమష్టికిని పరస్పర సంబంధముగలదు వ్యష్టియగు నీ శరీరమనెడు రాజ్యములో నింద్రియములనెడు ప్రజలను చక్కగా ధర్మబద్ధముగా నడువ శక్తిగలవాడే సమష్టియగు రాజ్యములోగల ప్రజలను ధర్మమార్గములో నడిపెడు యోగ్యత గలిగియుండును కనుక స్వరాజ్యమునకు ప్రధానులుగా మంత్రులుగా నుండదలంచు వారందరున్ను ఈ పూర్వ ఋషి వచనములను జ్ఞాపకములో నుంచవలయును

ఈ రాజ్యపాలనా విషయమై మనుస్మృతిలో విస్తారముగా గనందగును ఇక స్వారాజ్యము అనగా ఆత్మరాజ్య విషయమై మనుస్మృతినుండి యీ శ్లోకమును నిరూపించెద

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి ॥**

సమస్తభూతములలో తనను, తనయందు సమస్తభూతములను సమానముగా జూచునట్టి ఆత్మయజ్ఞమును జేయువాడు స్వారాజ్యమును, దైవరాజ్యమును పొందుచున్నాడు

ఇచట ఆత్మయజ్ఞము జేసెడు ఆత్మయాజిని గురించియు, కర్మయజ్ఞ మాచరించెడు సోమయాజిని గురించియు చెప్పినదని గ్రహించుకొనవలయును కర్మయజ్ఞమును జేసెడు సోమయాజి స్వర్గలోకమును పొంది పుణ్యము నశింపగనే మరల భూలోకమున పుట్టవలసియుండును

ఆత్మయజ్ఞమును చేసెడు ఆత్మయాజియో, పునర్జన్మరహితమగు బ్రహ్మపదమును పొందును హింసతో గూడిన సోమయాజియొక్క దుర్గతియు, అహింసతోగూడిన ఆత్మయాజియొక్క సద్గతియు దీనివలన తెలిసికొనవచ్చును కావుననే గీతయందు "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అని తెలిపిరి

**యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।**
**తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ (6-30)**

ఏ పురుషుడు చరాచర ప్రపంచ మందంతటను నన్ను చూచుచున్నాడో, సమస్తప్రపంచమును నాయందు చూచుచున్నాడో, వానికి నేను కనపడక పోను, వాడున్ను నాకు కనపడక పోడు భగవద్దర్శనము గోరువారందఱు ఇట్టి దృష్టి నవలంబించుకొనవలయును గాంధీగారు ఎల్లప్పుడున్ను తానేది చేయునప్పుడున్ను తన అన్తరాత్మ యను భగవత్ప్రేరణవల్లనే చేయుచుందునని చెప్పుదురు

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ (6-31)**

సమస్త భూతాన్తరాత్ముడనగు నన్ను ఎవడు సమముగా నన్నిటిలోను చూచువాడై భజించుచున్నాడో అట్టిజ్ఞాని సర్వప్రకారముగా వర్తించు వాడైనను, సదా నాయందే యుండువా డగుచున్నాడు అనగా, అట్టి సర్వాత్మైక భగవత్జ్ఞానముగల యోగి కర్మయోగి యయినను కావచ్చును లేక గృహస్థాశ్రమియైనను, సన్న్యాసాశ్రమియైనను ఉండవచ్చును బదర్యాశ్రమముందైనను, కుగ్రామమందైనను యుండవచ్చును వనమందైనను, గ్రామమందైనను నివసింపవచ్చును అట్టి మహానుభావునకు జ్ఞానమందుగాని, మోక్షమందుగాని యే కొఱతయున్ను గలుగదు, స్వరాజ్యమున కేలాగున రాష్ట్రములు విభాగింపబడి యున్నవో, అనగా బొంబాయి, మద్రాసు, కలకత్తా, పంజాబ్ మొదలైన విభజన తాలూకాలు, గ్రామములు వేరువేరుగా చేయబడినవో ఆలాగున స్వారాజ్య ఆత్మరాజమునకుగూడ ఆలాటి విభాగములు గలవు స్వరాజ్యపాలనమున కేలాగున ప్రజలు మంత్రులు మొదలయినవా రుంటున్నారో, ఆత్మరాజ్యపానలోగూడ, ఆలాగుననే ఏర్పడియున్నవి దీనిని ముఖ్యముగా ప్రథమమున స్థూల సూక్ష్మ కారణములను మూడు భాగములుగా చేయడమైనది తరువాత అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను పంచకోశములుగా విభజింపబడెను పిమ్మట 24 తత్త్వములతో గూడిన స్థూలదేహము, 17 తత్త్వములతోగూడిన సూక్ష్మదేహము, అవిద్యతోగూడిన కారణదేహము అని వేరుపరచబడెను వాగాది కర్మేంద్రియము లయిదున్ను, త్వగాది జ్ఞానేంద్రియము లైదున్ను ప్రజలుగాను నిర్ణయింపబడెను మనస్సు బుద్ధి చిత్తాహంకారములనెడు

నలుగురు మంత్రులున్ను నియమింపబడిరి వీటినన్నిటిని చూచుచుండు ప్రభువును ఆత్మనుగా నిశ్చయించిరి ఈ తత్త్వమంతయు సాంఖ్యయోగమున విశదమ్ముగా గనందగును సంక్షిప్తముగామాత్రము ఇచట నిరూపించెద యోగదర్శనమందు ఇది యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులని ఎనిమిదంగములుగా విభజింపబడెను ఆలాగున వాసిష్ఠాది జ్ఞానశాస్త్రములలో 1 శుభేచ్ఛ, 2 విచారణ, 3 తనుమానస, 4 సత్త్వాపత్తి, 5 అసంసక్తి, 6 పదార్థాభావన, 7 తురీయము, 8 తురీయాతీతమని ఎనిమిది విభాగములు చేయబడెను దీని ననుసరించియే శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వాములవారికి ఏడుకొండలున్ను, శ్రీ రంగనాథస్వాములవారికి సప్తప్రాకారములున్ను ఏర్పడినవి కొండలేడును ప్రాకార సప్తకమునున్ను దాటిన పై జెప్పినవారల దర్శనము గలుగునట్లుండునని తలంచిన యోగాష్టాంగములున్ను జ్ఞానాష్టాంగములున్ను ఒక అర్థమును ఉపదేశించుచున్నవి గీతాచార్యుండును పదునెనిమిదధ్యాయములను అష్టాదశ సోపానములనుగా ముక్తికొఱకు నిర్మించెను

**మోక్షాస్థానం పరం పార్థ సగుణం వాఽథ నిర్గుణమ్ ।**
**సోపానాష్టాదశై రేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥**

ఓ యర్జునా! సగుణ మయినటువంటి లేక నిర్గుణ మయినటువంటి, మోక్షస్థానమునకు పదునెనిమిది అధ్యాయములను స్తోపానములనుగా జేసికొని మనుష్యుడు పరబ్రహ్మము నొందుచున్నాడు ఈ పదునెనిమిది అష్టాంగములను పదునెనిమిది భాగములనుగా, అంతరార్థమున వివరించడ మయినది

**దృశ్యం దేహం చ వాగాది శ్రోత్రాదీన్ద్రియపంచకమ్ ।**
**ప్రాణాది పంచకం చైవ తథాఽన్తఃకరణమేవ చ ॥**

**ముక్తిసాధస్య సోపానా అష్టాదశ ఇతీరితాః ।**
**ఏతాన్క్రమేణ చారుహ్య బ్రహ్మభూయాయ కల్పతే ॥**

దృశ్యము, దేహము, వాగాది కర్మేంద్రియములు (ఐదు), శ్రోత్రాది జ్ఞానేంద్రియములు (అయిదు) ప్రాణాది వాయువులు (అయిదు), అంతఃకరణము,

ఒకటి ఈలాగున దేహమనెడు రాజ్యమును పదునెనిమిది విభాగములుగా చేయడమయినది అంతఃకరణ మొకదానిలోనే మనస్సు బుద్ధి చిత్తాహంకారము లుండినను, ఒకదానినిగానే కొన్ని శాస్త్రములలో నిర్ణయించిరి గీత 3-వ అధ్యాయమున కర్మయోగము నుపదేశించి, అందువల్ల అంతఃకరణ శుద్ధిగలిగి నైష్కర్మ్యసిద్ధి (మోక్షము) సిద్ధించునని కట్టకడ కుపదేశించిరి ఇదియే నిష్కామకర్మ యోగముచే కలిగెడు ఫలమని గ్రహించుకొనవలయును

**ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥**

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥**

**(3-42,43)**

బ్రహ్మవేత్తలు దేహముకన్న కర్మేంద్రియములు చైతన్యము గలవనియు, వానికన్న జ్ఞానేంద్రియములు చైతన్యము గలవనియు, వానికన్న మనస్సు చైతన్యము గలదనియు, దానికన్న బుద్ధిచైతన్యవంత మైనదనియు అట్టి బుద్ధికంటెను మిక్కిలి చైతన్యముగలది ఆత్మయనియు చెప్పుదురు దీనియందు "ఇంద్రియాణి" అని ప్రయోగించుటచే, పంచప్రాణములను గూడ గ్రహించుకొనవలెను అప్పుడు దేహము, కర్మేంద్రియములు -5, జ్ఞానేంద్రియములు-5, పంచప్రాణములు-5, మనస్సు, బుద్ధి, మొత్తము 18 ఏర్పడినవి మనస్సునందు చిత్తమున్ను, బుద్ధియందు అహంకారమున్ను కలిపి కొన్ని శాస్త్రములు చెప్పుచున్నవి ఓ అర్జునా! ఈ విధముగా బుద్ధికంటె వ్యతిరిక్తుడైన ఆత్మను (ప్రభువును) జ్ఞానస్వరూపునిగా నెఱింగి, ఆత్మచేత అన్నిటిని లెస్సగా నిగ్రహించి ప్రయాసముచే పొందదగినదియును, కామస్వరూప మయినదియును నైన మూలప్రకృతిని (శత్రువును) త్యజింపుమా లేక వధింపుమా! ఇదియే స్వారాజ్యమును (ఆత్మరాజ్యమును) పొందెడు ఉపాయము ఇదే విధముగా కఠోపనిషత్తు నందున్ను నిర్ణయింపబడినది

**ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥**

**మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।**
**పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః ॥**

శబ్దాది విషయములు ఇంద్రియములకంటె సూక్ష్మము లయినవి మనస్సు శబ్దాది విషయములకంటెను సూక్ష్మతర మైనది ఆ మనస్సుకంటె బుద్ధి సూక్ష్మతర మైనది ఆ బుద్ధికంటె మహత్తత్త్వము సూక్ష్మతరమైనది ఆ మహత్తత్త్వముకంటె అవ్యక్తము సూక్ష్మతర మైనది ఆ అవ్యక్తముకంటే పురుషుడు మహత్తరుడు ఆ పురుషునికంటే మహత్తర మయినది, మరియొకటి కొంచెమయినను లేదు అదియే అన్తమయినది అదియే సర్వోత్కృష్ట మయిన గతి అనగా మోక్షము, అవ్యక్తమున్ను మహత్తత్త్వమున్ను ఒకటిగా కొన్ని శాస్త్రములలో తెలుపబడినది కొన్నిటిలో అవ్యక్తము ఇంద్రియములకు వ్యక్తము గాదనియు, కొంత ఘనీభూత మయియుండు అవస్థ మహత్తత్త్వ మనియు తెలిపిరి ఇచ్చటను పదునెనిమిది భాగములుగా విభాగము లున్నవి ఇంద్రియములకు విషయములు అర్థము లనబడును అవి 1 శబ్ద, 2 స్పర్శ, 3 రూప, 4 రస, 5 గన్ధములు కావున అవి ~~ఈ~~దృశ్యములు 5 అర్థములు, 5 కర్మేన్ద్రియములు, 5 జ్ఞానేన్ద్రియములు, 1 మనస్సు, 1 బుద్ధి, 1 మహత్తత్త్వము, అవ్యక్తమున్ను ఒకటియే అన్నియు చేరి పదునెనిమిది యనంబడును వీనికన్నిటికి సాక్షియై పరమై యుండువాడు పురుషుడు, అనగా ఆత్మ, అదియే అన్త్యము దానికన్న అన్యమగునది మఱియొకటి లేదు అట్టి ఆత్మనే పరమాత్మనుగా నుపాసింపవలయును వీడే శరీరమనెడు రాజ్యమునకు ప్రభువు మొట్టమొదట చెప్పినటుల ఒక రాజ్యమునకు మద్రాసువంటి రాజధానులున్ను, గోదావరివంటి జిల్లాలున్ను, రామచంద్రపురంవంటి తాలూకాలున్ను నిర్ణయింపబడినవి ఇక గ్రామాదులవంటి తొంబైయారు తత్త్వములు నిరూపించబడుచున్నవి కొందరు తత్త్వవేత్తలు 24 తత్త్వములతో పూర్తిజేసిరి మఱికొందరు మఱింత విస్తారముజేసి 36 తత్త్వములతో పూర్తి జేసిరి ఇక కొందఱు బాగుగా విశాలపరచి 96 తత్త్వములతో పూర్తిజేసిరి

**చతుర్వింశతితత్త్వాని కేచిదిచ్ఛన్తి వాదినః ।**
**కేచిత్ షట్త్రింశ త్తత్త్వాని కేచిత్ షణ్ణవతీని చ ॥**
**తేషాం క్రమం ప్రవక్ష్యామి సావధానమనాశ్శృణు ॥**

తత్త్వము లిరువదినాలుగని కొందఱు, ముప్పదియారు అని మఱికొందఱున్ను, తొంబైయారు అని వేరుకొందఱున్ను చెప్పుచున్నారు వాని క్రమము జెప్పెద, సావధాన చిత్తుడవై వినుమా!

## చతుర్వింశతి తత్త్వములు

**జ్ఞానేంద్రియాణి పంచైవ శ్రోత్రత్వగ్లోచనాదయః ।**
**కర్మేంద్రియాణి పంచైవ వాక్పాణ్యంఘ్ర్యాదయః క్రమాత్ ॥**

**ప్రాణాదయస్తు పంచైవ పంచ శబ్దాదయ స్తథా ।**
**మనోబుద్ధిరహంకారశ్చిత్తం చేతి చతుష్టయమ్ ।**
**చతుర్వింశతితత్త్వాని తాని బ్రహ్మవిదో విదుః ॥**

శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణము అను జ్ఞానేంద్రియ పంచకమున్ను, వాక్కు, పాణి, పాదము, ఉపస్థము, పాయువు అను కర్మేంద్రియ పంచకమున్ను, సమాన, వ్యాన, ఉదాన, అపాన, ప్రాణములను ప్రాణపంచకమున్ను, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచతన్మాత్రలున్ను, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము లను అన్తఃకరణ చతుష్టయమున్ను - ఇవన్నియుచేరి 24 తత్త్వములని వేదాంతవేత్తలు చెప్పెదరు

## షట్త్రింశత్తత్త్వములు

**ఏతైస్త్వత్త్వైస్సమం పంచీకృతభూతాని పంచ చ ।**
**పృధివ్యాపస్తథా తేజో వాయురాకాశ ఏవ చ ॥**
**దేహత్రయం స్థూలసూక్ష్మ కారణాని విదుర్బుధాః ।**
**అవస్థా త్రితయం చైవ జాగ్రత్స్వప్న సుషుప్తయః ।**
**ఆహత్య తత్త్వజాతానాం షట్త్రింశన్మునయో విదుః ॥**

మున్ను వచించిన ఇరువది నాలుగు తత్త్వములతోగూడ, పృధ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అను పంచీకృత మహాపంచ, భూతములున్ను, స్థూలసూక్ష్మ కారణములను శరీరత్రయమున్ను, జాగ్రత్, స్వప్న, సుషుప్తులను

అవస్థాత్రయంమున్ను చేరి మువ్వదియారు తత్త్వములని యోగీశ్వరు లెరింగియున్నారు

## షణ్ణవతి తత్త్వములు

పూర్వోక్తైస్తత్త్వజాతైస్తు సమం తత్త్వాని యోజయేత్ ।
షడ్భావవికృతిశ్చాస్తి జాయతే వర్ధతేఽపి చ ॥

పరిణామం క్షయం నాశం షడ్భావవికృతిం విదుః ।
అశనా చ పిపాసా చ శోకమోహౌ జరామృతీ ॥

ఏతే షడూర్మయః ప్రోక్తాష్షట్కోశాస్తదనన్తరమ్ ।
త్వక్చ రక్తం మాంసమేదోమజ్జాస్థీని నిబోధత ।

కామక్రోధౌ లోభమోహౌ మదో మాత్సర్యమేవ చ ।
ఏతేఽషడ్వా విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞ ఏవ చ ॥

జీవత్రయం సత్త్వరజస్తమాంసి చ గుణత్రయమ్ ।
ప్రారబ్ధాగామ్యార్జితాని కర్మత్రయమితీరితమ్ ॥

వచనాదానగమన విసర్గానందపంచకమ్ ।
సంకల్పోఽధ్యవసాయశ్చాప్యభిమానోఽవధారణా ॥

ముదితా కరుణామైత్రీ ఉపేక్షా చ చతుష్టయమ్ ।
దిగ్వాతార్కప్రచేతాశ్వి వహ్నీన్ద్రోపేన్ద్ర మృత్యుకాః ॥

ధాతా చన్ద్రశ్చతుర్వక్త్రో రుద్రః క్షేత్రజ్ఞ దేవతాః ।
ఆహత్య తత్త్వజాతానాం షణ్ణవత్యస్తి కీర్తితా ॥

మున్ను వివరించిన ముప్పైయారు తత్త్వములతోగూడ షడ్భావ వికారములు, షడూర్మ్ములు, షట్కోశములు, అరిషడ్వర్గములు, జీవత్రయము, గుణత్రయము, కర్మేంద్రియ వ్యాపారములు, అన్తఃకరణ వృత్తులు, మైత్ర్యాది చతుష్టయము, జ్ఞానేన్ద్రియ, కర్మేన్ద్రియ, అన్తఃకరణ దేవతలు, అను నివిచేరి 96 తత్త్వములని

చెప్పబడుచున్నవి ఈ తొంబది యారు తత్త్వముల నతిక్రమించినవాడే పరమాత్మ యగును వీని పేర్లన్నియు పై శ్లోకమున చూచుకొనవచ్చును వేరువేరుగా వ్రాయవలసి వచ్చిన వ్యాసము పెరుగునని తలంచి అటుల చేయడమైనది

**సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమన్ధవత్ ॥**

పై జెప్పబడిన 96 తత్త్వములకు విలక్షణుడయ్యు చరాచరములలో వ్యాపించియు, జ్ఞాన స్వరూపుడై యుండు ఆత్మస్వరూపమును జ్ఞానదృష్టిగలవాడు చూచి ఆనందించును ప్రకాశమైన సూర్యోదయమును గ్రుడ్డివాడేలాగున చూడజాలడో, ఆలాగున జ్ఞానదృష్టిలేనివాడు దైవమహిమను (ఆత్మను) చూడజాలడు

ఇంద్రియనిగ్రహము గలవాని లక్షణము గీత తెలిపినది చూడుడు

**యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

తాబేలు తన అవయవములను లోనికి ముడుచుకొను విధముగా యోగి యగువాడు, ఎప్పుడు ఇంద్రియములను ఇంద్రియార్థ విషయములనుండి లోపలికి ముడుచుకొనుచున్నాడో, అప్పుడాయోగికి ఆత్మజ్ఞానము స్థిరమై యుండును అతడే సంయమి యనబడును ఇట్టి స్థితి గలవాడై కర్మయోగిగాని, జ్ఞానయోగిగాని, అభ్యాసయోగిగాని యుండవలయును అట్టివారి జ్ఞానము సుస్థిరమై యుండును ఇట్టిస్థితి, తమకు గలిగినదా అని ప్రతివారున్ను ఆత్మలో విచారణ చేయుచుండవలయును తాబేలు అవసరము వచ్చినప్పుడు కర చరణాదీన్ద్రియములను ప్రసరింపచేయును అవసరము కానప్పుడు లోనికి ముడుచుకొనును ఈలాగున ప్రవర్తించువాడే యోగి యనబడును

ఇంద్రియములు స్వాధీనము లేనివానిస్థితి యీ క్రింద నిరూపించబడుచున్నది

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి ॥**

విషయముల మీదకి పోవుచున్న ఇంద్రియములలో చేరుకొని మనస్సుగూడ విషయముల మీదికి పోయెనేని, అట్టి మనస్సు, సముద్రమునందలి ఓడను తుపానుగాలి ముంచివేయు విధముగా బ్రహ్మనిష్ఠునియొక్క ఆత్మజ్ఞానమును నశింపజేయుచున్నది అనగా అట్టివాడు సంసారసాగరములో మునిగిపోవును

మనోనిగ్రహము లేనివానికి గలిగెడు గతి యిటువంటిదని ప్రజ్ఞావంతు లాలోచించుకొనవలయును

**లోకములన్నియున్ ఘడియలోన జయించినవాడ వింద్రియా
నీకము జిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుజేయు నీ
భీకరశత్రులార్వుర ప్రభిన్నుల జేసిన బ్రాణికోటిలో
నీకు విరోధి లేడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా!**

అయితే, ఒకసారి లభ్యపడకపోయినను ప్రయత్నము చేయుచు రాగారాగా, సాధ్యపడునని 6-వ అధ్యాయమున శ్రీకృష్ణభగవానుడు తెలిపెను

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ॥
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

యోగము మనోనిగ్రహము లేనివానిచేత పొందకశ్యము గాదు ప్రయత్నశీలుడగు మనోనియమము గలవానిచేత, అభ్యాస వైరాగ్యములను ఉపాయమువలన పొంద సాధ్యమయినది, ఇదియే నాయొక్కమతము శ్రీకృష్ణభగవానుడు తనయొక్క ఆశయమును ఇచ్చుట నిశ్చయముగా నిరూపించెను. పాదములు రెండును సరిగా నుండువాడు మాత్రమే చక్కగ నడువగలుగును ఒక చరణము మాత్రము బాగుగానుండి రెండవపాదము బాగుగా లేనివాడు ఎట్లు నడువజాలడో, మఱియు రెండు చక్రములతో గూడిన రథము చక్రము విరిగినచో ఏలాగున గమ్యస్థానము చేరజాలదో ఆలాగున స్వరాజ్యము మాత్రము బడసి స్వారాజ్యము (ఆత్మరాజ్యము) పొందనివాని గతియు నుండును

# జడత్వమును బోధింపకుడు,

# చైతన్యమునే బోధించుడు.

జడత్వోపదేశముచే జనులు జడత్వమునే పొందుదురు చైతన్యోపదేశముచే చేతనత్వమునే పొందగలరు జడత్వోపదేశముచే అధోగతినిన్ని, చైతన్యోపదేశముచే ఊర్ధ్వగతినిన్ని పొందగలరు జడత్వోపదేశముచే జీవుడు పశుత్వమునున్ను, చైతన్యోపదేశముచే జీవుడు శివత్వమునున్ను పొందగలును కావుననే శ్రుతి యీలాగున నుపదేశించినది

**ఓం అసతో మా సద్గమయ, ఓం తమసో మా జ్యోతిర్గమయ,**
**ఓం మృత్యోర్మా అమృతం గమయ.**

ఓ పరబ్రహ్మమా! అసత్తునుండి నన్ను సత్తులోనికి చేర్చుమా! ఓ పరమాత్మా! తమస్సునుండి నన్ను ప్రకాశములోనికి చేర్చుమా! ఓ పరమేశ్వరా! మృత్యువునుండి నన్ను అమృతత్వములోనికి చేర్చుమా! అని వేదములందు స్తుతి చేయబడినది

దేహము నాధారము జేసికొని బోధించెడు వాక్యమును జడత్వమనియు, ఆత్మ నాధారము జేసికొని బోధించెడు వాక్యము చైతన్యమనియు మనము ముందుగా జ్ఞప్తిలో నుంచుకొనవలయును ఈ విషయము నారంభించుటకు ముందుగా లోకమును సింహావలోకనము నొనర్చుకొని భర్తృహరి యిట్లు చెప్పెను

**బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః ।**
**అబోధోపహతాశ్చాన్యే జీర్ణమఙ్గే సుభాషితమ్ ॥**

బోధకులు అనగా పండితులు మత్సరపరులై యున్నారు ప్రభువులు అనగా రాజులు విషయపరులై యున్నారు ఇక సామాన్యజనులో తగినవారు బోధించువారు లేకపోవుటచేత జ్ఞానరహితులై యున్నారు అందువలన మహాత్ముల పవిత్రవాక్యములన్నియు వారిదేహముతోనే లయమైపోవుచున్నవి ప్రస్తుతము లోకముయొక్క స్థితియు నట్లేయున్నది

శ్రీ శంకరభగవత్పాదులున్ను ఈలాగున మూడు విధములుగా విభాగించి

చెప్పిరి వివేకచూడామణియందు మొదటనే దీనిని గనందగును

**దేహోఽహమిత్యేవ జడస్య బుద్ధి-**
**ర్దేహే చ జీవే విదుష స్త్వహంధీః ।**
**వివేకవిజ్ఞానవతో మహాత్మనో**
**బ్రహ్మాహమిత్యేవ మతిస్సదాఽఽత్మని ॥**

జడత్వబుద్ధి గలవాడు దేహమే తాననుభావము గల్గియుండును కొంత వివేకజ్ఞానమున్ను, పాండిత్యమున్ను గలవాడు జీవుడే తానను భావము గల్గియుండును విజ్ఞానసంపన్నులును, మహాత్ములునగువారు బ్రహ్మమే తామను భావము సదా గల్గియుందురు

శ్రీ శంకరభగవత్పాదులు దేహ, జీవ, బ్రహ్మ - లని మూడు విభాగములు జేసిరి వీనియం దొక్కొక్కదానిని గురించి విచారణ సలిపినచో ఇప్పుడు సాధారణబోధకులు, పండితులు, గురువులు ముఖ్యముగా మఠాధిపతులు దేహమును అనగా జాతిని గురించియే బోధించుచున్నారు ఇది జడత్వబోధనయే యని శంకరులవారు మొదటనే తెలిపిరి ఇందు వల్లనే జనులు చైతన్య రహితులై జడప్రాయులయిరి అనగా జాతికిన్ని సన్న్యాసాది ఆశ్రమములకున్ను ఆధిక్యము నిచ్చిరేగాని, వారలలో వెలుగుచుండు వారి ఆత్మస్వరూపమై యుండు జీవుని గురించి యేమియు చెప్పకపోయిరి ఇది యొకడు నలుపు, తెలుపు, ఎఱుపు, పసుపు మొదలగు రంగులతోగల దుస్తులను ధరించి దానిని చూచి ఆ వస్త్రాదులయొక్క రంగుల ననుసరించియే తనను నిర్ణయించి నటులుండును ఇది వివేకవంతుల స్వభావమా! విజ్ఞానవంతులయిన, అతడు ఏవిధములగు వర్ణములతో గూడిన దుస్తులను ధరించియుండినను అతనియొక్క జాతియో, కులమో, పేరో మాత్రమే గ్రహించియుందురుగదా! లోకము యొక్క స్థితియు నిప్పుడాలాగున నేర్పడెను మఱియు నొక గృహములో నుండువానిని చూచి అతడేజాతికో, ఏ మతమునకో, ఏ నామమునకో చేరినవాడని తెలిసికొనక నివాసము చేసెడు గృహమే తానని నిర్ణయించుట ఎట్టి తెలివిమాలిన పనియని వివేకవంతులు తెలిసికొనెదరో ఆలాగున ఆత్మస్వరూపమును చూడక వర్ణాశ్రమముల గురించి, స్త్రీ పురుషుల గురించి ఒకరి

అర్హతను నిర్ణయించుటెట్టిదో, ఇదియున్ను అట్టిది యనియే గ్రహించుడు కావుననే గీతయందు "నవద్వారే పురే దేహీ" అని ప్రయోగించుట శిచ్చట దేహమును ఇల్లుగాను, ఆత్మను ఇంటిలో నుండువానినిగాను నిరూపించిరి ఆలాగున "దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సదాశివః " ఇచ్చటను దేహమును దేవాలయముగాను, దేవుని జీవునిగాను నిరూపించిరి ఇప్పుడుండువారు దేవుని విడిచి దేవాలయమును పూజించినటు లేర్పడెను ఇదెటువంటి వివేకమో విజ్ఞు లాలోచించుకొనెదరుగాక!

ఇదివరలో జెప్పినదానియొక్క సారవేమనగా, శుక్లశోణిత మలమూత్రములతోగూడిన దేహము నాధారముగా జేసికొని మానవులయొక్క యోగ్యతను నిర్ణయించువాడు జడవాది అనియు, వారలలో వెలుగుచుండు దైవస్వరూపమగు నాత్మ నుద్దేశించి బోధించువాడు చైతన్యవాది అనియు మనము గ్రహించుకొనవలయును జడవాదులు, చార్వాకులు నాస్తికులనియే ఆర్షమతము తెలుపుచున్నది చైతన్యాత్మను గురించి తెలుపువా డాస్తికుడనియు సనాతనమత సిద్ధాన్తము

ఈలాగున ఆలోచించిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులను, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసి, స్త్రీ పురుషాది భేదములను మాత్రము ముఖ్యముగా తలంచి బోధించువాడు ఆస్తికుడా, నాస్తికుడా? అని విజ్ఞులు తెలిసికొందురుగాక! నశ్వరములగు శరీర ధర్మములనుచూచి యోగ్యతను నిర్ణయించువాడు నశించిపోయెడు దేహమును నమ్మువాడుగదా! అతనిని నాస్తికుడనిగాక మఱి యేమందుము? సనాతనమగు నాత్మను గురించి యోగ్యతా నిర్ణయము చేయువాడుగదా ఆస్తికుడు అస్తిత్వము గురించి చెప్పువాడే ఆస్తికుడనియు, నాస్తిత్వము గురించి చెప్పువాడే నాస్తికుడనియు మనము గ్రహించుకొనవలయును మనస్సు దేని నెటుల భావన జేయునో, తదాకారస్థితిని పొందెడు శక్తిగలదై యున్నది కావుననే జడత్వభావముచే జడత్వమును, చైతన్యభావముచే చేతనత్వమును పొందుశక్తి మనస్సునకు గలదని తెలుపబడినది మనస్సు ఫోటోతీయు కెమెరాలోపల నుండు ప్లేటువంటిది పురోభాగమున ఏరూపమేలాగున నుండునో, ఆ రూపమును ఆలాగుననే ప్రతిఫలింపజేయు శక్తి

యెట్లు దీనికి గల్గియున్నదో, మనస్సుయొక్క స్థితియు ఆలాగున నుండును కావుననే "మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయో: అని శ్రుతి నిశ్చయించినది "మూషాసిక్తం యధా తామ్రం తన్నిభం జాయతే ధ్రువమ్" కరిగిన కంచునకు ప్రత్యేక రూపములేదు శిల్పి ఏరూపముగా మూసను కట్టియున్నాడో, దానిలోపోసినపుడు, కరిగిన కంచు ఆరూపములగు విగ్రహములుగా నేర్పడునట్లే ఎట్టి భావనను మానవుండు చేయుచున్నాడో, అట్టి రూపమును పొందుట నిక్కము కావున జడభావనను చేయక చైతన్యాత్మ భావననే చేయవలయును అని తెలిపినది శిల్పి కట్టినమూస, లక్ష్మిరూప మయినను, నారాయణరూపమయినను, నందీశ్వరరూప మయినను, ఈశ్వరరూప మయినను, ఆంజనేయ రూప మయినను, శ్రీరామ రూపమయినను, వెయ్యేల ఏ రూపమయినను ఆలాగున నేర్పడునటుల మనస్సుయొక్క స్థితియు ఉండునని తలంచి, మీరు ఏ యొక్క జాతిలో, ఏ కులములో, ఏ వర్ణములో స్త్రీ పురుషరూపము గలవారై యుండినను అన్నిటిలో వెలుగుచుండు ఆత్మస్వరూప మొకటియే యనియు, అదియే మీయొక్క స్వరూపమనియు భావించవలయును ఉపనిషత్తులు వేదాంతశాస్త్రములును సర్వదా యీలాగుననే ఘోషించు చున్నవి

**ఏక ఏవ హి భూతాత్మా భూతేభూతే వ్యవస్థిత: ।**
**ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ॥**

అనేక లోహములతో, అనేక ఆకృతులతో, అనేక రంగులతో చేయబడిన జలపాత్రలలో చంద్రబింబము, లేక సూర్యబింబము ఏలాగున నొకేవిధముగా నుంటున్నదో, ఆలాగున మానవు లనేకవిధములుగా నున్నవారైనను, అన్త: కరణములుగూడ విభిన్నగుణములతో గూడియున్నను, అందరిలోను వెలుగుచుండు ఆత్మ యొకేస్వరూపమని గ్రహించునప్పుడే,అతడాస్తికుడగును అప్పుడే అతనికి సోదరీసోదర భావము హృదయములో నిలకడగా నుండును స్మృతియున్ను ఈలాగుననే తెలుపుచున్నది

**ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి.**

ఓ అర్జునా! సమస్తభూతముల హృదయమందు వెలుగుచుండు సాక్షియగు

ఆత్మ ఈశ్వరస్వరూపుడే శ్రుతి స్మృతు లీలాగున సహస్రముఖములుగా నుపదేశించుచుండగా మనము సత్యమునుండి, దైవము నుండి యెంత దూరముగా ప్రయాణము జేయుచున్నామో, అంతరాత్మలో నొక క్షణకాలము మనస్సునుంచి యోచించుడు చింతించుడు అప్పుడు సత్యము మీకే బోధపడగలదు ఇక ఈ విషయమై విస్తరించి చెప్పంబూనలేదు స్థాలీపులాక న్యాయ మనుసరించి విజ్ఞుల కింతమాత్రమే చాలును ఇక శంకరాచార్యులు చెప్పిన రెండవ మెట్టులోనికి ప్రవేశించి చూతము

"దేహే చ జీవే విదుషస్త్వహం ధీః" - విద్యావంతులు ఇదివరలో జెప్పిన నాస్తికులు జడవాదులు కారనియు, ఈశ్వరాంశ సంభూతుడగు జీవుడే తాననియు బుద్ధిగలిగియుందురని తెలుపడమైనది అయితే యిప్పుడు విద్యావంతులలో చాలామందిన్ని యేదైన ధర్మమును, జ్ఞాన ముపదేశింప ప్రారంభించునప్పుడు జాతులనే చూచుచున్నారు ఇది నాస్తికత్వమని వారలలో చాలామంది మరచిపోవుచున్నారు అద్వైత శాస్త్ర మొకటి తప్ప, ద్వైత విశిష్టాద్వైతు లందఱున్ను ఈశ్వరాంశ సంభూతులే జీవులని తలంచుచున్నారు ఇంతవరకు వచ్చినను చాలా మేలే వాక్కుతో నటుల చెప్పినను, క్రియలో చూపువారు చాలా అరుదయిరి అదిన్ని జ్ఞాన పతనమునకు ఒక కారణమై నిలిచెను అయితే పై చెప్పిన దేహసంబన్ధముగల జాతినిగురించి పిడివాదమును చేయు నాస్తికులకన్న వీరు వేయిరెట్లధికులే అని చెప్పుటలో సందేహము లేదు జడవాదము సార్వభౌముని భృత్యుల వంటి అవస్థలో చేరినది ఈశ్వరాంశ స్వరూపులే జీవులని చెప్పువారు రాకుమారుడగు యువరాజువంటి అవస్థలోనికి వచ్చిరి సేవకులకున్ను, రాకొమరునకున్ను ఎంత వ్యత్యాసము గలదో, ఇట్టి భావములో వచ్చిన వారున్ను అంత అధికులే మనస్సుయొక్క భావనావేగము అంతయింత గాదు మనస్సున్నదే, అతివేగముగా ఊర్ధ్వాధోముఖముగా తిరుగుచుండు ఒక మహిమాతిశయముగల గొప్పయంత్రమువంటిది అది చైతన్యాత్మ భావముగా ఊర్ధ్వభాగ గమనమును ప్రారంభించిన భూర్భువాది సత్యలోకములను దాటించి యీ జీవుని శివునిగా నొనర్చును

అట్లుగాక జాతి వర్ణ స్త్రీ పురుషాది దేహసంబంధ జడభావములోనికి దిగినచో, అతల వితల పాతాలలోకముల కావల పడవేసి పశువుగా జేయును ఈ సత్యమును మరువకుడు

శ్రీ భగవద్గీతయొక్క యుపదేశమున్ను చైతన్యాత్మ నుద్దేశించియే యున్నది అర్జునునకు గలిగిన భ్రాన్తియు నిదియే దేహములు జడములనియు, నిప్పుడుగాక మరియెుకప్పుడైనను తప్పక నశించునవనియు, ఆత్మ నాశనములేని చైతన్యస్వరూపమనియు ద్వితీయాధ్యాయమున అనేక విధములుగా శ్రీకృష్ణభగవాను డుపదేశించి అర్జునునికి గలిగిన మోహమును పారద్రోలెను గీతయొక్క సారమిదియే కావుననే గీత, ద్వితీయాధ్యాయమున పదునొకొండవ శ్లోకము నుండి శ్రీ కృష్ణభగవాను డుపదేశము ప్రారంభించు నప్పు డీశ్లోకమును తెలిపెను ఋష్యాది న్యాసములో దీనిని బీజముగా పేర్కొనిరి మహావృక్షమునకు సూక్ష్మమయిన బీజమెట్టిదో, గీతాకల్పతరువున కిదియే బీజము ఇదియే ఆరంభము

**అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।**
**గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః ॥**

నీవు దుఃఖింపతగని వారినిగూర్చి దుఃఖించుచున్నావు పండితులు పలుకునట్టి మాటలనుగూడ పలుకుచున్నావు ఆత్మజ్ఞానముగలవారు మరణించినవారిని గురించిగాని, బ్రతికియుండువారిని గురించిగాని దుఃఖింపరు ఏలననగా శరీరము జడము, ఆత్మ చైతన్యము, అవినాశి అదే తమ స్వరూపమని ఎఱింగిన వారగుటచేతను విచారపడరు అని భావము

**అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥**

శాశ్వతముగా నుండువాడును, నాశరహితుడను, కేవల శాస్త్ర ప్రమాణములచే మాత్రము తెలియబడనివాడను, దేహధారియగు జీవుని యొుక్క యీ శరీరములు నశించునట్టివి అని చెప్పబడినది కావున ఓ అర్జునా! యుద్ధము చేయుము

**వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ ॥**

మనుష్యు డేప్రకారము చినిగిపోయిన వస్త్రములను విడిచి నూతనములయిన ఇతర వస్త్రములను గ్రహించుచున్నాడో, ఆ ప్రకారము ఆత్మ శిధిలములయిన దేహములను విడచి నూతనములయిన ఇతర దేహములను పొందుచున్నాడు

**నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥**

**అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ ।**
**నిత్యస్సర్వగతస్థాణు రచలోఽయం సనాతనః ॥**

ఈ ఆత్మను ఆయుధములు ఛేదింపజాలవు ఈ ఆత్మను అగ్ని కాల్చజాలదు ఈ ఆత్మను ఉదకములును తడుపజాలవు ఈ ఆత్మను వాయువు ఎండింపజేయజాలదు ఈ ఆత్మ ఛేదింప తగినవాడు కాడు ఈ ఆత్మ దహింపదగినవాడు కాడు ఈ ఆత్మ తడుపతగినవాడును కాడు ఎండింపజేయ తగినవాడును కాడు ఈ ఆత్మ త్రికాలములయందు నేకరీతిగా నుండువాడు, సర్వవ్యాపకుడు, నిశ్చలుడు, చలింపనివాడు, సనాతనుడు

ఇట్టి ఆత్మయే తాననెడు జ్ఞానముగలవాడే సనాతను డగును దేహాదులగురించి సనాతనత్వమును చెప్పువాడు సనాతనుడు కాజాలడు ఇట్టి యాత్మభావన సుస్థిరముగా గలుగుట ప్రయాసమని తలంచియే పునరుక్తి దోషమును పాటింపక రెండుసార్లు మరల మరల చెప్పుటకు కారణమైనది

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।**

సమస్త భూతములకును సనాతనమయిన నన్ను బీజస్వరూపునిగా తెలిసికొనుము

బీజాంకుర న్యాయమును గురించి వాదించువారు ఈ భగవద్ వాక్యమును గ్రహించిన బాగుండును ఇచ్చటగూడ సనాతనశబ్దము ప్రయోగింపబడెను వృక్షమునుండి ఆవిర్భవించిన బీజ మేలాగున వృక్షమున కన్యముగాదో, ఆలాగున భగవానునినుండి యుదయించిన జీవులు గూడ భగవంతుని కన్యులుగారు అయితే బీజము వృక్షమగుటకు పంచభూతముల సహాయము కావలసియుండును

అంతటితో చాలదు కొంతకాలముగూడ పట్టును అంతవరకు ఓర్చుకొని సాధన జేయువలెను బీజమును పెట్టి పోషించువారు బ్రాహ్మణులయినను, అబ్రాహ్మణులయినను, సన్యాసులైనను, గృహస్థులయినను, స్త్రీలయినను, పురుషులయినను సమానముగానే అది వృక్షమై ఫలపుష్పాదుల నివ్వగలుగునటుల నీ బ్రహ్మబీజమునుపెట్టి పోషించువారు మనుష్యమాత్రు లెవరయినను భక్తిజ్ఞానముల పొందగలరు బీజము వృక్షమగుటకు పంచభూతము లెట్లో ఆలాగున జీవులుగూడ శివత్వమునొందుటకు పంచశీలముల శీలించవలెను అవి (1) సత్ప్రవర్తనము, (2) సత్స్వరూపచింతనము, (3) సత్సంగము, (4) సద్గ్రంధపరనము, (5) సత్పదార్థభోజనము అగును

**నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥**

నేను యోగమాయచే గప్పబడినవాడ నయినందుచే, సమస్త జనులకు గోచరించువాడను కాను వివేకములేనివారు జన్మరహితు డయినట్టియు, నాశరహితు డయినట్టియు నన్నెఱుంగజాలరు అందఱిలోను భగవంతు డొకేవిధముగా నుండిన అందఱికిని నేల గోచరము కాలేదను ప్రశ్న కిచట సమాధానము చెప్పబడినది వెలుగుచుండు దీపమును మూత వేసి యుంచిన ఎట్లది కనిపించదో, మూత తీసివైచిన ఏలాగున కనబడునో, ఆలాగున అజ్ఞానముచే జ్ఞానమావృత మయియున్నది దానిని తొలగించు వారికి జ్ఞానమావిర్భవించును ఇదియే దీనిలో గల రహస్యము

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।**
**న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥**

ఓ అర్జునా! సమస్త భూతముల కుత్పత్తి కారణమగు బీజమేదియో అదంతయు నేనే, నన్ను వినా నాకంటే వేరైన చరాచరాత్మక మయిన వస్తువేది కలదో, అట్టివస్తువు లేనేలేదు

ఇచ్చటను బీజమును గురించి భగవంతు డుద్ఘాటించెను ఈ సత్యమును

తెలిసికొనిన మీరు భగవత్స్వరూపులను జ్ఞానము మీకు గలుగును గదా! అది మీకెంతో ఆనందమును, ధైర్యమును గలుగజేయును వృక్షము మహత్తరమైనను, బీజము అణుస్వరూప మయినను, బీజమును వృక్షముగా జేయునట్లు జీవునిగూడ శివస్వరూపునిగా జేయవచ్చును మహాత్ములకును, సామాన్యజనులకును ఇచ్చుటనే భేదమేర్పడుచున్నది

**ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

ఓ అర్జునా! యీ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది దీని నెవడెఱుంగునో, వానిని క్షేత్రజ్ఞుడని ఆ విషయము నెఱింగినవారు చెప్పుదురు దేవుడు లేని దేవాలయము నేలాగున పాడుదేవాలయము అని వ్యవహరింతురో, ఆలాగున దైవస్వరూపమును హృదయములో ప్రతిష్ఠజేయని మానవుని ఈ శరీరమను క్షేత్రమున్ను పాడుదేవాలయము వంటిదని గ్రహించుడు

**జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమసః పరముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥**

ఆ జ్ఞేయమగు బ్రహ్మము ప్రకాశించు సూర్య చంద్రాగ్నులకు గూడ ప్రకాశము నిచ్చునదనియు, చీకటి కావల నుండునట్టిదనియు చెప్పబడుచున్నది జ్ఞానస్వరూప మయినది అమానిత్వాది లక్షణరూప జ్ఞానమాత్రముచేతనే పొందదగినది సమస్త జంతువుల హృదయమునందుండు నట్టిది

ఈ ఆత్మవస్తువు అందఱి హృదయములలోను ఏకరూపముగా వెలుగుచున్నది అదియే మీ అందఱియొక్క ఆత్మ దానినే మీ స్వరూపముగా తెలిసికొనవలయును దేహముకాదని గ్రహించుకొనవలయును ఇదియే చైతన్యోపాసనచే గలిగెడు ఫలము.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥**

బ్రహ్మాది స్తంబపర్యన్తములగు సమస్తవస్తువుల యందును సమముగా

నున్నట్టి పరమేశ్వరు నెవండు సర్వము నశించినను నశించని వానినిగాఁ జూచుచున్నాడో వాడే చూచువాడు తక్కినవారు నేత్రములుండియు, లేనివారలతో సమానులు ఏలననగా చూడవలసినదానిని చూడకపోవుట అంధత్వముగదా!

**సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్ ॥**

ఏలననగా, అన్ని జంతువుల యందుండునట్టి ఈశ్వరుని, సమభావముతో చూచుచున్నవాడై తనను తనచేత హింసించుకొనడు అందువలన సర్వోత్కృష్టమగు మోక్షమును పొందుచున్నాడు అమృత స్వరూపమగు తన ఆత్మను తెలిసికొనక విడిచిపెట్టుట, తన ఆత్మను హింసించుట వంటిదిగదా! అందువల్లనే ఆత్మవేత్తలు గానివారిని, ఆత్మహన్తకులతో సమానులు తెలిపిరి

**సర్వయోనిషు కౌన్తేయ మూర్తయస్సమ్భవన్తి యాః ।**
**తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥**

ఓ అర్జునా! సమస్తయోనులయందును ఏ శరీరములు పుట్టుచున్నవో, ఆ మూర్తులకు మూలప్రకృతి తల్లిగను, బీజప్రదుడగు నేను తండ్రినిగను అగుచున్నాము తండ్రి పెద్దవాడైనను, కుమారుడు చిన్నవాడైనను తండ్రివంశమునకు అన్యుడెటుల కాగలుగును? ఆలాగున ఈశ్వరాంశ సంభూతులగు జీవులు ఈశ్వరుని కన్యులుగ నెట్లగుదురు? అయితే శైశవావస్థలోనుండు శిశువు యౌవనావస్థలోనికి వచ్చుటకు తగిన పోషణయు, కొంతకాలముగూడ పట్టును, ఆలాగున జీవుడు శివత్వమును పొందుటకు తగిన సాధనయు, కొంత కాలవిలంబనముగూడ అవసరములు ఇప్పుడు గీతలో నెన్నియోసార్లు భగవంతుడు తానే జీవుల బీజస్వరూపుడనని వర్ణించియున్నాడు ఇకను మనుష్యులు తెలిసికొనకపోవుట లోకముయొక్క దురదృష్టమనియే తలంచవలసి యుండును

**మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః ।**

ఈజీవకోటులన్నియు నాయొక్క అంశస్వరూపులనియు, సనాతన దైవ స్వరూపులనియు భగవానుడే స్వయముగా సెలవిచ్చినాడు ఇపుడు గీతా

వాక్యములను గురించి చాల విస్తారముగా తెలుపడమైనది ఇకను కావలసి యుండిన వేలకొలది స్మృతులు గలవు అవన్నియు వ్రాసి గ్రంధమును విస్తరింపజేయ తలంచలేదు అదెంత విశదీకరించినను సారమింతమాత్రమే గలదు, కావున ఇక ఈవిషయమై శ్రుతి ఏమి తెలుపుచున్నదో, దానిని తెలుపుటలోనికి ప్రవేశించెద

ముండకోపనిషత్తు-

**యధా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః**
**సహస్రశః ప్రభవన్తే సరూపాః ।**
**తథాక్షరాద్వివిధాస్సోమ్య భావాః**
**ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి ॥**

ఓ శౌనకుడా! ప్రకాశించి మండుచుండెడి అగ్నిహోత్రునివలన మిణుగురులు ఆ అగ్నికి సమానరూపము కలవై యెట్లు జన్మించునో, ఆ ప్రకారము ఆ అక్షరపరబ్రహ్మమునుండి అనేక విధములగు జీవములు ఆ పరబ్రహ్మమునకు సమానమయి పుట్టి దానియందే లయించుచున్నవి ఆ అక్షరపరబ్రహ్మము సత్యమయినది దానికి వేఱగు సమస్తము అసత్యమయినది

ఇచ్చటను కార్యకారణ రూపములనుబట్టి ఆలోచించిన కార్యము కారణ రూపముగా మారుట ప్రకృతిసిద్ధాన్త మగుచున్నది అగ్నిహోత్రుని నుండి లేచిన మిణుగురులను దూది, పీచు మొదలగువానిలో పెట్టి ఊదుచు చిన్నచిన్న పుల్లలువేసి పిదప పెద్ద కట్టెలు వేసినచో ఏలాగున కారణరూపమగు మహాగ్నిని పొందుచున్నదో, ఆలాగున ఈశ్వరాంశ సంభూతులగు జీవులున్ను తపోధ్యానాధ్యయనములచే పూర్ణత్వమగు ఈశ్వరుని పొందగలుగును ఇట్టి దృష్టాంతము లెన్నియో గలవు అనుష్ఠించి సిద్ధిపొందిన బ్రహ్మనిష్ఠులు తక్కువైనందుచే, బ్రహ్మవిద్య ప్రకాశించకపోవుచున్నది ముఖ్యముగా సన్న్యాసులలో సాధువులలో విద్యాతపస్సులు చాలతగ్గిపోయినవి అందువలన భౌతికవిద్యలలో ఉన్నతస్థితిలో నుండువారికి ధర్మతత్త్వమును బోధించుటకు వీరికి శక్తి లేకపోయెను భౌతిక విద్యయో, త్వరలోనే ప్రత్యక్షఫలము నిచ్చుచున్నది ఆధ్యాత్మిక విద్యయో, ఆలస్యముగానే ఫలము నిచ్చును భౌతికవిద్య త్వరలో ఫలము నిచ్చినను త్వరలోనే నశించును అట్టి విద్యవల్ల

ఆత్మశాంతి గలుగదు

ఆత్మవిద్యయో కొంత ఆలస్యముగా ఫలమునొసంగున దయినను, దానివలన గలిగెడు ఫలము శాశ్వతము ప్రారంభించి నప్పటినుండియే ఆత్మశాంతిని గలుగజేయుచుండును విద్యావంతులును, జ్ఞానసంపన్నులును మాత్రమే దీనిని లోకములో నిరంకుశముగా బోధింపగలరు కొద్ది కొద్ది ఫలితమునిచ్చెడు కూరగాయచెట్లు శీఘ్రముగా ఫలమునిచ్చినను అది చాల స్వల్పము అచిరకాలములోనే చెట్టు నశించును ఎక్కువ ఫలమిచ్చెడు పనస, నాటుమామిడి, కొబ్బరి మొదలయిన చెట్లు ఫలమిచ్చుట కాలస్యమయినను బహుకాలము ఏలాగున ఫలము నిచ్చుచుండునో, బ్రహ్మవిద్య యొక్కయు, ప్రపంచవిద్యయొక్కయు స్థితి యీలాగున నుండును మఱియు, ఉన్నతోద్యోగము కావలసియుండిన ఎక్కువకాలము చదువవలసి యున్నది గదా! తక్కువ గుమాస్తాపని కొద్దిచదువులోనే లభించును అయితే ఆ కొద్దిడబ్బుచే తన సంసారకార్యముల నిర్వహించుటకు చాలకున్నప్పుడు అతడు పరోపకార మేలాగున చేయగలుగును? ఉన్నతోద్యోగియో, వేలాది ధన మార్జించు వాడగుటచే మితముగా ఖర్చుచేయు వాడయినచో ఎంతో పరోపకారము చేయవచ్చును గదా! అధ్యాత్మ విద్యకున్ను, వ్యావహారిక విద్యకున్ను ఇంత తారతమ్యము గలదని విజ్ఞులెఱుంగుదురు గాక! మరియొక రహస్యము గూడ గలదు అదేమనగా! ప్రపంచవిద్య నభ్యసించువాడు తమ ఇన్ద్రియసౌఖ్యములను త్యజింప నవసరములేదు బ్రహ్మవిద్యాభ్యాసపరుడు తన ఆధ్యాత్మిక నిష్ఠకు ప్రతిబంధములయిన సర్వేన్ద్రియ సౌఖ్యములకును స్వస్తిచెప్పవలసియుండును ఇందువల్లనే ఆధ్యాత్మిక విద్యయందు సామాన్యజనులకు ప్రవేశము లేకపోయెను కఠోపనిషత్తు తెలిపినది చూడుడు-

**నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాన్తిశ్శాశ్వతీ నేతరేషామ్ ॥**

ఒక్కడగు నే పరమేశ్వరుడు, అనేకులకు వారివారి కర్మలకు తగిన ఫలముల నిచ్చుచున్నాడో, ఆ పరమేశ్వరుడు నిత్యమయినవాని లోపల నిత్యమయినవాడు, చైతన్యముగల బ్రహ్మాది స్తంబపర్యంతము గల ప్రాణులలోపల చేతనాస్వరూపుడు

తనలోనున్న ఆత్మను ఏ విద్వాంసులు చూచుచున్నారో, అట్టివారికే నిత్యమయిన శాంతి, సుఖము తదితరులకు అట్టి శాశ్వతమైన శాంతి, సుఖము లేదు ఇచ్చుటను చేతనాస్వరూపుడగు ఆత్మ నుపాసించులాగున చెప్పిరేగాని జడమగు దేహాదులను ఉపాసింప జెప్పలేదు అనగా చైతన్యస్వరూపమగు ఆత్మ తానని గ్రహించుకొన వలయునని భావము

**ఏకో వశీ సర్వ భూతాన్తరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

తనకంటే అల్పుడును, అధికుడును, తనతో సమానుడును అగువాడు మఱొక్కడు లేనివాడును, సర్వజగత్తు స్వాధీనముగా గలవాడును, సర్వభూతములకు అంతరాత్మ స్వరూపుడును అగు నే పరమేశ్వరుడు ఒక్కడయ్యు అనేక రూపములను చేయుచున్నాడో, అట్టి పరమాత్మను తనలో నున్నవానినిగా ఏ పరిశుద్ధాంతఃకరణులు చూచుచున్నారో, అట్టివారికే శాశ్వతమయిన సుఖము ఇతరుల కట్టిసుఖము లేదు

ఇందువల్లను ఆత్మోపాసకులకు మాత్రమే శాశ్వతసుఖము గలుగునని తెలుపడమైనది బృహదారణ్యకోపనిషత్తుగూడ ఈ తత్త్వమునే యుపదేశించుచున్నది యాజ్ఞవల్క్యమహర్షియు తన భార్యయగు మైత్రేయికి ఈ ఆత్మోపాసననే ఉపదేశించెను

**ఆత్మావారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః ।**

ఓ మైత్రేయీ! ఈ ఆత్మయే చూడందగినది శ్రవణము జేయందగినది నిదిధ్యాసనము జేయందగినది అని ఉపదేశించెను

అనుభూతిప్రకాశము-

**అన్తర్యామిణి బుద్ధేఽథ సుశకం బోద్ధుమక్షరమ్ ।**
**ప్రశాసనేన లింగేన సోఽన్తర్యామ్యవబుధ్యతామ్ ॥**

అన్తర్యామి బోధపడిన తర్వాత అక్షరము తెలిసికొనుట సులభము, అక్షరుని శాసనముచేతను, లింగముచేతను అంతర్యామిని తెలియవలయును

**ఏతస్య వా అక్షరస్య శాసనే సత్యదో జగత్ ।**
**స్యాద్వ్యవస్థితమర్యాదం సూర్యచంద్రాది లక్షణమ్ ॥**

ఈ అక్షరుని యొక్క శాసనమున్నప్పు డీజగత్తు ఒక నియమముతో నడచుచున్నది/సూర్యచంద్రాదుల వర్తనము నియమాను సారముగా నున్నది

**వివాదగోచరావన్నా యన్నపూర్వా జగత్థ్సితిః ।**
**వ్యవస్థితత్వాల్లోకస్య రాజపూర్వా స్థితిర్యధా ॥**

రాజున్న దేశ మెటుల నొక నియమముతో ప్రవర్తించునో అట్లు జగత్తుయొక్క స్థితిగూడ నొక నియంతవలననే నడచుచున్నదని, గ్రహించుకొనవలయును

**సూర్యచంద్రౌ ద్యుభూర్లోకౌ కాలో నద్యో యధా యధమ్ ।**
**నియమేన ప్రవర్త న్తే సా ప్రవృత్తిర్వ్యవస్థితిః ॥**

సూర్యచంద్రులస్థితి, ద్యులోకముల భూలోకముల ఏర్పాటు, కాలము, నదులు ఒక నియమముతో ప్రవర్తించుచున్నవి ఆ ప్రవర్తనయే ఈశ్వరనియమము అట్టి ఈశ్వరుడే మీ హృదయాన్తరవర్తియైడ యుంటున్నాడు అట్టి ఈశ్వరుని ఉపాసింపుము

**అజ్ఞానమాత్రతో బన్ధః జ్ఞానమాత్రేణ ముక్తతా ।**
**ఇత్యాశ్చరాణి సర్వాణి కల్పయన్తీశ్వరాస్తితామ్ ॥**

అజ్ఞానమువల్లనే బంధము, జ్ఞానమువల్లనే ముక్తి అనెడు ఆశ్చర్య కరములయిన విషయము లీశ్వరుడు కలడనుటకు హేతువులు

**మా గోచరాతివర్తిత్వాదదృష్టం స్యాత్తదక్షరమ్ ।**
**అభావత్వనిషేధార్థం ద్రష్టక్షరమితీర్యతే ॥**

ప్రమాణగోచరముల దాటియున్నందున అక్షరము కనబడదని చెప్పబడెను శూన్యమేమో యను సంశయము తొలగుట కునది సర్వము చూచునదని చెప్పబడెను కఠోపనిషత్తున్ను ఈ సత్యమునే తెలుపుచున్నది

**భయాదస్యాగ్ని స్తపతి భయాత్తపతి సూర్యః ।**
**భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥**

ఈ పరమేశ్వరునియొక్క భయమువలన అగ్నిహోత్రుడు దహించుచున్నాడు పరమేశ్వరునియొక్క భయమువల్లనే సూర్యుడు ప్రకాశించుచున్నాడు ఇంద్రుడున్ను వాయువున్ను ఐదవవాడగు మృత్యువున్ను ఈ పరమేశ్వరుని భయమువల్లనే స్వస్వవ్యాపార నిర్వహణమునందు నియమితముగ ప్రవర్తించుచున్నారు

**న ఆత్మా న హి విజ్ఞేయస్సర్వైరపి ముముక్షుభిః ।**
**తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యాత్కదాచన ॥**

అట్టి చైతన్యాత్మయే ముముక్షువు లందఱిచేత తెలిసికోదగినది అట్టి తుర్యాత్మజ్ఞానము లేనివారికి ముక్తి యెుకప్పుడును కలుగదు అని మాండూక్యోపనిషత్తు

ఇప్పుడు శ్రుతి స్మృతులను సంక్షిప్తముగా నిరూపించడ మైనది ఇక ఈ విషయమై చెప్పవలసియుండిన ఎంతయోగలదు అది జలము, ఉదకము, తోయము అని పదముల భేదము మాత్రమే వస్తువంతయు ఇంత మాత్రమే ఇప్పుడు భృత్యునినుండి యువరాజువరకు వచ్చితిమి ఇక ఈ యువరాజే సార్వభౌముడై మారులాగున ఈ చైతన్యాత్మ జీవుడే పరమాత్మగా నుంటున్నాడని తెలుపవలసియుండును

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥**

యోగముతో గూడుకొనిన మనస్సుగలవాడు సమస్త జంతువుల యందు సమభావము గలవాడై, తన్ను సమస్తభూతములయందున్న వానినిగాను, సమస్తభూతములు తనయం దున్న వానినిగాను చూచుచున్నాడు

ఈ శ్లోకముచే ఏకదేశీయులగు జీవులయొక్క అంతఃకరణోపాధిని ధ్వంస మొనరించి అన్నిటిలోనుండు ఆత్మయు, తన ఆత్మయు ఒకేచైతన్య స్వరూపమని ఉపదేశించడమైనది ఇది ఈశ్వరత్వము నుపదేశించుచున్నది ఈశ్వరుడు,

బ్రహ్మము, ఆత్మ అను ప్రయోగములలో సామాన్యముగా ఈశ్వరుని చెప్పునప్పుడు శుద్ధ మాయాప్రతిబిమ్బుడగు బ్రహ్మచైతన్యమనియే తెలుపును అశుద్ధ మాయాప్రతిబింబ బ్రహ్మచైతన్యమే జీవుడని వ్యవహారము గలదు ఏలననగా అన్తర్యామిత్వమును చెప్పునప్పుడు ఏద్దైన నొక వస్తువులోపల నుండునదని ఆ వాక్యములోనే అర్థము స్ఫురించుచున్నది కావుననే ఉపాధిద్వయరహితము గావలయుననియు, అప్పుడే బ్రహ్మత్వము సిద్ధమగుననియు వేదాంతశాస్త్రమున కొసలో తెలుపుటకు కారణము అచట ఒకే సద్వస్తువు మాత్రమే మిగిలియుండును అన్తర్యామిత్వ ఉపాధిగూడ పటాపంచలైపోవును కావుననే 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అని శ్రుతి శాసించినది ఆ సద్వస్తు వొకటియే దానినే పండితులు అనేక పేర్లతో పిలుతురు

**కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।**
**కార్యకారణతాం హిత్వా పూర్ణబోధో విశిష్యతే ॥**

దీనియర్థమే పైన నిరూపింపబడినది

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వధా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

సమస్త భూతాన్తరాత్ముడగు నన్ను, ఎవడు అభేదబుద్ధి గలవాడై, ఒక్కే ఆత్మగా తెలిసినవాడై భజించుచున్నాడో, అట్టి ఆత్మధ్యానయోగి, సర్వప్రకారముగా వర్తించువాడైనను, నా యందుంటున్నవా డగుచున్నాడు

"సర్వధా వర్తమానోఽపి" అని ప్రయోగించుటవల్ల బ్రహ్మచర్య, గార్హస్థ్య, వనస్థ, యత్యాది ఏ ఆశ్రమములో నుంటున్నను లేక కర్మ, భక్తి, యోగ, జ్ఞానములలో దేనియందు నుండువాడయినను లేక మౌనముగా నుండినను, మాట్లాడినను, ఏకాన్తముగా నుండినను, లేక జనపదములలో నుండినను విరోధము లేదనియు గ్రహించుకొనవలయును ఇదియే దీనియొక్క అర్థమేగాని, విధినిషేధములులేక ప్రవర్తించినను విరోధము లేదని అర్థము మాత్రము కాదని విజ్ఞులెల్లరు గ్రహించుకొనవలయును

నారోపితోదకం బరయంగ దోచునే
కనదధిష్ఠానార్క కరము గనిన
నారోపితాచ్ఛరౌప్యము లక్ష్యమగునె య
ధిష్ఠానమైన శుక్తికను గనిన

దలవ నారోపితాసితత్వంబు మరల
గాననగునె యధిష్ఠానఖంబు గనిన
దెలియ నారోపితమనంబు దృశ్యమగునె
తగ నధిష్ఠానపూర్ణతత్త్వమును గనిన

తరుణివేషంబు గైకొన్న పురుషు డరయ
బురుషు డగుగాక పరికింప దరుణియగునె!
జీవభావంబు జేకొన్న కేవలాత్మ
డాత్మ డగుగాక మఱి జీవుడగునె తెలియ

దంతిరూపంబుచే నొప్పు దారువ రయ
దారువగుగాక పరికింప దంతియగునె !
విశ్వరూపంబుచే దోచు విష్ణుమూర్తి
విష్ణుడగుగాక పరికింప విశ్వమగునె.

వారణమందు భ్రాంతుడగువానికి దారువు తోపదాక్రియన్
దారువటంచుగాంచు విహితజ్ఞానకుం బరికింపగల్గునే ?
వారణమట్లు సర్వమనువానికి బ్రహ్మము గానిపింప ద
ట్లారక బ్రహ్మమందు గను యోగికి సర్వము గల్గితోచునే ?

ఘటకటకోర్మికాపట నికాయములంచు వివేకదృష్టిచే
దటుకువ మృత్సువర్ణజలతంతువులంచు నెఱింగినంత ద
త్స్ఫుటతర నామరూపములు పోవమి నన్నియు గార్యకోటి కె
ప్పటివలె వచ్చు వచ్చినను బాధకమున్నదె హేతుదృష్టికిన్!

ఆరీతిన్ సకలంబు తత్త్వమని దివ్యాధ్యాత్మయోగంబుచే
నారూఢింగను యోగి కెయ్యెడ దదీయాంగేన్ద్రియాత్మాళికిం
బ్రారబ్ధానుభవంబు గల్గనటు లొప్పారంగ దా ద్రష్టయై
సారోదారవిచారదృష్టి నరయున్ సర్వంబు బ్రహ్మంబుగాన్.

స్వకృతవిచిత్రవట్టణ మసన్మయమంచు నెఱింగి భ్రాంతి నొం
దక యిల నింద్రజాలకుడు దాని సృజించు విధంబున న్నిజ
ప్రకృతికృత ప్రవంచమున భావముగా వివరించి కాంచి త
ద్వికృతుల జెందకే ఘనవివేకి యొనర్చు సమస్తకార్యముల్.

నిషిద్ధ్య నిఖిలోపాధీన్నేతి నేతీతి వాక్యతః ।
విద్యాదైక్యం మహావాక్యైర్జీవాత్మ పరమాత్మనోః ॥

సమస్తములయిన కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వాది రూపోపాధులను, 'నేతి' అను మహావాక్యమువలన నిషేధించి జీవాత్మ పరమాత్మలయొక్క భేదనివృత్తి పూర్వకమయిన ఐక్యమును, భేదనివృత్తి పూర్వకమైన అఖండానందస్వరూపార్థమును తెలియజేసెడు మహావాక్యములచేత తెలిసి కొనదగినది

ఏవం నిరన్తరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।
హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥

సర్వోత్తమమయిన యౌషధమును సేవించుటవలన రోగములు నశించునట్లు, ఎల్లప్పుడును నేను బ్రహ్మమేకాని బ్రహ్మ వ్యతిరిక్తుడనుకాను అని యభ్యాసము చేయుటవల్ల గలిగిన సంస్కార రూపమయిన సద్వాసన, ఆవరణ విక్షేప శక్త్యాకులమైన అవిద్యను బొత్తిగా పోగొట్టునని దృఢముగా నమ్మవలయును

వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేన్ద్రియః ।
భావయే దేకమాత్మానం తమనంతమనన్యధీః ॥

ఏకాన్త ప్రదేశమునందు గూరుచున్నవాడై, సమస్తవిషయముల యందు విరక్తిగలవాడై, ఇంద్రియములను విషయవ్యాపారములందు ప్రవేశింపకుండ అణచి, మనస్సును ఆత్మయందు చలించకుండా ఉంచి, ఒక్కటైనటువంటి, అనంతమైన

సత్యజ్ఞానానంద స్వరూపమునే తన స్వరూపముగా భావించవలయును

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యజ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ ఆత్మలాభముకంటే వేఱులాభము లేదో, ఏ ఆత్మసుఖము కంటే వేఱుసుఖము లేదో, ఏ జ్ఞానమును తెలియుటకంటె వేరే తెలియదగిన జ్ఞానము లేదో, అదియే బ్రహ్మమని నిశ్చయించి తెలిసికొనవలయును ఆత్మజ్ఞానానుభవము గలిగినదాని కిదియే గురుతు

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమంధవత్ ॥**

ఆత్మజ్ఞానమను నేత్రముగలవాడు సమస్తమందు వ్యాపించి యుండు సచ్చిదానంద స్వరూపాత్మను తననుగా జూచుచున్నాడు, దేహాదులే ఆత్మ యను అజ్ఞాననేత్రముగలవాడు, ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డి వాడు చూడజాలనట్లు ఆత్మను చూడజాలడు

ఇందువల్ల ఈశ్వరుడు లేక ఆత్మ యుండిన ఎందుకు కానుపింపడు? లేక కొందఱికి గోచరించుటకును, మరికొందఱికి గోచరించకపోవుటకును కారణమేమి? అను నీ ప్రశ్నలకు సమాధాన మివ్వడమైనది

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా ।**
**స్వభావస్సచ్చిదానంద నిత్యనిర్మలతాఽఽత్మనః ॥**

సూర్యునికి ప్రకాశమును, నీళ్ళకు చల్లదనమును, అగ్నికి ఉష్ణత్వమును స్వతస్సిద్ధమయిన స్వరూప మయినట్లు ఆత్మకును సచ్చిదానంద నిత్యనిర్మలత్వాదులే స్వరూపమని ముముక్షువులు తెలిసికొనవలయును

కొందఱు తన దేహమునుగురించి, వాక్యమునుగురించి, వర్తనమునుగురించి, మనస్సునుగురించి, జాతినిగురించి, దేశమునుగురించి ఇది మా స్వభావమని గొప్పగా చెప్పుకొనుచుందురు ఇవన్నియు అస్వభావములే అనియు, అనాత్మ

స్వభావములనియు, దుస్స్వభావములనియు వివేక బుద్ధితో తెలిసికొని వీనినన్నిటిని తొలగించి సత్యజ్ఞానానంద స్వరూపము తన స్వభావసిద్ధమని తెలిసి మనస్సును మార్పు జేసికొనవలయును

**అత్యల్పోఽపి యథా దీప స్సుమహిన్నాశయేత్తమః ।**
**జ్ఞానాభ్యాసస్తథాఽల్పోఽపి మహత్పాపం వ్యపోహతి ॥**

చిన్నదీపమయినను, గృహాన్తరాళములోని గొప్పచీకటి నేలాగున నాశమొనర్చునో, ఆలాగున ఈ జ్ఞానాభ్యాసమున్ను అల్పముగా శీలించినను, గొప్పదైన అజ్ఞానమును నశింపజేయును

**ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రావ్య విముహ్యతి ।**
**స్థిత్వాస్యామన్త కాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥**

ఓ యర్జునా! ఇది బ్రహ్మసమ్బద్ధమయిన నిష్ఠ ఈ నిష్ఠను పొందిన మోహము జెందడు ఈనిష్ఠయందు మరణకాలమందైనను ఉండెనేని మోక్షమును పొందుచున్నాడు

శ్రీ కృష్ణభగవానులు సాంఖ్యయోగమున స్థితప్రజ్ఞుని లక్షణములను చెప్పి కట్టకడకు జీవకోట్లపై కరుణగలిగి యీ శ్లోకమును వచించిరి ముఖ్యముగా ముదుసలులగు స్త్రీ పురుషులగురించి అతి కరుణగల్గి చెప్పినదని మరువకూడదు ఏలననగా చాలామంది వృద్ధులు, వృద్ధురాండ్రు 'మాకాలమంతయు దాటిపోయినది, మేమెట్లు తరించగలము' అని మనోవ్యాకులత గల్గియున్నారు అట్టి గలవారిని గురించియే ఇది ఉపదేశించడమైనది కావుననే "స్థిత్వాఽస్యామన్త కాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి'' అని ప్రయోగించిరి అన్త్యకాలమందైనను, ఆ పరమాత్మయందు స్మరణగలిగినను, మనసు నిలువ గలిగినను మోక్షము పొందగలరని తెలుపడమైనది

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణో వాఽన్త్యజోఽపివా ।**
**సంసారసాగరం తీర్త్వా ముక్తి పారం హి గచ్ఛతి ॥**

ఈ జ్ఞానయజ్ఞమనెడు ఓడచే బ్రాహ్మణుడైనను, అన్త్యజుడైనన జనన

మరణరూపమగు నీ సంసారసాగరమును దాటి మోక్షమనెడు దరిని చేరుచున్నాడు గదా!

ఇందువల్ల బ్రాహ్మణులుమాత్రమే మోక్షమును పొందనగును అని గాని, బ్రాహ్మణేతరులు పొందకూడదనిగాని అభిప్రాయ మేమియు లేదు పడవలో బ్రాహ్మణులును, అ బ్రాహ్మణులును, స్త్రీలును, పురుషులును, సన్న్యాసులును, సంసారులును ప్రయాణము చేయుట లేదా! అయితే దేశాన్తరమునకు వెళ్ళుటకు పొగవోడలో ప్రయాణము చేయదలంచువారు టిక్కెట్టును తీసుకొని దగ్గఱ ఉంచుకోవలయును ఓడనెక్కునప్పుడు టిక్కెట్టుకలెక్టర్ టిక్కెట్టు ఎచ్చట అని అడుగునుగాని నీవు బ్రాహ్మణుడా, అబ్రాహ్మణుడా, స్త్రీయా, పురుషుడా, సన్న్యాసియా, సంసారియా అని అడుగుట లేదుగదా! ఆలాగున గురూపదిష్ట జ్ఞానమొకదానిని సంపాదించుకొనిన చాలును

నైవ స్త్రీ చ పుమానేష నైవ చాయం నపుంసకః ।
యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే ॥

ఈ ఆత్మ స్త్రీయును గాదు, పురుషుడును కాదు, నపుంసకుడును కాదు ఏయే ఉపాధితోగూడిన శరీరమును గ్రహించుచుండునో దాని దానితో సంబంధపడియున్నది, అంతియేగాని ఆత్మకు స్త్రీ లింగము పుంలింగము, నపుంసకములతో సంబంధము లేదు అది దేహధర్మము ఆత్మ ధర్మము గాదు, ఏలాగున శంఖతీర్థము, కమండలుతీర్థము, పంచపాత్రతీర్థము మొదలగు పేరులు అసలుతీర్థమునకు లేకపోయినను, ఉపాధులనుపట్టి వచ్చినవో ఇదియున్ను అట్టిదే ఈ సత్యమును తెలిసికొనునప్పుడే దేహభావము వదలిపోయి ఆత్మభావము సుస్థిరముగా నిలువగలుగును



# సందేశము

(19-12-1953వ తేదీన కనుపర్తిపాడు దత్తాత్రేయ వార్షికోత్సవమునకు పంపినది )

మీరందఱును శ్రీ దత్తాత్రేయ వార్షికోత్సవమునకు ఏతెంచి యున్నారు సామాన్యముగ నందఱును శ్రీ దత్తాత్రేయభగవంతుడు మూర్తిత్రయాత్మక స్వరూపుడని యెరింగియున్నారు కావుననే "మూర్తి త్రయస్వరూపాయ దత్తాత్రేయ నమోఽస్తుతే" అని ధ్యానము చేయుచుందురు దత్తాత్రేయ స్వరూపమును బాగుగా తెలిసికొనవలసియుండిన అవధూతగీతను చదువ వలయును, ఇది దత్తాత్రేయులవారిచే రచింపబడినది

శ్రీ దత్తాత్రేయులవారి చరిత్రము ఈ దక్షిణ ఇండియాలో చాలా అరుదుగానే యుంటున్నది కాని ఉత్తరహిందూస్థానములో బాహుళ్యముగా గనందగును ఈ దేశములో శ్రీ వేంకటేశ్వరస్వామి జనులకెంత యుపాస్యమూర్తియో, అంత ఉత్తర దేశములో దత్తాత్రేయులు జనుల కుపస్యాదైవమై యున్నారు ఐతే శ్రీ వేంకటేశ్వరులకును, శ్రీ దత్తాత్రేయులకును కొంచెము తారతమ్యము గలదు శ్రీ వేంకటేశ్వరులను ఆరాధించువారిలో నెక్కువమంది ప్రవృత్తిమార్గస్థులును, కామ్యకర్మ పరులునునై యున్నారు దత్తాత్రేయుల నుపాసించువారు నివృత్తి మార్గస్థులుగాను, నిష్కామకర్మ యోగపరులుగా నుందురు దత్తాత్రేయ శబ్దమునకు అర్థము సంగ్రహముగా జెప్పిన దత్తమైన త్రయము గలవాడని బోధపడును దత్తమనగా ఇవ్వబడిన లేక త్యజింపబడిన త్రయముగలవాడు త్రయమనగా మూడు జీవసంజ్ఞగల విశ్వ, తైజస, ప్రాజ్ఞులనంబడు కల్పితులగు జీవత్రయమును వదలినవాడనియు, మిగిలిన ప్రత్యగాత్మ స్వరూపుడగు పరమాత్మ స్వరూపము గలవాడనియు, ఆలాగున స్థూలసూక్ష్మకారణము లనెడు దేహత్రయమును దత్తముజేసినవాడనియు, దేహత్రయాతీత సాక్షిచైతన్య స్వరూపుడనియు మనము గ్రహించుకొనవలయును ఆలాగున జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి అవస్థాత్రయము లేనివాడనియు, ఈ మూడింటిని సదా యే యాత్మ స్వప్రకాశాత్మయై ప్రకాశింప జేయుచున్నదో అట్టి ఆత్మస్వరూపమే దత్తాత్రేయ స్వరూపము మఱియు జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి మూడింటిని కాలితో తన్నివైచి మూడుగుణముల కతీతమగు

పరబ్రహ్మ స్వరూపముగా నుండువాడనియు దెలియదగినది ఆలాగున అకార ఉకార మకారములనెడు మూడుమాత్రలకు మూడక్షరములకు మూలస్వరూపుడై, అర్ధమాత్రస్వరూపుడై, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు పరమై పరబ్రహ్మస్వరూపమై, సత్యజ్ఞానానన్దమూర్తియై వెలిగెడు ఏ సద్వస్తువుగలదో అదియే దత్తాత్రేయుల స్వరూపము ఇది పుట్టుకలోగల పేరుగాదు ఈ స్థితిని బొందిన పిదప ఋషులు గల్పించిన యొక బిరుదుమాత్రమే యగును ఏలాగున డాక్టరు, ఇంజనీరు, కలెక్టరు మొదలగు ఉద్యోగ సంబంధమగు పేర్లుగలవో ఇదిన్ని అటువంటిదే కావున ఈ నామము మనలో నెవరైనను బొందవచ్చును

పై జెప్పిన దత్తమైన త్రయము గలవారెవరో వారెవరైనను ఆ నామధేయమున కర్హులే పైన నిరూపించిన యుద్యోగస్థుల బిరుదునకు వారుమాత్రము అర్హులని తలంచవలదు ఆ డిగ్రీయందుత్తీర్ణులైన వారందఱును ఆ నామమునకును ఆయుద్యోగమునకును ఎట్లు అర్హులో ఈ దత్తాత్రేయ స్థానమునకును మనుష్యమాత్రు లందరును యోగ్యతగలవారే పైన పేర్కొనిన యధికారమునకు బ్రాహ్మణులనిగాని, బ్రాహ్మణేతరులనిగాని, స్త్రీలనిగాని, పురుషులనిగాని, సంసారులనిగాని, సన్న్యాసులనిగాని భేదము లేనట్లు దత్తాత్రేయపదము నలంకరించుటకును అందఱును సమానమగు హక్కుగలవారలే ఇంకను దత్తాత్రేయ శబ్దమునకు అనేకార్థము లుండవచ్చును మూడు గుణములే జీవునికి బంధమనియు, మూడు గుణములనుండి విముక్తి గలుగుటయే ముక్తియనియు గీతయందు శ్రీ కృష్ణభగవాను డుపదేశించెను

**సత్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

ఓ యర్జునా! నాశరహితుడైన దేహస్థుడగు యాత్మను, దేహమునందు ప్రకృతివలన బుట్టిన సత్త్వ రజసజస్తమో గుణములు బంధించుచున్నవి

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

జీవుడు దేహోత్పత్తికి కారణభూతములైన పై జెప్పబడిన సత్త్వ, రజః,

తమోగుణముల నతిక్రమించి బ్రహ్మజ్ఞానముచేత త్రిగుణముల నడంచి పుట్టుక,చావు, ముసలితనము, దుఃఖములు మొదలగువానిని బొందక జీవన్ముక్తుడై యమృతత్వమును బొందుచున్నాడు

ఈ స్థితి కలుగుటకు ప్రతిరోజును నొక యనుకూల సమయమును ప్రతివారును ఏర్పాటుజేసికొని సాధన జేయవలయును బ్రహ్మముహూర్తము నుండి మొదటి యామము అనగా తొమ్మిదిగంటల లోపల నుండుట మంచిది కావుననే పరమఋషులు ప్రాతఃకాలమునకు బ్రహ్మముహూర్తమని పేరిడిరి ఏ కార్యమైనను శుభముహూర్తమున జేయుటెంత శ్రేయస్కరమో యీ ధ్యానానుష్ఠానములను బ్రహ్మముహూర్తములోనే చేయుట మంచిది శరీరమొక యంత్రము వంటిది గడియార మేలాగున సమయమునకు మన ప్రయత్నములేకనే గంటకొట్టుచున్నదో ఆలాగున ఒక సమయమును తప్పక ద్యానమున కేర్పాటుజేసికొనిన, మనస్సు మొదలగు ఇంద్రియములన్నియు మన విశేషప్రయత్నము లేకనే ధ్యానోన్ముఖములై పరమశాంతిలోనికి, ఉపరతిలోనికి, ఆత్మసన్నిధిలోనికి, నిశ్చలస్థితిలోనికి తీసికొని వెళ్ళుచుండును, ఇదియే నియమిత సమయముచే గలిగెడు ప్రయోజనము

మీలో నెవరైనను నియమితాహారము, నియమిత నిద్ర, నియమిత పరిశ్రమము గలిగియున్నచో గడియార సహాయములేకనే నిద్రనుండి జాగరణయు,ఆకలియు, విసర్జనమును అప్రయత్నముగనే గలుగుచుండును అయితే యెల్లప్పుడును అనివార్యకారణముచే నిర్వహింపకపోయినను భోజనమునకు ముందుగా తప్పక కొంతవరకైన అట్టి జపధ్యాన పారాయణాదులు జేసియే భుజింపవలయు ననెడి యొక వ్రతమును బూనినమాత్రమే యీ సంసారములో మీకు తరణోపాయము లభించును అట్లుగానిచో సేతుస్నానమునకు వెళ్ళి సముద్రములోగల కల్లోలము లణగిన తరువాత స్నాన మొనర్చవలయునని తలంచెడివానియొక్క గతియే సంభవించును సముద్ర ముండువఱకు అలలుండునుగదా! ఆలాగున సంసారమునందుండు వఱకును ఒక కార్యముపై మఱియొక కార్యము, ఒక సంకల్పముపై మఱియొక సంకల్పము వచ్చుచునే యుండును కావుననే సంసారమును సాగరముగా వర్ణించడమైనది

**శాన్తే సముద్రకల్లోలే స్నానమిచ్ఛతి మూఢధీః ।**
**తథైవ శాన్తే సంసారే జ్ఞానమిచ్ఛతి దుర్మతిః ॥**

తన భర్త యింటికడనుండ భర్తకు భోజనము పెట్టక ముందుగ భుజించు నారి యెట్టిదియో, గురుశుశ్రూషానిరతుడగు అంతేవాసి భిక్షాన్నము దెచ్చిగాని లేక పచనమొనర్చిగాని గురుదేవునకు బెట్టక ముందుగ భుజించువాడెట్టి గుణముగలవాడో, దేవతారాధన పరుడగు అర్చకుడు నైవేద్యము సమకూర్చి భగవదారాధనజేయక భుజించువాడెట్టి లక్షణము గలవాడో ఆలాగున మానవున కేర్పడిన దైవకార్యములను జేయక భుజించువాడును అట్టివాడే యగునని మీలో మీరే నిశ్చయించుకొనవలయును పై జెప్పిన ముప్వురును నెట్టిపాపగుణముగలవారో ఆలాగున దైవకార్యముల నొనర్చక భోజనము జేయరాదని దృఢముగ నొక వ్రతమును మీరనుష్ఠించినమాత్రమే యీ సంసారమునుండి తరించగలరు రాత్రియందు కారుచీకటిలో ఒక ప్రకాశమైన దీపమునుండి మీరెంత కెంతకు దూరముగ వెళ్ళెదరో అంతకంతకు అంధకారమయములోనికి (ఏమియు కనిపించని స్థితిలోనికి) బోవునట్లు, స్వప్రకాశమై జ్ఞానమయమై ఆనన్దఘనమై యుండు ఆత్మలోనుండి మనోబుద్ధులలోనికిని, జ్ఞానేంద్రియములలోనికిని, కర్మేంద్రియములలోనికిని, దేహములోనికిని, దృశ్యములోనికిని ఎంతకెంతకు జారిపోవుదురో అంతకంతకు గాఢాంధకారాజ్ఞానములోనికి దిగిపోవుచున్నారని తలంచవలయును

పై జెప్పినవారు దీపము చెంతకు రాగారాగా నేలాగున చీకటి నశించి వస్తువులు గనబడునో తమోరహితస్థితి గలుగుచుండునో, ఆలాగున మీ మనస్సును దృశ్యమునుండి, దేహమునుండి వాగాది కర్మేంద్రియాలనుండి, చక్షురాది జ్ఞానేంద్రియములనుండి, బుద్ధ్యాద్యంతరింద్రియముల నుండి క్రమముగా ఆత్మలోనికి లయపరచులాగున చేసికొని అమృతత్వమును, మోక్షమును, దైవత్వమును ఈజన్మలోనే బొందగలరు అది శివము, అమృతము, అద్వైతము, ఓమ్ ఈ సత్యమునే శ్రీభగవద్గీత మూడవ అధ్యాయమున నిష్కామకర్మయోగమును ఉపదేశించుచు వచ్చి కట్టకడకు 42, 43 శ్లోకములలో భగవానునిచే ఉపదేశించడమైనది దీనివలన నిష్కామకర్మ యోగముచే నంతఃకరణశుద్ధి గలిగి

రాగా రాగా మేఘము వదలినపుడు సూర్యుడు స్వయముగా ప్రకాశించునట్లు ఆత్మజ్ఞానోదయమున్ను గలుగునని గ్రహించుకొనవలయును అనగా నిష్కామకర్మయోగమును సరిగా ననుసరించుచువచ్చిన అదియే నైష్కర్మ్యసిద్ధిని గలుగజేయునను భావమును హృదయములోనుంచియే శ్రీకృష్ణభగవాను డిట్లుపదేశించుటకు కారణమైనది

**ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః ॥**

**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥**

దీని యర్థము పైన నిరూపించినదే ఈ విషయమునే 'కఠోపనిషత్తు' గూడ బోధించుచున్నది

**ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్ పరః ॥**

**మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।**
**పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ॥**

ఈ స్థితి గలుగునప్పుడే మానవుని దేహమనెడి దేవాలయమునందు దేవతాప్రతిష్ఠ జేసినట్లు జన్మసార్థకత నొందగలుగును లేనిచో ప్రతిష్ఠలేని పాడుదేవాలయమువంటిదే యగును



# అధ్యక్షస్థానము

ఇచట సభాధ్యక్షస్థానమునుగూర్చి తెలుపబడుచున్నది ఏ సభకైనను అధ్యక్షులుగా నుండువారు రెండుకార్యములలో సదా దృష్టి నుంచుకొనవలెను 1

కాలాతిక్రమణము గలుగనీయక సభను పూర్తి చేసికొనుట 2 ఏ సమాజనమునకు, ఏ మతమునకు, ఏ సంప్రదాయమునకు అధ్యక్షస్థానమును వహించెదరో దాని ననుసరించియే ప్రవర్తించవలయును అనగా, ఆ సంఘముయొక్క ఆశయము ననుసరించియే ప్రబోధము చేయవలయును కార్యనిర్వాహక సంఘమువారు నిర్ణయించిన కార్యదర్శిగారి నిర్ణయకాలమునకు ఎంద రుపన్యాసకులుండినను, దానికి లోపల పూర్తిచేసేలాగున సమయమును అధ్యక్షుడు నిర్ణయించుకొనవలెను ప్రతి ఉపన్యాసకుడును ఈ నియమమును పాటించవలసియుండును ఉపన్యాసకులున్ను సమాజముయొక్క లక్ష్యము ననుసరించియే ధర్మబోధలు చేయవలయునుగాని, తమ యిష్టానుసారముగా నుపన్యసించరాదు కాలమున్ను, అధ్యక్షుడు నిర్ణయించినదానికన్న తన స్వేచ్ఛానుసారము పెంచకూడదు ఏలన సంఘమువారికి అనేక కార్యక్రమము లుండవచ్చును ఒకదాని తర్వాత మరియొకటి జరుపవలసియుండుటచే, ఉపన్యాసముల కాలమును పెంచినచో కార్యక్రమము సరిగా జరుగదు ఈలాటి విషయములన్నిటిని అధ్యక్షులుగాని, ఉపన్యాసకులుగాని జ్ఞాపకములో నుంచుకొనవలసియుందురు అధ్యక్షుడు తనకు సర్వాధికారమున్నదని తలచి స్వేచ్ఛగా ప్రవర్తించరాదు సమయమునకు సభపూర్తిచేయుట, సంఘమువారి ఆశయమునకు భిన్నముగా ప్రవర్తించకుండుట అను రెండుభారములు అధ్యక్షునిపై నుండును గవర్నరుజనరల్, కలెక్టరు మొదలగువారుకూడ తమ కేర్పడియుండు అధికారమునకు మించి ప్రవర్తించరాదు వీరందరున్ను ఒక రాజశాసనమునకు లోబడియే ప్రవర్తించవలయును కట్టకడకు సార్వభౌముడైనను అతనికి సర్వాధికార మున్నను తన కేర్పడిన అధికారమునకు మించి ప్రవర్తించరాదు వారికిన్ని ధర్మశాసన మొకటి గలదు అట్లుండగా కొందరు సభాధ్యక్షులు తమకు సర్వాధికారము గలదనియు, కార్యదర్శిగాని, కార్యనిర్వాహకులుగాని తమ పోకడకు అడ్డుచెప్పకూడదనియు తలంచుట ప్రమాదకరము మరియు కార్య నిర్వాహకులు తమ సంప్రదాయమునకు అనుకూలించిన వారిని మాత్రమే అధ్యక్షులుగా చేయవలయును ఈ విషయములో వీరున్ను జాగరూకులై యుండకపోయిన అప్పుడున్ను ప్రమాదము సంభవించును ఈ విషయములో సరిగా నాలోచించకపోయిన, పప్పుపెట్టమని చెప్పిన ఉప్పు పెట్టినట్లుండును కావుననే

ప్రతి సంప్రదాయమువారును వారి వారి సంప్రదాయము ననుసరించినవారినే అధ్యక్షులుగా చేయుదురు

1 అధ్యక్షులైనవారును తమ మనస్సాక్షికి విరుద్ధమని తోచిన నే సభకున్ను అధ్యక్షస్థాన మంగీకరించరాదు ఒక వేళ అంగీకరించినా ఆ సం ్రదాయము ననుసరించి అతడు చెప్పవలయునేగాని, తనకు తోచినట్లు చెప్పరాదు ఈలాటి విషయములో అధ్యక్షుడు ముందుగానే ఆలోచన చేయవలసియుండును ఇదంతయు ధర్మరహస్యము ముఖ్యముగా అధ్యక్షుడు తన ఆశయమునకు భిన్నమైన యే సమాజమునకున్ను అధ్యక్షుడుగా నుండక పోవుటయే మంచిది లేనిచో, ఎవరైన అడిగిన తన ఆత్మసాక్ష్యమునకు భిన్నముగా ప్రవర్తించినట్లు తప్పక చెప్పవలసియుండును సాకారార్చన పూజాదులు జరుగు సభలకు నిరాకార దైవారాధనగల ఆర్యసమాజ, బ్రహ్మసమాజస్థులు మొదలగువారిని అధ్యక్షులనుగా జేసినచో వారు విగ్రహారాధనగల సనాతనమతమును ఖండన చేయవచ్చును, అది ఆ సమాజమునకు, మతమునకు విరుద్ధముగా నుండుటవలన ఆ సంప్రదాయ భక్తులకు మనోవైకల్యము గలుగజేసినవారే యగుదురు ఆలాగున నిరాకారోపాసనగల బ్రహ్మసమాజ, ఆర్యసమాజ సంప్రదాయమునకు విరుద్ధమైన విగ్రహారాధన చేయు సంప్రదాయముల వారిని అధ్యక్షులుగా జేసినను పై జెప్పిన గతియే సంభవించును అదే ప్రకారము వైష్ణవమతమునకు శైవమతస్థుని అధ్యక్షునిగా నియోగించిన శివుడే ముక్తినిచ్చునుగాని, విష్ణువు మోక్షప్రదాతగాదని చెప్పిన నెట్లుండును? అదే ప్రకారము శైవసభకు వైష్ణవుని అధ్యక్షునిగాజేసిన శివుడు మోక్షము నిచ్చుటకు శక్తుడు గాదు, శ్రీ మన్నారాయణమూర్తియే మోక్షదాతయని గంభీరముగా నుపన్యసించిన ఎట్లుండునో, ఆ సభ్యులయొక్క హృదయమున కెంత వేదన గలుగజేయునో, ఆలోచించుకొనవలయును ఒకవేళ నిరాకార ఈశ్వరోపాసకులు సాకార ఉపసాకుల సభకు ఆధిపత్యము వహించిన దాని కనుకూలముగా చెప్పినచో విరోధము లేదు ఆలాగున నిరాకారోపాసకుల సభకు సాకారోపాసకులు యాజమాన్యము వహించినను పై విధముగా ఆ సమాజము ననుసరించియే బోధముచేయవలెను లేనిచో సభలో అశాంతిగలుగునదేగాక శాంతిశూన్య మగును కావుననే తమ సంప్రదాయములకు సంబంధించిన వారిని మాత్రమే అధ్యక్షులుగా

జేసుకొనుట మంచిదని మొదటనే చెప్పబడినది అట్టి సభయే శాంతిని, సుఖమును, భక్తిని గలుగజేయును

అదే ప్రకారము నిష్కామకర్మయోగ, భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞానయోగముల గురించియు జ్ఞాపకములో నుంచుకొనవలయును ఆయా యోగములకు సంబంధించినవారిని మాత్రమే అధ్యక్షపదవికి ఏర్పాటు చేయవలయును ఆ నాలుగు యోగములున్ను స్వతంత్రముగా ముక్తిని గలుగజేయుననియే ఆ మతకర్తల సిద్ధాంతము లేనిచో ఆ మతము పరాధీనమేగాని, స్వాతంత్ర్యముగలది గాజాలదు ఆ యా మతములలో మోక్షమును పొందిన మునులు, ఋషులు, యోగులు అనేకులు గలరు బలమైన ప్రమాణములుకూడ అసంఖ్యాకము లేర్పడియున్నవి "నాన్యః పన్థా విద్యతేఽయనాయ" అను వేదప్రమాణము అందరికిని సమానమేగాని ఒక్కరికిమాత్ర మేర్పడినదిగాదు రోగ నివారణమునకు ఆయుర్వేదము, సిద్ధమతము, ఆంగ్లేయము, యునాని మొదలగు వైద్యగ్రంథములు గలవు ఇవన్నియు రోగనివారణమునకు తగిన ఔషధములు గలవేయగును దీనియం దొకటి హెచ్చు, ఒకటి తక్కువయని చెప్పుటకు లేదు ప్రకృతి చికిత్సకూడ మరియొకటి గలదు పై జెప్పిన నాల్గింటిలో ఒకదాని ననుసరించి ఆరోగ్యము గలుగక, మరియొకదానిచే ఆరోగ్యము పొందినవారును ఉంటున్నారు అపుడు తనకు దేనివలన ఆరోగ్యసిద్ధి గలిగినదో అది గొప్పయని తలంచినను, ఆ చికిత్సచేత ఆరోగ్యము గలుగనివానికి మరియొక ఔషధమువలన ఆరోగ్యము సిద్ధించిన, అతడు అదే గొప్పదని చెప్పినట్లుండునని తలంచి నాల్గింటిని గ్రహించవలెను కావుననే "నానా మతం మహర్షీణాం సాధూనాం యోగినామపి" అని అష్టావక్రముని జనక మహారాజునకు చెప్పెను ఇదే సత్యము

**యథా తోయ ప్రవాహానాం సముద్రః పరమావధిః ।**
**తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠా పరావరా ॥**

నదులన్నిటికి సముద్రమేలాగున పరమావధిగా నుంటున్నదో, ఆలాగున సర్వమార్గములకున్ను పరమోత్కృష్టమైన మోక్షమే పరమావధియని గ్రహించదగినది

**త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి**
**ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితి చ ।**

**రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిలనానాపథజుషాం**
**నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ ॥**

చక్కగా వంకరగా మరియు అనేక విధములుగా ప్రవహించు నదులన్నిటికి సముద్రమెట్లు గమ్యస్థానమో, అట్లు మతకర్తల యభిప్రాయముల ననుసరించి వేద, సాంఖ్య, యోగ, శైవ, వైష్ణవాది మతముల మార్గములు వేరువేరుగా నున్నను, అన్నిమార్గములకు ఆ పరమేశ్వరుడే గమ్యస్థానముగా నుంటున్నాడు

**యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో**
**అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః ।**
**బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః**
**సోఽయం నో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో విభుః ॥**

ముల్లోకములకు ప్రభువైనట్టియు, సర్వవ్యాపకు డైనట్టియునగు ఏ పరమేశ్వరుని శైవులు శివుడనియు, వేదాంతులు బ్రహ్మ అనియు, జైనులు అర్హన్ అనియు, మీ మాంసకులు కర్మ అనియు, బౌద్ధులు బుద్ధుడనియు, నైయాయికులు కర్తయనియు ఉపాసించుచున్నారో, పై యుపాసకులందరికి ఉపాస్యమైన ఆ పరమేశ్వరుడు మనయొక్క అభీష్టమును నెరవేర్చుగాక!

2 ఇక ఉపన్యాసకుల విషయమై కొన్ని విషయములు గ్రహించవలసియున్నవి ఒక సమాజములో నుపన్యాసకులు పలువురుందురు వారున్ను ఆ సమాజముయొక్క లక్ష్యము ననుసరించియే యుపన్యసించవలసి యుందురుగాని, తమతమ యిష్టానుసారముగా నుపన్యసించుట ఒక విధముగా క్రమవిరుద్ధ మగును ఈ విషయమై కూడ బోధకులు జాగ్రత్తవహించవలసి యుందురు ఆ సంఘముయొక్క లక్ష్యము కర్మ, భక్తి, యోగ, శైవ, వైష్ణవములై యుండిన దాని కనుగుణముగా ప్రవచనము జేయవలసియుండునేగాని, భిన్నమైనచో అదిన్ని అశాంతికి దారితీయునని మరువకూడదు సంఘ కార్యనిర్వాహకులున్ను తమ సమాజమునకు అనుకూలమైనవారిని మాత్రమే ప్రబోధకులుగా ముందుగానే యెన్నుకొనవలెను లేనిచో గాలిలేని ప్రశాంతసముద్రమువలె నుండవలసిన సభ, తుపానులేచి అల్లకల్లోలము చెలరేగు సముద్రమువలె నుండునని గ్రహించవలెను

ఇచ్చటకూడ ప్రవచనపరు లగువారు భిన్నాభిప్రాయములుగల వారైయుండినను, సమాజముయొక్క లక్ష్యము ననుసరించియే ప్రవర్తించవలయును అట్లుచేయుట ఆత్మసాక్ష్యమునకు భిన్నముగాతోచిన మానుకొనుటయే మంచిది అదియే ఉదారస్వభావము వివేకలక్షణముకూడా

3 ఈలాటి స్థలములలోకూడ ఉపన్యాసకులు భిన్నభిన్న పంధాలను త్రొక్కుచుండిన అధ్యక్షుడు సమన్వయపరచేశక్తి గలిగియుండవలయునేగాని, ఒక్కొక్కరి ఉపన్యాసములను విమర్శించి వారిని చిన్న పుచ్చుట ఏమాత్రమున్ను తగదు ఇచటను సభాధ్యక్షునియొక్క ప్రజ్ఞను, సహనమును, సమన్వయశక్తిని వినియోగపరచవలెను అట్లు గాకపోయిన అశాంతికి అధ్యక్షుడు దారితీసిన వాడగును ఆలాటి సమర్ధత అధ్యక్షునికి తప్పక యుండవలెను లేనిచో కొన్ని ప్రశ్నలు బయలుదేరుటగాని లేక ఉపన్యాసకులు ప్రత్యేకముగా సభలుచేయుటగాని జరుగుట నిక్కము వీనినన్నిటి నాలోచించిన అధ్యక్షస్థానము వహించుట గొప్పభారమయిన కార్యమని గోచరమగును అయితే యీ చెప్పినదంతయు వ్యష్టిగత సభను గురించినదని గ్రహించుకొనవలెను సమష్టి సభ మరియొకటి గలదు అది సర్వమత సమ్మేళనమునకు సంబంధించినది అచట కాలనిర్ణయమును చేయు బాధ్యతమాత్రమే అధ్యక్షున కుండునుగాని, మతాభిమానులు వారి వారి మతానుకూలముగా ప్రబోధముచేయుట కధికారము గలిగి యుందురు అచట అధ్యక్షుడుగాని, సభ్యులుగాని, ఉపన్యాసకులుగాని యేమియు చెప్పుట కవకాశము గలిగియుండరు సభలలో నీలాటి పరిస్థితి గలదని సభాధ్యక్షుడున్ను, ప్రబోధకులున్ను, సభ్యులున్ను తెలిసికొని యుండవలెను

4 గీతయందు శ్రీకృష్ణభగవానుడు పదునెనిమిది యోగములను గురించి చెప్పెను వీటిని నెట్లు సమన్వము చేయవలెనో మేధావులు ఊహించుకొవలెను గీతయొక్క ఉపక్రమము మొదలు ఉపసంహారము వరకు బాగుగ అవగాహనము చేసికొన్నవారు మాత్రమే వీటిని సమన్వయము చేయగలరు అట్లుండికూడ ద్వైతాద్వైత విశిష్టాద్వైత, శైవ, వైష్ణవులు, వేరువేరు విధములుగా భాష్యములు వ్రాసియున్నారు ఆ మతకర్తలుకూడ మహామేధాసంపత్తియు, అమానుషప్రజ్ఞయు గలవారై యున్నారు అయితే గీతయొక్క అష్టాదశాధ్యాయములను వారివారి మతానుగుణముగా

సమన్వయపరచిరి ఆదే వారియొక్క ప్రతిభా విశేషము భగవానుడు జీవుల సంస్కారము ననుసరించి పలువిధ మార్గములను చెప్పినను గమ్యమేకమని నిర్ణయించెను అదియే గీతాశాస్త్రముయొక్క అమోఘమైన దివ్యశక్తియని గ్రహించవలెను ఇది తెలియక, కొందరు అధ్యక్షపీఠ మలంకరించి తన ఆశయమునకు భిన్నముగా నుపన్యసించువారిని గురించి, వారు చెప్పినది తక్కువ స్థితియనియు, అంతరార్థము గాదనియు విమర్శించ బూనుటకన్న బుద్ధిహీనత మరియొకటి లేదు ఇది అట్టిసభలో నుపన్యాసకులను అవమానపరచుట తప్ప మరి యేమున్నది దీనిని గురించి చెప్పవలసిన భాగములన్నియు ఇదివరలోనే తెలుపడమైనవి గీతాచార్యుడగు కృష్ణభగవానుడు తెలిపినది చూడుడు

**ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥**

**అన్యేత్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥**

పరమాత్మను తనయందున్నవానినిగా శుద్ధమనస్సుతో కూడి ధ్యాన యోగముచేత కొందరున్ను, మరికొందరు సాంఖ్యముచేతను, ఇక కొందరు యోగముచేతను, మఱియు కొందరు కర్మయోగముచేతను చూచుచున్నారు యోగమందు భక్తియోగము అంతర్భూతమై యుండుటవలన ప్రత్యేకముగా నిచట భక్తియోగమునుగురించి పేర్కొనలేదు పై జెప్పబడిన ధ్యాన, సాంఖ్య, యోగ, కర్మయోగములవలన తెలిసికొనజాలని వారలగు నితరులు, జ్ఞానులగు నితరులవలన ఉపదేశమును పొంది, లేక శ్రవణముజేసి ఉపాసనజేయుదురు అట్లు వినుటయందాసక్తి గలవార్లు కూడ మృత్యురూపమగు సంసారసాగరమును దాటి ముక్తిని పొందుదురు గీతయెంత విశాలభావమును పొందియున్నదో, దీనివలన గ్రహించు కొనవచ్చును

గీత జ్ఞానయోగమునుగూర్చి చెప్పినది చూడుడు

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥**

ఈ లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పవిత్రమైనదియు మరియొకటి లేదుగదా! అట్టి జ్ఞానమును కాలక్రమముచేత లెస్సగా యోగసిద్ధిని పొందినవాడు తనయందు తనంతటనే పొందుచున్నాడు యోగమును గూర్చి

**యుంజన్నేవం సదాఽఽఽత్మానం యోగీ నియతమానసః ।**
**శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

మనోనియమముగల యోగి, యెల్లప్పు డాత్మను పరమాత్మ యందైక్యపరచి ధ్యానించెడు అలవాటుగలవాడై బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమే అంత్యముగా గలదియు, నాయందుండు నట్టిదియు నగు ప్రకృతి శమించిన నిర్వాణమగు మోక్షమును పొందుచున్నాడు

భక్తియోగమును గూర్చి

**భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥**

జీవుడనన్యమైన భక్తిచేత నే నెవడైనదియు, ఎట్టివాడ నైనదియు యథార్థముగా నెరుంగుచున్నాడు అట్లెరుంగుటవలన నన్ను నిజముగా తెలిసికొనినవాడై, పిమ్మట నాలో ప్రవేశించుచున్నాడు (ఐక్యమగుచున్నాడు లేక నా స్వరూపమగుచున్నాడు)

కర్మయోగమును గూర్చి

**తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।**
**అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥**

ఫలాభిలాషనువదలి విధిచోదితమైన కర్మమునుచేయువాడు పరమపురుషార్థమగు మోక్షమును పొందును కనుక నీవు ఫలాభిలాషను వదలి చేయదగిన కర్మమును చేయుము

ఇపుడు ఈ నాలుగు యోగములచేతను పొందబడునది ఒకే మోక్షమని భగవంతుని మతము తక్కిన 14 అధ్యాయములున్ను ఈ నాల్గింటి ననుసరించియే యుంటున్నవి దీనినిగూర్చి ఆలోచించి చూచిన, ఏది యెక్కువ ఏది తక్కువయని

ఎవరు నిర్ణయించగలరు? ప్రజ్ఞానిధులు ఆలోచించుకొందురుగాక

మోక్షసౌధమునకు ఈ నాల్గున్ను నాలుగు స్తంభములవంటివి ఆలాగున ముక్తియను కామధేనువునకు ఈ నాలుగు యోగములున్ను నాలుగు పాదములవంటివి మంటపమును ధరించుటలో స్తంభచతుష్టయ మేలాగున సమానభారము వహించుచున్నదో, దానియందు ఒకటిహెచ్చు ఇంకొకటి తక్కువయని నిర్ణయించుటకు లేదో, అదేరీతిగా కామధేనువు యొక్క పాదచతుష్టయమున శ్రేష్ఠా శ్రేష్ఠముల నిరూపించుటకు లేదో ఇదియు నటువంటిదే

5 అధ్యక్షుడు మరియొక విషయములోకూడ జాగ్రత్త వహించవలసియుండును అదేమన తానెక్కువ సమయమును తీసికొని, తక్కిన యుపన్యాసకులకు కావలసిన సమయమును నివ్వకపోవుటయు ప్రమాదమే ఇతర ప్రబోధకులలోకూడ కొందరికి నెక్కువ కాలము, మరికొందరికి తక్కువకాలమును ఇచ్చినచో అదిన్ని పక్షపాతమని గ్రహించుకొనవలయును అయితే విషయముయొక్క గాంభీర్యమునుకూడ చూచుకొని కాలము నివ్వవలసియుండును ఈలాటి కార్యము లన్నిటిని సమరసపరచుటలో అధ్యక్షుడు తనబుద్ధి నెంతో వినియోగపరచవలసియుండును

6 ఇదివరలో చెప్పినవన్నియు మతసంప్రదాయము ననుసరించినవి ఇక రాజకీయ విషయములోగాని, ఏదైనా ఒక సంస్థను స్థాపించు విషయములోగాని ఉపన్యాసకుల యొక్కయు, అధ్యక్షుని యొక్కయు అభిప్రాయములను చెప్పుకొనవచ్చును తర్వాత అందరున్ను సమాలోచన చేసికొని భూరిపక్షమును నిర్ధారణచేయుటయు సమంజసమే



# భవరోగము

## భి ష జె   భ వ రో గి ణా మ్

మానవునకు రెండు దేహములు గలవు 1 స్థూలదేహము, 2 సూక్ష్మదేహము, స్థూలదేహ మందరికిని తెలిసినదే సూక్ష్మదేహము, సంకల్పదేహము, ఆత్మదేహము-ఇవన్నియు జీవాత్మకు సంబంధించినవి దీనికే మనోవ్యాధియనికూడ పేరుగలదు కారణదేహము మరియొకటి గలదు అది వ్యావహారికముతో సంబంధించినది గాదు అప్రాకృతము ఇది వేదాంతులకు సంబంధించినది దీనిని పై జెప్పిన రెండు దేహములతో జేర్చదలచలేదు ఇది బ్రహ్మజ్ఞానసంబంధ విషయము స్థూలదేహమునగల రోగ నివృత్తికొఱకు భిషగ్వరు లెట్లేర్పడియున్నారో, ఆలాగున మానసికవ్యాధి నివృత్తికొఱకు భవరోగవైద్యులుకూడ గలరు కనుకనే మొట్టమొదట శ్రీదక్షిణామూర్తులవారిని "భిషజే భవరోగిణామ్" అని ఋషులు స్తోత్రము జేసిరి అనగా భవరోగులకు వైద్యులుగా నుండువారు శ్రీ దక్షిణామూర్తులవారు వాత పిత్త శ్లేష్మ ప్రకోపములవలన స్థూలశరీరమునకు వ్యాధులు సంభవించును ఆలాగున సత్త్వరజస్తమస్సులను మూడు గుణముల వైషమ్యమువలన మనోవ్యాధులు జీవునకు గలుగుచుండును ప్రభుత్వమువారు ప్రాపంచికవిషయములకు సంబంధించిన వారగుటచే ప్రపంచజనులయొక్క శరీరారోగ్యమునకు సంబంధించిన ఆస్పత్రులను, డాక్టరులను, మందులను మాత్రమే చూచుచుందురు ఇది భౌతిక శరీరమునకు సంబంధించిన రోగమునుండి మాత్రమే విముక్తిని గలుగజేయును అయితే యిదియు నవసరమైనదే కాని జనులను ఎంత ఆరోగ్యవంతులనుగా జేసినను, వారు మృత్యువునుండి తప్పించుకొనజాలరు మరల ఆ జీవులయొక్క కర్మల ననుసరించి జననమరణములు తప్పక కలుగుచునే యుండును ఆరోగ్యమును గలుగజేయుటవలన తాత్కాలిక దుఃఖశాంతి గలిగినను, జననమరణ దుఃఖరహితమగు శాశ్వతానందము భవరోగ నివృత్తివల్లనే సిద్ధించును అది జీవునకుగల త్రిగుణములచే ఏర్పడినదగుటచే త్రిగుణములకు మూలమగు అజ్ఞానము, కర్మ, అవిద్యానివృత్తివలన మాత్రమే సిద్ధించును

వృక్షముయొక్క మొదట నీరుపోసిన ఎట్లు శాఖోపశాఖలకుగాని, ఫలపత్రములకుగాని జలము పోయవలసిన యవసరముండదో, శాఖోపశాఖా

ఫలపల్లవ పుష్పలతాదులకు నీరుపోసినను, మూలములో నీరుపోయకపోయిన అది యేలాగున నిరుపయోగమో, ఆలాగున అజ్ఞానమునకు మూలమగు జీవునకుగల భవరోగమును నివృత్తి చేయకపోయిన శాశ్వతమైన సౌఖ్యము నెవరును పొందజాలరు అయితే ప్రాకృతజనులు ఎక్కువగుటచేతను, ప్రభుత్వమువారు కూడ అట్టివారగుటచేతను దేహారోగ్యమునకు తగిన పనులనే ఎక్కువగ చేయుచుందురు భవరోగ వైద్యులగు బ్రహ్మవేత్తలు, సాధుపురుషులు తక్కువగుటచేత జీవునకుగల అవిద్యారోగమును రహిత మొనర్చుటలో యత్నించు వారరుదైరి ఒకవేళ వ్యావహారిక జనులు ఎక్కువగా నుండుటచేత వారి దేహారోగ్యమునకు తగిన ఆస్పత్రు లెక్కువగా జేసినను అవిద్యారోగనివృత్తికొఱకు ఆధ్యాత్మిక జ్ఞానసంస్థలనుకూడ కొంతవరకైన ఉండేలాగున జేయుటలోను ప్రయత్నముకలవారై యుండవలెను అపుడే జనులు నిజమైన శాంతిని, సౌఖ్యమును పొందగలరు అదేవిధముగా ప్రపంచజనుల కుపయోగకరమగు విద్యాలయములను వృద్ధిపరచుటలో ప్రభుత్వమువారు శ్రద్ధ తీసుకొనేలాగున ఆధ్యాత్మిక విద్యకు సంబంధించిన ఆశ్రమములను, బ్రహ్మవిద్యా పాఠశాలలను అభివృద్ధికి తెచ్చునప్పుడే నిజముగా విద్యయొక్క ప్రయోజనమును లోకము పొందగలుగును కావుననే శ్రీకృష్ణభగవానుడు "అధ్యాత్మవిద్యా విద్యానామ్" అని యుపదేశించెను విద్యయొక్క స్వరూపము అవిద్యను రహిత మొనర్చుటయను తత్త్వమును చాలమందిన్ని మరచిపోయిరి నిజమైన విద్యాస్వరూప మెట్టిదో యీ శ్లోకము తెలుపుచున్నది

**విద్యయా చ యయాఽవిద్యా ప్రభయా చ యధా తమః ।**
**నశ్యతి బ్రహ్మవిద్యా సా తేజో రూపా చ నేతరా ॥**

ప్రకాశముచేత నేలాగున చీకటి నశించునో, ఆలాగున ఏ విద్యచేత అవిద్య రహితమగునో అదే విద్యయొక్క నిజమైన అర్థము అది బ్రహ్మవిద్య ఒక్కదానివల్లనే గలుగును ఇతర విద్యలవలన గలుగదు

**సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

సత్త్వగుణమనియు, రజోగుణమనియు, తమోగుణమనియు పేర్లు గల యీ

మూడు గుణములు ప్రకృతిసంభవములు శాశ్వతమై, శుద్ధమై, జ్ఞానమైన ఆత్మను పై త్రిగుణములు బంధించుచున్నవి ఇవే సంసారబంధమునకున్ను, అజ్ఞానరోగమునకున్ను కారణములైనవి ఈ గుణము లనేక విధములుగా నున్నట్లు గీతయందు శ్రీ కృష్ణభగవాను డుపదేశించెను వీటి నుండి విముక్తి గలుగుటయే భవరోగ విముక్తియని గ్రహించుకొనవయును అదెట్లు నివృత్తియగునో యీ క్రింది శ్లోకముచే నిరూపించడమైనది

**గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ।**

జీవుడు దేహోత్పత్తికి కారణభూతములైన పైన జెప్పబడిన సత్త్వరజ స్తమోగుణముల నతిక్రమించి పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖము మొదలగువానిని చెందక అనగా జీవన్ముక్తుడై నాలో నైక్యము నొందుచున్నాడు ఈ మూడు గుణములనుండి విముక్తిని పొందుటయే భవరోగమునుండి విమోచనము గలుగుటయు, సంసారపాశములనుండి విడుదల గలుగుటయు నగును ప్రభుత్వమువారు దేహసుఖమునకు సంబంధించిన వైద్యాలయములనే చూచుచున్నారనియు, ఆత్మసుఖమునకు సంబంధించిన బ్రహ్మవిద్యాలయములలో శ్రద్ధయుంచుట లేదనియు, పై నుదాహరించినదానిలో సంపూర్ణముగ రాజకీయవేత్తలను మాత్రము నిందించి ప్రయోజనము లేదు సన్న్యాసులలోను, సాధువులలోనుకూడ కొంత లోపమున్నది అందువలననే భవరోగ నివృత్తిపరమగు బ్రహ్మవిద్యాలయముల కొరత గలిగియున్నది సాధువులలో, సన్న్యాసులలో విద్యవంతులును, తపస్సంపన్నులున్ను చాల అరుదైరి అందువలన పార్లమెంటు సభలలోను, మంత్రుల స్థానము లోను ప్రవేశించి ఆధ్యాత్మిక జ్ఞాన ప్రయోజనమునుగురించి చెప్పేవారుకూడ లేకపోయిరి ఇదిన్ని బ్రహ్మవిద్యా పతనమున కొక ముఖ్యకారణము సాధువులలో, సన్న్యాసులలో నిపుణులుండి, మంత్రులస్థానము నధిష్ఠించియుండినచో ఆత్మశుద్ధిచేత, ఆత్మజ్ఞానముచేత గలిగెడు ప్రయోజనమును సభలలో తెలిపియుండిన తక్కిన మంత్రులందరును తప్పక అంగీకరించి బ్రహ్మవిద్యాభివృద్ధికిని, బ్రహ్మనిష్ఠుల, బ్రహ్మచారుల ఉన్నతికిని తప్పక

ప్రయత్నము చేసియే యుందురు

మన భారదేశము నాస్తికముకాదు మంత్రిప్రవరులుకూడ ఆస్తికులే అయితే వారికి అధ్యాత్మిక జ్ఞానశక్తియొక్కయు, దానిచే గలిగెడు ప్రయోజనము యొక్కయు సంగతి తెలుపువారియొక్క కొఱతయేగాని, మరి యేయొక కొరతయు లేదు రామమోహనరాయ్‌గారు, దయానందసరస్వతిస్వామిగారు మొదలగు ఆత్మవేత్తలు రాజకీయవిషయములలో ప్రవేశించి మంత్రి ప్రముఖుల మనస్సును త్రిప్పివేసిన కారణముచేతనే బ్రహ్మసమాజము ఆర్యసమాజము ఉన్నతస్థితిలోనికి వచ్చుటకు కారణమైనది కావుననే శ్రుతియు నీలాగున తెలుపుచున్నది "విద్యా తపోభ్యాం పూతాత్మా" విద్యాతపస్సులచే మాత్రమే ఆత్మనిర్మలత్వము, ఆత్మవిముక్తి గలుగునని తెలుపుచున్నది స్వరాజ్యము వచ్చినందుచే ప్రజలక్షేమమును చూచుటయే ప్రభుత్వముయొక్క కర్తవ్యమై యున్నది అందువలన అధ్యాత్మజ్ఞానముచే బ్రహ్మవిద్యచే జీవులయొక్క భవరోగము నశించవలెనని బోధించుటయు, ఆలాగున అవిద్య నశించినవారిచే గలిగెడు ప్రయోజనము చూపుటయు గలిగియుండిన తప్పక బ్రహ్మవిద్యకొఱకు, తపస్సంపత్తికొఱకు ప్రభుత్వము సహాయపడకపోదు ప్రభుత్వము ప్రజల చేతులలో నుండుటవలన ప్రజల యభిప్రాయము ననుసరించియే ప్రభుత్వము ప్రవర్తించవలసి యుండునేగాని, ప్రజల ఆశయమును తిరస్కరించిన మరల ప్రభుత్వమే యుండదు కావున సన్న్యాసులు, సాధువులు బ్రహ్మవిద్యచే గలిగెడు ప్రయోజనమును ప్రజలకు గలిగేలాగున ప్రవర్తించిరేని తప్పక బ్రహ్మవిద్యాభివృద్ధికి తగిన యేర్పాట్లను ప్రభుత్వము చేయగలుగును

అయితే ప్రభుత్వము సోమరులను పోషించుట కేర్పడినది గాదు కాలము యొక్క పరిణామమునుగూడ సాధువులు, సన్న్యాసులు గ్రహించుకొని ప్రవర్తించవలసియుండును కేవలము సన్న్యాసులకు, సాధువులకు, బ్రాహ్మణులకు భోజనము పెట్టిన పుణ్యము గలుగునని తలంచెడు కాలమంతయు కాలగర్భములో కలిసిపోయినది ఇప్పుడో సన్న్యాసి లక్షణమేమి? సాధువు చేయవలసిన పనియేమి? బ్రాహ్మణు డెట్టిలక్షణము గలిగియుండవలెను? అను వివేక జ్ఞానభాస్కరుడు ప్రతివారి హృదయములోను నుదయమాయెను ఇక నంధవిశ్వాసమున కవకాశము

లేదని సన్న్యాసులు, సాధువులు, బ్రాహ్మణులు బాగుగ గ్రహించుకొనవలసిన కాలమాసన్నమైనది అన్ని జాతులలోగల స్త్రీ పురుషులకు విద్యావికాసము కొంతవర కేర్పడినందుచే శాస్త్రములను చదివి ఎట్టి లక్షణములుగలవాడు సన్న్యాసి, సాధువు, బ్రాహ్మణుడు అని అందరున్ను చాలవరకు తెలిసికొనిరి అందువలన శాస్త్రములలో నిర్ణయించిన లక్షణములుగల సన్న్యాసులకుగాని, సాధువులకుగాని, బ్రాహ్మణులకుగాని గౌరవము, పూజ్యత అధికరించినదేగాని ఏమాత్రము తగ్గలేదు వేషధారులకు, మోసకారులకు మాత్రము గౌరవ, పూజ్యతలు లేకపోయినవేగాని తక్కినవారి కేలోపమున్ను గలుగలేదు

ఇదివరలోనుండిన బుద్ధదేవుడు, ఏసుక్రీస్తు, మహమ్మదునబీ, గురునానక్, ఆదిశంకరాచార్యులు, వివేకానందస్వాములు మొదలగువారి గౌరవమునకు, పూజ్యతకు నేలాటి కొరతయు గలుగలేదు వారి గౌరవము శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధిని పొందుచున్నదేగాని, కృష్ణపక్ష చంద్రునివలె క్షయమునొందలేదు ఇప్పుడుకూడ పూర్విక ఋషులవలె నుండువారికి ఎంత గౌరవము లోకములో గలదో చూచుకొనవచ్చును ఇది ముఖ్యముగా ఆధ్యాత్మిక విద్యయందు ప్రవృత్తిగల ప్రతి స్త్రీ పురుషులున్ను, జాగ్రత్తతో చూచుకొనవలసిన విషయము కావుననే శ్రీ శంకరాచార్య లీలాగున వచించిరి "హరత్యవిద్యా విక్షేపాన్ రోగానివ రసాయనమ్" దివ్యౌషధములచే శరీరవ్యాధి నశించునట్లు అధ్యాత్మజ్ఞానముచే అవిద్యారూపమైన భవరోగమున్ను తప్పక నశించును సంగ్రహముగ భవరోగ నివృత్త్యుపాయము చెప్పడమైనది ఇంతవరకు చెప్పిన దానియొక్క సారమేమన, ప్రభుత్వమువారు జనుల ఆరోగ్యము కొఱకు అచటచట ఆస్పత్రులు ఏర్పరచినట్లు అధ్యాత్మజ్ఞానోన్నతికి తగిన ఆశ్రమములను బ్రహ్మవిద్యామందిరములను ఏర్పరచినప్పుడే మానవులలోగల భవరోగము శమించి హృదయనిర్మలత్వము ఆత్మశాంతియు గలిగి అందరును ధన్యాత్ములగుదురు అప్పుడే మానవజన్మము లభించినందుకుగల దైవసుఖమును పొందగలరు

పై నుదాహరించినట్లు ప్రాపంచికజను లెక్కువగుటచేతను, ఆత్మనిష్ఠులు తక్కువగుటచేతను ఆస్పత్రులవలె బ్రహ్మవిద్యకు సంబంధించిన స్థాపనలు

ఎక్కువగా లేకపోయినను, అచ్చటచ్చటైనా తప్పక యుండవలెను ఆస్పత్రులుండే ప్రదేశములోగల జను లేలాగున ఆరోగ్యవంతులై యుంటున్నారో, ఆలాగున ఆధ్యాత్మిక జ్ఞానసంబంధ స్థాపనలు, బ్రహ్మజ్ఞానసంపన్ను లుండినచో, మానసిక భవరోగ దుఃఖము లుపశమించి జనులందరు ఆనందభరితులై యుందురు అట్టి ఆస్పత్రులులేని స్థలములలో జనులు రోగబాధితులై దుఃఖమును పొందునట్లు బ్రహ్మవిద్యాసంబంధ స్థాపనలు లేనిప్రదేశము ఆధ్యాత్మిక జ్ఞానసంస్థలున్ను, బ్రహ్మనిష్ఠాపరాయణులున్ను కొఱతగల ప్రదేశములలోనుండు ప్రజలు భవరోగముచే తప్పక తప్తులగుదురు ఒకరికి శరీరారోగ్యము మాత్రము గలిగి మానసిక సూక్ష్మశరీరము చెడినచో అతడేలాగున శరీరారోగ్యముచేతను ధనముచేతను గలిగిన మానవసౌఖ్యమును పొందజాలడో, ఇదిన్ని అటువంటిదని మరువకూడదు బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యు లుండినచో చాలవరకు ప్రజలే సహాయము చేయుదురు అయితే ప్రభుత్వమువారు బ్రహ్మనిష్ఠులకు సంబంధించిన ఆశ్రమముల, మఠముల ఆధ్యాత్మక జ్ఞానసంస్థలకు ఇదివరలో గలిగియుండు భూమి మొదలగు ఆస్తులను విచారణచేయక అంధప్రాయముతో స్వాధీనము చేసికొనుటచే కూడ బ్రహ్మవిద్యకొక గొప్ప ఆటంకము గలిగినది

సాధువులదేమి, సన్న్యాసులదేమి, గృహస్థులు, జమీందారులు, రాజులు ఏర్పరచియుండు ధర్మసంస్థలన్నిటినిన్ని విచారణచేయక ప్రభుత్వము స్వాధీనము చేసుకొనకూడదు ఏలన ఇదివరలో ఆత్మజ్ఞానోన్నతి కొఱకు నుత్సాహభరితులై ప్రవర్తించువారికి నిరుత్సాహము గలిగెను ఇక మీద ఆధ్యాత్మిక విద్యను వృద్ధిపరచుటకు తగిన సంస్థల నేర్పరచినను ప్రయోజనము లేదను సంకల్పము వారికి గలిగెను అదియునుగాక ప్రజలు, భక్తులుకూడ ఆశ్రమములను, మఠములను వృద్ధిపరచినను ప్రయోజనమేమి? ఏలాటి విచారణచేయక ప్రభుత్వమువారు ఆధ్యాత్మిక జ్ఞానసంస్థలను వశపరచుకొనుచున్నారను భావము ప్రజల హృదయములలో గాఢముగా నాటిపోయెను ఇదియును ఆత్మవిద్యకు గొప్ప ఆటంకమును గలుగజేసెను అయితే దీనియందు కొంత లోపము సన్న్యాసులలో సాధువులలో కూడగలదు దీనిని ప్రభుత్వమువారు తెలిసికొనియే ఆధ్యాత్మిక సంస్థల వశమొనర్చుకొనుటకు కారణమగుచున్నది వారి వాదమేమన ప్రజోపయోగము

కొరకుగదా ఆధ్యాత్మిక సంబంధ మఠములు, ఆశ్రమములు నేర్పడినవి ఇప్పుడు ప్రజలక్షేమముకొఱకు మఠాధిపతులేమి చేయుచున్నారని ప్రశ్నింతురు ఈ వాక్యములోకూడ సంపూర్ణ సత్యము లేకపోలేదని చెప్పదగదు అయితే అన్నిసంస్థలు ఆలాగున నుండునని తలంచక ప్రతిసంస్థను పరిశోధించి ఎంతవరకు ఆ సంస్థవలన ప్రజోపయోగము గలుగుచున్నదో, అదియు నాలోచించుకొనక ప్రభుత్వము స్వాధీనము చేసికొనుట అక్రమము, అధర్మము



# ధర్మాతిక్రమణము

పై మాటకు శాస్త్రాతిక్రమణమనియు పేరుగలదు శ్రీ కృష్ణభగవానుడే గాక, శాస్త్రవేత్తలందఱును ఈ క్రిందివిధముగానే చెప్పిరి గీత-

**యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

ఎవడు శాస్త్రోక్తవిధిని విడిచిపెట్టి స్వేచ్ఛగా ప్రవర్తించుచున్నాడో వాడు సిద్ధిని పొందడు సుఖమును పొందడు సర్వోత్కృష్టమగు ముక్తిని కూడ పొందడు

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥**

కాబట్టి కార్యాకార్యముల నిర్ధారణచేయుటయందు నీకు శాస్త్రము ప్రమాణమగును శాస్త్రమునందు చెప్పబడినదానిని తెలిసికొని ఈ ప్రపంచమునందు కర్మను చేయుటకు తగుదువు

సాక్షాత్ శ్రీ కృష్ణభగవానుని అవతారము ధర్మసంస్థాపన కొరకని నాల్గవ అధ్యాయములో స్వయముగానే తెలిపిరి

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" ఇదియే దానికి ప్రమాణము. అయితే 18-వ అధ్యాయమున

**సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

సమస్త ధర్మములను విడిచి నన్నొక్కనిని మాత్రము శరణుబొందుము, నేను నిన్ను సర్వపాపములనుండి విముక్తుని చేసెదను దుఃఖింపకుము

ఇచ్చటనే ధర్మరహస్యము, ధర్మకీలకమున్ను గలదు, పైన నిరూపించిన యీ రెండు వాక్యములున్నూ పరస్పర విరుద్ధములుగా మేధాసమ్పన్నులకు తోచకపోదు, కావున దీనినెటుల సమన్వయపరచగలరు సమన్వయపరచకపోయిన పూర్వాపరవైరుధ్ధ్యము సంభవించును ఇదియే దీనిలోని రహస్యము. "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణవ్రజ" అనునదియే దీనిలోగల రహస్యము అన్ని ధర్మములను త్యజించి పాషండుడై నాస్తికుడై యుండవలయునని దీని యందర్థములేదు కావుననే "మాం ఏకం శరణం వ్రజ" అని ప్రయోగించిరి భగవంతు నొకనిని శరణుపొందే విషయములో దాని కడ్డుగా వచ్చెడు ఇతరములగు సామాన్యధర్మములను విడిచిపెట్ట వచ్చుననియే దీనిలోగల రహస్యము కాబట్టియే గీతయొక్క ఋష్యాది న్యాసములలో ఈ శ్లోకముయొక్క రెండుపాదములలో మొదటిదానిని గీతయొక్క శక్తియనియు, రెండవదానిని గీతయొక్క కీలమనియు తెలిపిరి కీలక మనగా మర్మమని భావము

"సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతి శక్తిః" అనియు, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ ఇతి కీలకమ్" అనియు ఈలాటి రహస్యవాక్యములు మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములలో ననేకములు కన్పట్టుచున్నవి

**జప్యేనైవ తు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః ।**
**కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥**

బ్రహ్మనిష్ఠుడు ప్రణవజప మొకదానిచేతనే మోక్షసిద్ధిని (ఆత్మసిద్ధిని) పొందగలుగును ఇతరములయిన ధర్మములను చేసినను సరియే, త్యజించినను సరియే అని మనువు ధర్మశాస్త్రముల కన్నిటికిని ఆద్యమయిన మూలమయిన

మనుస్మృతియందు తెలిపెను

ఇక నీలాగున నొక్కొక్కదానిని నిరూపించవలసి యుండిన వ్యాసము చాలాపెరుగును అందువలన మానివేయడమైనది శ్రీ వైష్ణవులు "సర్వధరాన్పరిత్యజ్య" అను శ్లోకమును చరమశ్లోకమని చెప్పుదురు ఇదియే శ్రీకృష్ణ భగవానునియొక్క అన్తిమ సందేశమనియు, శ్రీ కృష్ణాశయమనియు వచింతురు వైష్ణవులకు శ్రీమదష్టాక్షరీ మహామన్త్రము (తిరుమన్త్రము) ఎటువంటిదో ఈ చరమశ్లోకమునకును అంత ప్రాధాన్యము గలదు దీనికి శ్రీ రామానుజాచార్యులవారు గొప్ప భాష్యమును వ్రాసియున్నారు ఇది ప్రపన్నులు తదేకనిష్ఠగలవారు పరబ్రహ్మ నిష్ఠులయినవారిని గురించి చెప్పినదని మరువకూడదు ఇది యెటువంటిదనగా ఒక వృక్షము యొక్క మూలములో జలముపోసిన మాత్రముచేతనే శాఖోపశాఖా ఫలపుష్ప పల్లవాదులు ఎటుల వృద్ధినొందునో అట్టిది ధర్మము లన్నిటికిని మూలమగు పరమాత్మను పరబ్రహ్మమును ఒకనిని ధ్యానించిన చాలును కావుననే "సర్వధర్మమయో హరిః" అని తెలిపిరి భగవన్నిష్ఠ యొక్కదానిని చేయక తక్కిన ధర్మములనుమాత్ర మెన్నిజేసినను అది వృక్షమూలమున జలసేచనము చేయక శాఖోపశాఖల తడిపినట్లుండును మఱియు గంగాతీరములో తపమొనరించువానికి ప్రపంచములోగల గుంటలు, బావులు, చెరువులు, కాలువలు వీనిలోగల జలముచే నేమి ప్రయోజనము? సూర్యుని సన్నిధిలో వాలఖిల్యులు మొదలగు మునులకు దీపములు గావలయునా! వారికి చీకటిచే భయము గలుగునా! కల్పవృక్షముక్రింద గూర్చొన్నవానికి ఇతరములగు వృక్షఫలముల ఆశ్రయము కావలయునా! కామధేనువుయొక్కసన్నిధానములో సదా యుండువానికి ఇతరపశువులతో సంబంధ ముండవలయునా!

మఱియు సర్వధర్మముల త్యజించి యూరకే యుండుమని చెప్పలేదు కనుకనే నిరన్తరము భగవద్ధ్యానమందు బ్రహ్మనిష్ఠయందు యుండువానిని గురించి భగవానుడు తెలిపెనని మరువకూడదు క్రింది ఉద్యోగియొక్క సేవకుడు ఆ పనిని మాని ఉన్నతోద్యోగియొక్క ఆజ్ఞానుసారముగా ప్రవర్తించిన క్రింది ఉద్యోగి ఆ సేవకుని ఎటుల ద్వేషింపజాలడో, ఉన్నతోద్యోగియొక్క ఆజ్ఞను పాలింపక క్రింది

ఉద్యోగియొక్క ఆజ్ఞానుసారము ప్రవర్తించిన అదెటుల నిన్ద్యమగునో, ఆలాగున పరమధర్మమగు భగవన్నిష్ఠకొఱకు మోక్షవిషయమగు తపస్సు మొదలయినవానికి భంగకరములయిన ఇతర ధర్మముల నుపేక్షించుటలో దోషమేమియు లేదు గంగాస్నాన మొకటి జేసిన సర్వతీర్థస్నాన ఫలమేలాగున గలుగునో, గంగాస్నానముమాత్రము జేయక ఇతర తీర్థయాత్ర లెన్నిజేసినను తీర్థస్నానఫల మేలాగున పూర్తిగ పొందజాలడో ఈ ధర్మము గూడ నట్టిదే సర్వధర్మములు, గుణములు, భగవంతుడు (పరబ్రహ్మము) గుణి గుణినాశ్రయించిన గుణములన్నియు స్వవశములు సార్వభౌముని అనుగ్రహము గలవానికి క్రింది ఉద్యోగస్థుల ఆశీర్వాద మెటులవసరము లేదో, ఉద్యోగస్థు లందఱి ప్రీతికి పాత్రుడైనను సార్వభౌముని అనుగ్రహమునకు దూరుడైన ఎటులుండునో ఈ ధర్మరహస్యముకూడ ఆలాగున ఉన్నది అయితే ఇది అందఱికిని సంబంధించినది గాదు కావుననే "మామేకం శరణం వ్రజ" అని గీతయు, "జప్యేనైవతు" అని మనువున్ను ప్రయోగించుటకు కారణము

శాస్త్రములలో ధర్మము ముఖ్యమనియు, గౌణమనియు గలదు బ్రహ్మప్రాప్తి కొఱకు భగవత్ప్రాప్తి కొఱకుమాత్రము ఆటంకములుగా వచ్చెడు గౌణధర్మము లన్నిటిని త్యజించుటలో భయపడ నవసరములేదు ఇది అగ్నిపరీక్షవంటిది రోగియైనవాడు ఇక బ్రతుకునా లేదా అని సంశయము గలుగునప్పుడు వైద్యుడు గరళము పోసినటులుండును దీనిని అన్త్యకాలమున భిషగ్వరులు ప్రయోగింతురు ఆలాగున మోక్షమొకటి సిద్ధించిన చాలును ఆ విషయములో ప్రాణమునుగూడ తృణీకరించదగిన వైరాగ్యపురుషున కొకనికిమాత్రమే ఈ ధర్మము జెల్లును ఇట్టి విషయములో గురవాక్యమునైనను, మాతాపితరుల ఆజ్ఞనైనను త్యజించుటలో వెనుదీయ నక్కఱలేదు అట్టివాడీజన్మములోనే మోక్షమునొంది బ్రతుకుటయో లేక చచ్చుటయో అని గల ఘోరవ్రతమును ధరించియుండవలయును అట్టి దైవప్రాప్తిని ముక్తిని పొందినచో మాతాపితరులేగాక గురుదేవుడుసహా ఆట్టి విరాగ పురుషుని దగ్గఱకు వచ్చి తాము చేసిన ఆటంకములను గురించి పశ్చాత్తాపపడుదురు, ఆశీర్వదింతురు, ప్రేమాలింగనము చెసికొనెదరు, ఆనందబాష్పముల జడివానలను

కురిపింతురు, రోమాంచిత గాత్రులగుదురు, గద్గద స్వరము గలవారగుదురు, తన్మయు లగుదురు, మౌనము వహించి స్తబ్ధులగుదురు మమ్ములను, మా వంశములను, లోకమునుగూడ నుద్ధరించుటకు పుట్టినవాడ వనుచు నుద్ఘోషింతురు

అయితే, ఇట్టి భగవత్ప్రాప్తి, మోక్షము ఒక్కదానికి మాత్రమే ఈ ఘోరవ్రతమును బూనవలయును గాని అట్లు గాకపోయిన మాతాపితరుల గురువరేణ్యుల వాక్యముల నతిక్రమించగూడదు వారల అనుగ్రహమువలన వీనికి శ్రేయస్సు గలుగును ఇది యెటువంటి తీక్ష్ణ పరీక్షయో, ఈ అగ్నిపరీక్షయం దుత్తీర్ణులయిన వారెవరో, వారలలో కొందరి పేరులను మాత్రము క్రింద నిరూపించెద విభీషణుడు శ్రీరామతారక పరమాత్మయొక్క అనుగ్రహమును పొందుటలో అన్నదమ్ములను, తల్లిని, రాజ్యమునుగూడ త్యజించెను ప్రహ్లాదుండు శ్రీమన్నారాయణుని కరుణను పొందుటలో తల్లిదండ్రుల వాక్యములనుగూడ తిరస్కరించెను భీష్మాచార్యులు తన ధర్మసంరక్షణయందు గురుదేవుడయిన పరశురాముని వాక్యములను దూరీకరించెను బలిచక్రవర్తి తాను చెప్పిన వాక్యములను పరిపాలించుటలో, ఆత్మగురువగు శుక్రాచార్యుల వచనముల నుల్లంఘించెను శ్రీ గౌతమబుద్ధుడు తండ్రియగు శుద్ధోదనుని, పోషించిన తల్లియగు మహాగౌతమిని, శరత్కాలచంద్రునివంటి శాంతగుణముగల ధర్మపత్నియగు యశోధరను, పసిపిల్లవాడగు ఆత్మపుత్రుడగు రాహులుని, కపిలవస్తువగు తన రాజ్యమునుగూడ తృణీకరించి పరమనిర్వాణస్థితిని పొంది లోకములో గల హింసాది పాపములను నివర్తించుటకు, నిర్వాణమగు పరమశాంతికొఱకు అర్ధరాత్రియందు అన్తఃపురమును విడిచి అరణ్యమునకు బయలుదేరెను ఆలాగున ఆ కాలపు యూదుల బాధలను సహింపజాలక వేడుకొనిన శ్రీ యేసుక్రీస్తు తనయొక్క జోసెఫ్, మరియా యను తల్లి దండ్రులనుకూడ విడవాడి దైవప్రాప్తికై అరణ్యమునకు పారిపోయెను ఆలాగున మహమ్మదు నబీయు క్రూరులయిన అరబ్బీలయొక్క బాధలను సహింపజాలక తనవారందఱిని విడిచి, దేవుని ఆజ్ఞను పాలించుటకై ఎడారిలోని హిరాన్ కొండగుహలోనికి పారిపోయెను ఆ విధముగానే శ్రీ గురునానక్కున్ను భార్యాపుత్రులను తన దేహసంబంధస్థులను ఉద్యోగమును గూడ

పరిత్యజించి జ్ఞానప్రాప్తికై పరుగిడెను శ్రీ శంకర భగవత్పాదాచార్యులు ఏకపుత్రుడై యుండియు, బ్రహ్మప్రాప్తికై లోకోద్ధరణకొఱకు ఆర్యాంబ యను మాతృదేవిని విడిచి నర్మదాతీర గుహలో నుండు గోవిందభగవత్పాదులను గురుదేవుని అనుగ్రహమునకై కేరళమునుండి నర్మదా తీరమువరకును పాదచారియై నడచెను

ఇదేరీతిగా శ్రీమన్నారాయణావతారమూర్తియగు శ్రీ వేదవ్యాసభగవానుని ఏకపుత్రుడగు శ్రీ శుకబ్రహ్మర్షియు, వ్యాసమహాముని వచించిన ధర్మములు, వేదములు వీనిచే తృప్తినొందక, ధర్మాతీతమగు నుపనిషత్ప్రతిపాదితమయిన బ్రహ్మతత్త్వమును గురించి తండ్రియు, గురువునగు శ్రీ వేదవ్యాసులను విడచి మిధిలావతియగు జనకమహారాజువలన సంశయమును నివృత్తిజేసికొని హిమాలయమునకు పయనమయిన సంగతియు జ్ఞాపకముంచుకొనవలయును ఆలాగున యాజ్ఞవల్క్య మహాఋషియొక్క ధర్మపత్నియగు మైత్రేయియు సంసార మంతయు భర్తకప్పగించి తపోవనమునకేగిన విషయమున్ను స్మరణీయము భర్తృహరియు తన అన్నదమ్ములగు భట్టి, విక్రమాదిత్యులను, తల్లిదండ్రులను, ఉజ్జయినీ మహారాజ్యమునున్ను పరిత్యజించి కౌపీనధారియై గంగాతీర హిమాలయ గుహలోనికి అరిగిన గాధయు సంస్మరణీయము

మరియు శ్రీ మీరాబాయియు ధర్మోల్లంఘన చేసినవారిలో మొదటి వారనియే చెప్పవచ్చును ఈ మీరాబాయి రాజపుత్రస్థానమున రాజకుటుంబములో రతన్‌సింగ్ రాంధార్ అనువారికి కుమార్తెగా జన్మించెను భర్తయగు రాణాకుంభను పరిత్యజించి అర్ధరాత్రిలో సౌధాంతరాళమునుండి బయటికివచ్చి మామూలు మనుష్యులు నడిచెడి మార్గమున ప్రయాణము చేయక శ్రీ కృష్ణా యని అరచుచు కంపలు ముళ్ళచెట్లుగల యరణ్యమార్గములో పయనించి బృందావనమున శ్రీకృష్ణ చరణారవిందములను చేరెను మామూలు బాటలో వెళ్ళినచో నెవరైన రాజభటులు వెదకికొనివచ్చి పట్టుకొని వెళ్ళుదురేమోయను భయముతో ఆలాగున చేయుటకు కారణమైనది ఇది అందరకును సంబంధించిన విషయముగాదు చావో బ్రతుకో అని నిర్ధారణ చేయు ఘట్టములో మాత్రము ఉపయోగపరచవలసిన ఆత్మార్పణమగును యుద్ధములో శత్రువులకు అంతిమ సందేశమొకటి పంపే మామూలు గలదు ఇదిన్ని అటువంటిదే

అదేమన లొంగిపోయెదవా? లేకమాతో యుద్ధమునకు వచ్చెదవా? అటువంటి స్థితియే యిదియు నగును కావున శ్రీ మీరాబాయి చరిత్రమును విని సామాన్యముగా స్త్రీలెవరును ప్రవర్తించవలదు ఈ విషయమై శ్రీ నారద భక్తిసూత్రమందు ఈలాగున గలదు

**యథా వ్రజగోపికానామ్ ।**

ఏలాగున గోకులమునందలి గోపికాస్త్రీలు శ్రీకృష్ణ భక్తిగలిగి మైమరచియుండిరో, ఆలాటి తన్మయభక్తి గలిగియుండవలయును అనగా తన్నుగూడ మరచి భగవన్మయమై యుండవలయును

**తత్రాపి న మాహాత్మ్యజ్ఞానవిస్మృ త్యపవాదః ।**

గోపికాస్త్రీలు పామరులవలె దేహబుద్ధిగలవారై శ్రీకృష్ణుని చెందలేదు కేవలము తన్మయులై పరమాత్మభావము గలిగియుండిరి కావుననే లోకాపవాదమును బొందక పోవుటయేగాక లోకస్తుతి కర్హులైరి కావుననే వ్యాసాది ఋషులచేతను, బ్రహ్మాది దేవతలచేతను స్తుతింపదగిన వారైరి ఈ పరమభక్తురాండ్రగు గోపికాస్త్రీలున్ను ధర్మాతిక్రమణము చేసినవారే ఈ విషయమై శ్రీ తరిగొండ వెంకమాంబగారు గీత (అ 9 శ్లో 18) నిరంతరము పఠించుచు తోటి నారీమణుల కుపదేశించుచుండేవారు మనలను, మన భర్తలను, బ్రహ్మాదిదేవతలను, బ్రహ్మాండము లన్నిటిని భరించు ఆ భగవంతుని భర్తగా చేసికొనిన నారీమణులకు మరల వైధవ్య మను దుఃఖము గలుగదు వారు నిత్య సుమంగళులు అని చెప్పుచుండేవారు

**గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।**
**ప్రభవః ప్రలయస్థానం నిధానం బీజమవ్యయమ్ ॥**

గతియును (శరణము), భర్తయు (భరించువాడును), ప్రభువును, సాక్షియును, నివాసమున్ను, ఆశ్రయింప దగినవాడును, ప్రతిఫలమును గోరక ఉపకారమును చేయువాడును, ఉత్పత్తిస్థానమున్ను, లయస్థానమున్ను, ఉండేస్థలమున్ను, శాశ్వత ధనమున్ను, నాశరహితమైన కారణమున్ను ఆ భగవంతుడే

## భాగవతము-గోపికాగీతలు-దశమస్కంధము

చరణ సేవకులకు సంసారభయమును, బాపి శ్రీ కరంబు పట్టుగలిగి
కామదాయియైన కరసరోజంబు మా, మస్తకముల నునిచి మనుపుమీశ!

మగువలయెడ నీ క్రౌర్యము, దగునే నిజభక్త భీతిదమనుడ వకటా
తగదు భవద్దాసులకును, నగుమొగముంజూపి కావు నళినదళాక్షా !

నీ నగవులు నీ చూడ్కులు, నీ నానావిహారణములు నీ ధ్యానంబుల్
నీ నర్మాలాపంబులు, మానసములనాటి నేడు మగుడవు కృష్ణా !

నీ వడవిం బగల్ దిరుగ నీ కుటిలాలక లాలితాస్య మి
చ్ఛావిధి జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నిను గన్నుల నెప్పుడు జూడకుండ ల
క్ష్మీవర రెప్పలడ్డముగజేసె నిదేల విధాత క్రూరుడై !

అక్కట బంధులున్ మగలు నన్నలు దమ్ములు బుత్రకాదులున్
నెక్కొని రాత్రి బోకుడన నీ మృదుగీత రవంబు వీనులన్
వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహమునొంది నాథ నీ
వెక్కడబోయితో యెరుగ మీక్రియ నిర్దయు డెందు గల్గునే ?

కట్టా మన్మధుకోలలు, నెట్టన లోనాట బెగడి నీ పాదంబుల్
పట్టికొనగ వచ్చినమము, నట్టడవిని డించిపోవ న్యాయమె కృష్ణా !

తియ్యవిలుకాడు ఢీకొని, వ్రయ్యలుగా దూరనేసె వనితల మనముల్
వియ్యాన నింకనైనం, గుయ్యాలింపంగదయ్య గోవింద హరీ !

అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం
దనురావేయని చీరియేడువ జగత్త్రాణుండు త్రైలోక్య మో
హనుడై మన్మధ మన్మధుండయి మనోజ్ఞాకారియై హారియై
ఘనపీతాంబరధారియై పొడమె దత్కాన్తాసమీపంబునన్.

శ్రీ యేసుక్రీస్తు బైబిలులో తన అనుచరులతో దైవాజ్ఞకు విరుద్ధమగు

మానవాజ్ఞను పాలింప నక్కరలేదు అని వచించిరి శ్రీ గాంధీగారున్ను ప్రజాపీడితమగు ధర్మవిరుద్ధమైన రాజశాసనము నుల్లంఘించవచ్చునని ప్రజలకు దెలిపియే సత్యాగ్రహము నారంభించిరి ఇది లోకవిదితముగదా! కావున గాంధీగారును ధర్మాతిక్రమణము జేసినవారలలో నొకరు ఈలాగున సాక్షాన్మోక్షము కొఱకు శ్రీరామానుజ, శ్రీమధ్వాచార్యులు మొదలగు అనేకులు సర్వసంగ పరిత్యాగులై ప్రవర్తించిన కథ లెన్నియో గలవు

శ్రీ రామానుజాచార్యులు ధర్మశాస్త్రాతిక్రమణములో ప్రథములని చెప్పవచ్చును వీరిగురువులు పెరియనంబిగారు గురూపదేశము కొఱకు పదునారుసార్లు తిరిగియు ఇకను మనఃపరిపక్వము కాలేదని గురువుగారు చెప్పి తిరుగా పంపుచుండెడివారు అన్నిసార్లు తిరిగినను విసుగు కొనకుండ, గురుభక్తి కొంచెమైనను తగ్గక హృదయపక్వము కాలేదని తలంచి భగవంతునిగురించి రోదనము చేయుచుండెడివారు ఆ గాథయంతము చాల పెద్దది శ్రీ రామానుజుల జీవితచరిత్రలో కనుగొన వచ్చును తరువాత పెరియనంబిగారి అన్తరంగ శిష్యులున్ను, గురు సేవకులున్ను అగు వారి సహాయముచే పెరియనంబిగారివల్ల తిరుమన్త్రోపదేశమును పొందిరి మన్త్రోపదేశ సమయమున నీదివ్యమన్త్రమును మరియెవ్వరికిని చెప్పరాదని ప్రమాణమును చేయించిరి మన్త్రోపదేశ మయినవెంటనే దూదిపింజసమూహము, ఎండిపోయిన ఆకులకుప్ప తత్క్షణమే రగులుకొనునట్లున్ను, అగ్ని తగిలిన మహారణ్యము గొప్పగాలిచే ప్రజ్వలించిపోవునటులున్ను శ్రీ రామానుజాచార్యులవారి సర్వకర్మలు భస్మము లాయెను అంతియేగాదు, మూలాధారమునుండి బ్రహ్మ రంధ్రము వరకుగల షడాధారములున్ను తెరువబడెను మరియు గొప్పదగు జలముతోనిండిన నదియొక్క ఆనకట్టను కొట్టివేసిన ఆ నీళ్ళు మహావేగముగా ప్రవహించునట్లు అనర్గళముగా భగవచ్ఛక్తి, భగవద్భక్తి, భగవద్జ్ఞానము అతనిలోనుండి ప్రవహింపసాగెను

**భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః ।**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥**

అను శ్రుతివాక్యము శ్రీరామానుజులవారియందు ప్రత్యక్షసిద్ధమాయెను ఈ

మహాధానందమును భరింపజాలక తాను వచ్చుచుండు దారిలోగల గోష్ఠిపురగ్రామమునగల శ్రీ సౌమ్యనారాయణస్వామి దేవాలయము యొక్క మహాగోపురమునెక్కి అంత్యజాతినుండి అగ్రజాతివరకుగల అందఱికిని శ్రీ నారాయణాష్టాక్షరియను మహామన్త్రమును చెప్పివేసెను కాగితపుముక్కలలో వ్రాసి అంతటను వెదజల్లెను దీనిని చూచినవెంటనే వైష్ణవులందరు పరుగెత్తుకొనివెళ్ళి శ్రీరామానుజులవారి గురువులగు పెరియనంబిగారికి తెలిపిరి వెంటనే అంతరంగశిష్యుని పిలిపించి, రామానుజులవారిని వెంటనే కూడా తీసుకొని వచ్చేలాగున వారు ఆజ్ఞాపించిరి ఆలాగున పరుగెత్తివెళ్ళి శ్రీ రామానుజులవారిని కూడ తోడ్కొని వచ్చియుండగా గురుదేవుడు క్రోధాన్తఃకరణుడై నిప్పులు గ్రక్కుచున్న ఎఱ్ఱని నేత్రములతో శ్రీ రామానుజులనుగురించి ఓపాపీ! గురుద్రోహీ! నరకాగ్నిలోపడి యావత్కాలము తపింతువుగాక! అని శపించెను వెంటనే రామానుజులవారు వస్త్రమును నడుమునకు కట్టుకొని చేతులు ముకుళించి సాష్టాంగముగా నమస్కరించి "గురుదేవా! అపరాధిని, మీ శాపమును శిరసావహించి అనంతకోటి యుగములవరకు నేను నరకాగ్నిలో దహించుచుండినను బాధలేదు దేవరవారొసంగిన దివ్యమన్త్రప్రభావముచే మనస్సు పట్టజాలక యీ చేతనాకోట్లు సంసారదుఃఖమును తరించి, భగవత్ప్రాప్తియగు వైకుంఠమును పొంది నిరతిశయ మోక్షసుఖమును పొందిన చాలునని తలంచి యింత ఘోరాపరాధమునకు ఒడిగట్టుకొంటిని" రామానుజులవారి ప్రశాన్తమగు భావమును, వణకుచుండు శరీరమును, గద్గదస్వరముతో పలుకుచుండు వాక్యములను, ఆనందబాష్పములు ప్రవహించు నేత్రములను చూచిన వెంటనే, మండుచుండు నిప్పులో నీళ్ళుపోసిన లాగున శాన్తముగలిగి గాఢాలింగనము జేసికొని ఉడయవర్ అని సంబోధించిరి ఉడయవర్ అనగా లోకోద్ధారకమున కవతరించిన సాక్షాత్ శ్రీమన్నారాయణమూర్తియని భావము అత్తరి రామానుజులవారి శరీరము, ఇనుము కొలిమిలోపెట్టి కాల్చిన నెట్లు దేదీప్యమానమై జ్వలించుచుండునో, అట్లు అప్పుడు పూర్వశరీరముసకన్న కాంతిమయమై వెలుగుచుండెను కావున జనులారా! ధర్మోల్లంఘనము, శాస్త్రాతిక్రమణము, గురువాక్యోల్లంఘనము ఏతరుణమున చేయవలయునో జాగ్రత్తగా వినుడు

**యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే ॥**

అని గీతాచార్యుండు చెప్పిన భాగమును చూడందగును

**సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।**
**సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥**

శుకుడున్ను ఈలాగుననే వచించెను "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః" భక్తులారా! ముముక్షువులారా! ఈ స్థితి ప్రజ్వలించుచుండు అగ్నిహోత్రునివంటిది పచ్చిది, యెండినది అను భేదములేక అది కాల్చివేయును సామాన్యాగ్ని పచ్చికట్టెలను కాల్చజాలని రీతిగా ధర్మాతిక్రమణ మందరికిని తగదు

**అన్యత్ర ధర్మా ధన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్ ।**
**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద ॥**

నేను బ్రహ్మవిద్యోపదేశమునకు యోగ్యుడనయి యున్నయెడల, నీకు నాయం దనుగ్రహము గలిగియున్నయెడల ఎయ్యది శాస్త్రవిహిత ధర్మానుష్ఠానముకంటెను, తత్ఫలముకంటెను, తత్కారకముల కంటెను వేరైనదియో, అధర్మానుష్ఠానముకంటెను, తత్ఫలముకంటెను, తత్కారకముల కంటెను వేరైనదియో,కార్య కారణములకంటెను వేరైనదియో, భూతభవిష్యద్వర్తమానముల కంటెను వేరైనదియో, కాలత్రయముచేతను అపర్ఛిన్నమయిన దనునది యెయ్యదిగలదో, సర్వవ్యవహారముల కతీతమయిన అట్టి బ్రహ్మమును నీవెఱింగి యున్నావు కావున, ఆ బ్రహ్మమునే నాకు బోధింపుము అని నచికేతుడు యమధర్మరాజును ప్రార్థించెను

ధర్మశాస్త్రములన్నియు నీలాగుననే చెప్పుచున్నవి

**త్యజ ధర్మ మధర్మం చ ఉభే సత్యానృతే త్యజ ।**
**ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ ॥**

ధర్మాధర్మములను రెండింటిని త్యజించి, ఆలాగున సత్యాసత్యముల రెంటిని

ఉపేక్షించి, జ్ఞానాజ్ఞానములనున్ను విడచి, యే బుద్ధి వలన వీనినన్నిటిని త్యజించితివో ఆ బుద్ధినిగూడ కట్టకడకు త్యజింపుమా అనగా బుద్ధికి సాక్షియగు ఆత్మయందు నిలకడ గలిగియుండుము అదియే మనయొక్క గమ్యము "సా కాష్ఠా సా పరా గతిః" అని కఠోపనిషత్తు దీనినే యుపదేశించుచున్నది సాధకుడు మొట్టమొదట అధర్మము లన్నియు నశించు పర్యన్తము ధర్మానుష్ఠానపరుడు కావలయును ధర్మనిష్ఠయందు నిలకడ గలిగిన పిమ్మట ధర్మాధర్మముల కతీతమగు పరమాత్మయందు నిలకడ గలిగేలాగున చూడవలయును ఇదియే శ్రుతియొక్క శాసనము ఆలాగున తమోగుణావస్థలో నుండువాడు రజోగుణావస్థలోనికిని, రజోగుణము గలవాడు సత్త్వగుణావస్థలోనికిని, సత్త్వగుణము గలవాడు విశుద్ధతత్త్వములోనికిని ప్రవేశించవలయును అట్టైన మాత్రమే పరమ నిర్వాణమును పొందగలుగును శ్రీ కృష్ణ ఆశయమున్ను ఇదియే

**త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥**

ఓ అర్జునా! వేదములు త్రిగుణాత్మకములగు సంసారధర్మములను తెలుపునవిగా నున్నవి ఆ కారణమువలన నీవు త్రిగుణాత్మకములగు విషయములందు వాంఛ వదలిన వాడవుగను, కేవల సత్త్వగుణ విశిష్టుడవుగను, సుఖదుఃఖాది ద్వన్ద్వముల సహించు వాడవుగను, యోగక్షేమముల సైతము గోరనివాడవుగను, ఆత్మజ్ఞానము గలవాడవుగను కమ్ము

**యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే ॥**

ఎవడైతే, తనలో తానే ఆనందించువాడును, తనలో తానే తృప్తినొందువాడును, తన యాత్మలో తానే సంతోషించువాడును, ఆత్మారాముడును అయియుండునో, అట్టివానికి చేయదగినది మఱి యేమియు మిగిలియుండలేదు శుకబ్రహ్మర్షియొక్క ఆశయమున్ను ఇట్టిదే యగును

**భేదాభేదౌ సపది గళితౌ పుణ్యపాపే విశీర్ణే**
**మాయామోహౌ క్షయమువగతౌ నష్టసన్దేహవృత్తీ ।**

**శబ్దాతీతం త్రిగుణరహితం ప్రావ్య తత్త్వావబోధం**
**నిస్త్రైగుణ్యే పధి విచరతాం కో విధిః కో నిషేధః ॥**

భేదాభేదములు వదలినవారును, పుణ్యాపాపములు నశించినవారును, మాయామోహములు క్షయించినవారును, సన్దేహమున్ను ప్రకృతివృత్తులున్ను క్షీణించినవారును, శబ్దాతీతమై త్రిగుణాతీతమైన తత్త్వావబోధమునుపొంది త్రిగుణాతీతమగు పరబ్రహ్మమందు విహరించు వారును అయిన మహాత్ములకు శాస్త్రవిధి ఎచట? నిషేధవిధి ఎచట? అనగా విధి నిషేధముల కతీతులని భావము అయితే శుకమహర్షి స్థితి తమకు గలిగినదా లేదా అని బాగుగా నాలోచించుకొనియే ఈ అతీతమార్గమున ప్రవేశించవలయును శ్రీ వేదవ్యాసులకును శ్రీ శుకమహర్షికిని గలిగిన వాదప్రతివాదములను దేవీభాగవతమున చూడవలయును వ్యాసులు వేదములను గురించియు, శుకులు వేదాంతములగు ఉపనిషత్తులను గురించియు వాదించిరి శ్రీ మద్భాగవతమున శుకుని గురించిన గాధను వినుడు

**సముడై యెవ్వడు ము క్తకర్మచయుడై సన్న్యాసి యై యొంటి వో**
**వ మహాభీతి నాహో కుమార యనుచున్ వ్యాసుండు సీరంగ వృ**
**క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు సక్కంజేసె మున్నట్టి భూ**
**తమయున్ మ్రొక్కెద బాదరాయణి తపోధన్యాగ్రణిన్ ధీమణిన్**

శుక్రాచార్యుడు-

**దనుజేన్ద్ర యీతడు ధరణీసురుడు గాడు**
**దేవకార్యంబు సాధించుకొఱకు**
**హరివిష్ణుడవ్యయుం డదితిగర్భంబున**
**గశ్యపసూనుడై కలిగె నకట**
**యెఱుగక కీతని కోర్కి నిచ్చెదనంటివి**
**దైత్యసంతతి కుపద్రవము వచ్చు**
**నీలక్ష్మి దేజంబు నెలవు నైశ్వర్యంబు**
**వంచించి యిచ్చు దా వానవునకు**

మొనసి జగములెల్ల మూడుపాదంబుల
నఖిలకాయుడగుచునాక్రమించు,
సర్వధనము విష్ణునంనర్జనము సేసి
బడుగు పగిదినెట్లు బ్రదికెదీవు

వారిజాక్షులందు వైవాహికములందు
బ్రాణవిత్తమాన భంగమందు
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము వొంద డధిప

ఈ పద్యమును సామాన్యజనులు కంఠస్థము జేసికొని ఇది భాగవత ధర్మమని చెప్పుదురు అట్టివారు ఈ పద్యముయొక్క పూర్వోత్తరముల జూడకనే అటుల వచించుచుందురు ఇది శుక్రాచార్యుల వచనము అసుర ధర్మము, ఇది దేవధర్మముగాదు కావుననే దేవగుణముగల బలిచక్రవర్తి దానిని ఖండించెను

నిజమానతిచ్చితి నీవు మహాత్మక
మహిని గృహస్థ ధర్మంబు నిదియ
యర్థంబు గామంబు యశమును వృత్తియు
నెయ్యది ప్రార్థింప నిత్తుననియు
నర్థలోభంబున నర్థిబొమ్మను టెట్లు
పలికి లేదనుకంటె బాపమెద్ది
యెట్టి దుష్కర్మిని నేభరించెదగాని
సత్యహీనుని మోవజాలననుచు

బలుకదే తొల్లి భూదేవి బ్రహ్మతోడ
సమరముననుండి తిరుగక చచ్చుకంటె
బలికి బొంకక నిజమున బరగుకంటె
మానధనులకు భద్రంబు మఱియు గలదె.

కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూటగట్టుకొని పోవం జాలిరే భూమి పై

బేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా!

నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైన గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో,
హరుడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైననౌ
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్.

ఇక భారతము ఉద్యోగపర్వమున గురుడగు పరశురామునికిని, శిష్యుడగు భీష్మునకున్ను జరిగిన వృత్తాన్తమును వినుడి ఇచ్చట సంగ్రహముగా జెప్పబడుచున్నది విస్తారముగా జూడదలంచినవారు ఉద్యోగపర్వమున చూడవచ్చును

## భీష్ముని వాక్యము

ఏను వినయంబు వదలక వినతుండనగుచు వివిధవాక్యంబులం
దెలుప నంతకంతకు నతనికి కోపం బగ్గలంబైన వెండియు

గురుడవై సమగ్రకోదండవిద్యామహత్త్వ మిచ్చి నాడవలుగ దగునె,?
కారణంబు లేక యీరసమెత్తి యిట్లనిన బరశురాము డాగ్రహమున

గురుడని నన్నెఱుంగు దనఘుండవు నావచనంబునం దనా
దరణము సేసి యెన్నియొ విధంబుల బల్కెదు భక్తితోడ నీ
వెరవులు దక్కుమీ యబల వేగమ పెండిలి సేయుమంతలో
మరలు మదీయకోపశిఖి మానదు వేఱొక వేయు జేసినన్.

అనిన విని ధర్మాచరణంబున కింతవట్టి పెనంగనగునే, పరానురక్తచిత్తయగు మగువ నిల్లాలిం జేయువారుం గలరే ఇట్టి యకృత్యం బాచరించుకంటె నీచేత నెట్లయినను లెస్స తొల్లి పెద్దలు చెప్పినచొప్పు నవధరింపుమని యిట్లంటి

గర్వియైన కార్యమిట్టి దకార్యమిట్టి
దని యెఱుంగక లోకంబు చను పథమున

దిరుగ కున్మదవృత్తి వర్తించునట్టి
వాని గురువైన దండింప వలయునండ్రు *

అనుమాటకు గాలానల
మును బోలెను మండి కయ్యమున కాయితమై
మొనలేర్చి వేగ యిచటికి
జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్

పలికిననేనును,

అలుకదనంబున విప్రున
కలుగంగా దగదు గురుడువై యున్నాడం
చలయక తలచితిగాకిటు
నిలుమీ నీరణముసేత నిజమగునేనిన్.

అప్పుడు దెప్పిటి కన్నుల
నిప్పులు రాలంగ నన్ను నిశ్చలదృష్టిం
దప్పకచూచియలతిన
వ్వొప్పుగ బ్రహ్మాస్త్రమాత డుగ్రతనేసెన్

తెగగొని బ్రహ్మాస్త్రమయే
దగనేసిన నొకటి కొకటి దార్కొని రెండున్
గగనంబంతయు దేజ
స్థగితముగాజేసె సురలు దైత్యులు దలకన్.

మే మిరువురమును దివ్యాస్త్రంబు లుపసంహరించి సమరం బుడిగితి మట్టియెడ, నయ్యేనమండ్రు విప్రులుంజేరి నాతో నిట్లనిరి

---

*ఆ తరుణమున భీష్మాచార్యులు రాజ్యపరిపాలనము చేయుచుండువారగుటే, ఆలాగున చెప్పుటకు కారణము తల్లి, తండ్రి, గురువులైనను ధర్మపరిపాలనాస్థితి ఆలాగుననే యుండవలయును

**గురుడు బ్రహ్మవిదు డకుంఠిత తేజుండు**
**పరశురాము డతనిపాలి కీవు**
**భక్తిమెఱయనేగి ప్రణమిల్లి తదనుగ్ర**
**హంబు వడయవలయు ననఘ యిపుడు**

అని చెప్పి యతనికడకుం దారును, నారదమునీశ్వరుండును, జమదగ్నిప్రముఖులును, భాగీరథియున్ను జని, నీ శిష్యుండు దేవవ్రతుండు, వానియెడ నలుగందగునే, వాడు దగవుమాలినపని జేయంజాలక పెనంగె, నింతియకాని విరోధిగాడు, వానిం గరుణింపుమని తెలిపి నన్నుం బిలిచినం బోయి యేనమ్మహాత్మునకు సాష్టాంగదండ ప్రణామంబు సేసిన నతండు దీవనతో గ్రుచ్చియెత్తి కౌగలించుకొని, గాంగేయా! నీ శక్తి భక్తికిం బ్రీతుండ నైతినని సస్నేహంబుగా సంభావించి యంబ నవలోకించి నన్ను భీష్ముండు గెలిచె, నావలన నయ్యెడు పని యింతియ, నీ వింక జూడంగలిగిన బోలిన గతిం బొమ్మనెను

ఇక శ్రుతికిన్ని స్మృతికిన్నిగల ధర్మహస్యమును నిరూపించెద మనుస్మృతి

**ఋణాని త్రీణ్యపాకృత్య మనోమోక్షే నివేశయేత్ ।**
**అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః ॥**

ఋణముల మూడింటి తీర్చియే మనస్సును మోక్షమున ప్రవేశపెట్టవలయును అట్లు ఋణముల మూడింటిని తీర్పక మోక్షమార్గమున (సన్న్యాసమున) మనస్సును నిల్పినవాడు పాపము నొందుచున్నాడు ఋణత్రయమనగా

**జాయమానో వై బ్రాహ్మణస్త్రిభిర్ ఋణైః ఋణవాన్**
**జాయతే । యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః, స్వాధ్యా**
**యేన ఋషిభ్య ఇతి శ్రుతేః ॥**

1 దేవఋణము, 2 పితృఋణము, 3 ఋషిఋణము, అగ్నిహోత్రాదులచే దేవఋణమున్ను, ఉత్తమసంతానముచే పితృఋణమున్ను, అధ్యయనముచే ఋషిఋణమున్ను తీర్చవలయును తర్వాత

సన్న్యసించవలయును అని స్మృతియొక్క అభిప్రాయము శ్రుతిఅభిప్రాయము దీనికి భిన్నముగా నున్నది మైత్రేయ్యుపనిషత్తు-

**యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు ।**
**తదైవ సన్న్యసేద్విద్వానన్యథా పతితో భవేత్ ॥**

సకలవస్తువులయందు వైరాగ్యమెప్పుడు జనించునో అప్పుడే విద్వాంసుడయినవాడు సన్న్యసించవలయును అట్లు సంపూర్ణవైరాగ్యము గలుగక సన్న్యసించినచో పతితుడగును మఱియు "యదహరేవ విరజేత్తదహరేవప్రవ్రజేత్॥" ఏ దినమందు సర్వవిషయములలో వైరాగ్యముగలుగునో ఆ దినమందు సన్న్యసించవలయును మఱియు నారదపరివ్రాజకోపనిషత్తు తెలిపిన దానిని చూడుడు

**అప్రమత్తః కర్మభక్తిజ్ఞాన సమ్పన్నః స్వతన్త్రో వైరాగ్యమేత్య బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో వా ముఖ్యవృత్తి కశ్చేత్ బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహాద్వనీభూత్వా ప్రవ్రజేద్యది వేతరథా బ్రహ్మచర్యాదేవప్రవ్రజేత్, గృహాద్వా వనాద్వాఽథ పునరవ్రతీ వా వ్రతీ వా స్నాతకో వాఽస్నాతకో, వోత్సన్నాగ్ని, రనగ్నికో వా, యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్ ॥**

ఏలాటి ప్రమాదము లేనివాడై కర్మభక్తిజ్ఞానములతో గూడుకొన్న స్వతన్త్రుడైనవాడు వైరాగ్యమునుపొంది బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని వానప్రస్థుడుగాని సన్న్యసింపవచ్చును అదెటులనగా ముఖ్యమగు క్రమవృత్తి గలవాడైనచో బ్రహ్మచర్యమును పూర్తిగావించి గృహస్థుడు గావలయును గృహమునుండి వానప్రస్థుడై సన్న్యసించవలెను, ఇది క్రమమార్గము అటులగాకపోయిన, ఒకవేళ వైరాగ్యముగలవాడు బ్రహ్మచర్యమునుండియే సన్న్యసింపవచ్చును గృహస్థుడు గృహస్థాశ్రమమునుండియే, వానప్రస్థుడు వానప్రస్థాశ్రమమునుండియే సన్న్యసింపవచ్చును బ్రహ్మచర్యవ్రతము ననుష్ఠించినవాడను, అనుష్ఠించని వాడును, విద్యపూర్తియై స్నాతకవ్రతమును పూర్తిజేసినవాడును, అటుల చేయనివాడును, అగ్నికార్యము పూర్తిచేసినవాడును, అగ్ని కార్యమును పూర్తిచేయనివాడును, ఎవరైనను "యదహరేవ విరజేత్తదహరేవ

ప్రవ్రజేత్'' ఎప్పుడు సర్వవిషయములలో విరక్తి జనించునో అప్పుడే సన్న్యసింపవచ్చును స్మృతియును ఆలాగుననే వచించుచున్నది

**సోపానవత్పరం ప్రాప్తుం భవిష్యత్యాశ్రమక్రమః ।**
**అత్యన్తపక్వచిత్తస్య క్రమాపేక్షా న విద్యతే ॥**

బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమములను విధిప్రకార మాచరించి సన్న్యసించుట క్రమపద్ధతి యనంబడును ఇది సౌధము నెక్కుటకు సోపానక్రమముగా వర్ణింపబడినది

అయితే నిర్విషయస్థితి గలిగి అత్యన్త పరిపక్వమయిన చిత్తముగల వానికి ఈ క్రమపద్ధతి నవలంబించవలసిన అవసరములేదు వానికెప్పుడైతే సంపూర్ణవైరాగ్యము గలుగునో అప్పుడే సన్న్యసింపవచ్చును క్రమపద్ధతిని పిపీలికా మార్గమనియు, క్రమాతిక్రమణ పద్ధతిని విహంగ మార్గమనియు శాస్త్రము నిర్ణయించుచున్నది పిపీలికా మార్గమందు పతనముగలుగదు విహంగ మార్గమందు పరిపక్వము లేనిచో పతనమునకు మార్గములు మెండు కావుననే "అత్యన్తపక్వచిత్తస్య'' అని ప్రయోగించుటకు కారణము, ఇదెట్టిదనగా పక్షులు బాగుగా రెక్కలు వచ్చువరకు గూటిని వదలక దానియందే యుండును రెక్కలువచ్చి ఎగిరెడిశక్తి గలుగుటకు ముందుగా ఎగురచూచినందుచే కొన్ని విహంగశిశువులు క్రిందపడిపోవుటయు, కుక్కలుగాని, పిల్లులుగాని వానిని చంపుటయు జూచుచున్నాము కావుననే అన్తఃకరణశుద్ధి గలుగనివారు సన్న్యసించియు కొందరు పతితులగుదురు ఈ విషయమై శ్రీరామకృష్ణపరమహంసగారు ఇటుల నుడివిరి కప్పపిల్లలు తోక గలిగి చేపపిల్లలవలెనె నీటిలో కొంతకాలము వరకుండును కాళ్ళేర్పడునపుడు తోక తెగిపోవును అప్పుడు నీటిలోను, భూమిపైనను వానికి సంచరించుశక్తి గలుగును చరణములుగలిగి పుచ్ఛము తెగిపోవువరకు జలములోనే యుండవలయును లేనిచో అపాయము సిద్ధము, ఈ వాక్యమును ముముక్షువులు బాగుగా నాలోచింపనగును సాధనచతుష్టయ సమ్పత్తిగలిగి ప్రకృతివాసన యను తోక తెగిపోవు వరకున్ను క్రమపద్ధతి ననుసరించుటయే శ్రేయస్కరము అందువలననే మైత్రేయ్యుపనిషత్తు ఈలాగున తెలుపుచున్నది

**ద్రవ్యార్థమన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థమేవ వా ।**
**సన్న్యసేదుభయభ్రష్ట స్స ముక్తిం నాప్తుమర్హతి ॥**

ధనార్జనము కొఱకుగాని, అన్నవస్త్రములు సులభముగా లభించునను బుద్ధితోగాని, తనను అందఱును గౌరవింతురను బుద్ధితోగాని సన్న్యసించినయెడల వాడుఉభయలోక భ్రష్టుడగునే గాని మోక్షమును పొందజాలడు

**పరేషాముపదేశాయ క్షేమాయ చ మనీషిణః ।**
**పక్వాశ్చ కర్మ కుర్వన్తి భయాన్నాదేశశాస్త్రతః ॥**

మహాత్ములగు కొందఱు పరిపక్వజ్ఞానము గలిగినవారైనను కర్మకాండశాస్త్రము ననుసరించి ప్రవర్తింతురు దీనిని పరులయొక్క ఉపదేశముకొఱకుగాను, ఆత్మయొక్క క్షేమముకొఱకుగాను చేయుచున్నారేగాని, లోకమునకు భయపడిగాని శాస్త్రమునకు భయపడిగాని చేయువారుగారు ఈ విషయమై శ్రుతి స్మృతులకు ఎచ్చటెచ్చట అభిప్రాయభేదము గలుగునో, అచ్చట ఇదమిత్థమని నిర్ణయించుటకు శాస్త్రమీలాగున నిరూపించుచున్నది

**యదదృష్టం హి వేదేషు తద్ద్రష్టవ్యం స్మృతౌ కిల ।**
**ఉభాభ్యాం యదదృష్టం హి తత్పురాణేషు పఠ్యతే ॥**

**శ్రుతిస్మృతిపురాణేషు విరుద్ధేషు పరస్పరమ్ ।**
**పూర్వం పూర్వం బలీయస్స్యా దితి న్యాయవిదో విదుః ॥**

**శ్రుతిస్మృతివిరోధేషు శ్రుతిరేవ గరీయసీ ।**
**అవిరోధే సదా కార్యం స్మార్తం వైదికవత్సదా॥**

**శ్రుతిస్మృతిపురాణానాం విరోధో యత్ర దృశ్యతే ।**
**తత్ర శ్రౌతం ప్రమాణం తు .......... . ........... ॥**

ఏది వేదములందు చూడబడలేదో దానిని స్మృతియందు చూడవలయును, ఆ రెంటియందును ఏది ప్రతిపాదింపబడలేదో దానిని పురాణములందు చూడవలయును శ్రుతిస్మృతి పురాణములయందు పరస్పర విరోధము గనుపించిన,

పురాణములకన్నను స్మృతిని, స్మృతికన్నను శ్రుతిని బలవత్తరముగా నంగీకరింపవలయును శ్రుతిస్మృతులయందు విరోధము గానుపించినప్పుడు శ్రుతిని ముఖ్యముగాను, స్మృతిని గౌణముగాను గ్రహించవలయును వాని రెంటికి విరోధము లేనప్పుడు స్మృతిని గూడ శ్రుతిని వలెనే గౌరవించవలయును ఆలాగున శ్రుతి స్మృతి పురాణములకు విరోధము గనిపించినచోట పురాణముకన్న స్మృతిని, స్మృతికన్న శ్రుతిని పరమప్రమాణముగా గ్రహించవలయును

ఇది ఎటువంటిదనగా క్రిందికోర్టులో సబ్‌మేజిస్ట్రేటు చేసిన తీర్మానమును జిల్లాకోర్టువారు అంగీకరించవచ్చును, లేక త్యజింపవచ్చును జిల్లాకోర్టువారి తీర్మానము హైకోర్టువారికి సరిగాతోచిన అగీకరించవచ్చును, లేనిచో త్రోసివేయవచ్చును హైకోర్టువారివిధిని (పార్లమెంటు) సుప్రీముకోర్టువారు గ్రహించవచ్చును లేక త్యజించవచ్చును అయితే పై కోర్టువారల తీర్మానమును క్రిందికోర్టువారికి విచారించు అధికారములేదు ఏలననగా పైపైకోర్టువారు గొప్పవారున్ను మహావిద్యావంతులున్ను అగుటయే దానికి కారణము ఆలాగున మనుస్మృతియందు ఋణత్రయమును తీర్చి సన్న్యసింపవలయునని గలదు శ్రుతియందో ఎప్పుడైతే వైరాగ్యము గలుగునో అప్పుడే సన్న్యసింపవచ్చునని నిర్ణయింపబడెను ఈ శ్రుతిని ఆధారముచేసికొనియే శ్రీ శంకరాచార్య రామానుజాచార్య మధ్వాచార్య ప్రభృతులు బ్రహ్మచర్యాశ్రమమునుండియే యత్యాశ్రమమును గ్రహించుటకు కారణము శ్రీ రామానుజాచార్యులు వివాహితు లయినను సంతానోత్పత్తికి పూర్వము గృహత్యాగమొనరించి సన్న్యసించిరి

**ఉత్పాదకబ్రహ్మదాత్రోః గరీయాన్ బ్రహ్మదః పితా ।**
**బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతమ్ ॥**

పుత్రునికి వేదగ్రహణార్థమై జ్ఞానరూపమయిన రెండవజన్మ నొసంగు ఆచార్యుడు తండ్రికన్నను అధికుడు ఏలనగా బ్రహ్మగ్రహణార్థమైన జన్మము బ్రహ్మప్రాప్తిఫలక మయినందున ఇహ పరముల రెండింటి యందును నిత్యమైనది దేహమును జనింపజేయుటలో తండ్రి కారకుడు దేహములోనుండు దేహియగు ఆత్మను జనింపజేయుటలో (ఆత్మజ్ఞానమును కలిగించుటలో) ఆచార్యుడు

(గురుదేవుడు) కారకుడు అట్టి ఆత్మజ్ఞాన మిహమందును పరమందును సుఖమును కలిగించును సర్వజంతువులున్ను జన్మించుటలో సమానములు ఇది మొదటిజన్మ యగును అట్టి జన్మలోనుండి ఆత్మజ్ఞానమును గలిగించుటలో గురువరుడు కారకుడు అట్టి రెండవజన్మ గలవాడే ద్విజుడనబడును ద్విజుడనగా రెండవజన్మ గలవాడని అర్థము ఇట్టి రెండవజన్మ గలవాడు ద్విజులలో జన్మింపకపోయినను ద్విజుడే అట్టి రెండవ జన్మమును పొందనివాడు ద్విజులలో జన్మించినను ద్విజుడు కాజాలడు కావుననే ఒకే గురుదేవునికి అనేకజాతులలో చేరిన స్త్రీ పురుషులు శిష్యులుగా నుండినను గురుపుత్రులనియు గురుపుత్రికలనియు వ్యవహారములో కానుపించుటకు కారణము

ఇక మానవు డభివృద్ధినొందు విషయమై క్రింద తెలిపెద

**అశ్రద్ధా పరమం పాపం శ్రద్ధా పాప ప్రమోచనీ ।**
**జహాతి పాపం శ్రద్ధావాన్ సర్పో జీర్ణామివ త్వచమ్ ॥**

అశ్రద్ధకు సమానమైన పాపము మఱియొకటి లేదు శ్రద్ధకు సమానమైన పాపవిమోచనము జేయునది మఱియొకటి లేదు, సర్ప మేలాగున జీర్ణమైన కుబుసమును విడుచుచున్నదో ఆలాగున శ్రద్ధావంతుడు సమస్తపాపములనుండి బన్ధములనుండి విముక్తు డగుచున్నాడు

ఈ వ్యాసమందు జ్ఞానమున కింత యాధిక్యయు నొసగుటకు కారణముమేమనగా ఎంత మంచి దృఢమయిన సుందరములయిన ఓడలుగాని, బోటులుగాని యుండినను అవి ఏలాగున సముద్రములోమాత్రము తిరుగు శక్తిగలవగునో, సముద్రముదాటి పైకి వెళ్ళుశక్తి వాటికిలేదో, ఆలాగున కర్మకాండ క్రియలన్నియు సంసారసాగరములో తిరుగుశక్తి గలవగునేగాని మోక్షమార్గములో నడువ శక్తిగలవి గావు ఆ విషయమై శ్రీకృష్ణభగవానుడు గీతలో దెలిపినదానిని చూడుడు

**యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**

ఏ ప్రకారము చక్కగా రగులుచుండెడు అగ్నిహోత్రుడు సమిధలను (కట్టెలను), హోమద్రవ్యములను భస్మము చేయుచున్నాడో ఆ ప్రకారముగానే జ్ఞానమనెడు అగ్ని సమస్తకర్మలను భస్మము జేయుచున్నది "సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి" ఓ అర్జునా! జ్ఞానమనె పడవచే పాప (అజ్ఞాన)మనెడు సముద్రమును లెస్సగా దాటగలవు "న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే" ఆత్మజ్ఞానమునకు సమానమైనది పావనమయినది మూడు లోకములయందును మఱియొకటి లేదు

## 'నామ్'

దీనిని గురించి శ్రీ రామతీర్థులు చెప్పిన సంగతి చూడుడు-

ఈ విషయం తల్చుకొంటే రామునికి ఒక కధ జ్ఞాపకం వస్తుంది హిందూదేశములో ప్రఖ్యాతిగన్న ఒక వ్యక్తి ఉండేవాడు అతడు సత్యమయుడు, దైవతన్మయత్వం గలిగినవాడు అతడు వీధులలో తిరుగుచూ ఓ దైవత్వమును కొనేవారలారా! రండి! అని పెద్దగా కేకలువేస్తూ వుండేవాడు అతడు దైవత్వమును అమ్ముతూ వెళ్ళేవాడు ఓ దైవత్వమును కొనేవారలారా! ఓ దైవత్వవాంఛాపూర్ణులారా! రండి! హృదయ భారాలు గలిగినవారు రండి! అని అరుస్తూ వెళ్ళేవాడు అతడు స్వదేశభాషలో కేకలువేసేవాడు ఆ భాషలో "నామ్" అంటే భగవంతునికి పేరు అతడు తన స్వభాషలో "నామ్ లేలో నామ్ లేలో" అని అరచేవాడు నామ్ లేలో అంటే అర్థం-నావద్ద అమ్మకమునకు ఒక వస్తువు వున్నది మానవులారా! దాన్ని కొనండి ఆ వస్తువు భగవంతుడు అతడు నామ్ అనేపేరు ఉపయోగించేవాడు నామ్ అనేదానికి రెండర్థాలున్నాయి. ఒక అర్థం భగవంతుడని, మరొక అర్థం అందమైన మణిఖచితమైన కంఠహారమని, కాని ఆ మహాత్ముడు నామ్ అన్న పదాన్ని భగవంతుడనే అర్థంలో ఉపయోగించాడు కంఠహారమనే అర్థంలో ఉపయోగించలేదు ఒకనాడు "నామ్ నామ్" అని వీధులలో అమ్ముతూ వెళ్ళుతున్న సమయంలో కంఠహారము కొనవలయుననుకొంటున్న ఒకడు యీ మహాత్ముని చూచి యితడెవరో ఒక హారవర్తకుని యేజంటయి ఉంటాడని అనుకొన్నాడు

హిందూదేశములో వివాహసమయాలలో ప్రజలకు అలంకారార్థమై ఎక్కువ విలువగల ఆభరణాలు కావలసిఉంటుంది ఆభరణాలు కావలసిన అతడు ఈ మహాత్ముని యిల్లు కనుక్కొని అతని యింటికి వెళ్ళాడు ఇంటికి వెళ్ళిచూచి ఆశ్చర్యచకితుడైనాడు అతని యిల్లు చాలా బీదవాని యిల్లుగా వుంది ఆభరణవర్తకుని యిల్లు ఇంత బీదగా వుంటుందా అని అతడు ఆశ్చర్యం పొందాడు అతడు యింటిలోకి ప్రవేశించాడు కాని అతనికి వీధివర్తకుడు కనిపించలేదు అతడు తలుపు తట్టగానే ఒక చిన్నపిల్ల వచ్చి తలుపుతీసింది అతడు ఆ పిల్లను యింటియజమాని యెక్కడ ఉన్నాడని అడిగాడు ఆ పిల్ల "మాతండ్రి బయటికి వెళ్ళాడు సాయంత్రానికి యింటికివస్తాడు అయ్యా! మీరు ఏ పనిమీద వచ్చారో నాకు తెలుపగలరా?" అనెను అతడు ఆ పిల్లమాటలచే ఆకర్షింపబడ్డాడు ఆ పిల్లతో మాట్లాడుదామనుకొన్నాడు ఆ పిల్లతో కొన్ని మాటలు మాట్లాడుతూ, 'నామ్ కొనడానికి వచ్చా' నన్నాడు పిల్ల నవ్వి 'నేను మీకు నామ్‌ను ఇవ్వగలను, అది చాలా సులభమైనది' అన్నది అతడు 'సరే నేను వేచియుంటాను' అన్నాడు అతడు వాకిట్లో నిల్చొని ఉన్నాడు ఆమె యింట్లోకి వెళ్ళింది అతడు వేచివేచి విసుగుచెందాడు

ఈ సమయములో భూగర్భమునుంచి ధననిధి త్రవ్వవచ్చుగదా అనుకొన్నాడు విసుగు జెందినవాడై యింట్లోకి తొంగిచూచాడు ఇంట్లో ఆ పిల్ల పెద్దకత్తికి పదునుపెట్టడము చూచాడు అతడు అమ్మాయీ! నాతో ఎందుకు పసిపిల్లల ఆటలు ఆడుతున్నావు నావంటి పెద్దమనిషితో ఆటలాడవలసిన కాలం కాదిది ఇక నీ ఆటలాపి నీ తల్లిదండ్రులు సొమ్మునెక్కడ దాచారో నీకు తెలియదనిచెప్పు, అన్నాడు అప్పుడు ఆ పిల్ల 'నన్ను క్షమించండి, ఒక్క నిమిషము ఓర్పు వహించండి నేను వస్తున్నాను' అన్నది అతడు 'వెంటనే వచ్చేసెయ్యి, యింకా పదునెందుకు పెడుతున్నావు?' అన్నాడు ఆ పిల్ల 'మీకు నామ్ కావలెనా?' అన్నది అతడు 'నాకు నామ్ కావాలి, కాన నాకు నామ్‌నుచూపు, నేనుదానిని ఒక వజ్రవ్యాపారిదగ్గరికి తీసికొనివెళ్ళి సరియైన ధర కనుక్కోవాలి?' అన్నాడు అప్పుడు ఆమె 'వీధులలోని మణివర్తకులచేత విలువ నిర్ణయింపబడేది గాదు మావద్దవున్న నామ్, మా 'నామ్' కు అప్పుడే ధర నిర్ణయమై యున్నది ఈ ధర హెచ్చదు, తగ్గదు

దీనివెల నిర్ణీతమయ్యేవున్న'దని అన్నది అతడు "అట్లుగా? అయితే నీకత్తిని పారవేసి నాకు దాన్ని చూపించు' అన్నాడు, ఆమె 'అయితే మీరు మొట్టమొదట విలువనియ్యాలి తరువాత మీకు నామ్ యివ్వబడుతుంది" అన్నది అతడు 'నీవు నన్ను పొడవదలచుకొన్నావా యేమిటి? నీ కత్తిని పదును పెడుతున్నావెందుకు? అన్నాడు ఆమె పవిత్రమైన విశ్వాసపూరితమైన స్వరముతో 'నామ్' యొక్క విలువ తెలియకుండా నీవు యిక్కడికి యెందుకు వచ్చావు? నామ్ కావలెనంటే నీ జీవితాన్ని పోగొట్టుకొనవలెనని నీకు తెలియదా? నామ్ కొఱకు చెల్లించవలసిన విలువ జీవితము ఎవడు తన జీవితాన్ని రక్షించుకొంటాడో వాడు "నామ్"ను పోగొట్టుకొంటాడు

అరేబియా భాషలో ఒక పద్యం ఉన్నది ఆ పద్యం అర్థం యిది- "సమాధిలో నిన్ను పెట్టేముందు నీవు చనిపో, అలా చనిపోవడంవల్ల ఈ జగత్తును ఒక స్వర్గం చెయ్యి" ఈ విషయాన్ని వర్ణించే అనేక పద్యాలు సంస్కృతములో ఉన్నవి

నీలోని సమస్తమూ ఈ జగత్తుకు పరాఙ్ముఖ మైనపుడు నీవు బాధాతప్తుడ వైనపుడు, నీవు ఈ జగత్తుకై శిలువ వేయబడినపుడు నీవు జీవిస్తావు మతబోధకులు, ఉపన్యాసకులు చెప్పే ప్రశంసావాక్యాలకు మోసపోవద్దు రాముడు మీకు సత్యం చెబుతాడు రాముడు ప్రశంసా వాక్యాలు చెప్పడు వేదములలో ఒక అందమైన పద్యం ఉన్నది ఆ పద్యంలోని అర్థం యిది- మానవుని శరీరము ఒక కోటవంటిది ఇంద్రియాలు కోటవాకిళ్ళు కోటద్వారములలో ఫిరంగులను, తుపాకులను ఉంచుతాము లోపలనుంచి వెలుపలకు కాలుస్తాము ఇదే విధముగా మీలోనుంచి చూపులనే ఫిరంగిగుండ్లు చూచేవారి హృదయాలలోకి, వలల లోకి కాల్చబడుతున్నవి ఈ కోటనుకట్టిన ఆత్మ, యీ కోటకు సృష్టికర్తయైన ఆత్మ మానవునితో ఒక విచిత్రం చేసింది నీలో నుండి గుండ్లన్ని వెలుపలికి కాల్చబడుతున్నవి మానవుడు విస్మితు డగుచున్నాడు ఈ జగత్తును తాను జయిస్తున్నానని మానవు డనుకొంటున్నాడు కాని సత్యానికి అతడు తన ఆత్మను నష్టంచేసికొన్నవాడు అవుతూ ఉన్నాడు ఈ కోటలోనుండి మానవుడు తగుజ్ఞానం సంపాదిస్తున్నాననుకొంటున్నాడు ప్రపంచములో విజయం పొందుతున్నాననుకొంటూ ఉన్నాడు కాని జ్ఞానిదృష్టికి అతడు తన నిజమైన ఆత్మను కడుపుమాడ్చినవాడు అవుతూ ఉన్నాడు ఆ పద్యంలో ఇలా

చెప్పబడివున్నది-ఎవడు తన ఫిరంగుల తూపాకుల ముఖాలను లోనికి త్రిప్పి కాలుస్తాడో అత డీజగత్తునంతా జయిస్తాడు ఎవని కన్నులు వెలుపలికి చూడడానికి మారుగా లోనికి చూస్తున్నవో దృష్టియొక్క మూలాన్నే చూస్తున్నవో, ఎవని చెవులు వెనుదిరిగి వినుటయొక్క మూలమును వింటున్నవో, ఎవని మనస్సు అంతర్ముఖమై మనశ్శక్తికి మనశ్చలనానికి మూలాన్ని చూస్తున్నదో, ఆ మానవుడు సమస్త జగత్తును జయిస్తాడు

అంతర్ముఖుడివికా! కనులను చూచునవిగా, చెవులను వినేటట్లు, జుట్టును పెరిగేటట్లుగా చేస్తున్నదేమిటి? ఆత్మ లేక భగవంతుడు ఈ విషయం ఎంత సులభముగావుంది మీరు యీ సత్యాన్ని ఒక్కనిమిషము ఆలోచించి నట్లయితే నీవు భగవత్స్వరూపంతప్ప మరేమీ కాదని తెలుసుకొంటావు నీలోని ఆ దివ్యత్వాన్ని అనుభవించు ఈ విశ్వానికి దివ్యత్వాన్ని అందించు ఈ విశ్వానికి చక్రవర్తివికా, అధిపతివికా ఈ జీవితం పెరిగి మృత్యువు వస్తూవుంది చెట్టు పెరిగి పెద్దది కావాలంటే బీజం నశించడానికి సిద్ధం కావాలి ప్రకాశించాలంటే దీపపువత్తి కాలాలి ఇదేవిధముగా భగవంతుడుగా జీవించాలంటే స్వార్థవృత్తి అహంవృత్తి నశించాలి ఈ విషయంలో పడి మనం అసలు కథను మరుస్తున్నాము

అప్పుడు ఆ పిల్ల అన్నది అయ్యా! దాని ధర అప్పుడే నిర్ణయింపబడి యున్నదని మీకు తెలియదా? నామ్ కావలెనంటే (పిల్లదృష్టిలో నామ్ అంటే భగవంతుడు అని అర్థం ఆ మనిషిదృష్టిలో హారమని అర్థం) ఈ నీ శిరస్సు ఈ కత్తితో నరకబడాలి అప్పుడే నీకు నామ్ లభిస్తుంది' అని ధైర్యంగా సంతోషంగా నిస్సంకోచంగా ఆ పిల్ల యీమాట అన్నది పాపం అతడు చకితుడై పోయినాడు పెద్దగా కేక వేశాడు ఆ కేకకు యిరుగు పొరుగువారందరూ అక్కడికి చేరారు అతను వారితో "ఇటు చూడండి! ఈ పూరిగుడిసెలో కసాయివాళ్ళు, నరహంతకులు వున్నారు ఈ పిల్ల తల్లిదండ్రులు హంతకులని నేను అనుకొంటాను ఈ విషయాన్ని న్యాయస్థానం ముందు పెట్టాలి మనము పోలీసులను పిలుద్దాము" అనెను అప్పుడు అక్కడచేరిన ప్రజలు 'అట్లా మాట్లాడవద్దు ఈ పిల్ల తల్లిదండ్రులు భక్తి పవిత్రతలకు ప్రఖ్యాతిపొందినవారు, అన్నారు అందులకతడు వీరిని పవిత్రులనేవారందరు

సాధారణంగా చెడుగా వుంటారని నేననుకొంటాను, వారికి నిజంగా మతం వుండదు వారు మతం పేరిట ఘోరపాపాలు చేస్తుంటా'రన్నాడు అప్పుడక్కడ పెద్దగందర గోళం లేచింది

హఠాత్తుగా అక్కడికి ఆ పిల్ల తండ్రి వచ్చాడు ఆ మనిషి పిల్లతండ్రిని గొంతు నులమబోయే స్థితిలో నున్నాడు పవిత్రుడైన ఆ తండ్రి ప్రశాంతముగా నున్నాడు తండ్రితో అతను కఠినంగా 'నీవు నీ పిల్లకు ఘోరపాపాలు ఎందుకు నేర్పుతావు? చిన్నతనంలోనే పిల్లలకు పాపం నేర్పేపను లెందుకు చేస్తావు?' అని అన్నాడు ఆ మహాత్ముడు 'మీరు చెప్పేది నాకు అర్థంకావటం లేదు నాకు బోధపరచండి' అన్నాడు మహాత్మునికి విషయమంతా వివరించి చెప్పారు, ఆ విషయం వినగానే మహాత్ముని హృదయం దివ్యోద్రిక్తమైంది పవిత్రభావాలతో అతని శరీరమంతా ఉద్రిక్తమైంది అతని అంతరంగం దివ్యత్వంతో నిండిపోయింది అతని కనులనుండి పెద్ద పూసలవంటి కన్నీటిబిందువులు రాలి చెక్కిళ్ళపై నిలిచాయి అతను ఓ ప్రవక్తలారా! ఓ దేవతలారా! ఓ భగవంతుడా! ఓహో! భగవంతుని నామం ఒక శిశువుయొక్క చేతిలోపడి యింత చౌకగా మారిందా! ఒక అమాయకురాలైన, అజ్ఞానురాలైన పసిపిల్లచేతిలో పడబట్టి దైవత్వం భగవంతుడు ఎంత చౌక అయింది? అమృతత్వం, స్వర్గం ఒక తలకు లేక ఒక హృదయానికి ఎంత తక్కువధరకు అమ్మబడింది? ఓ దైవత్వమా! ఓ మధురమైన అమృతత్వమా! దీని ధర ఒక్క జీవితమేనా? ఒక్క జీవితమే ప్రియమైన ధర అవుతుందా? సత్యంయొక్క ఒక క్షణమాత్ర కిరణలేశ దర్శనంకోసం కోటానుకోట్ల జీవితాలు సృష్టించబడి నశింప చెయ్యబడుగాక! పరమ పవిత్రమగు దైవచైతన్యముయొక్క ఒక్క క్షణానుభవంకోసం కోటానుకోట్ల జీవితాలు తలలు కొట్టివెయ్యబడి ముక్కలు ముక్కలుగా ఖండింపబడుగాక!

ఆ మహాత్ముడు ఈ మాట లనగానే ఆ క్రొత్త అగంతుకుని హృదయం కరిగిపోయింది చుట్టూకూడిన ప్రజలు స్తబ్ధులై నిల్చున్నాడు అప్పుడు వారు తమ మనస్సులు తుచ్ఛమైన భౌతిక కశ్మలములో తగుల్కొని నామ్‌లోని నిజమైన అర్థము తెలిసికొనలేక పోయినారని ఆ పిల్ల దృష్టిలో, ఆమె తల్లిదండ్రుల దృష్టిలో నామ్‌కు ఏదో అత్యంత మధురాతి మధురమైన అర్థం వుందని తెలిసికొన్నారు.

# వంశవిచ్ఛేదన మొనర్పకుడు

ఈ విషయమై సూతసంహితయందు మహేశ్వరుండు సనకాది ఋషుల కుపదేశించినది చూడుడు

**భవన్తోఽపి మహాత్మానో మత్తః ప్రాప్తాత్మవేదనాః ।**
**అభవన్కృతకృత్యాశ్చ మా శఙ్కధ్వం కదాచన ॥**

యోగములను సమాధిపర్యన్తము జెప్పినపిమ్మట నిటుల మహేశ్వరు డానతిచ్చెను మహాత్ములగు మహర్షులారా! నావలన మీ రందఱున్ను జ్ఞానమును, యోగమును గలిగిన యీ వేదాంతసారమును విని ఆత్మవేత్త లయితిరి మీరందఱును కృతకృత్యు లయితిరి దీనియందు సంశయములేదు

విశేషార్థము॥ బ్రహ్మప్రాప్తిగలిగిన తర్వాత కృతార్థుడయిన యోగి, అట్టి ఆత్మానుభవ జ్ఞానమును భక్తులకు బోధించవలసినదని యీ క్రింది శ్లోకములచే చెప్పబడుచున్నది ఈ దైవపరమ్పర, ఋషిపారమ్పర్య సత్యమును తెలియక, లోకోద్ధారకులగు మహనీయులను గురించి ఈలాగున చెప్పుచుందురు

అదేమనగా, సాధువులకు విరక్తులకు సన్న్యాసులకు, ఈ జనులతో సమ్బన్ధమేమి? మఠములు, ఆశ్రమములు విరక్తులకు తగునా? అట్టివారు నిర్జన స్థలములలో, పాడుదేవాలయములలో, పాడుపడిన యిండ్లలో నుండవలయును గదా! అని చెప్పుచు తిరుగుచుందురు వీరిలో విద్యగాని, తపస్సుగాని, బ్రహ్మవిచారముగాని యేమియు నుండవు అట్టివారి వాక్యములను విని కొందరు పొరబడుచున్నారు కావున నీ వ్యాసమును వ్రాయడమైనది

**స్థాపయధ్వమిమంమార్గం ప్రయత్నేనాపి హే ద్విజాః ।**
**స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్ ॥**

బ్రహ్మవేత్తలారా! మునిసత్తములారా! మీరు ప్రయత్నపూర్వకముగా నిట్టి జ్ఞానమార్గమును ప్రపంచములో స్థాపించుడు దైవికమగు నిట్టి పుణ్యమార్గమును స్థాపించితిరేని ప్రపంచమంతయు సౌఖ్యము నొందగలుగును

**యో హి స్థాపయితుం శక్తో న కుర్యాన్మోహితో నరః ।**
**తస్య హంతా చ పాపీ స్యా దితి వేదాంతనిశ్చయః ॥**

ఆత్మజ్ఞానము బొందినవాడు ప్రపంచములో అట్టి జ్ఞానమార్గ ప్రదమగు ఆశ్రమములను నిల్పి, జనులకు బోధింప శక్తిగలిగియుండియు, ఏద్దైన కారణాన్తరముచే మోహితుడై యట్లు జేయని మానవుడు అట్టి జ్ఞానమార్గమును నశింపజేసిన వాడుగను, పాపిగను అగుచున్నాడు ఇది వేదాంత శాస్త్రముయొక్క నిశ్చయమని మఱువకుడు

**యస్థాపయితుముద్యుక్త శ్శ్రద్ధయైవాక్షమోఽపిసన్ ।**
**సర్వపాపవినిర్ముక్త స్సాక్షాద్జ్ఞానమవాప్నుయాత్ ॥**

అట్లు స్థాపించువాడు శ్రద్ధయు, క్షయము గలిగియుండవలయును అట్టివాడు సర్వపాపములనుండి విముక్తుడై సాక్షాత్ జ్ఞానమును పొందుచున్నాడు

**యశ్చ విద్యాభిమానేన వేదమార్గ ప్రవర్తకమ్ ।**
**ఛలజాత్యాదిభిర్జియా త్స మహాపాతకీ భవేత్ ॥**

ఏ మానవుండు విద్యాగర్వముచేతగాని, మరియేద్దైన మోసకృత్యముచేతగాని జ్ఞానమార్గ ప్రవర్తకుని భంగపరచునో, అట్టివాడు మహాపాపి యగును

దైవమార్గమును లోకమందు బోధించువారిని విద్యాశక్తి లేకపోవుటవల్ల కుతర్కములచేతగాని, అల్లరిమురాచేతగాని భంగపఱచినచో, మహాపాతకము నొందగలరు కావున జ్ఞానమార్గప్రవర్తకుల కేలాటి యాటంకములను కలుగజేయరాదు అని సాక్షాత్పరమశివుండు తెలిపెను నదిని దాటుటకై నిర్మింపబడిన వంతెనను పడగొట్టుటెట్టిదో, ఏరును దాటుట కేర్పడిన పడవను విధ్వంస మొనరించుటెట్టిదో, అట్టిదే సంసార దుఃఖప్రవాహమును తరించుటకు ఈశ్వరాజ్ఞానువర్తులగు మహా ఋషులచే నిర్మితమయిన జ్ఞానమార్గసేతువును ధ్వంస మొనరించుటయును ఆలాగున సంసారసాగరమునుండి జీవులను తరింపజేయ నేర్పడిన జ్ఞాననావను నష్టపఱచువాడును పై జెప్పినట్టివాడే యగును ఒకవేళ తాను తరించినను, తక్కినవారు తరించుట కేర్పడిన యీ జ్ఞానసేతువును నష్టపఱచినవాడును దుష్టాత్ముడే అగును శ్రీమద్భాగవతమున శ్రీ వేదవ్యాసమహర్షియు నేలాగున వేదజ్ఞానమును లోకములో ప్రచారము చేసిరో క్రింది వాక్యములచే చూడుడు

పైలుండు ఋగ్వేదవరనంబు దొరకొనె
సామంబు జైమిని చదువుచుండె
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనె
దుది నథర్వము సుమంతుడు పఠించె
నఖిలపురాణేతిహాసముల్ మా తండ్రి
రోమహర్షణుడు నిరూఢిదాల్చె
దమ తమ వేద మాతవనులు భాగించి
శిష్య సంఘములకు జెప్పిరంత

శిష్యులెల్లను నాత్మీయ శిష్యజనుల
కంత బహుమార్గముల ద్రుంచి యనుమతింప
బెక్కు శాఖలు గలిగి యీ వృథివిలోన
నిగమ మొప్పారె భూసుర నివహమందు.

ఈ తెనుంగు పద్యమునకు సరియయిన సంస్కృతమును చూడుడు

ఋగ్వేదపారకం పైలం జగ్రాహ స మహామునిః ।
వైశంపాయననామానం యజుర్వేదస్య చాగ్రహీత్ ॥

జైమినిం సామవేదస్య తథైవాథర్వవేదవిత్ ।
సుమన్తుస్తస్య శిష్యోఽభూ ద్వేదవ్యాసస్య ధీమతః ॥

రోమహర్షణనామానం మహాబుద్ధిం మహామునిః ।
సూతం జగ్రాహ శిష్యం స ఇతిహాసపురాణయోః ॥

దీని యర్థము పై భాగవతపద్యములో నిరూపింపబడినదే.

శ్రీ వేదవ్యాసు లేలాగున తన వేదమతమును పైల వైశంపాయన జైమిని సుమన్తు సూతాది మహర్షులచే లోకమున వ్యాపింపజేసిరో, ఆలాగున శివమతమును, సిద్ధమతమును, శ్రీ వామదేవ మహామునియు నేలాగున ప్రచారము జేసిరో యీ క్రింది ప్రమాణముచే తెలిసికొనగలరు

భజనల వంటివే యగును అదియునుగాక తుపాకిమందుమాత్రమువేసి గుండువేయని షుర ఫిరంగి ధ్వనివలెను, లోపల గింజలేని వట్టి టెంకి ఉమకవలె ఉండెడు కృషివలెను నుండును, దీనితోను తృప్తినొందక గురుదేవు డుపదేశించిన గురుతునుండి, లక్ష్యమునుండి, ఆత్మనుండి జారక చూచుటయు గొప్ప గురుసేవ యగును అట్టివాడు గురుదేవునికి దూరముగా నుండినను దగ్గరగా నుండువాడే యగును గురుతునుండి జారినవాడు గురుదేవుని దగ్గఱ యుండినను చాలాదూరమున నుండువాడే యగును గురుదేవుడు నడిచిన అడుగుజాడనుండి కొంచెమైనను చలింపక నడచువాడే గురుపాదసేవకు డగును అటులగానివాడు గురుపాదసేవ జేసినను, చేయనివాడే అని నిశ్చయించు కొనవలయును మరియు గురుదేవు డనుభవించిన అనుభవజ్ఞానమును, దైవజ్ఞానమును అనుభవవాక్యమును చక్కగా అనుష్ఠానములో నుంచి ప్రవర్తించువాడే గురుప్రసాదమును, గురూచ్ఛిష్టమును భుజించిన వాడగును అటుల గాక గురూచ్ఛిష్టముకొరకు, గురుప్రసాదముకొరకు పోట్లాడువారు సత్యదూరులే అయితే వీరికి కొంచెము పుణ్యమున్ను కొంత పాపక్షయమున్ను మాత్రమే గలుగును

**ఉత్పాదక బ్రహ్మదాత్రోః గరీయాన్ బ్రహ్మదః పితా ।**
**బ్రహ్మజన్మ హి విప్రస్య ప్రేత్యచేహ చ శాశ్వతమ్ ॥**

దేహోత్పత్తికి కారణభూతులగు తల్లిదండ్రులకన్న, ఆత్మజ్ఞాన ముపదేశించిన శ్రీ గురుదేవు డధికుడు ఏలననగా తల్లిదండ్రు లొసంగిన యీ దేహము జడము, నశ్వరము, గురుదేవు డొసంగిన ఆత్మస్వరూప జ్ఞానము, చైతన్యము, దివ్యము, అమృతము, శాశ్వతము ఇహ మందును పరమందును సుఖమును గలుగజేయునది కావున బ్రాహ్మణులకు ద్విజులని మరియొక పేరుగలదు ద్విజుడన రెండవజన్మము గలవాడు తల్లిదండ్రులచే నేర్పడిన యీ స్థూలశరీరములోనుండి ఆత్మజ్ఞానము గలుగజేసినవాడు గురుదేవుడు ఈ జ్ఞానము గలిగినవాడు ద్విజులలో జన్మింపకపోయినను, ద్విజుడే యగును ద్విజులలో జన్మించినవాడైనను, ఈ జ్ఞానము పొందనివాడు ద్విజుడు కాజాలడు కావుననే ఒక తల్లిదండ్రులకు పుట్టిన బిడ్డలందఱు సోదరీ సోదరులను వాక్యమెట్లుండునో, ఆలాగున ఒక గురుదేవుని కేర్పడిన స్త్రీ

పురుష శిష్యులందఱున్ను గురుపుత్రులు అని వాడుకలో నుండుటయు తగును ఇప్పుడు గురుపరమ్పరగా ఋషి పరమ్పరగా, ఈశ్వర పరంపరగా వేదపరంపరగా వచ్చుచుండెడు ధర్మసేతువును విచ్ఛేదము జేయగూడదని కొంతవరకు మనము తెలిసికొన్నాము ఈలాగున ఋషిధర్మమును బోధించుటకు శక్తిలేనివారున్ను, అసూయాపరులున్ను, పరుల శ్రేయస్సునుజూచి సహింపజాలనివారును అగు కొందఱు సాధువేషధారులుమాత్రమే పై జెప్పిన ధర్మబోధకుల గొప్పతనమును గాంచి సహింపజాలక సాధువులకు, సన్న్యాసులకు ఈ జనులతో నీప్రపంచముతో నేమి సంబంధము? అని చెప్పుచుందురు ఏలననగా, తమదగ్గఱ ఎవరును చేరకపోవుటచేతను, తమవాక్యముల నెవరును విని తన్నాదరింపక పోవుటచేతను గలిగెడు అసూయ మాత్రము ఇదియని గ్రహించుకొని ధర్మప్రబోధమును చేయుడు వారిమాట లెట్టివనగా జంబుకవైరాగ్యము, త్యాగమువంటివే యగును జంబుకమనగా నక్క అని అర్థము ఒక ప్రదేశమున పెద్దద్రాక్షతోట యుండెను అది పందిలిపై బాగుగా ద్రాక్షఫలములతో నిండి యుండెను రాత్రిలో ఒక నక్క ఆఫలములను తినుటకై వెళ్ళి యెంత ఎగిరెగిరి చూచినను, అందకపోవుటచేత అభావవైరాగ్యము గలిగి వెళ్ళుచున్నప్పుడు మఱియొక నక్క ఏమి, పండ్లను భుజింపక వెళ్ళిపోవుచున్నావని అడుగగా, అవి యికను బాగుగా మగ్గలేదు, పుల్లగా నున్నవి, అందువలన తిరిగి పోవుచున్నానని చెప్పినటుల పై వారి వాక్యము లుండునని ప్రజ్ఞావంతులు గ్రహించుకొనవలయును ఇక శ్రీ దక్షిణామూర్తులవారి ఆత్మీయశిష్యులగు సనకాదులగురించి తెలిపి, ఈ విషయమును విరమించెద

**సనకస్సనాతనశ్చైవ ప్రభుర్యశ్చ సనన్దనః ।**
**విభుస్సనత్కుమారశ్చ నిర్మలో నిరహంకృతిః ॥**

**సనకశ్చ సనన్దశ్చ సనాతనమునిస్తతః ॥**
**సనత్సుజాత ఇత్యేతే యోగివర్యాశ్శివప్రియాః ॥**

1 సనకుడు, 3 సనాతనుడు, 3 సనన్దనుడు, 4 సనత్కుమారుడు వీరలు ఆత్మజ్ఞాన ప్రభువులుగాను, నిర్మలులుగాను, నిరహంకారులుగాను ఉంటున్నారు ప్రభువులని ప్రయోగించుటకు కారణమేమనగా ప్రజలలో

ప్రభువేలాగున అధికుడో, ఆలాగున యోగులలో వీరు సార్వభౌములగుటచేతనే ప్రభువులని ప్రయోగించిరి రెండవ శ్లోకమున సనత్కుమార స్థానములో సనత్సుజాతయని గలదు వీరు నలువురును మహాయోగివర్యులుగా, ఈశ్వరప్రియులుగా నుంటున్నారు ఇట్టివారు సహ బ్రహ్మజ్ఞానమును, యోగవిద్యను లోకములో ప్రచారము జేసిన వారలే కావుననే వేదమునకు శ్రుతియని నామాన్తరము గలిగినది శ్రుతియనగా, శ్రవణముద్వారా పరంపరగా వచ్చినదని అర్థము, కాబట్టియే యిప్పుడును ఆచార్యునివద్ద వేదము చదువవలయుననియు, ఆచార్యుండు స్వయముగా నుచ్చరించి నేర్పవలయుననియు చెప్పుదురు స్వయముగా గ్రంథమునుచూచి చదువుటకు అది సాధ్యముగాదు కావుననే ఉపనయనకాలమున ఆచార్యుడుగాని, తండ్రిగాని వేదమూలమగు గాయత్రీ మంత్రమును చెవిలో చెప్పుచు వచ్చుచున్నారు ఆలాగుననే గురుదేవుడున్ను కర్ణమందే గురుమన్త్రము నుపదేశించును ఈలాటి అనేక కారణములచే వేదమును శ్రుతియని చెప్పుచున్నారు శ్రీ భగవద్గీతలోను భగవానుడు అనాదిగా వచ్చుచుండెడి ధర్మమార్గవిచ్ఛేదము జేయగూడదనియే దెలిపియున్నారు అ 4

**ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్ ।**
**వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥**

**ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్ష యో విదుః ।**
**స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప ॥**

**స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥**

దీనికన్న పరమ ప్రమాణము మరియేమి కావలయును?

నేను నాశరహితమయిన యీ నిష్కామకర్మయోగమును, సృష్ట్యాదియందు సూర్యభగవానునికి చెప్పియుంటిని ఆ సూర్యుడు తన పుత్రుడగు వైవస్వతమనువుకొఱకు నుపదేశించెను ఆ మనువు ఇక్ష్వాకు మహారాజుకొఱకు బోధించెను ఓ యర్జునా! ఇటుల పారంపర్యముగా ననుష్ఠించుచు వచ్చిన యీ

నిష్కామకర్మయోగమును రాజర్షులు ఆచరించుచు వచ్చిరి ఆ యోగము బహుకాలము గడచుటచే నీలోకమునందు నశించినదాయెను నాకు భక్తుడవును, సఖుడవును నయితివి కావున అనాదియయిన ఆ నిష్కామకర్మయోగమే యిప్పుడు నీకొఱకు నాచే చెప్పంబడినది మహోత్తమమయిన యీ నిష్కామకర్మయోగము, రహస్యమయినది గదా? భగవంతుడు దీనియందు "రాజర్షయః" అని ప్రయోగించెను ఆ కాలపు రాజులు ఋషులయిన వారుగానే యుండిరి ఇప్పుడుండువారు ఋషిత్వమును విడిచిరి రాజులుమాత్ర మయిరి, బహుకాలమునం డీయోగవిద్య నాశమొందుటకు గారణమేమని సంశయించు వారు చాలామంది గలరు కొంతమంది భాష్యకర్తలు శిష్యపరంపరగా అనుష్ఠించువారు లేకపోవుటచే నశించినదని వ్రాసిరి ఆ శిష్యపరంపర లేకపోవుటకు కారణమేమను ప్రశ్న మిగిలియే యున్నది మహాభారత ఆదిపర్వమునం దిదేప్రకారముగా జెప్పకపోయినను మఱియొక విధముగా దెలిపియున్నారు అదేమన, పరశురాముడు క్షత్రియులపై కోపము వహించి యిరవైయొక్కసార్లు దేశమంతయు తిరిగి క్షత్రియుల నిర్మూల మొనరించెను అందుచే క్షత్రియపరంపరగా ననుష్ఠించుచువచ్చిన యీ నిష్కామ కర్మయోగము నష్టమాయెను ఆలాగున క్షత్రియ వినాశమును పరశురాము డొనర్చుటకు హేతువును భారతమున దెలిపిరి కార్త వీర్యార్జునుడు వేటకై వెళ్ళి జమదగ్ని మహర్షి ఆశ్రమములో నుండు కామధేనువును కోరుటయు, ఆ ఋషి యివ్వకపోవుటయు, ఆ మహర్షిని వధించుటయు కారణము అందువల్ల జమదగ్నిమహర్షి పుత్రుడగు పరశురాము డధర్మప్రవర్తకులగు నీ రాజులవంశములను లోకమున లేకుండ చేయవలయునని తలంచుటవలన నిట్టి మహాఘోరవిపత్తు సంభవించెను పరశురాముడు త్రేతాయుగమున నుండినవాడు

గీతను భగవాను డుపదేశించినది ద్వాపరాన్తమున కాబట్టి మధ్యకాలము చాలా గడచినదని చెప్పుట సమంజసముగా నుంటున్నది ప్రతి శాస్త్రమునకున్ను మాహాత్మ్యము గలదు అందు దీనిననుష్ఠించు వారున్ను, ఇతరులచే ననుష్ఠింపజేయువారున్ను ధర్మాత్ములనియు, పుణ్యాత్ములనియు, వారికి మోక్షము గలుగుననియు తెలుపబడియుండెనేగాని, దాని నెవరికిని నుపదేశింప రాదనియు,

నశింపజేయవలయు ననియు ఏ శాస్త్రమందు గాని, యేవ్రతమందుగాని కనుపించదు కావుననే మొట్ట మొదట సూతసంహితలోగల ఈశ్వరవాక్యమును నిరూపించిరి గీతలోను ఆలాగుననే నిరూపించడమైనది

**య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥**

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥**

ఎవ డీపరమ రహస్యమగు గీతాశాస్త్రమును నా భక్తులకు చెప్పుచున్నాడో, వాడు సంశయరహితుడై నాయందే సర్వోత్కృష్టమైన భక్తిని చేసినవాడై, నన్నే (మత్సాయుజ్యమునే) పొందగలడు మనుష్యులలో నా భక్తులకు గీత జెప్పువానికంటె నా కధిక ప్రియము జేయువాడొక్కడున్ను లేనేలేడు భూలోకమున వానికంటె నితరుడు మిక్కిలి యిష్టుడు కలుగనుకూడ గలుగడు అనగా శ్రీ భగవద్గీతను భక్తులకు బోధించువానికన్నను భగవానునకు ప్రీతి గలుగజేయువాడు ఇదివరలో నుండియుండలేదనియు, ఇప్పుడుండుట లేదనియు, ఇక నుండబోడనియు స్వయముగా భగవానుడే తెలిపెను, అట్లు చెప్పకపోయిన నే శాస్త్రమయినను అప్పుడే నశించియుండునుగదా ఈలాగున చెప్పుటవలనగదా శాస్త్రము శాశ్వతముగా నిలుచుట కవకాశము గలుగును ఈ శ్లోకమున 'మద్భక్తేష్వభిధాస్యతి' అని భగవానుడు స్వయముగా ప్రయోగించుటవలన, భగవద్భక్తులెవరైనను వారలకు జెప్పులాగున గలదుగాని, పలాని జాతికిగాని, పలాని వర్ణమునకుగాని, పలాని ఆశ్రమము వారికిగాని చెప్పలేదని సిర్ధారణ యగుచున్నది గదా! ఇదేవిధముగా చాతుర్మాస్య మాహాత్మ్యమందు గీతను గురించిన కొన్ని శ్లోకములు గలవు

**భారతే భగవద్గీతా తథా నామ సహస్రకమ్ ।**
**గాయత్ర్యాస్స్మృతం ప్రోక్తం పుణ్యే పాపక్షయే తథా ॥**

**పాఠేన యత్ఫలం ప్రోక్తమర్థజ్ఞానాచ్చతుర్గుణమ్ ।**
**మద్భక్తేభ్యశ్శ్రావణాచ్చ పుణ్యం దశగుణం స్మృతమ్ ॥**
**వ్యాఖ్యానాచ్చాపి శిష్యేభ్యః పుణ్యం శతగుణం స్మృతమ్ ॥**

ఈ భగవద్గీతయు శ్రీ విష్ణుసహస్ర నామమున్ను మహాభారత మందుగలవు ఈ గీత గాయత్రీ మహామంత్రమునకు సమానమయినది గాయత్రిజపము పుణ్యాభివృద్ధికిని, పాపక్షయమున కెట్టిదో, యిదియు నటువంటిదే పారాయణముచే ఏ ఫలము జెప్పబడినదో, అర్థముతోగూడ పఠించిన నాలుగురెట్లు ఫలమధికము భగవద్భక్తులకు చెప్పుటవల్ల పదిరెట్లు పుణ్యమధికముగా గలుగును గీతకు వ్యాఖ్యాన మొనరించి జనులకు బోధించుచుండిన నూరురెట్లు అధిక పుణ్యఫలము గలుగును శాస్త్రమీలాగున నుండగా భగవద్ధర్మమును బోధించువారిని చిన్నబుద్ధితో తలంచువారి జన్మమెటువంటిదో, అనగా ఎట్టి అసురజన్మ గలవారో లోకవే ఊహించుకొనవచ్చును ఈలాగున శాస్త్రకర్తలు, మునులు చెప్పకపోయిన అనాదినుండి బ్రహ్మాది దేవతలున్ను, సనకాది యోగులున్ను, వ్యాసాదిమహర్షులున్ను, శంకరాచార్యాది గురువులున్ను ఆదినుండి నేటివరకును బ్రహ్మవిద్యా ప్రచారమును చేయుటకు కారణము లేకపోవునుగదా! ఈ శ్లోకమందును 'మద్భక్తేభ్యః' అని ప్రయోగించుటచే భక్తులెవరైన వారికే తెలుపవలయునుగాని, ఒక జాతియో, ఒక వర్ణమో, ఒక ఆశ్రమమో గలవారలకే అధికారము గలదని కనుపించుటలేదు ఇక నీలాగున చెప్పవలసియుండిన వేలకొలది శాస్త్రప్రమాణములు గలవు దానివల్ల గ్రంధ విస్తారమగునేగాని ఫలము ఇంతమాత్రమే యుండును అని తలంచి విస్తరించి వ్రాయ బూనలేదు ఇక కఠోపనిషత్తు చెప్పినది చూడుడు

**య ఇమం పరమం గుహ్యం శ్రావయే ద్బ్రహ్మసంసది ।**
**ప్రయతశ్శ్రాద్ధకాలే వా తదానన్త్యాయ కల్పతే ॥**
**తదానన్త్యాయ కల్పత ఇతి ॥**

ఎవడు పరమశ్రేష్ఠ మయినట్టియు, గోప్యమయినట్టియు నగు నీ బ్రహ్మవిద్యను బ్రహ్మవేత్తల సభయందు వినిపించునో, మరియు శుచియై శ్రాద్ధకాలమందు జనులకు వినిపించునో, ఆతనికి అటుల వినిపించుటవలన అనన్తమయిన పుణ్యఫలము గలుగును అనన్తమయిన పుణ్యఫలము గలుగును అని రెండుసార్లు తెలియపఱచుటయైనది

"య ఇమం పరమం గుహ్యం" అని ప్రయోగించుటవలన నెవడైనను నీ

యుపనిషద్విద్యను పఠించి జనులకు బోధింపవచ్చునని తెలియవచ్చుచున్నది మఱియు "బ్రహ్మసంసది" అనియు "శ్రాద్ధకాలే" అనియు తెలియజేయువల్ల ఉత్సవాది స్థలములలోను, సమారాధనాది ప్రదేశములలోను జనులు ఎక్కువగా చేరుదురని తలంచి యటుల ప్రయోగించిరి

**రవిశ్చన్ద్రో ఘనా వృక్షా నద్యో గావశ్చ సజ్జనాః ।**
**ఏతే పరోపకారాయ భువి దైవేన నిర్మితాః ॥**

సూర్యుడు, చంద్రుడు, మేఘములు, వృక్షములు, నదులు, గోవులు మొదలయినవన్ని యేలాగున పరోపకారముకొఱకు ఈశ్వరునిచే సృష్టింపబడినవో, ఆలాగున సజ్జనములున్ను అనగా జ్ఞానులున్ను లోకోపకారమునకే ఈశ్వరునిచే సృష్టింపబడిరను తత్త్వమును మరువకుడు ఇప్పుడు శ్రుతి స్మృతుల ఆశయము సంగ్రహముగా మీకు తెలుపబడెను

ఇక ఓషధులు, పశువులు, పక్షులుగూడ తమ తమ వంశములను నిలబెట్టి పోవుచుండునేగాని నశింపజేయుటలేదు ప్రకృతిలో దీనిని మీరలు జూడగలరు అయితే మాయ, కన్నుండియు సత్యమును మనుష్యులచే చూడనివ్వదు, చెవి యుండియు విన నీయదు అందువల్ల కండ్లార జూచియు చెవులారా వినియు తెలిసికొనకపోవుచున్నారు కదళీవృక్షమును చూడుడు అది గెలవేసి, ఫలము పక్వమునకు వచ్చునప్పుడు తన దేహమును వదలుచున్నది అప్పటికి నాలుగు లేక ఐదు పిల్లలను తనకు సమానస్థితిలోనికి ఉంచుకొనియే దేహమును వదలుచున్నది ఆలాగున పసుపు, చేమచెట్లున్ను ముదిరి తమ శరీరము పడిపోవునప్పటికి కొన్ని గడ్డలను తయారుజేసియే లోకమును వదలిపోవుచున్నవి ఓహో సృష్టికర్తయొక్క సత్యమెట్టిదో వీనిని చూచి మీరు తెలిసికొనకూడదా! ఆలాగున వృక్షములున్ను తమ సన్తతి బీజములను (విత్తనములను) నిలబెట్టి దేహమును వదలుచున్నవేగాని బీజముల నుత్పత్తిజేయక ఒక వృక్షముగాని, పైరుగాని తమ జీవితమును నాశమొనరించుట లేదు పక్షులున్ను ఆలాగున తమ వంశములగు బిడ్డలను భూలోకములో స్థిరముగా నుండులాగున జేసియే మరణించుచున్నవి గోవులు మొదలగు జంతువులున్ను పై జెప్పిన విధముగానే తమ వంశములగు దూడల

నుత్పత్తిజేసికొనియే దేహమును విడచుచున్నవి ఇక దీనికన్న పరమరహస్య మేమి గలదు? ఇది పురుషులకు మాత్రము సంబంధించినదని తలంచి స్త్రీలు ఊరకే యుండరాదు ఏలననగా పక్షులలోను, పశువులలోను ఆడపిల్లలును, మగపిల్లలును గలవు గదా! కావున బ్రహ్మచారులు బ్రహ్మచారులనున్ను, గృహస్థులు గృహస్థులనున్ను, వానప్రస్థులు వానప్రస్థులునున్ను, యతులు సన్న్యాసులనున్ను, ఉత్పత్తి (తయారు) చేసియే తమజీవితముల చాలించవలసియుందురు ఆలాగున బ్రహ్మచారిణులు బ్రహ్మచారిణులనున్ను, గృహిణులు గృహిణులనున్ను, వనవాసినులు వనవాసినులనున్ను, సన్న్యాసినులు సన్న్యాసినులనున్న ఏర్పాటుచేసికొనియే దేహమును వీడవలయును

అయితే దీనియందొక ప్రశ్న గలుగును అదేమనగా గృహస్థ స్త్రీ పురుషులు స్త్రీ పురుష సన్తతులను గలుగజేసికొనవచ్చును బ్రహ్మచర్య వానప్రస్థ యతులకు తమ సన్తతుల నెట్లు ఏర్పాటు చేయుటకు సాధ్యమగును? అయితే గృహస్థులవలె వీరున్ను వివాహితులు కావలసిన పనిలేదు బ్రహ్మచర్యవ్రత నిష్ఠగలవారు మంచి ఉత్తమ కౌమారావస్థలో నుండువారిని దగ్గఱచేర్చి బ్రహ్మచర్యవ్రతము నుపదేశించి తపోధ్యానాదులను నేర్పి తనవలెనె బ్రహ్మచారులుగా తయారు జేయుటయే యగును ఆలాగున వనవాసులున్ను ఉత్తమ గుణముగలిగి వైరాగ్య నిష్ఠగలవారిని దగ్గఱలోనికి చేర్చి వానప్రస్థునికి తగిన తపోధ్యానాద్యనుష్ఠానముల నేర్పవలయును ఆలాగున యతులున్ను సాధనచతుష్టయ సమ్పత్తి కలిగి ఆత్మశుద్ధిగలిగి బ్రహ్మనిష్ఠార్హత గలవారిని చేరదీసి సన్న్యాసి ధర్మముల నుపదేశించి బ్రహ్మవిద్యను, ఉపనిషద్విద్యను వేదాంతవిద్యను ప్రపంచములో బోధించులాగున సుశిక్షితులనుగా నొనర్చుటయే తమ సన్తతి నుత్పత్తిజేయుటయను అర్థమును గ్రహించి ప్రవర్తించవలయును కావుననే ఉత్తరహిందూస్థానములో బ్రహ్మచారుల ఆశ్రమములనియు, వానప్రస్థుల మఠములనియు, సన్న్యాసుల ఆశ్రమములనియు, యోగుల మఠములనియు నిప్పుడున్ను ననేకములు గనపడుచున్నవి ఆలాగున బ్రహ్మచారిణియగు స్త్రీయు, వనవాసినియగు నారియు, సన్న్యాసినియగు యోగినియు తమ తమ ఆశ్రమమునకు సంబంధించిన నారీమణులను తయారుచేయవలయును అప్పుడే వారు,

అనాదినుండి వచ్చెడు, ఋషుల ధర్మమును నిర్వహించినవార లగుదరు లేనిచో వంశ విచ్ఛేదకు లగుదురని మరువకూడదు ఇక ఈ విషయమై ఎక్కువ చెప్పతలంచలేదు

ఈ వంశవిచ్ఛేదనము చేయకుడు వంశాభివృద్ధిని చేయుడు అనునిట్టి బోధనలన్నియు మౌనముగానుండి వినుచుండిన, సంయమముగల్గి మహావైరాగ్య శాలియునగు నొకవ్యక్తి లేచి మేధాతిథి శ్లోకములను చదివి యిటుల ప్రశ్నించెను

**ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్యసంగ్రహః ।**
**దివాస్వాపో వృథాలాపో యతేర్బన్ధకరాణి షట్ ॥**

1 ఆసనము, 2 పాత్రలోపము, 3 సంచయము, 4 శిష్యసంగ్రహము, 5 దివాస్వాపము, 6 వృధాలాపము అను నీ యాఱును సన్న్యాసికి మోక్ష ప్రతిబంధకములు అని చెప్పియుండగా తాము శిష్యసంఘము నేర్పాటు చేయవలసినదిగా నెటుల నుడివెదరు?

సమాధానము - పవిత్రాత్మా! వైరాగ్యనిధీ! మేధాతిథి చెప్పిన ఈ శ్లోకమును చదివియుంటిని దీని కామహామునియే యా యాఱింటికిని ఆరు శ్లోకముల వ్రాసియున్నారు వానిని చదివినచో మీ కీసందేహము గలుగదు ఆ యాఱు శ్లోకములును తాత్పర్యసహితముగా రజతోత్సవ సంచికలో* ప్రకటితములై యున్నవి వానినే మరల యిచ్చట వ్రాయుట యుచితము కాదని తలంచెద అయితే శిష్యసంగ్రహము అను నొకదానియందుగదా మీకు సంశయ మేర్పడినది దాని యర్థమును మేధాతిథి తెలిపినది చూడుడు అదటుల నుండనిమ్ము

జనులారా! శిష్యసంగ్రహమునకు లోబడి చాలామంది బోధకులున్ను క్రిందికి జారిపోయిరి ఈ విషయములోను బోధకులు జాగ్రత్త పడవలసి యుందురు ఏ వాక్యమయిన నెవరైన చెప్పినచో దానియందు సారము గలదా లేదా అని మనీషులు

---

* రజతోత్సవ సంచికలోని శ్రీసద్గురు స్వాములవారి వ్యాసములు ఈ గ్రంథావళిలో పదునైదవ సంపుటమున చూడవచ్చును ( స ల )

జాగ్రత్తతో పరిశీలించుకొందురు పరిశోధించిన తరువాత సారముండిన గ్రహించవలయును, లేనిచో త్యజింపవచ్చును కావుననే శాస్త్రములయందు "బాలాదపి సుభాషితం" అనియు "అన్త్యాదపి పరం ధర్మం" అనియు తెలుప బడినది కావున శిష్యసంఘము నేర్పరచుటయందు మగ్నులై ఆత్మనిష్ఠనుండి జారనీయ కెల్లప్పుడు జాగ్రత్త గలిగియుండవలయును పై జెప్పిన శ్లోకములలో నాల్గవది శిష్యసంగ్రహము దానికి ఆ మేధాతిథియే చెప్పినది చూడుడు

**శుశ్రూషా లాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః ।**
**శిష్యాణాం న తు కారుణ్యాత్ న జ్ఞేయశ్శిష్యసంగ్రహః ॥**

తన శుశ్రూషకొరకున్ను, ఏదైన లాభము గలుగునని తలంచియు, పూజకొరకున్ను, కీర్తి గలుగునని తలంచియు, గొప్ప విఖ్యాతి గలుగవలయుననియు శిష్యులను చేర్చుకొనుట వలన మాత్రమే ప్రతిబంధము గలుగునుగాని, కేవలము దయచేత శిష్యులను కృతార్థులనుగా జేయవలయుననెడి తలంపుతో చేర్చుకొనుట బంధముగాదు అది శిష్యసంగ్రహమని చెప్పబడదు అటులగానిచో పూర్వికులగు ఋషులు, మహాత్ములు శిష్యులను చేర్చికొనియుండిరి కావుననే "శిష్యాణాం న తు కారుణ్యాత్, సజ్ఞేయశ్శిష్యసంగ్రహః" అనగా కేవలము సంసార సాగరములో తపించెడు విరక్తులను, జిజ్ఞాసువులను , ముముక్షువులను ఉద్ధరించు నిమిత్తమై చేర్చి బోధించుట శిష్యసంగ్రహములో చేరదు అనధికారులను చేర్చిన తన పనులు జరుగునను తలంపుతోను, అపరిపక్వ హృదయులగు ధనవంతులను చేర్చిన మనకు లాభము గలుగునను అను తలంపుతోను, ఆలాగున ఆత్మశుద్ధిలేని శ్రీమంతులనుగాని ఉద్యోగస్థులనుగాని చేర్చికొనిన తనకు గొప్పయశస్సు గలుగును అను తలంపుతోను అట్టి జనులను చేర్చుకొనిన తప్పక బాధగలుగును వారి కాత్మశుద్ధి లేనికారణముచేత వైరాగ్యపురుషులతో గలసియుండజాలరు వారి సౌఖ్యముకొరకే వీరలు సేవజేయవలసియుందురు వారీసాధుధర్మమునకు కట్టుబడి యుండరు అందువల్ల అశాంతి, కలహము తప్పక గలుగును కావున జ్ఞానుల ధనము వైరాగ్య ధనమేగాని, ప్రపంచ ధనము కాదని బాగుగా గురువులు జ్ఞాపకము జేసికొనవలయును

విరక్తులై బ్రహ్మనిష్ఠజేయువారు బీదవారైనను వారి కన్న వస్త్ర వసతులిచ్చి సాధన కనుకూలమైన యేర్పాట్లు జేయవలయును కొంత కాలము పోయిన అట్టి విరక్తులగు బ్రహ్మనిష్ఠులను జూచి అనేకులు కావలసిన ధనాదులను సహాయము జేయుదురు ఇది మఠములు గలవారు, ఆశ్రమములు గలవారు, గురువులు తప్పక గ్రహించవలసిన పరమ సత్యము ఈ సత్యము నెఱుంగక ధనవంతులనుగాని, ఉద్యోగస్థులనుగాని చేర్చుకొనినచో బీదవానికి ఏనుగును దానమిచ్చి నటులుండును పాపమతడెటుల ఏనుగును పోషింపగలుగును? అదియునుగాక బీదస్థితిలోనుండు కుటుంబమునకు గొప్ప శ్రీమంతుల కుటుంబమునుండి పతిభక్తి తెలియని కోడలిని వివాహము జేసినటుల వీరియొక్క గతియు కావుననే పరమశివుండు గురుగీతయందు పార్వతీదేవి కిటుల ఉపదేశించెను

**శాంకరీయం మహాశాస్త్రం న దేయం యస్య కస్యచిత్ ।**
**నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే ॥**

ఈశ్వర సంబంధమైన యీ బ్రహ్మవిద్య వానికి వీనికి అనగా నియమ నిష్ఠ లేనివానికి చెప్పరాదు మఱియు నాస్తికునకు, కృతఘ్నునకు, దుర్వృత్తునకు, దురాత్మునకును చెప్పరాదు

**గురుభక్తివిశుద్ధాన్తఃకరణాయ మహాత్మనే ।**
**సమ్యక్పరీక్ష్య దాతవ్యం మాసం షణ్మాసవత్సరమ్ ॥**

గురుభక్తియు, పరిశుద్ధహృదయమున్ను, గొప్ప బుద్ధియు గలవారైనను వారిని సహా చక్కగా సంవత్సరముగాని, ఆరునెలలుగాని, కట్టకడకు ఒక మాసమైనను పరీక్షించి మాత్రమే యీబ్రహ్మవిద్య నుపదేశించవలయును లేనిచో అనేక అనర్థములకు కారణమగును

**అశిష్యాయావిరక్తాయ యత్కించిదుపదిశ్యతే ।**
**తత్ప్రయాత్యపవిత్రత్వం గోక్షీరం శ్వదృతావివ ॥**

ఆవుపాలు పూజార్హమై పవిత్రమైన దయినను, కుక్కచర్మముతోజేసిన తిత్తిలోపోసిన అదెటుల అపవిత్రమై, పూజార్హముగాక పోవునో, ఆలాగున శిష్యున

కుండవలసిన సుగుణములు లేనివానికిని, వైరాగ్య రహితునికిని ఉపదేశించిన ఆ మంత్రము పాడైపోవును

**ఆదౌ శమదమప్రాయైర్గుణైశ్శిష్యం విశోధయేత్ ।**
**పశ్చాత్సర్వగతం బ్రహ్మ శుద్ధస్త్వమితి బోధయేత్ ॥**

మొట్టమొదట ముముక్షువగువాడు గురువువద్దకు వచ్చునపుడు శమదమాది సాధన చతుష్టయ గుణములను శోధించి, సర్వగుణ సంపన్నుడై యుండినయెడల సర్వాన్తర్యామియైన శుద్ధబ్రహ్మస్వరూపుడవే నీవని మహావాక్యము నుపదేశింపవచ్చును మనఃపరిపక్వత లేనివారికి జప ధ్యాన యోగాదులను బోధించుట శ్రేష్ఠము



# చిత్తైకాగ్రత

చిత్తమున కేకాగ్రతయు, నిర్మలత్వమున్ను గలిగిన మాత్రమే యందరిలోను నిగూఢమై వ్యాపించియుండు ఆత్మను లేక ఈశ్వరుని దర్శింపగలరు

**ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥**

ఈయాత్మ సకల ప్రాణులందు గూఢముగా నున్నవాడై యున్నందుచే ప్రకాశించుట లేదు మఱేమన ఏకాగ్రత్వము గలిగిన సూక్ష్మమైన బుద్ధితో, సూక్ష్మదృక్కులగు మహర్షులచే చూడబడుచున్నాడు అని కఠోపనిషత్తు తెలుపుచున్నది గీత యందును శ్రీ కృష్ణభగవాను డీవిధముగానే చెప్పెను

**సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్॥ (13-16.)**

ఆత్మజ్ఞాన సాధనములేని బహిర్దృష్టి గలవారికి బహుదూరముగా నుండునదియు, ఆత్మజ్ఞాన సాధనము గలిగి యంతర్దృష్టి గలవారికి మిక్కిలి సమీప

మందుండునదియు నగుచున్నది

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోవాప్తుముపాయతః ॥ (6-36)**

యోగము మనోనిగ్రహము లేనివానిచేత పొందబడదగినదిగాదు యత్నించుచున్న మనోనియమము గలవానిచేత అభ్యాస వైరాగ్యములనెడు ఉపాయములవలన పొందుటకు సాధ్యమైనదని నా యొక్కమతము

ఈ శ్రుతి స్మృతులు చిత్తమున కేకాగ్రత, పరిశుద్ధతయు గలుగక పోవుటయే మనసులో వెలుగుచుండు నాత్మను దర్శింపకపోవుటకు కారణమని విశదీకరించుచున్నవి మీ చేతి యందొక చిన్న గడియార ముంటున్నదని గ్రహించుడు ఏదైన శబ్దముండు స్థలమున నా గడియారమాడుట తెలియుటకై చెవిదగ్గఱ బెట్టి చిత్తైకాగ్రతతో జూచిన మాత్రముననే, ఆ సూక్ష్మశబ్ద మేలాగున వినవచ్చుచున్నదో, ఆలాగున చిత్తనిరోధము గలుగజేసిన మీలో మనోబుద్ధులకు సాక్షియై వెలుగుచుండు ఈశ్వర సత్యమును, ఈశ్వర స్వరూపమును దెలిసికొనగలరు అట్లే షణ్ముఖీ ముద్రలో కర్ణరంధ్రముల రెంటిని మూసికొని యేకాంతస్థలములో చిత్తము నేకాగ్రపఱచుచుండిన, తనలోగల ప్రణవశబ్దమును అందరును వినగలరు అందరిలో నెల్లప్పుడును ఓంకార ధ్వని గలుగుచున్నప్పటికి మనస్సును నిర్మలముగాను, నిశ్చలముగాను జేయని కారణముచే నెల్లప్పుడును ఎల్లరును దానిని వినకపోవుచున్నారు అయితే ఇది నాదబ్రహ్మోపాసనతో జేరిన దైనను అంతటితో తృప్తినొందక ఆ నాదము నేది గుర్తెరుంగుచున్నదో అదియే యాత్మస్వరూపమని గ్రహించుకొనవలయును అభ్యాసకులకు మొదట నాదమందే ప్రీతియున్నను, క్రమముగా ఆ నాదము నేయాత్మ తెలిసికొనుచుండునో ఆ స్థితిలోనికి జేరవలయును

**యేన రూపం రసం గంధం శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్ ।**
**ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే ఏతద్వైతత్ ॥**

దేహాది వ్యతిరిక్తమైన యాత్మచేతనే సమస్తప్రాణిజాతము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విషయసుఖములను చక్కగా తెలిసికొనుచున్నది ఇట్లుండ నీ

ప్రపంచమునందాత్మచే తెలియబడని దేదియుండును? అట్టియాత్మ యిదియే యని యెరుంగవలయును

**నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః ।**
**నాశాన్తమానసో వాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥**

పాపకర్మమునుండి విరమింపనివా డీయాత్మను బొందజాలడు ఇంద్రియ చాపల్యముచే శాన్తిలేనివా డీయాత్మను బొందజాలడు ఏకాగ్రతచిత్తము లేనివా డీ యాత్మను బొందజాలడు బహువిషయములందు వ్యాప్తమైన మనస్సుగలవా డీ యాత్మను బొందజలాడు బ్రహ్మవిజ్ఞానము చేతనే యీ యాత్మను బొందగలుగును కఠశ్రుతియు నీలాగున తెలుపుచున్నది

కొన్ని సంప్రదాయములవారు జపమాల పట్టుకొని జపించుటచేత మాలయందును, లెక్కయందును మనస్సు పోవుచున్నందుచే జ్ఞేయమగు నాత్మయందు నిలుకడ గలుగదని చెప్పుదురు అంతఃకరణశుద్ధి గలుగుటకును, పాపము నశించుటకును దివ్యమంత్రజపము తప్పక చేయుచునే యుండవలయును

**జప్యేనైవ తు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః ।**
**కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥**

బ్రహ్మనిష్ఠుడు జపముచేతనే నిస్సంశయముగా మోక్షసిద్ధిని పొందును తక్కిన వైదిక కర్మలను చేసినను సరియే, చేయక వదలినను సరియే, సర్వప్రాణులయందు మైత్రితోనుండువాడు బ్రాహ్మణుడని చెప్పబడుచున్నాడు

ఈ విధి ననుసరించి జప మాచరించు నప్పుడుగూడ జ్ఞేయమగు నీశ్వర స్వరూపమున, లేక యాత్మస్వరూపమున మనసు నిలువులాగున నాచరించవలయును జపానంతరము జపమాలనుగూడ [illegible]ందు కొంతకాల ముండులాగున అభ్యాసము చేయవలయును అ[illegible] జపధ్యానములనుండి లేచినపిమ్మట నేకార్యములు చేయు[illegible]ండినను [illegible]క్షయ[illegible] దైవభావములో సదా మనస్సు నిలుప శక్యమగు[illegible] అట్లుగాక[illegible] జపములు జేయునప్పుడు జపమాలయందు మనస్సు పోవుటవలన [illegible]భావములో మనసు

నిలువజాలదని చెప్పువార లున్నందుచే ఆ ధ్యానకాలములోనే కొంతసేపు మనస్సు నిలువగలదు ఇతర కార్యములు జేయునప్పుడు నిలువజాలదనియు వారి వాక్యమువలననే యర్థమగుచున్నది నిరంతర మన్నికార్యములు చేయునప్పుడుగూడ దైవభావములో నుండి ఇంద్రియముల చేత క్రియలు చేయునప్పటికిని, దైవస్థితిలో సదాయుండు జ్ఞానమే మనకు కావలసియున్నది అట్లుగాక ధ్యానములో నున్నప్పుడు మాత్రము దైవభావమును గల్గించునట్టియు, ఇతర కార్యములు చేయునప్పుడు ఆత్మవిస్మృతి గలిగించు యోగముగాని జ్ఞానముగాని మన కవసరము లేదు ఈ విషయమై శ్రీకృష్ణ భగవానుడు అ 5 శ్లో 7 నుండి నాలుగు శ్లోకములచే నిరూపించినారు అయితే ఇంద్రియము లింద్రియార్థ కార్యములలో ప్రవర్తించినను ఇంద్రియ విషయములచే నెవడు మలినము నొందడో, ఇంద్రియార్థకర్మలచే నెవడు బద్ధుడు కాడో అట్టి యధికారినిగురించి మొట్టమొదటి శ్లోకములోనే 5 లక్షణములు చెప్పినారు మొదటివి నాలుగును యోగమును గురించియు, ఐద వది జ్ఞానమును గురించి యనియు గ్రహించవలయును మొదటివి నాలుగు వాక్యములు విచారించిన నొకే యర్థము నిరూపించుచున్నవి అయినను మరల మరల నొక్కి వక్కాణించుటకు కారణమేమనగా అది చాలా యగాధమైన విషయమగుటచేతను, సామాన్యులకది దుస్సాధ్యమగుటచేతను పునరుక్తిదోషమును పాటింపక భగవాను డుపదేశించెను

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।**
**సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥**

శుద్ధాంతఃకరణుడును జపింపబడిన మనస్సు గలవాడును,ఇంద్రియ నిగ్రహము గలవాడును, సమస్త ప్రాణులలోగల యాత్మయు తనయాత్మయే యను జ్ఞానము గలవాడునగు జ్ఞాన నిష్ఠాపరుడు కర్మల నాచరించుచున్నను, బద్ధుడు కాడు

దీనివలన ఇంద్రియములు ఆ యా విషయములలో ప్రవర్తించినను, నేను కేవల సాక్షి మాత్రుడను నాకు బంధము గలుగదని చెప్పువారు భగవానుడు నిరూపించిన అధికారి లక్షణములో నెంతవరకు నిలుకడగలిగి యున్నారను విషయమును విజ్ఞులే తెలిసికొనవచ్చును పై నిరూపింపబడిన ఆత్మస్థితి గలవాడు

ఈక్రింద వివరింపబోవు విధముగా నింద్రియములచే కర్మల జేయుచున్నను కర్మ జేయువాడుగాని, చేయించువాడుగాని, కర్మఫలముచే బద్ధుడు కాడని, శ్రీ భగవంతుడే స్పష్టముగా దెలిపెను

**నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।**
**పశ్యన్ఛృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపన్శ్వసన్ ॥**
**ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।**
**ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥**

బ్రహ్మజ్ఞాన సంపన్నుడు చూచుచున్నను, వినుచున్నను, తాకుచున్నను, ఆఘ్రాణించుచున్నను, తినుచున్నను, నడచుచున్నను, నిద్రించుచున్నను, శ్వసించుచున్నను, మాటలాడుచున్నను, మలమూత్ర విసర్జనము జేయుచున్నను, దేనినేని గ్రహించుచున్నను, కన్నుల దెరచుచున్నను, కన్నులు మూయుచున్నను, ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నవని యెంచుకొనిన వాడగుచు, కొంచెమేని నేను చేయుట లేదని తలంచును

**బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న న పాపేన పద్మపత్రమివాంభసా ॥**

ఏ బ్రహ్మజ్ఞాని, సకల కర్మలను పరమాత్మకు సమర్పించి ఫలమునందు కోర్కెలేక యుంటున్నాడో ఆ మహాత్ము డుదకముచే తామరాకు తడవనట్లు పుణ్య పాపరూపమైన స్వర్గనరకములచే బన్ధమును బొందడు

**సమ్యగ్దర్శనసమ్పన్నః కర్మణా న న బద్ధ్యతే ।**
**దర్శనేన విహీనస్తు సంసారం ప్రతిపద్యతే ॥**

ఆత్మయొక్క సాక్షాత్కార జ్ఞానముగలవాడు కర్మచే బద్ధుడుకాడు అట్టి ఆత్మసాక్షాత్కార జ్ఞానములేనివాడు కర్మచే బద్ధుడై సంసారమందు బద్ధుడగుచున్నాడు



# సందేశము

(రజతోత్సవ సమయమున 25-11-1954 భారతీయ వైశ్యపత్రికకు పంపినది)

ఓం సత్యం శాంతం దయ

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షుభిః

కరుణామూర్తియగు సర్వేశ్వరునియొక్కయు, పరమపావనులగు మహర్షులయొక్కయు కృపవలన లోకములో శాంతియు, కరుణయు, భక్తియు వర్ధిల్లునుగాక! భారతీయ వైశ్యపత్రికకు రజతోత్సవము జరుగుట శుభసూచకము

లోకములో జనులు శాంతి సౌఖ్యముల బొందవలసియుండిన బాహ్యధనముతో సహా ఆత్మధనము గూడ కలిగియుండవలయును కావుననే మన పూర్వులు స్వరాజ్యమనియు, స్వారాజ్యమనియు అనగా ఆత్మరాజ్యమనియు రెండుభాగములు జేసిరి మానవుండు దేవత్వమునకును పశుత్వమునకున్ను మధ్య నుండువాడు దేవతలకు దేహసుఖమును గురించిన విచారణ అవసరము లేదు ఏలననగా వారు సంకల్పసిద్ధులు పశువులకో ఆత్మను గురించిన విచారణలేదు మానవుడో దేహముతోను దైవముతోను సంబంధము గల్గియుండువాడు పశువులకు దేహపోషణ వల్ల గలిగెడు సుఖముతో తృప్తి గల్గును మానవుడట్లు గాదు దేహ భోగము లెన్నియుండినను ఆత్మశాంతి, ఆత్మసుఖము, ఆత్మ నిర్మలత్వము గలుగునప్పుడే నిరతిశయానందసుఖము పొందగలుగును కావున ప్రతి పత్రికలోను కొంతభాగము ఆత్మశాంతిని, భూతదయను గురించిన వ్యాసము లుండుట అవసరము ఇంతేగాక మహనీయుల దివ్యోపదేశములును, జీవితచరిత్రలున్ను, ఎంతో ఉపయోగపడును ఆలాగున పరిశ్రమచే పవిత్రులై ఉచ్చస్థానములోనికి వచ్చినవారి కథలుండిన జనుల కుత్సాహకరముగా నుండును మరియు మానవులలోగల తారతమ్య మంతయు కేవలము మతమునుగురించి మాత్రము కాదనియు, గుణమును గురించియే స్థిరమైన యునికి గలదనియు గల ప్రబోధ వాక్యములున్ను లోకమున కెంతో ఉపయోగకరములు అట్లుగానిచో జనుల యాత్మోన్నతికి అవకాశము గలుగదు

# దివ్యవాక్యములు

1 నిరక్షరకుక్షియైనను ఎవడైతే అక్షరస్వరూపుడగు పరమాత్మ ధ్యానము హృదయమున గలవాడో, అతడే యక్షరాభ్యాసము గలవాడగును అక్షర స్వరూపుడుగు పరమాత్మ నెరుంగనివాడు అనేక భాషాక్షరములు నేర్చినవాడైనను నిరక్షరకుక్షియే యగును

2 నిర్ధనుడైనను ఎవడైతే దైవధనము గలవాడగునో వాడే మహాధనవంతు డగును మహా ధనవంతుడైనను దైవధనము లేనివాడు మహా దరిద్రుడే యగును

3 సంసారమందుండిన వాడైనను ఆత్మసన్న్యాసము గలవాడెవడో వాడే సన్న్యాసి యగును సన్న్యాసి యైనను ఆత్మసన్న్యాసము లేనివాడు మహాసంసారియే యగును

4 కలియుగమందుండిన వాడైనను నిర్మలహృదయము గలవాడు కృతయుగమందుండువాడే కృతయుగమందుండు వాడైనను కల్మష హృదయము గలవాడు కలియుగమునందుండువాడే

5 బ్రాహ్మణ జన్మమెత్తిన వాడైనను బ్రహ్మము నెరుంగనివాడు శూద్రుడే యగును బ్రహ్మము నెఱింగినవాడు బ్రాహ్మణ కులమున పుట్టక పోయినను బ్రాహ్మణుడే యగును

6 పురుషుడై పుట్టినను పురుషప్రయత్నము నెరుంగనివాడు స్త్రీయే యగును స్త్రీయై జన్మించినను పురుషప్రయత్నము గల్గియుండిన పురుషుడే యగును

7 దేహమనెడు రాష్ట్రమున ఇంద్రియము లనెడు ప్రజలను సన్మార్గములో నడుపువాడు సార్వభౌముడే యగును సార్వభౌముడైనను ఇంద్రియములను సన్మార్గములో నడుపు శక్తిలేనివాడు దీన స్థితిలోనుండు ప్రజయేగాని, ప్రభువుగాడు

8 మానసాది వృత్తులనెడు శిష్యులను స్వాధీనములో నుంచువాడే గురుడగును మానసాది వృత్తులకు లోబడియుండు వానికి అనేక శిష్యులుండినను, అతడు శిష్యుడగునేగాని గురువు గాజాలడు



# అక్షరాభ్యాసము

మన పూర్వ ఋషులు మన విద్యాభ్యాసమునకు అక్షరాభ్యాసమని నామకరణ మిడిరి ఎప్పుడైనా ఈ బాలుడు అక్షరాభ్యాసమనిన దానియొక్క అర్థమును తెలిసికొనెడు దశలోనికి రావచ్చుననను భావముతోనే యిట్టిపేరును పెట్టిరి అక్షరాభ్యాసమునకు అక్షరముయొక్క అభ్యాసము అని అర్థము అక్షరము అని చెప్పినప్పుడు క్షరము మఱియొకటి యుండియే తీరవలయును ఇది స్త్రీ అనునప్పుడు స్త్రీకి భిన్నముగా పురుషుడెటు లుండవలయునో ఆలాగున అక్షరము అని చెప్పునప్పుడు అది క్షరమునకు అన్యముగా నుండవలయు ననియు బుద్ధి వికసించునప్పుడు తప్పక గోచరించును అప్పుడు బాల్యదశయందుండువాడు యౌవనావస్థకు వచ్చునప్పుడు క్షరమనగానేమి, అక్షరమనగానేమి యని గ్రహించుట కభిలాష గలుగును దీనినే నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానమని వేదాంతశాస్త్రమున పేర్కొనడమైనది ఈ నత్యమునే గీతయందు శ్రీకృష్ణభగవానులు అక్షరపరబ్రహ్మయోగమని పేర్కొని అష్టమాధ్యాయమున అర్జునునికొఱ కుపదేశించిరి ఈ అక్షరస్వరూపమునే అన్త్యకాలమున స్మరించి దేహమును వీడిపోవువాడు అక్షరపరబ్రహ్మ స్వరూపమును పొందగలడని భగవాను లుపదేశించిరి

అర్జునుడు అడిగిన ప్రశ్న "ప్రయాణకాలే చ కథం జ్ఞేయో஽సి నియతాత్మభిః" - నియమనిష్ఠగలవాడు దేహప్రయాణకాలమున నెట్టిభావ గలిగియుండిన నిన్ను (పరబ్రహ్మమును) పొందగలుగునను ప్రశ్నకు భగవానుడు నమాధానము పై జెప్పిన దానినే నిరూపించెను ప్రయాణకాలములో "నియతాత్మభిః" అని అర్జును డడిగెనేగాని, సన్న్యాసులనిగాని, బ్రాహ్మణులనిగాని, స్త్రీలని గాని, పురుషులనిగాని ప్రశ్నయందు లేదు ఇందువలన ప్రణవ ధ్యానమునకు ఆత్మ నిష్ఠగలవా రందఱును అర్హులని ద్యోతకమగుచున్నది అందఱికిని దానియందర్హత లేనిచో ఆ విషయ మిచ్చోటనే శ్రీకృష్ణుడు నిరూపించియుండును అయితే ఎవరైనను నియమనిష్ఠ గలవారు కావలయును కావుననే "నియతాత్మభిః" అని ప్రయోగించినారు ఎంతవఱకు ఈ అక్షరబ్రహ్మోపాసన గలుగలేదో అంతవఱకును నతడు అక్షరాభ్యానము లేనివాడనియే గ్రహించుకొనవలయును ఇట్టి అక్షర బ్రహ్మోపాసన గలవాడు బాహ్య అక్షరాభ్యాసము

అనగా విద్యలేనప్పటికిని ఇతడే అక్షరాభ్యాసము గలవాడగును ఇట్టి అక్షర బ్రహ్మోపాసన లేనివాడు ఎన్ని అక్షరములను అనగా విద్యలను నేర్చుకొనినను, అక్షరాభ్యాసము లేనివాడనియే గ్రహింపవలయును కావుననే" అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే'' అనుచోట అక్షరము పరబ్రహ్మ స్వరూపమనియు, అదియే అందఱియొక్క ఆత్మ స్వరూపమనియు భగవదాశయము కావుననే అక్షరభ్యాసమున మొట్టమొదట ఓంకారము నుపదేశించిరి

పురుషోత్తమ ప్రాప్తియోగమగు పదునైదవ యధ్యాయమునందును, క్షరాక్షరములనుగూర్చి భగవానుడే వివరించి తెలిపెను "క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే'' సమస్త భూతములున్ను క్షరములనియు, కూటస్థుడగు ఆత్మయే అక్షరుడనియు ఉపదేశించబడినది ఇది మహావాక్యములలో మొదటిదియగు "ప్రజ్ఞానంబ్రహ్మ" అను ఋగ్వేద ఐతరేయోపనిషత్తులోగల వాక్యమగును విశ్వరూపసందర్శన యోగమగు పదునొకండవ అధ్యాయములోను అక్షరస్వరూపమును పరబ్రహ్మముగానే వర్ణించిరి

**త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వమవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే ॥**

ఈ తెలియదగిన పరబ్రహ్మము నీవే ఈ ప్రపంచమున కాధారభూతుండవు నీవే, నాశములేనివాడవు నీవే, శాశ్వతధర్మమును పాలించువాడవు నీవే, సనాతన పురుషుడవు నీవే అని తలంచుచున్నాను

ఇచ్చటను "త్వమక్షరం" అని ప్రయోగించుటవలన అక్షరస్వరూపుడు పరబ్రహ్మమనియే గ్రహింపనగును అదియునుగాక "సనాతనస్త్వం" ఆ అక్షరస్వరూపుడగు పరమాత్మయే సనాతనమనిగూడ తెలియపఱచబడినది ఇట్టి సనాతనమును అవలంబించినవారే సనాతను లగుదురు కాని సనాతనులని చెప్పుచు అట్టి అక్షరస్వరూపుడగు పరమాత్మస్వరూపము ననుష్ఠించని వారెటుల సనాతను లగుదురు? మఱియు అష్టమాధ్యాయమున అర్జునునికొఱకు బ్రహ్మోపదేశమును

చేయుటకు ముందుగా ఓంకారముయొక్క ప్రభావమును గురించి భగవంతుడు ఉపోద్ఘాతముగా ఉపన్యసించిన పిమ్మటనే బ్రహ్మోపదేశమును చేసెను దేనిని గురించియైనను దానియొక్క మాహాత్మ్యము తెలియకపోయిన దీనియందిట్టి మహిమ గలదని తెలిసికొని యెటుల అనుష్ఠానము జేయగలరు? దీనిని గ్రహించియే ఓంకారముయొక్క ప్రభావమును గురించి బోధించిన పిమ్మట అర్జునునకు బ్రహ్మోపదేశమును జేసిరి

**యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥**

వేదార్థసార మెరింగినవారు దేనిని నాశములేని దానినిగా చెప్పుచున్నారో, రాగరహితులయిన యతులు దేనిని ప్రవేశించుచున్నారో, దేని నిచ్ఛగించిన వారగుచు బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నారో ఆ స్థానమును (బ్రహ్మపదమును) సంక్షేపముగా నీకొఱకుపదేశించుచున్నాను

ఇచ్చట "యదక్షరం" అని మొదటనే తెలిపెను భగవానుడు ఎవరెవరిని సాక్షులుగా జేసికొని, యీ అక్షరస్వరూపమగు పరబ్రహ్మమును గురించి యుపదేశించెనో, అట్టి సాక్షులను తెలిసికొనినచో ఓంకారముయొక్క ప్రభావము నెఱుంగ గలరు ఇచ్చట 'వేదవిదః' వేదముల కడవఱకు చదివి వేదార్థము నెఱింగిన బ్రాహ్మణులను, 'యతయో వీతరాగాః' రాగద్వేషములు నశించిన సన్న్యాసులను సాక్షిగా నిరూపించిరి ఆలాగుననే సనకాది బ్రహ్మచర్యవ్రత నిష్ఠగలవారినిన్ని సాక్షిగా జూపిరి ఇందువల్ల అక్షర బ్రహ్మోపాసనయందుగల మహిమ యెట్టిదో,దానికి సాధన యెట్టిదో అది ఓంకారమని సాక్షాత్ శ్రీకృష్ణ భగవానుడే తెలిపియుండగా దాని ప్రభావమును గురించి మరియేమి చెప్పవలయును? ఇదేవిధముగా కఠోపనిషత్తునందు యమధర్మరాజు నచికేతసుడను పేరుగల ఋషికుమారునికిన్ని తెలిపియున్నాడు

**సర్వే వేదా యత్పదమామనన్తి**
**తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।**

**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి**
**తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓమిత్యేతత్ ॥**

సర్వవేదములు ఏ పదమును అక్షరమని ప్రతిపాదించుచున్నవో, సర్వవిధములగు తపస్సులున్ను ఏ యొక్క పదప్రాప్తిని వచించుచున్నవో, ఏయొక పదప్రాప్తికొఱకు విధిపూర్వకముగా బ్రహ్మచర్యానుష్ఠానము చేయుచున్నారో అట్టి పదవిని సంగ్రహముగా మీకొఱ కుపదేశించుచున్నాను అదియే ఓంకారమగును మరియు గీత క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమను పదమూడవ అధ్యాయమున తెలిపిన దానినిగూడ చూడుడు

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥**

బ్రహ్మాది స్తంబపర్యన్తముగల సమస్త వస్తువులందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని తన హృదయమున నెవడు సర్వము నశించినను నశింపనివానినిగా చూచుచున్నాడో వాడే చూచువాడు

ఆలాగున చూడనివాడు కన్నులుండియు లేనివానితో సమానుడు ఏలయన వాడు చూచినవన్నియు నశించు వస్తువులే నాశములేని ఆత్మను, దైవమును చూడకపోవుటచేత పుట్టంధునితో సమానుడని భగవానుడు తెలిపెను చూడందగినదేదో దానిని చూడక చూడందగని దానిని చూచినవాడు గ్రుడ్డివాడు కదా! ఈ విషయమై మనుమహర్షి మనుస్మృతియందు తెలిపినదానిని చూడుడు

**క్షరంతి సర్వా వైదిక్యో జుహోతి జయతి క్రియాః ।**
**అక్షరం త్వక్షరం జ్ఞేయం బ్రహ్మ చైవ ప్రజాపతిః ॥**

వేద విహితములయిన హోమ యాగ రూపములగు క్రియలన్నియు నశించుచున్నవి ఓం అను అక్షరము బ్రహ్మప్రాప్తికి హేతుభూత మగుటవలన నశింపదు ఏలయన ప్రజల కధిపతియు నీ బ్రహ్మమేకాన ఆ బ్రహ్మస్వరూపమగు ఈ ఓంకారమున్ను బ్రహ్మస్వరూపముగను, బ్రహ్మప్రతిపాదకముగను ఉండుటచేత ఓంకారమే బ్రహ్మము

ఈ మనుమహర్షియు క్షరాక్షరముల గురించి విమర్శించి "క్షరంతి సర్వావైదిక్యో" వేదములలోజెప్పిన క్రియలన్నియు నశించునవనియు, "అక్షరం త్వక్షరం జ్ఞేయం" వేదాంతములలో జెప్పిన అక్షరస్వరూపుడగు పరమాత్మయే తెలిసికొన దగినదనియు జెప్పిరిగదా! మానవసృష్టిలో మొదటివాడును, పరమ ఋషియు అగు మనువు జెప్పిన వాక్యము నాలోచించుకొనుడు లేనిచో ఉపయోగము లేనిదానిని దెలిసికొనుట, ఉపయోగము గలదానిని తెలిసికొనకపోవుట యను దోషము గలుగును

**నిరక్షరస్యాపి తు యస్య కుక్షౌ బ్రహ్మైవ చాభాతి స ఏవ సాక్షరః ।**
**సర్వాక్షరస్యాపితు యస్య చిత్తే బ్రహ్మైవ నాభాతి స వై నిరక్షరః ॥**

సామాన్యముగా అక్షరాభ్యాసము లేనివాడు నిరక్షరకుక్షియనియు, అక్షరాభ్యాసము గలవాడు అక్షర కుక్షియనియు (సాక్షరుడనియు) లోకములో వాడుక గలదు అక్షర సముదాయము లన్నిటిని తెలిసికొనిన వాడైనను అక్షర స్వరూపుడగు పరబ్రహ్మమును తెలిసికొనక పోయినచో నిజముగా అతడే నిరక్షర కుక్షియు, నిరక్షరాస్యుడగును అక్షరము లన్నిటిని అనగా ఆమ్నాయములన్నిటిని తెలిసికొనక పోయినను, అక్షరస్వరూపుడగు పరబ్రహ్మమును తెలిసికొనిన అతడే అక్షర కుక్షియని గ్రహించుకొనవలయును అనగా అక్షరాస్యుడతడే

**అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణి మానవః ।**
**యో వై బ్రహ్మ న జానాతి దర్వీ పాకరసం యథా ॥**

చతుర్వేదముల నధ్యయనంబులు జేసియును, ధర్మశాస్త్రంబులం జదివియును, పాకపాత్రంబులందుండు గరిటె పాకరుచి నెరుంగని టుల మనుజుండు తత్సారంబగు బ్రహ్మము నెఱుంగనిచో పై జెప్పిన గరిటెవలె ఇతనిజీవితముండును అని ఉత్తరగీతయందు శ్రీకృష్ణ భగవానుడు తెలిపెను

**షడంగాదివేదో ముఖే శాస్త్రవిద్యా**
**కవిత్వాదిగద్యం సుపద్యం కరోతి ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

ఎవనిమనస్సు గురుచరణారవిందములయందాక్తముగాక యుండునో వానియొక్క ముఖమునందు నాల్గువేదములును, ఆరువేదాంగములున్నూ, సమస్తశాస్త్రములును, గద్యపద్యాది కవిత్వరచనలున్ను గలిగియుండినను వీటిచే పరలోకమున కేమిప్రయోజనము? ఏమి లాభము? ఏమి సిద్ధించును? ఏమి పొందగల్గును? అని శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు తెల్పిరి

**యధా ఖరశ్చందనభారవాహీ**
**భారస్య వేత్తా న తు చందనస్య ।**
**తథైవ శాస్త్రాణి బహూన్యధీత్య**
**సారం న జానన్ ఖరవద్వహేత్సః ॥**

మంచి సుగంధవస్తువులను మోయు గార్దభంబు దాని పరిమళ మెరుంగనటుల, సకల వేదశాస్త్రములు జదివియును, దత్సారాంశంబగు పరబ్రహ్మ స్వరూపము నెరుంగక పోయినయెడల వాడును గార్దభంబువంటి వాడేయగును ఇదిన్నీ శ్రీ కృష్ణభగవానుడు ఉత్తరగీతలో దెలిపినదే ఉత్తరదేశమందు కస్తూరి మొదలగు సుగంధద్రవ్యముల నమ్మువారు కంచరగాడిద, ఒంటె, యెద్దు, మొదలగువానిపై పెట్టుకొని అమ్ముచుందురు పాపము ఆ జంతువులు ఆ భారమును మోయుచుండునే గాని పరిమళ మెరుంగనట్లు, శాస్త్రము చదివియు సారమగు పరబ్రహ్మము నెరుంగనిచో నట్టి గతియే గల్గును



# విద్యాభ్యాసము

అక్షరాభ్యాసమువలె విద్యాభ్యాసములోగూడ అంతరార్థము గలదు ఏ విద్యవలన అవిద్య నశించునో, దానికే విద్యాశబ్ద రూఢ్యర్థ మన్వయించును అది జ్ఞానము దీనిచే అజ్ఞానము నశించును అట్టి జ్ఞానము యొక్క అభ్యాసమెపుడు ప్రారంభమగునో, అప్పటినుండియే విద్యాభ్యాసము ప్రారంభమగును అంతవఱకెన్ని విద్యలభ్యసించినను, ఇకను నిజమగు విద్యాభ్యాసము కాలేదనియే తలంచవలయును అట్టి బ్రహ్మ విద్యాభ్యాసమును చేయువాడు, ప్రపంచవిద్యలను

అభ్యసింపక పోయినను అతడే విద్యావంతుడగును కనుకనే శ్రీ కృష్ణభగవానుడు గీత విభూతి యోగమందు "అధ్యాత్మవిద్యా విద్యానాం" అని సెలవిచ్చినారు శ్రీ శంకర భగవత్పాదులున్ను ఆత్మబోధమున ఈ సత్యమునే తెలిపిరి

**అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్ ।**
**విద్యాఽవిద్యాం నిహన్త్యేవ తేజస్తిమిరసంఘవత్ ॥**

యాగాది రూపమయిన వేదకామ్య కర్మలు అవిద్యతో తనకు విరోధము లేమిచేత, అజ్ఞానమును నశింపజేయజాలవు జ్ఞానమన్ననో, వెలుగు అంధకార రాశినివలెనే, అజ్ఞానమును విలయ మొనరించుచున్నది ఒకవేళ ప్రాపంచిక వ్యవహారములకు ప్రపంచవిద్య యుపయోగపడినను, అజ్ఞానమును రహితమొనరించి జ్ఞానమును గలిగించుటకు మాత్రము శక్తి గలిగియుండదు ఎట్లన రాత్రి (చీకటికాలమున) కారుమబ్బు చీకటిని మరింత బలపరచునేగాని రహిత మొనరింప జాలనట్లు ప్రపంచవిద్య నెంత యభ్యసించినను, అది అభిమాన గర్వములతో గూడి, అజ్ఞానము నభివృద్ధి గావించును సూర్యోదయ మేలాగున తమస్సును పారద్రోలి వస్తువులను ప్రకాశింపజేయుచున్నదో ఆలాగున జ్ఞానమొకటియే అజ్ఞానమును నాశమొనరింప సమర్థమగును గీత అయిదవ అధ్యాయమున ఈ సత్యమునే భగవానుడు తెలిపెను

**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥**
**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్యవద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**

ఆత్మజ్ఞానము అజ్ఞానముచేత కప్పబడియున్నది దానిచేత జీవకోట్లు మోహమును పొందియున్నవి అట్టి జ్ఞానము నావరించియున్నట్టి అజ్ఞానము, ఆత్మయొక్క జ్ఞానముచేత ఎవరికి నాశము గావింపబడుచున్నదో, అట్టివారలకు జ్ఞానము సూర్యునివలె ఆ పరబ్రహ్మ స్వరూపమును ప్రకాశింపజేయుచున్నది మఱియు శంకరభగవత్పాదులు తెలిపినదానిని చూడుడు

**అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్ ।**
**కృత్వా జ్ఞానం స్వయం నశ్యేజ్జలం కతకరేణువత్ ॥**

అజ్ఞానముచే కలుషితుడగు జీవుని ఆత్మజ్ఞానాభ్యాసము అజ్ఞానమును నాశమొనరించి పరిశుద్ధునిగా జేయుచున్నది ఎట్లనగా చిల్లగింజ నరగదీసిన గంధము బురదనీటిని పరిశుద్ధముగాజేసి, తానును, తన రూపము కనపడకుండ నేలాగున దానియందు కలసిపోవుచున్నదో, అలాగే ఆ జ్ఞానమున్ను ఆత్మయందు లీనమైపోవుచున్నది మఱియు

**విద్యయా చ యయాఽవిద్యా ప్రభయా చ యథా తమః ।**
**నశ్యతి బ్రహ్మవిద్యా సా తేజోరూపా చ నేతరా ॥**

ప్రకాశముచే నన్ధకారము నశించునట్లు ఏ విద్యచే అవిద్య నశించునో, అదియే తేజోరూపమయిన బ్రహ్మవిద్య యనంబడును అవిద్యను నశింపజేయు సామర్థ్యము లేనిది విద్య కానేరదు

**యయా చ విద్యయా తాపత్రయం శామ్యతి మూలతః ।**
**తృషేవ తోయపానేన సైవ విద్యా హి నేతరా ॥**

జలపానముచే దాహము శమించినట్లు ఏవిద్యచే తాపత్రయము సమూలముగా శాంతించునో, అదియే విద్యయగును, కాని, తాపత్రయమును శమింపజేయనిది విద్య కానేరదు గీత అ 2

**త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥**

ఓ అర్జునా! వేదములు త్రిగుణాత్మకములగు విషయములను తెలుపునవిగా నున్నవి కాబట్టి త్రిగుణాత్మకములగు విషయముల వాంఛను వదలిన వాడవుగను, కేవల సత్త్వగుణ విశిష్టుడవుగను, సుఖదుఃఖాది ద్వన్ద్వములు లేనివాడవుగను యోగక్షేమ రహితుడవుగను, ఆత్మజ్ఞానము గల వాడవుగను అగుమా! మూడుగుణములతో గూడియుండు వరకున్ను బద్ధుడే అగును, గీత అ 14

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

ఓ అర్జునా! నాశరహితుడైన ఆత్మను, దేహమునందలి ప్రకృతివలన బుట్టిన సత్త్వరజస్తమోగుణము లను మూడుపాశములు బంధించుచున్నవి ఇవియే సంసారపాశ మనబడును ఈ మూడుగుణముల నుండి విడివడుటయే మోక్షమనబడును ఇది వేదములచే నివృత్తిగాదు వేదాంతముచేతనే నివర్తించబడును

**గుణానేతానతీత్య త్రీన్దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

జీవుడు దేహోత్పత్తికి బీజభూతములగు ఈ మూడు సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించినవాడై, జనన మరణ వార్ధక్యములు మొదలగు దుఃఖములచేత విముక్తుడై అమృతత్వమును పొందుచున్నాడు కావున బ్రహ్మచింతకులు ఈ మూడు గుణములనుండి విముక్తి గలిగినదా అని తమలోతాము తెలిసికొనవలసియుండును ఈ మూడుగుణములే మాయాపాశములనియు, సంసారపాశములనియు, అజ్ఞానపాశములనియు శాస్త్రములో చెప్పబడినవి యమదూతలు ప్రత్యేకముగా కాలపాశముల చేబూని, మరణకాలమున జీవులను కట్టి లాగుకొని పోవుచున్నారని చెప్పుటకిదియే అర్థమగును తనలో ఆశాపాశములు లేనివారిని యమభటులు బంధించి తీసికొనిపోవుట లేదు కావున అట్టివారే ముక్తాత్ములు ఇదియే శాస్త్రములోగల రహస్యము ముండక శ్రుతియు ఈరహస్యమునే తెలుపుచున్నది

**తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదస్సామవేదోఽథర్వవేదః**
**శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి ।**
**అథ పరా యయా తదక్షరమధిగమ్యతే ॥**

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము - ఈ నాలుగు వేదములు 1 శిక్ష, 2 కల్పము, 3 వ్యాకరణము, 4 నిరుక్తము, 5 ఛందస్సు, 6 జ్యోతిషము అను ఆరు శాస్త్రములున్ను అపరవిద్య యనబడుచున్నవి ఏ బ్రహ్మవిద్యచేత ఆ ప్రసిద్ధమయిన నాశరహితమగు పరబ్రహ్మము పొందబడుచున్నదో అదియే పరావిద్య యనబడుచున్నది కాబట్టి బ్రహ్మమును, లేక జ్ఞానమును గలుగజేసెడు విద్యయొక్క అభ్యాసము గలుగునప్పుడే విద్యాభ్యాస మయినదని తెలిసికొనవలయును

**అవిద్యాయామన్తరే వర్తమానాస్స్వయం ధీరాః పండితమ్మన్యమానాః ।**
**జఙ్ఘన్యమానాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాఽన్ధాః ॥**

అవిద్యలోనున్న మూఢజనులు, మేమే బుద్ధిమంతులమనియు, పండితులమనియు తలంచుచున్నవారలై జరా రోగాదులచే కొట్టబడుచు గ్రుడ్డివానిచేత మార్గమునందు తీసికొనిపోబడుచుండెడి గ్రుడ్డివాండ్రవలెనే తిరుగుచున్నారు అనగా అవిద్యాసమ్బన్ధమయిన ప్రాకృతశాస్త్రములను మాత్రము జదివి, తామే పండితులమని తలంచువారిగతి యీలాగుండునని మఱువకూడదు

**అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః ।**
**యత్కర్మిణో న ప్రవేదయన్తి రాగాత్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే ॥**

అజ్ఞానరూపమయిన ప్రపంచమందు అనేకవిధములుగా సంచరించుచున్న బాలురవంటివారు మేము కృతార్థులమని తలంచిన వారలయి అవిద్యాకర్మలను చేయుచు ఆ కర్మఫలములయందలి అనురాగమువలన ఆత్మతత్త్వము తెలిసికొనకపోయినవారలై దుఃఖార్తులై స్వర్గాది లోకములనుండి జారిపడిపోవుచున్నారు అనగా అవిద్యాశాస్త్రమును చదివి అవిద్యాకర్మలను జేసికొని దానివలన బద్ధులై మేము కృత్తార్థులమయితిమని తలంచువారి గతి యిట్టిదని గ్రహించుకొనవలయును కావుననే శాస్త్రమీలాగున వచించుచున్నది

**అన్యవిద్యాపరిజ్ఞానం హ్యావశ్యం నశ్వరం భవేత్ ।**
**బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం భవేత్ ॥**

ప్రాకృతశాస్త్రములను ఎంతచదివినను తప్పక నశించునవే బ్రహ్మవిద్యాపరిజ్ఞాన మొకటియే బ్రహ్మప్రాప్తిని గలుగజేయును ప్రాకృత విద్యలన్నియు మరణకాలమున తానలంకరించియుండు వస్త్రాభరణాదు వేఱుపడినట్లు తనతోగూడ వేఱుపడును

**ఆచారహీనం న పునన్తి వేదా యద్యప్యధీతాస్సహ షడ్భిరఙ్గైః ।**
**ఛన్దాంస్యేనం మృత్యుకాలే త్యజన్తి నీడం శకున్తా ఇవ జాతపక్షాః ॥**

శాస్త్రములను చదివి దానిలో చెప్పినట్లు పరమాత్మోపాసన చేయనివానిని

నాలుగు వేదములున్ను, వేదాంగములగు ఆరు శాస్త్రములున్ను పావన మొనరింపజాలవు ఆ ఛందస్సు లన్నియు (వేదములన్నియు) అన్త్యకాలమున వీనిని పక్షములు వచ్చువరకు చెట్టును గూటిని ఆశ్రయించి యుండు పక్షులు రెక్కలురాగానే వదలిపోవునట్లు, వదలిపోవుచున్నవి ప్రాకృతశాస్త్రము లన్నిటియొక్క స్థితి యీలాగున నుండును బ్రహ్మ విద్యయో, తాను జీవించి యున్నప్పుడును, దేహమును వదలిపోవునప్పుడున్ను, మనుజాడు నడచునప్పుడు అతని నీడ ఎల్లప్పుడున్ను ఎచ్చోట నున్నను తనతో గూడియున్నటుల, సదా కాలమున్ను తనను విడనాడకనే వెంబడియుండును ఎందుకనగా అది ఆత్మకు సంబంధపడినది తక్కినవి దేహమునకు సంబంధించినవి అవి దేహమున్నంతవరకే యుండును దేహము వదలునప్పుడు వానినిగూడ వదలిపోవలసి యుండును ఆత్మఎల్లప్పుడు తన స్వరూపముగా నుండుటవలన ఎచ్చోటను ఎల్లప్పుడున్ను తనతో గూడియుండి తన స్వరూపమై నిలకడగలిగి యుండును ఆత్మ శాశ్వతము అందువలన ఆత్మవిద్యయు శాశ్వతము, దేహ మశాశ్వతము, కాన దేహసంరక్షణార్థము నేర్చుకొన్న విద్యయు అశాశ్వతమే విజ్ఞులు గ్రహించుకొనవలసిన ముఖ్యవిషయ మిదొకటియే



# జ్ఞానజ్ఞేయములు

వేదాంతశాస్త్రములు జ్ఞాన జ్ఞేయములనియు, జ్ఞాన విజ్ఞానములనియు రెండుభాగములు తెలిసికొనవలసి యున్నవని తెలుపుచున్నవి అప్పుడే మానవుడు పూర్ణావస్థను పొందును వీనినే ముముక్షుత్వమనియు, ముక్తత్వమనియు, అభ్యాసియనియు, ఆరూఢుడనియు గ్రహించుకోవలయును, ఇంకను ఈలాటి ద్వంద్వపదము లనేకములుగలవు ఈ విషయమై యెంత విస్తారముగా చెప్పినను సారము ఇంతమాత్రమే, అందువల్ల ఇంత మాత్రము సంగ్రహముగ నిర్ణయించడమైనది దీనివలన జ్ఞానమొక్కదానిచే గాని, లేక విజ్ఞానము ఒక్కదానిచేతగాని, జ్ఞేయమొక్కదానిచేతగాని కృతార్థుడ నైతినని యెవరును తలచరాదు అట్లు తలచిన ప్రమాదమే యగును ఇది యెటువంటిదన ఒక

డుద్యోగమును సంపాదించుటకు దానికి తగిన డిగ్రీ (శాస్త్రములో నుత్తీర్ణుడగుట యగును) పరీక్షలో నుత్తీర్ణుడైనను, ఉద్యోగమును పొందనిచో తగిన ఫలితము, (అధికారము) జీతములేనిచో అతడు ఏలాగున సుఖమును, స్వాతంత్ర్యమును పొందజాలడో, ఆలాగున జ్ఞానమును మాత్రము సంపాదించుకొని విజ్ఞానమును పొందకపోయిన ఆత్మస్వాతంత్ర్యమును, జీవన్ముక్తి పదమును అతడు పొందజాలడు అయితే పరీక్షలో నుత్తీర్ణుడగుట శ్రమ యనితలంచి, ఉద్యోగముమాత్రము దొఱికిన చాలును గదా యని తలంచినచో ఎట్లు విద్యయందు ఉత్తీర్ణుడు గానిచో ఏకాలమందైనను ఉద్యోగము లభ్యపడదో, ఆలాగున జ్ఞానమును సంపాదించుట ప్రయాసమని తలంచి జ్ఞేయమును పొందినచాలునని ఊహించినచో అది వ్యర్థఊహయేగాని సార్థకత యిసుమంతయు దానియందులేదు ఈ విషయమై శ్రీ భగవద్గీత అ 7 శ్లో॥ 2లో, శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించినది చూడుడు

**జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।**
**యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్యద్జ్ఞాతవ్యమవశిష్యతే ॥**

దేనిని తెలిసికొన్నపిమ్మట ఈ లోకమందు మరల తెలిసికొనదగినది మరియొకటి మిగిలియుండదో అట్టి జ్ఞానమును, విజ్ఞానమును నీకు నేను నిశ్శేషముగా చెప్పుచున్నాను

విశేషార్థము-"యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్యమవశిష్యతే "

ఈ జ్ఞాన విజ్ఞానములను రెండింటిని తెలిసికొన్నచో మరల తెలియదగినది కొంచెమైనను మిగిలియుండదని భగవానుడు స్పష్టముగా జెప్పెను అందువలన జ్ఞాన విజ్ఞానములను తెలిసికొనకపోయిన జ్ఞానమందుగాని, విజ్ఞానమందుగాని తెలియదగిన విషయము మిగిలియుండునని స్పష్టముగా నుపదేశించబడినది జ్ఞానమనగా అనుష్ఠానమనియు, లేక శాస్త్రజ్ఞానమనియు గ్రహించవలయును విజ్ఞానమనగా అనుభవ జ్ఞానమనియు, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమనియు గ్రహించదగినది. ఈ రెండింటిలో ముముక్షువులు, జిజ్ఞాసువులు, అభ్యాసకులు ఎంతవరకు అనుభవములోనికి వచ్చియున్నారో వారికి వారే ఆలోచించుకొనవలయును మఱియొక విషయము మనమొక పరీక్షలో

నుత్తీర్ణులము కావలసియుండిన దానికి సంబంధించిన యెన్ని గ్రంధములు చదువవలసియుండునో అన్నిటిలోను ఆరితేరవలసి యుండును కొన్నిటిలో నుత్తీర్ణులైనను, కొన్నిటిలో తప్పిపోయిన మరల మరు సంవత్సరములో లేక ఆ సంవత్సరములోనో మరియొక పరీక్షలో నుత్తీర్ణులుకావలసి యుండునట్లును, అట్లయినమాత్రమే యుద్యోగమున కర్హు లగునట్లును, పదమూడవ యధ్యాయములో జెప్పబోయెడు అమానిత్వాది జ్ఞానలక్షణము లన్నియు గలుగువఱకు జీవన్ముక్తియను ఉద్యోగమునకు అర్హులు గాలేరని స్పష్టముగా నమ్మవలసియుందురు ఈ విషయమునే అ 9 శ్లో॥ 1 లో మరల భగవాను డుపదేశించెను

**ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।**
**జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥**

దేనిని తెలిసికొని జనన మరణరూపమగు సంసారబంధము నుండి విముక్తుడవు కాగలవో, అట్టి పరమరహస్యమగు జ్ఞానమును, విజ్ఞానమును నీకు చెప్పెదను

ఇచ్చటను జ్ఞానమును, విజ్ఞానమును ఉపదేశించెను మరియు “యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్” అని ఉపదేశించుటవలన ఏ జ్ఞాన విజ్ఞానములు గలవో వానిని తెలిసికొనిన మాత్రమే అజ్ఞానమునుండి, అవిద్యనుండి మాయనుండి విడివడగలవని స్పష్టముగా వచించెనుగదా! అందువలన జ్ఞాన విజ్ఞానములలో నుత్తీర్ణుడుగానిచో అవిద్యనుండి, అశుభమునుండి విమోచనము గలుగజాలదను భగవద్వాక్యమును భక్తులుగాని ముముక్షువులు గాని బాగుగా జ్ఞాపకములో నుంచుకొనవలయును మఱియు “గుహ్యతమం” అని ప్రయోగించుటవల్లను దీనియొక్క గొప్పతనము నిరూపించబడినది గుహ్యమనియు, గుహ్యతరమనియు, గుహ్యతమమనియు మూడువాక్యములు శాస్త్రనిర్ణయమందు గలవు దీనికే శ్రేష్ఠమనియు, శ్రేష్ఠతరమనియు, శ్రేష్ఠతమ మనియు శాస్త్రనిర్ణయములు, ఎప్పుడు శ్రేష్ఠతమమని చెప్పెనో, అవతల మరల ప్రయోగములేదు అదియే కట్టకడపటి ప్రయోగమని అర్థము అందువలననే యీ శ్లోకమున గుహ్యతమమని ప్రయోగించుటకు కారణమైనది అనగా దీనికన్న గుహ్యమైనది, గోప్యమైనది,

రహస్యమైనది మఱియొకటి లేదు దీనికన్న (జ్ఞాన విజ్ఞానములకన్న) ఇక గ్రహించదగినది లేనేలేదు ఈ విషయమును 13వ అధ్యాయమున 1వ శ్లోకములోగల 6 ప్రశ్నలలో కట్టకడపటి రెండు ప్రశ్నలగు "జ్ఞేయం జ్ఞానం చ కేశవ" అని అర్జునునిచే అడుగబడినది ఈ శ్లోకము పై భాగములోగల నాలుగు ప్రశ్నలగు "ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ" అనునవి ప్రస్తుతము మనకు సంబంధించినవి గావు

**ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ।**
**ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥**

మనకు కావలసినవి జ్ఞానజ్ఞేయములే జ్ఞానమనగానేమి, జ్ఞేయమనగా నేమి యను విషయమును శ్రీకృష్ణభగవానుడిచట నిరూపించియున్నాడు 8-వ శ్లోకము నుండి 12-వ శ్లోకము వరకు జ్ఞానముయొక్క లక్షణము తెలుపబడినది ఇట్టి జ్ఞానము గలవాడే జ్ఞానియగును ఎట్లనగా కిరీటముగల వాడు కిరీటియనియు, దండముగలవాడు దండియనియు, ఎట్లు వ్యవహారమందు గలదో, లేక ఉద్యోగము గల వానిని ఉద్యోగియనియు నెట్లు వచింతురో యిదియు నటువంటిదే

**అమానిత్వమదంభిత్వ మహింసా క్షాంతిరార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ 8**

**ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥ 9**

**అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥ 10**

**మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।**
**వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥ 11**

**అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।**
**ఏతద్జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥ 12**

అర్థము- 1 అమానిత్వము, 2 అదంభిత్వము, 3 అహింస, 4 క్షాంతి,

5 ఆర్జవము, 6 ఆచార్యోపాసనము, 7 శౌచము, 8 స్థైర్యము, 9 ఆత్మవినిగ్రహము, 10 ఇంద్రియార్థములయందు వైరాగ్యము, 11 అనహంకారము, 12 జన్మమృత్యు జరావ్యాధులలో దుఃఖదోషానుదర్శనము, 13 అసక్తి, 14 పుత్రదార గృహాదులయందు అనభిష్వంగము, 15 నిత్యము ఇష్టానిష్టములయందు సమచిత్తత్వము, 16 భగవద్ధ్యానమందు అనన్యమైన యోగమున్ను అచంచలమైన భక్తియున్ను గలిగియుండుటయు, 17 వివిక్తదేశ సేవిత్వము, 18 జనసంఘమందరతియు, 19 అధ్యాత్మజ్ఞాన నిత్యత్వము, 20 తత్త్వజ్ఞానార్థదర్శనము - ఈ యిరువదిన్ని జ్ఞానమనబడును ఈ జ్ఞానముగలవాడే జ్ఞానియని గ్రహించుకొనవలెను ఇట్టి జ్ఞానలక్షణములకు అన్యమైన అజ్ఞాన గుణములుండినచో అతడు జ్ఞాని కాజాలడు కావున ఆత్మనిష్ఠులు తమలో తాము విచారణ సలిపి భగవంతుడు చెప్పిన జ్ఞానలక్షణములకన్న భిన్నమైన అజ్ఞానలక్షణము లుండిన, తప్పక సవరణ చేసికొనవలయును ఎట్లన, కర్షకులు పొలములో తాము పెట్టిన విత్తనముల కన్యమగు కలుపు ఏర్పడిన ఏలాగున తీసివేయుదురో ఆలాగున హృదయక్షేత్రమును శుద్ధపఱచుకొనవలయును అట్లు కలుపు తీయనిచో గడ్డిగాదము పెరిగి పైరు నణచివేయునట్లు ప్రకృతిగుణములు విజృంభించి, ఆత్మజ్ఞానమును వృద్ధినొందనీయక చేయును అంతేగాదు ఈ సంవత్సరము కలుపుతీయనిచో, ఆ గింజలన్నియు రాలి మరుసంవత్సరము మరింత తృణావృతమై పోవునట్లు ఈ జన్మములో ప్రయత్నపూర్వకముగా ప్రకృతిగుణములను రహిత మొనర్పనిచో, మరుజన్మములో హృదయక్షేత్రము మరింత ప్రకృతిగుణములతో గూడినదై ఆత్మను చెఱచునని బుద్ధిమంతులు మఱువకూడదు

ఇప్పుడు చెప్పినది జ్ఞానము, ఇది యొక భాగము ఇక రెండవభాగము జ్ఞేయము, ఇవి రెండును గల్గునప్పుడే, విజ్ఞానము అనగా, అనుభవజ్ఞానము గలుగును ఇది 13-వ శ్లోకమునుండి 19-వ శ్లోకమువరకు 7 శ్లోకములచే శ్రీ కృష్ణపరమాత్మ్మండు తెలిపెను ఈరెండును గలిగినచో పరీక్షలో నుత్తీర్ణుడైన వెంటనే గొప్ప యుద్యోగము లభించినట్లుండును.

**జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృతమశ్ను తే ।**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥ 13**

సర్వత: పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వత: శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 14

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 15

బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥ 16

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్ ।
భూతభర్తృ చతద్జ్ఞే యం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥ 17

జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమస: పరముచ్యతే ॥
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 18

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసత: ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే ॥ 19

అర్థము - ఏది యెఱుంగ దగినదో, దేనిని నెఱింగిన అమృతమను మోక్షమును పొందునో, అది ఆదిలేనిదియు, పరబ్రహ్మమైనదియు, సత్తు గానిదియు, అసత్తుగానిదియు అని చెప్పబడుచున్నది అట్టిదానిని చెప్పుచున్నాను ఆ బ్రహ్మములోమంతటను పాణియున్ను పాదమున్ను గలదియు, అంతట నేత్రమును, శిరస్సున్ను, ముఖమున్ను గలదియు, అంతట కర్ణము గలదియు, సమస్త చరాచర ప్రపంచము నావరించి యుండునదియు, సర్వేంద్రియగుణములను ప్రకాశింపజేయు నట్టిదియును సర్వేంద్రియములు లేనిదియు, దేని నంటనిదియు, సమస్తజగత్తును భరించు నట్టిదియు, మూడు గుణములు లేనిదియు, గుణములను తెలిసికొనునదియు, చరాచరభూతములను వెలుపల లోపల నుండు నట్టిదియు, స్థావరరూపమైనదియు, జంగమరూప మైనదియు నగు ఆ పరమాత్మ సూక్ష్మరూపము గలదగుటచేత అమానిత్వాది జ్ఞానము లేనివారికి తెలిసికొన సాధ్యము కానిదియు, ఆ పరబ్రహ్మము బహిర్దృష్టిగలవారికి బహుదూరముగా నుండునదియు, అతర్దృష్టిగలవారికి చాల సమీపమున నున్నదియునై యున్నది అట్టి జ్ఞేయమగు

పరబ్రహ్మము విభజింప బడనిదియు, భూతములయందు విభజింప బడినదానివలె నుండునట్టిదియు, సమస్తభూతములను ధరించునట్టిదియు, సమస్తభూతములను లయమొనర్చు నట్టిదియు, అట్లు లయమొనర్చిన భూతములను పుట్టించునట్టిదియు నగు పరమాత్మ నెఱుంగదగినది అట్టి జ్ఞేయమగు బ్రహ్మము, ప్రకాశించెడి వస్తువులగు సూర్యచంద్రాగ్నులకుకూడ ప్రకాశమిచ్చునదియు, తమస్సు కావల నుండునట్టిది యని చెప్పబడుచున్నది అమానిత్వాది లక్షణములుగల జ్ఞానముచే నెఱుంగబడదగినది అమానిత్వాది జ్ఞానముచేతమాత్రమే పొందబడదగిన, సమస్తప్రాణులయొక్క హృదయము నందుండునట్టిది యగుచున్నది ఈ చెప్పబడిన ప్రకారము క్షేత్రమును, ఆలాగుననే జ్ఞానమును, జ్ఞేయమును సంగ్రహముగా జెప్పబడినవి నా భక్తుడు దీని నెఱింగినవాడై నాభావమును పొందుట కర్హుడగుచున్నాడు

ఈ జ్ఞేయ ప్రారంభములోనే దీనియొక్క ప్రయోజనమును గురించి భగవానుడు స్వయముగా వచించెను అందువలననే "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే" అని ప్రయోగించుటకు కారణమైనది అమానిత్వాది జ్ఞానముచేత తృప్తినొందక, ఇకమీద జెప్పబోయెడు జ్ఞేయమును పొందినమాత్రమే అమృతత్వమును, అనగా మోక్షమును పొందగలడని విస్పష్టముగ తెలియపఱచబడినది మఱియు, 18 - వ శ్లోకమున "జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్" అని చెప్పుటచే, అమానిత్వాది జ్ఞానముమాత్రముచేతనే జ్ఞేయమగు బ్రహ్మమును పొందనగునని నిరూపించుట యైనది అయితే ఆ బ్రహ్మము ఏలోకమున నుండునని సందేహపడుదురేమో యని తలంచి "హృది సర్వస్య విష్ఠితమ్" అందరి హృదయములోనే యున్నదనియు, "సర్వస్య" అని ప్రయోగించుటవలన ఒక జాతియందుగాని, ఒక మతమందుగాని, ఒక దేశమందుగాని ఉండునది గాదనియు, అందరిలో నుండునది యనియు నిరూపింపబడినది అమానిత్వాది జ్ఞానము గలవారెవరైనను దానిని పొందవచ్చును కట్టకడకు 19వ శ్లోకమున "మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే" అని చెప్పుటవలన భక్తులైనవారు కూడా ఈ జ్ఞాన జ్ఞేయములను పొందినమాత్రమే భగవత్ప్రాప్తిని పొందగలరని నిరూపింపబడినది ఈలాగున చెప్పుటకు కారణ

వేమనగా, భక్తులైనవారికి భగవద్భక్తిమాత్రము గలిగియుండిన చాలుననియు,జ్ఞానజ్ఞేయముల అనుష్ఠించవలసిన పనిలేదనియు కొందఱు చెప్పుచుందురు కావున భక్తులైనను, జ్ఞానులైనను, యోగులైనను నీ జ్ఞాన జ్ఞేయములు గలిగినమాత్రమే మోక్షమును పొందగలరని గ్రహించుకొనవలయును ఆఖరు పదము "మద్భావాయోపపద్యతే" అనుదానికి భగవత్ప్రాప్తియనియు, భగవదైక్యమనియు, భగవదాకారమనియు, మోక్షమనియు అర్థము గలదు ఈ జ్ఞానజ్ఞేయములలో సామాన్యముగా నిర్మలబుద్ధి గలవారికి జ్ఞానము అవగాహనము కాగలదు జ్ఞేయమో సంపూర్ణాంతఃకరణశుద్ధియు, ఏకాగ్రతయు గలవారికిమాత్రమే అవగాహన మగును అందువలననే జ్ఞానమును ముందుగాచెప్పి తర్వాత జ్ఞేయము నుపదేశించుటకు కారణమైనది జ్ఞానముచేతనే అంతఃకరణ శుద్ధియు, చిత్తైకాగ్రతయు గలుగును ఇక అభ్యాసియొక్కయు, ఆరూఢునియొక్కయు లక్షణము అ 6 శ్లో॥ 3లో నుపదేశించినది చూడుడు

**ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే ।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥**

యోగసిద్ధియగు యోగారూఢత్వదశను పొందుటకు ఇచ్ఛగించిన మననశీలునకు లేక మౌననిష్ఠగలవానికి లేక మునికి అనుష్ఠానము సాధనమగుచున్నది యోగసిద్ధని పొందిన ఆ మననశీలునకు, లేక మునికి చిత్తోపరతి లేక యింద్రియములయొక్క శమము కారణ మగుచున్నది

ఒక సౌధము నెక్కుటకు సోపాన మెటువంటిదో, ఆలాగున ముక్తిసౌధము నెక్కదలచువారికి అనుష్ఠానమే ఉపాయము సౌధము నెక్కినవాడు ప్రశాంతముగా నుండునట్లు యోగారూఢస్థితిని పొందిన వానికి సర్వేంద్రియములయొక్క యుపశమనమే గుర్తుగా నుండును ఈసత్యమును దెలిసికొనినచో ఆరురుక్షువు ఎట్లుండవలెను, ఆరూఢుడు ఎట్టిస్థితి గలిగియుండునో గ్రహించుకొనవచ్చును ఈ తత్త్వము నెఱింగిన ముముక్షువైనవా డెట్లుండవలయును, ముక్తుడైన వాడెట్లుండవలయునో గోచరము గాగలదు ఈ విషయమై అమృతబిందూపనిషత్తు తెలిపినది చూడుడు

**గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః ॥**

ఈ యుపనిషత్తున్ను జ్ఞానవిజ్ఞానములను గురించియే తెలుపుచున్నది ఇచట మేధావియొక్క లక్షణము నిరూపించబడినది అనగా బుద్ధిమంతునియొక్క లక్షణము ఎఱిగింపబడినది మేధాసంపన్ను డుత్కృష్ట శాస్త్రమును, శాస్త్రములో చెప్పిన అనుష్ఠానమును, కృషీవలుడు పైరును సంరక్షించి పండినపిమ్మట ధాన్యమును కొట్టి తీసికొని గడ్డిని వదలినట్లు, శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడు నగు గురువుదగ్గర అభ్యాసము చేసికొని జ్ఞానములోను, విజ్ఞానములోను, ఆరితేరినపిమ్మట వదలవలెనని నిరూపించబడినది మొట్టమొదట నుపయోగములేని పైరును సంరక్షింతురు అప్పుడు కనపడని ఫలము (వెన్ను) ఆవిర్భవించును గడ్డితో నేమిపని యని యుపేక్షించినచో, పైరు ఎట్లు పండజాలదో, ఆలాగున అనుష్ఠానమగు జ్ఞానమును నిర్లక్ష్యముచేసినచో, విజ్ఞానమను అమృతఫలమును పొందజాలరు దీనికన్న పరమసత్య మేమికావలయును? అనుష్ఠానము లేనివారికి పైరును సంరక్షించక ధాన్యముకొఱకు నిరీక్షించుచుండువారల గతియే గలుగును విజ్ఞానమే మనము పొందవలసినదిగా నుండినను జ్ఞానానుష్ఠానము లేనిచో దానిని పొందజాలము కావున అనుష్ఠానమందు మిక్కిలి జాగ్రత్త గలిగియుండుడు

**ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్ప వివర్జితమ్ ।**
**జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్॥**

మనకు ఫలములే కావలసి యున్నప్పటికిని, అవి పుష్పము నుండియే గలుగుచుండును పుష్పములు వృక్షమునుండియే పుట్టుచుండును ఆలాగున జ్ఞానము (ఆత్మజ్ఞానము) కర్మరహితమైనను, అనగా కర్మమునకు సంబంధము లేనిదైనను, ఉత్తమమైన అనుష్ఠానమనెడు నిష్కామకర్మ లేనిచో జ్ఞానము గలుగదు వృక్షమును సంరక్షించిన, పుష్పములకొఱకు ఫలములకొఱకు మనము ప్రయత్న మేమియు చేయనక్కఱలేదు వృక్షసంరక్షణ చేయక పుష్పములయొక్క సుగంధమును గురించిగాని, ఫలములయొక్క మాధుర్యమును గురించిగాని యెంత వర్ణించినను ఏమి ప్రయోజనము? అయితే మనము పోషించిన వృక్షముమాత్రము

భుజించుట కుపయోగపడదు, పారవేయవలసినదే కాని, వృక్షములేనిచో ఫలపుష్పము లుండవు ఆలాగున కర్మమును, అనుష్ఠానమును మనము విడువవలసి యుండునని మరువకూడదు అనగా కర్మరుడై సాధనపరుడై యుండుటవలన గర్వము జనింపకచూడవలెను

# ఆత్మస్వాతన్త్ర్యము

ఆత్మస్వాతన్త్ర్యము కావలసియుండిన దానియొక్క పుట్టు పూర్వోత్తరములను లెస్సగా దెలిసియుండవలయును ఆత్మజ్ఞానవిషయ మట్లుండనిమ్ము ప్రపంచములోగల దేశములన్నియు ఆత్మస్వాతన్త్ర్యముకొఱకే తీవ్రప్రయత్నము జేయుచున్నవి అయితే వారియొక్క స్వాతన్త్ర్యము ఆత్మజ్ఞానవిషయమై గాకపోయినను, దేశస్వాతన్త్ర్యమున కైనందుచే అదియు నొక విధమగు స్వాతన్త్ర్య మనియే తలంచవలసియుండును

1955 ఏప్రిల్ 18-వ తేదీనుండి బాండుంగులో ఆసియా, ఆఫ్రికా ఖండాలకుచేరిన 29 రాజ్యాల మహాసభ యీ ఆత్మస్వాతన్త్ర్యముకొరకే జరిగినది మన భారతదేశమువలె ఇండోనేషియా దేశముగూడ డచ్చివారి పాలనక్రింద ఉండెను భారతీయులవలె వారున్ను అనేక శ్రమలకు లోనైయుండి దాస్యవిముక్తిని చేసికొన్నారు అయితే ఆత్మ స్వాతన్త్ర్యమును సంపాదించుట ఇతర దేశములపై దండెత్తుటకొఱకు గాదని జ్ఞాపకములో నుంచుకొనవలయును తన దేశమునకును, తన ప్రజలకును కావలసిన స్వాతన్త్ర్యమునకును, సౌఖ్యమునకును అని మాత్రము జ్ఞప్తిలో నుంచుకొనవలయును ఇది యింతటితో సంగ్రహముగా నెఱింగింపబడినది ఈ వ్యాసముయొక్క ఆత్మస్వాతన్త్రము ఆత్మరాజ్యమునకు అనగా మోక్షముకొఱకని గ్రహించవలసియున్నది కావున ఈ ఆత్మయొక్క పుట్టుపూర్వోత్తరములను సంపూర్ణముగా తెలిసికొనినమాత్రమే దీనియందు ప్రవృత్తి గలుగుటకున్ను, ధైర్యము గలుగుటకున్ను, ఉత్సాహము గలుగుటకున్ను, త్యాగము గలుగుటకున్ను మార్గమేర్పడును

జీవునివిషయమై రెండుమార్గములు ముఖ్యములుగా శ్రుతి స్మృతులయందు

కనబడుచున్నవి (1) ఈశ్వరుడే జీవరూపముగా నున్నట్లున్ను, 2 ఈశ్వరాంశస్వరూపులే జీవులనియు కానుపించుచున్నది తక్కిన భేదములన్నియు ఈ రెండింటిలో నన్తర్భూతములే ద్వైత విశిష్టాద్వైతులు ఈశ్వరాంశులే జీవులనియు, అద్వైతులు ఈశ్వరస్వరూపులే జీవులనియు వక్కాణించుచున్నారు ఈ రెండింటికిని ఎక్కువభేద మేమియు లేదు చాలా విషయములలోను ఐకమత్య మున్నది ఈ సృష్టి విషయమై వేదాంత పంచదశియందు నాల్గవ ప్రకరణమున ద్వైతవివేకమును గురించి చెప్పిన భాగము ననుసరించి యిది వ్రాయబడినది

ఐతరేయశ్రుతి నాధారముజేసికొని యీ శ్లోకము శ్రీ విద్యారణ్య స్వాములవారు చేసిరి

**ఆత్మా వా ఇద మగ్రేఽభూత్ స ఈక్షత సృజా ఇతి ।**
**సంకల్పేనాసృజల్లోకాన్ స ఏతానితి బహ్వృచా ॥**

సృష్టికి పూర్వమందు నీజగంబంతయు పరమాత్మ మాత్రముగానే యుండెననియు, ఆ పరమాత్మ సృష్టించెదనని సంకల్పించెననియు, మఱియు నా పరమాత్మ సంకల్పముచేత ఈ సర్వలోకముల సృష్టించెననియు తెలియవచ్చుచున్నది దీనికి ఐతరేయశ్రుతి ప్రమాణము

**ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించన మిషత్స**
**ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాన్ లోకానసృజత ॥**

ఈ శ్రుతివాక్యమువల్ల ఇదంతయు బ్రహ్మమయమని అర్థమగుచున్నది గీతయున్ను, "వాసుదేవస్సర్వమితి" అని ఉపదేశించుచున్నది ఇదెంత గొప్ప భావమును తెలుపుచున్నదో, ముముక్షువులగు ధీరులు ఆలోచించుకొనవలయును తైత్తిరీయశ్రుతియు ఈలాగుననే వచించుచున్నది.

**బహు స్యామహమేవాతః ప్రజాయేయేతి కామతః ।**
**తపస్తప్త్వాఽసృజత్సర్వం జగదిత్యాహ తిత్తిరిః ॥**

ప్రత్యగభిన్న పరబ్రహ్మమే నేను బహురూపములుగా నయ్యెదననియు, కార్యవర్గ మయ్యెదననియు, ఈ విధమయిన యిచ్ఛచేత ఆలోచించి యీ

సర్వజగత్తును సృష్టించెనని తిత్తిరిముని చెప్పెను ఈ శ్రుతియు, ఈశ్వరుడే అనగా బ్రహ్మమే ఏకరూపమై యుండినను అనేక రూపము లయినట్లున్ను కానుపించుటవల్ల జీవులన్నియు ఈశ్వరస్వరూపులని స్పష్టపఱచుచున్నది ఇదే ప్రకారము ఛాందోగ్యోపనిషత్తున్ను చెప్పుచున్నది

**ఇదమగ్రే సదేవాసీ ద్బహుత్స్యాయ తదైక్షత ।**

ఈ ప్రపంచమంతయు సృష్టికిపూర్వము బ్రహ్మమయముగా నుండెననియు, ఆ బ్రహ్మము బహురూపములుగా నుండుటకొఱకు సంకల్పించెననియు గలదు

**సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్ ।**

మండకోపనిషత్తున్ను ఇదేవిధముగనే తెలుపుచున్నది

**విస్ఫులింగా యధా వహ్నేర్జాయంతేఒక్షరత స్తధా ।**
**వివిధాశ్చిజ్జడా భావా ఇత్యాధర్వణికశ్రుతిః ॥**

దేదీప్యమానముగా ప్రజ్వలించెడి అగ్నిహోత్రమువలన నిప్పురవ్వలు పుట్టినట్లు అక్షరశబ్దముచేత చెప్పదగిన బ్రహ్మమువలన చేతన జడరూపములగు నానావిధ పదార్థములు పుట్టుచున్నవి దీనికి ముండక శ్రుతి ప్రమాణము

**తదేతత్సత్యం యధా సుదీప్తాత్పావకాత్**
**విస్ఫులింగాస్సహస్రశః ప్రభవన్తే సరూపాః ।**
**తధాఒక్షరా ద్వివిధాసోమ్య భావాః**
**ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి ॥**

పై శ్రుతులకన్న ఇచ్చట ఒక మెట్టు క్రిందుగా చెప్పడమైనది పై నుదాహరించిన శ్రుతులు ఈశ్వరుడే జీవులని నిరూపించినవి ఇచ్చట ఈశ్వరాంశస్వరూపములే జీవులని నిర్ణయించడమైనది అయితే ఎక్కువ భేదమేమియు లేదు ఈశ్వరుడనియు, బ్రహ్మమనియు, పరమాత్మ అనియు శబ్దములన్నియు ఒకే అర్థములోనే ప్రయోగించ బడినవని గ్రహించవలయును లేనిచో వేదాంతవాక్యములో సందేహము గలుగవచ్చును అచట శుద్ధమాయ నవలంబించి సృష్టించువాడు

ఈశ్వరుడని ఒక అర్థము గలదు అట్టి శుద్ధమాయగూడ లేనిది పరబ్రహ్మమనియు, పరమాత్మ అనియు కొందరు తలంతురు

ఈశ్వరాంశుడే తన ఆత్మ అనగా జీవుడు అని తలంచు స్థితిగూడ చాల గొప్పది అంతవఱకైనా రానీయక జడరూపమగు తాను పుట్టిన కులమే లేక జాతియే తానని తలంపు గలుగజేయుటచేతనే భారతదేశ మధఃపతనమొందినది స్మృతియగు గీతలోను నీ అంశ స్వరూపమను భావముగూడ గలదు

**మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః ।**

ఈ స్థితికి వచ్చిన, సార్వభౌముని కుమారుడగు యువరాజువంటి అవస్థలోనికి జీవులు రాగలరు అంతవఱకైనా రానీయక మనవారలలో కొందఱు సార్వభౌమునియొక్క పరిచారకులు, సేవకులు, భృత్యులు అను బానిసస్థితిలోనికి దైవాంశులగు జీవులను తెచ్చిరి ఇదెటువంటిదన రాజుయొక్క సంతతివారిని రాజవంశములో సంబంధములేక తన కులగోత్రములకు దూరులనుగాజేసి బానిసత్వమునకు తయారుజేసినటులాయెను శైశవావస్థలో ఒకవేళ రాజసంతతి ఆలాగున నుండినను మైనర్ కాలము దాటిన తరువాత ఎట్లు తన రాజవంశమును తెలిసికొని రాజత్వమున కర్హులగుచుందురో, ఆలాగున ఈశ్వరాంశస్వరూపులే జీవులని జ్ఞానము గలిగిన ఈశ్వరస్థానమున కర్హులగుదురు ఇదే ఇప్పుడు జరుగుచుండు రాజులకును ప్రజలకును గల పోరాటమని గ్రహింపుడు ఈ విధముగానే కొన్ని వర్గములకు మాత్రమే వేదాధికారమునకు జ్ఞానాధికారమునకు అర్హత గలదనియు, తక్కినవా రనర్హులనియు చెప్పెడివారి వాక్య రహస్యమయి యున్నది అదెంత వఱకుండును? పై జెప్పిన రాజ సంతతి శైశవావస్థ యుండువరకు మాత్రమే మైనర్‌కాలము దాటిన తరువాత తన పుట్టు పూర్వోత్తరములను తెలిసికొని తన రాజ్యము నెటుల లోబరచుకొనుచున్నారో, ఆలాగున తన ఈశ్వరాంశము తెలిసికొనువరకు మాత్రమే జడరూపమగు నీ జాతికులములకు అధీనుడై జీవుడుండునుగాని, నిజరూపమగు ఆత్మస్వరూపమును తెలిసికొన్నప్పుడు జడత్వము నతిక్రమించి చైతన్యాత్మస్వరూపమును పొందగలుగును కావుననే మొట్టమొదట తన పుట్టు పూర్వోత్తరముల తెలిసికొనవలయునని చెప్పుట ఒక కాలమున

భారతదేశ మీలాగుననే యుండెను ఒక వర్గమువారు మాత్రము వేదసంబంధమయిన బ్రహ్మవిద్యకర్హులనియు, ఒక వర్గమువారు మాత్రమే శత్రువు నెదిరించి పోరాడుటకు యోగ్యులనియు, మఱియొక వర్గమువారు మాత్రము వ్యాపారమునకు పాత్రులనియు, ఇంకొకవర్గమువారు బానిసలై యుండవలయుననియు నుండుటచేతనే, భారతీయులయ్యు రమారమి మహమ్మదీయ ఆక్రమణనుడి వేయిసంవత్సరములు బానిసలై, పరాధీనులై పడియుండవలసిన దురవస్థకు గురియయిరి

ఇప్పుడిప్పుడు విద్యావివేక జ్ఞానములకు కొంచెము దారి దొరికినందుచే కులమునకు అధిక్యమివ్వక గుణమున కాధిక్యము ఇచ్చినందుచేతనే రాజ్యస్వాతన్త్ర్యమున కర్హులయిరి ఇతంటితో తృప్తినొందక, ఆత్మస్వాతన్త్ర్యమును గూడ సంపాదించినప్పుడే నిజమయిన స్వాతన్త్ర్యము గలవారగుదురని మఱువకూడదు

**కృత్వా రూపాన్తరం జీవం దేహే ప్రావిశదీశ్వరః ।**
**ఇతి తాశ్శ్రుతయః ప్రాహుర్జీవత్వం ప్రాణధారణాత్ ॥**

మఱియు ఆ బ్రహ్మమే జీవసంబంధియగు మఱియొక వికార రూపము జేసికొని దేహసమూహమందు ప్రవేశించెనని పైన చెప్పబడిన ఉపనిషత్తులన్నియు జెప్పుచున్నవి

**చైతన్యం యదధిష్ఠానం లింగదేహశ్చ యః పునః ।**
**చిచ్ఛాయా లింగదేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే ॥**

1 లింగదేహకల్పనకు ఆధారమయిన ప్రత్యగాత్మ యనెడి చైతన్యంబును, 2 ఆ చైతన్యమందు కల్పింపబడిన లింగదేహంబును, 3 ఆ లింగదేహమందు ప్రతిబింబరూపముగా నుండెడి చిదాభాసుడును - ఈ మూటినిచేర్చి జీవశబ్దముచేత చెప్పుదురు వేదాంతశాస్త్రము లన్నియు ఈలాగుననే చెప్పుచున్నవి మహావాక్యమందుగల "అయమాత్మా" అను శ్రుతియు దీనినే ఉపదేశించుచున్నది

**స్వప్రకాశాపరోక్షత్వమయమిత్యుక్తితో మతమ్ ।**
**అహంకారాదిదేహాన్తాత్ప్రత్యగాత్మేతి గీయతే ॥**

'అయ' మనెడి పదముచేత, ఆత్మకు స్వప్రకాశత్వమువలన అపరోక్షము గలిగియున్నదనెడి అర్ధము సమ్మతమగును అహంకారమే ఆదిగా గలిగినట్టియు, స్థూలదేహమే అన్తముగా గల ప్రపంచముకంటె అధిష్ఠానత్వ సాక్షిత్వముచేత ఆత్మ యని చెప్పబడుచున్నది గీతయు ఈ అర్ధమునే తెలుపుచున్నది

**ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥**

ఓ అర్జునా! సర్వాంతర్యామియగు నారాయణుండు సకల ప్రాణులయొక్క హృదయములందుండి మాయచేత సకల భూతములను కీలుబొమ్మలనువలె వారివారి జన్మాంతర కర్మసంస్కారము ననుసరించి త్రిప్పుచు ఆయా కర్మలయందు ప్రవర్తింపజేయుచున్నాడు ఇచ్చటను నీ ఆత్మయే బ్రహ్మమని నిరూపింపబడినది అయితే మాయా శక్తిచేత జీవులు తెలిసికొనజాలక యున్నారు మరియు "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అను స్థలములో క్షేత్రజ్ఞుడగు జీవుని భగవత్స్వరూపునిగా తెలియులాగున శ్రీకృష్ణభగవానుడు అర్జునున కుపదేశించెను మఱియు

**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।**
**అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ ॥**

సకలభూతములయొక్క హృదయకమల మందుండు ప్రత్యగాత్మను నా స్వరూపముగాను, సమస్తభూతములయొక్క సృష్టిస్థితి లయములును లేక ఆది మధ్య అన్తములును నేనే అనగా సృష్టికి ముందుగాను ఇప్పుడును ఇకను ఈ ఆత్మ నాయొక్క స్వరూపమే అని భగవానుడాదేశించెను

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥**

తెలియందగిన ఆ బ్రహ్మము ప్రకాశించునట్టి సూర్యచంద్రాగ్నులకుకూడ ప్రకాశమిచ్చు నదియును, అజ్ఞానమగు తమస్సుకంటె వేరైనదియు, నిర్మలాన్తః కరణముగలిగి ధ్యానించువారికి గోచరమగునదియు, ముముక్షువు లందఱిచేతను

తెలియదగినదియు, అమానిత్వము మొదలగు జ్ఞాన మాత్రముచే పొందదగినదియు సకల ప్రాణిసముదాయములయొక్క హృదయమున నున్నదనియు చెప్పబడుచున్నది

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥**

బ్రహ్మాది స్తమ్బపర్యన్తములగు సమస్త వస్తువులయందును సమముగా నుండునట్టి పరమేశ్వరుని, ఎవడు దేహేన్ద్రియాదులు సర్వము నశించినను నాశము లేనివానినిగా జూచుచున్నాడో వాడే చూచువాడు తదితరులు నేత్రము లుండియు చూడనివారలే అనగా నేత్రము లున్నను పరమాత్మను తన ఆత్మగా దర్శించలేనివారు గ్రుడ్డివారితో సమానులు అని భావము అట్టి ఆత్మ అందఱికిని తెలియకపోవుటకు కారణ మీక్రింది శ్లోకము నిరూపించుచున్నది

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

భగవన్మాయవలన గలిగిన సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములు ఈ గుణములకంటె వేరైన నాశరహితుడయిన ఆత్మను దేహమునందు బంధించుచున్నవి (తెలియనటులజేయుచున్నవి)

**గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

జీవుడు దేహోత్పత్తికి కారణమయిన పై సత్త్వ రజస్తమోగుణముల నతిక్రమించి బ్రహ్మజ్ఞానముచేత త్రిగుణముల నణచి పుట్టుక, చావు, ముసలితనము మొదలగు దుఃఖములచే విడుదలపొంది మోక్షమును (అమృతత్వమును) పొందుచున్నాడు ఈ విషయమై శ్రుతి స్మృతులనేకములు గలవు ఇచ్చట సంగ్రహముగా వ్రాయబడినది సూక్ష్మబుద్ధిగల ముముక్షువుల కింతియే చాలును ఇక ఈ విషయమై అపరోక్షానుభూతియందు శ్రీ శంకరభగవత్పాదాచార్యులు తెలిపినది చూడుడు

**సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం హి శాశ్వతమ్ ।**
**బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తధా భవేత్ ॥**

సువర్ణమునుండి గలిగిన ఆభరణాదులకు సువర్ణత్వము శాశ్వతమగునటుల బ్రహ్మమునుండి గలిగిన జీవకోట్లకు బ్రహ్మత్వము శాశ్వతమగును

**బ్రహ్మణస్సర్వభూతాని జాయన్తే పరమాత్మనః ।**
**తస్మాదేతాని బ్రహ్మైవ భవన్తీత్యవధారయేత్ ॥**

బ్రహ్మమయినట్టి పరమాత్మనుండి సకలభూతములును కలిగినవి కావున ఇవి (యీ జీవులన్నియు) బ్రహ్మమే యగుచున్నవని నిశ్చయింపవలయును

**యధా మృది ఘటో నామ కనకే కుండలాభిధా ।**
**శుక్తౌ హి రజతఖ్యాతిర్జీవశబ్దస్తధా పరే ॥**

మట్టియందు కుండయను పేరును, స్వర్ణమునందు కుండలమను నామమును, ముత్తెపు చిప్పయందు వెండియను పేరునువలె బ్రహ్మమందు జీవుడను నామము కల్పితము

"యధా స్వప్నప్రబోధవత్" అని వేదాంతమున ఒకవాక్యము గలదు ఏలాగున సార్వభౌముడయినను, జనరల్ గవర్నరయినను మహాపండితోత్తము డయినను, యతీశ్వరు డయినను సుషుప్తిలో నుండునప్పుడు తానెవడను జ్ఞానములేక యుండునో, ఆలాగున అజ్ఞాననిద్రలో నుండువరకు నీ జీవులు తన ఆత్మస్వరూపమగు బ్రహ్మము నెఱుంగజాలరు సుషుప్తినుండి జాగ్రదవస్థకు వచ్చిన, పైన పేర్కొనిన సార్వభౌముడు మొదలయిన వారందఱున్ను తమ ఆధిక్యము నెటుల తెలిసికొనుచున్నారో జీవుల స్థితియు ఆలాగుననే యున్నది మఱియు "గ్రహావిష్టో ద్విజః కశ్చిత్" అను వచనముగూడ వేదాంతశాస్త్రమున ఉన్నది వేదవేదాంత పారంగతుడైన నైష్ఠికుడగు నొక బ్రాహ్మణోత్తముని ఒక హీనజాతి గ్రహము పట్టుకొనెను భూతావేశమయిన పిమ్మట బ్రాహ్మణత్వమును మఱచి పెనుభూత స్వరూపము నెటుల పొంది ప్రవర్తించెనో, మంచి మాన్త్రికుని సహాయముచే గ్రహవిమోచనము గలిగినపిమ్మట తన బ్రాహ్మణత్వ మెటుల స్మృతికి వచ్చెనో,

ఆలాగున మాయ యనెడు గ్రహావేశము గలిగినందుచే జీవుడు తన బ్రహ్మస్వరూపమును మఱచిపోయినవాడై దేహేంద్రియములు, జాతి వర్ణాశ్రమములతో కూడినవాడై మహా క్లేశముల పొందుచున్నాడు బ్రహ్మవేత్తయగు మాంత్రికుడు తత్త్వమస్యాది మహావాక్య మహామంత్రములచే జీవునియొక్క మాయ యనెడు అజ్ఞానమును పోద్రోలునప్పుడు తన ఆత్మయొక్క బ్రహ్మత్వము దెలిసికొనినవాడై అజ్ఞానమునుండి విముక్తిని పొంది జననమరణ దుఃఖములనుండి విడుదల పొందినవాడై శాశ్వతమగు తన దైవత్వమును తెలిసికొని విముక్తుడగుచున్నాడు శివత్వమును పొందుచున్నాడు



# బ్రహ్మ చర్యము

ప్రశ్న॥ ఆశ్రమములు 1 బ్రహ్మచర్యము, 2 గార్హస్థ్యము, 3 వానప్రస్థము, 4 సన్న్యాసము - ఈ నాలుగింటిలో బ్రహ్మచర్యవానప్రస్థ సన్న్యాసములు మూడున్ను మనోవాక్కాయ కర్మలచే బ్రహ్మచర్యవ్రతము గలిగియుండవలసి యుండును దానికి సంబంధించిన శాస్త్రము లనేకములు గలవు అయితే పై జెప్పిన మూడాశ్రమస్థులందఱున్ను త్రికరణశుద్ధితో ఆచరించుచున్నామా అని వారిలో వారే అంతరాత్మసాక్షిగా విచారించుకొన్న యెడల దానియొక్క ఫలితము విషయమున్ను వారి వారి అనుభవమువల్ల వారికి వారే విచారణ చేసికొనవచ్చును ఆ విషయమై ప్రస్తుతము విచారణ చేసికొనుటకు బూనలేదు గృహస్థ బ్రహ్మచర్య మెటు లుండవలయును ఋతుకాలమున మాత్రము గృహస్థుడు విషయప్రవృత్తి గలిగియుండవచ్చుననియు, తక్కిన కాలములో బ్రహ్మచారివలె విషయములనుండి నివృత్తి గలిగి ప్రవర్తించవలయుననియు శాస్త్రము విధించుచున్నది

ఉత్తరము॥ మహనీయాత్మా! సృష్టిలో బ్రహ్మచర్య వ్రతపాలనమునకన్న కష్టసాధ్యమయిన పని మఱియొకటి లేదు ఏలననగా సృష్టి యంతయు దానియందే సృష్టికర్త నిలబెట్టియున్నాడు ఏలననగా అదిలేనిచో సృష్టియే నశించిపోవును అందువల్ల బ్రహ్మదేవుడు తన తపశ్శక్తినంతయు దానియందు నిమిడ్చియున్నాడు

అందువల్లనే పుణ్యాత్ములును, పవిత్రాత్ములునగు బ్రహ్మచారులలో కొందరున్ను, వానప్రస్థులలోను, యత్యాశ్రమములో నుండు కొందరున్ను ఎంత ప్రయత్నించినను నిలబెట్టజాలక పతితులగుచున్నారు వ్రతభంగము గలుగునప్పుడు ఎందరో పశ్చాత్తాపపడుచున్నారు ప్రాయశ్చిత్తము జేసికొనుచున్నారు, శాంతి జేసుకొనుచున్నారు ఉపవాసవ్రతము జేయుచున్నారు మఱికొందఱు బోరుబోరున నేడ్చుచున్నారు దానియొక్క ప్రభావ మాలాగున నున్నది కావుననే శాస్త్ర మీలాగున చెప్పుచున్నది "దుర్లభో విషయత్యాగః" విషయ నివృత్తి గలుగుట చాలా దుర్లభము ఏలన నేది ప్రభావము గలిగియుండునో, అది అంతటి ప్రయాసము చేతనే సాధించుటకున్ను సాధ్యమగును ఇది స్త్రీ పురుషు లుభయులకును సమానము దీనిని జయించినవాడు ప్రకృతిని జయించినవాడే ప్రకృతిని జయించిన గలుగు ప్రయోజనమేమి? బ్రహ్మప్రాప్తి అనగా మోక్షమే అతనికి మరల సృష్టిసంబంధములగు జనన మరణము లుండవు దీనిని సాధించుటకు కొందఱు కొన్ని కల్పములను, మూలికలను, మంత్రములను, యోగములను అపక్వాహార నియమములను పాలించుచున్నారు అట్లుండు వారిలోగూడ కొందఱు పతితులగుచునే యున్నారు అట్టి శుద్ధాత్ములు మలినాత్ములనిగాని, వైరాగ్యము లేనివారనిగాని, ఆత్మశుద్ధి లేనివారనిగాని, వివేకజ్ఞానము గలుగనివారనిగాని చెప్పుటకు లేదు

అట్టి బ్రహ్మచర్యవ్రతము పాలించువారే సత్యము నెఱుంగగలరు పై జెప్పిన సాధనలన్నియు మంచివే అయితే ఆహారవిషయములోను, నివాసనియమములోను జాగ్రత్త గలిగియుండనిచో పై జెప్పిన సాధనలెన్ని యుండినను నిది సాధ్యము గాదు కావున అతిపావన వ్రతమగు నీ బ్రహ్మచర్యవ్రతమును పాలించు స్త్రీలుగాని పురుషులుగాని వేరు వేరు ప్రదేశములలో నివాసము జేయుటదప్ప సులభమయిన మార్గము వేరొకటి లేదు అటులే ఆత్మశుద్ధియు, వివేకజ్ఞానమున్ను, మంచి నియమ నిష్ఠయున్ను గలిగియుండినచో నిదంత ప్రయాసమైనది గాదు బ్రహ్మచర్యము అను గ్రంథమున నీవ్రతమునకు సంబంధించిన నియమములన్నియు తెలుపబడినవి చరకముని ఆయుర్వేదమును శిష్యులకు బోధించుచుండగా ఇహపరసౌఖ్యములకు ఏకైకమైన యౌషధ మేదియని శిష్యులడుగగా నీ క్రింది శ్లోకమును వచించిరి-

**మృత్యువ్యాధి జరానాశి పీయూషం వరమౌషధమ్ ।**
**బ్రహ్మచర్యం మహద్యత్నం సత్యమేవ వదామ్యహమ్ ॥**

బ్రహ్మచర్యవ్రతము అమృతస్వరూపమై మరణమును, రోగమును, వృద్ధావస్థనున్ను నశింపజేయునదియునై యున్నది ఇది నిజము ఇది గొప్ప యత్నముచేతనే సాధించవలసియుడును ఇదియే జనన మరణ మనెడు వ్యాధికి దివ్యౌషధము

**యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షౌ రసో యథా ।**
**శరీరేషు తథా శుక్రం నృణాం విద్యాద్భిషగ్వరః ॥**

ఏలాగున క్షీరమున ఘృతము, చెఱకున రసము సర్వత్ర వ్యాపించియున్నదో, ఆలాగున శరీరమంతటను మానవులకు శుక్లము వ్యాపించియున్నది ఈ సత్యమును వైద్యకోవిదుడు బాగుగా తెలిసికొనవలయును అని సుశ్రుతము పాలనుండి వెన్నతీసిన మజ్జిగ యెటుల సారరహితమగునో, చెఱుకునుండి రసముతీసిన పిప్పి యెట్లు నిరర్థకమగునో అట్లే శరీరమునుండి శుక్లము నష్టమయిన అతని జీవితము నిస్సారమగును

**సార్వభౌమాయమానం హి సర్వేష్వపి వ్రతేష్విదమ్ ।**
**రుగ్ణానామపి సర్వేషాం నాస్తీతో దివ్యమౌషధమ్ ॥**

ఈ బ్రహ్మచర్యవ్రత మనునది సర్వవ్రతములలోను సార్వభౌమపదవి నధిష్ఠించియున్నది అనగా ఈ వ్రతము లేనిదే సర్వ వ్రతములు నిష్ఫలములు రోగగ్రస్తులకును ఔషధము లన్నిటిలోను నిది దివ్యౌషధము ఇది లేనిచో మరియే ఔషధమున్ను సరిగా పనిచేయజాలదు

**బ్రహ్మచర్యవ్రతో భీమ స్సింహోఽపి శునకో భవేత్ ।**
**బ్రహ్మచర్యస్య హీనే తు శ్వా భీమస్సింహవద్భవేత్ ॥**

బ్రహ్మచర్యవ్రతము గలవాడు కుక్కవంటి దీనావస్థలో నుండ్రువాడైనను, సింహమువంటి పరాక్రమము గలవాడగును బ్రహ్మచర్యవ్రతము లేనివాడు మహాసింహ పరాక్రమము గలవాడైనను నీచమగు శునకమువంటి స్థితి గలవాడగును

మఱియు బ్రహ్మచర్య దార్ఢ్యము గలవాని దృష్టిలో మహాసింహముగూడ దీనమగు శునకమువలె కానుపించును బ్రహ్మచర్యవ్రతము లేనివాని దృష్టిలో శునకముగూడ మహా సింహమువలె కానుపించును ఈ చెప్పిన దంతయు సంపూర్ణబ్రహ్మచర్యము గలవారిని గురించినదగును

**సముద్రతరణే యద్వత్ ఉపాయో నౌః ప్రకీర్తితాః ।**
**సంసారతరణే తద్వత్ బ్రహ్మచర్యం ప్రకీర్తితమ్ ॥**

సముద్రమును దాటుటకు నావ యుపకరించునట్లు, సంసార సాగరమును దాటుటకు బ్రహ్మచర్యనావయే యుత్తమసాధనము

**సిద్ధే బిందౌ మహాయత్నాత్కిం న సిద్ధ్యతి భూతలే ।**
**యస్య ప్రసాదాన్మహిమా మమాప్యేతాదృశో భవేత్ ॥**

మహాపరిశ్రమ యొనర్చి బిందుసాధన మొనరించిన యఖండ బ్రహ్మచారికి త్రిభువనములలో నేవస్తువును అసంభవము అసాధ్యముగ నుండదు బ్రహ్మచర్య ప్రతాపముచే మనుజుడు మేరుతుల్యుడుగ, ఈశ్వరతుల్యుడుగ సర్వత్ర వందనీయుడగును గృహస్థబ్రహ్మచర్యమును గురించి ఒక వాక్యముగలదు అదేమనగా 1 దినమునకు రెండు, 2 వారమునకు రెండు, 3 మాసమునకు రెండు, 4 సంవత్సరమునకు రెండు, ఈలాగున ప్రవర్తించువానికి ఔషధముతోగాని వైద్యునితోగాని సంబంధ మవసరములేదు 1 దినమునకు రెండు అనగా, రోజునకు రెండుసార్లు భుజించువాడును, 2 వారమునకు రెండనగా, ఒకవారములో రెండుసార్లు తైలాభ్యంగస్నానము చేయువాడును, 3 నెలకు రెండనగా మాసమునకు రెండుసార్లు మాత్రము ధర్మపత్నితో కూడువాడును 4 సంవత్సరమునకు రెండనగా, వర్షమునకు రెండుసార్లు విరేచనమునకు తీసికొనువాడును సదా ఆరోగ్యవంతుడై యుండును ఇట్టివారికి గలిగెడు సన్తానము గూడ ఆయురారోగ్య జ్ఞానములు గలిగియుండును ముదిరిన విత్తనము సారవంతమయిన భూమిలో పెట్టిన, ఏలాగున బాగుగా పెరిగి చక్కగా ఫలపుష్పములను గలుగజేయునో, బాగుగా ముదురని విత్తనమున్ను సారహీనమయిన భూమియున్ను గలిగియుండిన

వృక్షములు పూర్ణముగా ఫల పుష్పాదులను గలుగజేయునో, ఆలాగున శుక్లము చక్కగా పరిపక్వమగునప్పుడు, ఆలాగున రక్తమున్ను శుద్ధమగునప్పుడు కలిగెడు సంతానములకును, ఆలాగున శుక్లశోణితములు చక్కగా ముదురనివారికి గలిగెడు సన్తతులకును పై జెప్పిన వృక్షముల రీతిగా భేదము గలుగుచుండును

## గృహస్థ బ్రహ్మచర్యము

**ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చ యః ।**
**స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయస్స గృహాశ్రమీ ॥**

ఋతుకాలమందుమాత్రము స్వభార్యయందు చేరు గృహస్థుడు ఎల్లప్పుడును బ్రహ్మచారి యనియే గ్రహించదగినది ఆలాటి నారీమణియు బ్రహ్మచారిణియనియే అనందగును

**కాయేన మనసా వాచా నారీణాం పరివర్జనమ్ ।**
**ఋతౌ భార్యాం వినా స్వస్య బ్రహ్మచర్యం తదుచ్యతే ॥**

మనోవాక్కాయ కర్మలచే పరస్త్రీలతో సంసర్గము లేకుండుటయు, ఋతుకాలములో మాత్రము స్వపత్నితో చేరుటయు గృహస్థ బ్రహ్మచర్య మనబడును పురుషులకు చెప్పులాగున స్త్రీయును త్రికరణములచే పరపురుష చింతనలేక ఋతుకాలములో స్వభర్తతో చేరుటయు బ్రహ్మచర్య మనబడును అట్టి స్త్రీయు నైష్ఠిక బ్రహ్మచారిణులతో సమానురాలగును

**మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।**
**స్వర్గం గచ్ఛత్యపుత్రాఽపి యథా తే బ్రహ్మచారిణః ॥**

ఏ సాధ్వీమణులగు స్త్రీలు భర్త మరణించిన పిమ్మట బ్రహ్మ చర్యవ్రతము ననుష్ఠించుచున్నారో, అట్టివారు సంతానము లేనివారైనను, మరణానంతరము స్వర్గలోకమును పొందుచున్నారు అంతియేగాదు, బ్రహ్మచర్యవ్రతము సల్పెడు నైష్ఠికబ్రహ్మచారులు ఏ బ్రహ్మలోకమును పొందెదరో, అట్టి బ్రహ్మలోకమును నీ నారీమణులుగూడ పొందెదరు మోక్షముమాత్రము సంతానము గలవారైనను

భగవద్భక్తిచేత, ఆత్మజ్ఞానముచేత మాత్రమే గలుగును శాస్త్రములలో సప్తవిధ సంతానములు నిర్ణయింపబడినవి కావున సంతానములేదని తపించెడు స్త్రీ పురుషులు ఈ సప్తసంతానములలో ఒకటిగాని, రెండుగాని, మూడుగాని లేక పూర్తిగాగాని చేసినచో అన్ని సత్సంతానము గలవారే యగుదురు కావున భయపడనక్కరలేదు

**తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థావ్యం సురాలయమ్ ।**
**ఆరామకృతి సత్రాణి సప్తసంతాన సంజ్ఞకాః ॥**

1 చెరువు త్రవ్వించుట, 2 ధర్మార్థముగా శాశ్వత ధననిధిని ఏర్పరచుట, 3 బ్రహ్మనిష్ఠులకు మఠముగాని, ఆశ్రమముగాని నిర్మించుట 4 దేవాలయము కట్టుట, 5 ధర్మార్థముగా తోటవేయుట, 6 ఉత్తమ గ్రంధముల అచ్చువేయుట, 7 అన్నసత్రము నిర్మించుట, ఈ ఏడున్ను సప్తసంతానము లనంబడును

## ఋతుకాల నిర్ణయము

గృహస్థ బ్రహ్మచర్యము శీలించవలసినవాడైనను, భార్యతో సహ ఏక శయ్యాశయమునగాని, ఒకే గదిలో ఉభయులును పరుండుటగాని కూడదు ఏలననగా,

**అగ్ని కుండసమానారీ ఘృతకుమ్భసమః పుమాన్ ।**
**సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥**

అగ్ని కుండవంటిది స్త్రీయనియు, నేతికుండవంటివాడు పురుషుడనియు, నిప్పుకుండ పై పెట్టిన నేతిదుత్త ఎటుల కరుగకయుండదో, ఆలాగున స్త్రీ పురుషుల సంబంధమని శ్రీ దత్తాత్రేయులు వచించిరి అందువల్ల దూరదూరముగానే యుండవలయును ఎంతవరకు పురుషులు తమ యింద్రియ నిగ్రహమును చేసికొనుటకు సాధ్యము కాకపోవునో, అప్పుడు మాత్రమే తన ధర్మపత్నితో చేరవలయును కావుననే ఋతుకాలనిర్ణయ మేర్పడినది తైలము నశించిన దీప మేలాగున ఆరిపోవునో, ఆలాగునను క్రూడాయిల్, పెట్రోల్ మొదలగు నూనె నశించిన యంత్ర మేలాగున ఆగిపోవునో, ఆలాగున శారీరక మానసికములగు నీ

శరీరయంత్రమునకు శుక్లము తైలమువంటిది దానిని ఎంతో యత్నముతో గృహస్థుడైనను సంరక్షించుకొనవలయును జలములేని పైరు మొదలగు సస్యము లేలాగున చక్కగా పెరిగి పూర్ణములగు ఫల పుష్పాదుల నివ్వజాలవో, బ్రహ్మచర్య నియమములేని మానవుల స్థితియు నాలాగున నుండును గర్భోపనిషత్తున చెప్పిన దానిని చూడుడు

**షడ్విధో రసో, రసాచ్ఛోణితం, శోణితాన్మాంసం,**
**మాంసాన్మేదో, మేదసోఽస్థీన్యస్థిభ్యో మజ్జా, మజ్జాయాః శుక్లః ॥**

రసములు ఆరు కటు, అమ్ల, లవణ, కషాయ, తిక్త, మధురములు మానవుడు భుజించెడి అన్నాదులలో పై జెప్పిన ఆరు విధములగు రసములు కలవు వాని నుండి రక్తమున్ను, రక్తమునుండి మాంసమున్ను, మాంసమునుండి మేదస్సున్ను, మేదస్సునుండి అస్థులున్ను, అస్థులనుండి మజ్జయు, మజ్జనుండి శుక్లమున్ను కలుగుచున్నవి వీనికి సప్తధాతువులని పేర్లు 1 రసము 2 రక్తము, 3 మాంసము, 4 మేదస్సు, 5 అస్థి, 6 మజ్జ, 7 శుక్లము భుజించెడు ఆహారము ఈలాగున సప్తధాతువులై మారును దీనిని గ్రహించిన శుక్లముయొక్క ప్రభావమును తెలిసికొనవచ్చును తైలయన్త్రముయొక్క లోపలగల బాయిలర్ నుండి ఏర్పడిన స్టీము ఏలాగున యన్త్రమును నడుపుచుండునో, శరీరమను యన్త్రమున నెముకలమధ్యనుండు మజ్జ అనగా మూలుగవంటి ఒక పదార్థము ప్రతి జీవి యెముకల మధ్య నుండును దానినుండియే శుక్లము అనగా వీర్య మేర్పడును అదియే మానవులయొక్క స్థూల సూక్ష్మ శరీరయంత్రమును నడుపుచుండును కావుననే వీర్యము నష్టమయినవాడు నిర్వీర్యుడై పోవుచున్నాడు అందువల్లనే పతంజలిమహర్షియు యోగసూత్రమునందు "బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః " అని వచించెను తొంబై రక్తబిందువుల వల్లనే ఒక బొట్టు శుక్లమేర్పడునని ప్రాక్ పాశ్చాత్య వైద్యకోవిదులు నిర్ణయించి చెప్పుచున్నారు ఈ దినము భుజించిన అన్నము రసమై సప్తధాతువులై మారుటకు ఇరువదియేడు రోజులు పట్టునని ఆయుర్వేదకోవిదులలో కొందరి అభిప్రాయము అందువల్లనే 27 నక్షత్రములు ఏర్పడినవి మరికొందరు కొన్నిరోజులు తక్కువగాను చెప్పిరి

**బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభో భవత్యపి ।**
**సురత్వం మానవో యాతి చాన్తే యాతి పరాం గతిమ్ ॥**

బ్రహ్మచర్యవ్రతము పాలించిన వీర్యలాభము గలిగి మానవునకు దేవత్వము ప్రాప్తమై సాధనచతుష్టయ సమ్పత్తి పూర్ణతనొంది పరమగతి (మోక్షము) లభ్యపడును బ్రహ్మచర్యముగలవాడు మానవుడైనను దేవుడే యని భావము

**స్వదారే విధివత్కృత్వా నివృత్తి శ్చాన్యతస్సదా ।**
**మనసా కర్మణా వాచా బ్రహ్మచర్యమితి స్మృతమ్ ॥**

ఋతుకాలవిధి ననుసరించి స్వధర్మచారిణియగు భార్యతో చేరుటయు, సర్వకాలములలోను నితరస్త్రీలతో సదా మనస్సుచేతను, వాక్కుచేతను, కర్మచేతను విషయనివృత్తి గలిగియుండు టేదియో యదియే గృహస్థ బ్రహ్మచర్యమగును

**పరాదార పరిత్యాగా త్స్వదార పరితుష్టితః ।**
**ఋతుకాలాభిగామిత్వా ద్బ్రహ్మచారీ గృహీరితః ॥**

పరస్త్రీల పరిత్యజించి స్వభార్యయందుమాత్రము సంతుష్టిగలవాడును, ఋతుకాలమందు మాత్రము స్వభార్యయందు ప్రవర్తించువాడెవడో, అట్టివాడు గృహస్థాశ్రమి యయినను బ్రహ్మచారి యనంబడును ఆలాగుననుండు పుణ్యవతియగు నారీమణియు బ్రహ్మచారిణియే యగును

**ఋతావృతౌ స్వదారేషు సంగతిర్యా విధానతః ।**
**బ్రహ్మచర్యం తదేవోక్తం గృహస్థాశ్రమవాసినామ్ ॥**

శాస్త్రమున విధింపబడిన రీతిని ఋతుకాలమున తన ధర్మపత్నితో కేవల సంతానార్థమై సమ్పర్కముచేయు పురుషుడు గృహస్థాశ్రమమున నుండినను, అతడు బ్రహ్మచారియే యనంబడును అట్టి నారీమణియు బ్రహ్మచారిణియే

**ఋతుస్స్వాభావికస్త్రీణాం రాత్రయష్షోడశ స్మృతాః ।**
**చతుర్భిరితరైస్సార్ధమహోభిస్సద్విగర్హితైః ॥**

స్త్రీ లకు స్వాభావికముగా ఋతుమతియయిన తరువాత 16 దినముల

వరకు ఋతుకాల మనంబడును అందు మొదటి నాలుగు దినములు సజ్జన నిందితములు, వర్జనీయములు

**తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా ।**
**త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః ॥**

ఋతుకాలపు 16 దినములలో మొదటి నాలుగు దినములును, పదునొకండవ, పదుమూడవ రాత్రియు నిందితములు తక్కిన పదిరాత్రులు ప్రశస్తములు ఈ విధిని అనుసరింపక ప్రవర్తించుటవల్లనే కురూపులు రోగగ్రస్తులు, అల్పాయుస్సుగలవారు, చోరులు,కపటులు, మూకులు, బధిరులు మొదలగు నికృష్టసంతానము లేర్పడుచున్నారు

**ఆత్యన్తికం బ్రహ్మచర్యమాశ్రమత్రయవాసినామ్ ।**
**స్వదార నియమాత్సమ్యక్ బ్రహ్మచారీ గృహాశ్రమీ ॥**

బ్రహ్మచారి వానప్రస్థ సన్న్యాసులను ముగ్గురికిని పూర్ణబ్రహ్మచర్య ముండవలయును స్వపత్నియందు ఋతుకాలము ననుసరించి ప్రవేశించెడు గృహస్థుడుగూడ బ్రహ్మచారియే అట్టి స్త్రీయు బ్రహ్మచారిణియే అని మనుమహర్షి వచించెను గృహస్థ బ్రహ్మచర్యము ననుసరించువారికి గలిగెడు సంతానము లెట్టివో క్రింద నిరూపింపబడుచున్నవి

**ఆయుస్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్యశః ।**
**పుణ్యం చ మత్ప్రియత్వం చ లభ్యతే బ్రహ్మచర్యయా ॥**

బ్రహ్మచర్యమహిమచే పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, బలము, వీర్యము, అపార ప్రజ్ఞ, ధనసంపత్తి, మహత్తైన యశస్సు, గొప్పపుణ్యము, భగవత్ప్రీతి ఇదంతయును సులభముగాను, సుఖముగాను చేకూరును ఇట్టి వారికి గలిగెడు సంతానములకు ఇట్టి లక్షణములుండును

**ఏవం సంరక్షయేద్బిన్దుం మృత్యుం జయతి యోగవిత్ ।**
**మరణం బిందుపాతేన జీవనం బిందుధారణాత్ ॥**

యోగి యయినవాడు బిందువును సంరక్షించి జనన మరణములను దాటుచున్నాడు జీవులకు శుక్లముయొక్క పతనముచేత అకాల మరణమున్ను, బిందుధారణచేత పూర్ణాయుస్సు కలుగుచున్నది

**సర్వేషామపి చైతేషాం వేదస్మృతివిధానతః ।**
**గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠః స త్రీనేతాన్ బిభర్తి హి ॥**

ఈ నాలు గాశ్రమములవారిలో శ్రుతిస్మృతులందు చెప్పబడిన రీతిగను గృహస్థుడే ఉత్తము డనబడును అతడేగదా తక్కిన మూడాశ్రమములవారిని పోషించుచున్నాడు కావున ఇతడే శ్రేష్ఠుడు అని మనువు చెప్పెను గృహస్థధర్మ పరిపాలనచే గలిగెడు గొప్పతనమును గురించి ఇచట నిరూపింపబడినది బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్న్యాసులు ముగ్గురున్ను నిరాధారులు వీరిని విద్యాసహాయముచేత అన్న వస్త్ర పుస్తకాదులచే పోషించెడు భారము గృహస్థునిపై ఏర్పడియున్నది అట్లు చేయని గృహస్థుడు పతితుడగును మఱియొక రహస్యముగూడ గలదు భావికాలమున బాహ్యలోకమునుగాని, అంతరాత్మలోకమునుగాని, ఉద్ధరించుటకు ఉత్తమసంతానము కావలసియుండును అది గృహస్థునిచేమాత్రము సాధ్యమగునుగాని బ్రహ్మచారిచేగాని, వానప్రస్థునిచేగాని, సన్న్యాసిచేగాని సాధ్యము కాదుగదా కావున లోకోద్ధారకులై ప్రజ్ఞావంతులై యుండు సంతానము గృహస్థాశ్రమమునుండియే పుట్టవలసియుండును గృహస్థా శ్రమములు అధికమగుటకు కారణమిదే ఎంత విద్యావంతుడయిన బ్రహ్మచారిగాని, తపస్సమ్పన్నుడైన వానప్రస్థుడుగాని, మహాప్రజ్ఞావంతుడయిన సన్న్యాసిగాని యీ కార్యము చేయజాలడుగదా! పుట్టినతరువాత గల బిడ్డలను విద్యచేతగాని, తపస్సుచేతగాని, జ్ఞానముచేతగాని బ్రహ్మచారియు, వనస్థుడు, సన్న్యాసియు బాగుచేయగలరుగాని సంస్కారము శుద్ధముగానిచో బ్రహ్మచారి, వానప్రస్థ, సన్న్యాసులేమి చేయగలరు కావున ఆత్మ సంస్కార శుద్ధి మాతాపితరులనుండి రావలసియుండును అందువల్లనే గృహస్థ బ్రహ్మచర్యమును ఇంత ప్రభావముగా మహర్షులచే వర్ణించడమైనది

ప్రశ్న॥ ధర్మమునకు విరుద్ధము కాని యింద్రియసౌఖ్యములను గృహస్థు

డనుభవింప వచ్చుననియు, దానివలన మోక్షమునకు ఆటంకము కలుగదనియు, అంతియేగాక అది విష్ణుస్వరూపమనియు భగవానుడు సప్తమాధ్యాయమున చెప్పియుండలేదా? అందువల్ల గృహస్థునకు బ్రహ్మచర్యమందు ఇంతనియమమేల? అని "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ"

ఉ॥ ఈ శ్లోకముయొక్క పదప్రయోగమును తెలియనివారే పై విధముగా పలుకుదురు ఏలననగా "ధర్మావిరుద్ధో" ఈ పదమును విభాగమును చేయునప్పుడు "ధర్మ అవిరుద్ధః" అని ఏర్పడుచున్నది అప్పుడు ధర్మమునకు విరుద్ధముగాని ఇంద్రియసుఖమును గ్రహించవలయును అటులయిన ఋతుకాల ధర్మమునకు విరోధముగాని విషయసుఖము ననుభవించుటలో గృహస్థునకు దోషము లేదనియే పై వాక్యమున కర్థమగును ఋతుకాలము నతిక్రమించి ప్రవర్తించుట ధర్మమునకు విరుద్ధమగును ఈబ్రహ్మచర్యవ్రతము ధ్యానయోగపరుడగు గృహస్థునకుగూడ ఉండవలయుననియే గీత ఆరవ అధ్యాయమున భగవాను డుపదేశించెను

**ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥**

ప్రశాన్తమయిన హృదయముగలవాడును, భయరహితుడును, బ్రహ్మచర్యవ్రత మందుండువాడును, మనస్సును విషయములమీదికి పోనీయక, నాయందే (భగవంతునియందే) చిత్తముగలవాడును, నేనే పరమగతి యని నమ్మకముగలిగి యుండువాడు ప్రయాసములేక మోక్షము నొందగలుగును దీనియందు "బ్రహ్మచారివ్రతే స్థితః" అని ప్రయోగించుటవల్ల గృహస్థుడయినచో గృహస్థ బ్రహ్మచర్యమున్ను, ఇతరాశ్రమస్థులు సంపూర్ణ బ్రహ్మచర్యమును గలిగి యుండవలయును

**నివృత్తి మార్గే దాంపత్యం సానుకూలం భవేద్యది ।**
**పూర్వస్మిన్ పుణ్యపుంజేన నాస్తి చేత్ప్రవ్రజేత్పుమాన్ ॥**

గృహస్థాశ్రమములోనుండి బ్రహ్మచర్యవ్రతము పాలించి మోక్షము పొందవలసి యుండిన భార్యాభర్త లిరువురు ఒకే మనస్సుగల వారై

యుండవలయును అట్లుభయు లేర్పడవలసియుండిన పూర్వజన్మములో ఉభయులున్ను మహత్తరమయిన పుణ్యకర్మ చేసియుండవలయును ఇంతియేగాదు పూర్వజన్మములోగూడ ఒక్కగురుపుత్రులై యుండినగాని, ఒకే దేవోపాసన గలవారై గాని యుండవలయును అంతేగాక జన్మసాఫల్యము గలుగజేసికొనుటకు ఉభయులజన్మకు కారణమని యెఱుకగలిగి యుండవలయును అట్లు సానుకూలత లేని విషయములో సన్న్యసించుట తప్ప వేరు గతిలేదు

**యథా సౌధాదినిర్మాణం గగనే వితథం భవేత్ ।**
**తథా యోగాదికం త్యక్త్వా జ్ఞానసిద్ధిం సువిన్దత ॥**

బ్రహ్మచర్యము మొదలగు చతుష్టయసమ్పత్తి గల ధ్యాన యోగాదులు లేనివానికి జ్ఞానవిచారణమాత్రము గలిగియుండిన అది ఆకాశమున మేడకట్టే లాగున చేసెడు ప్రయత్నము వంటిదగును నాలుగంతస్తులతో నొక హర్మ్యమును నిర్మింపదలంచువాడు మూడంతస్తులను కట్టిన తరువాత నాల్గవది నిర్మించిన నిలుచును. ఆలాగున సాధన చతుష్టయసమ్పత్తి గలిగి నిష్కామకర్మయోగ, ఉపాసనాయోగ, ధ్యానయోగములందు దృఢము కలిగిన పిమ్మట జ్ఞానయోగమగు మహావాక్యవివరణ సుస్థిరముగా నిలువగలుగును అని ముముక్షువులు, జిజ్ఞాసువులు, సాధకులు గ్రహించుకొనవలయును

ప్రశ్న॥ బ్రహ్మచర్యవిషయమై ఒక పరమ రహస్యము గలదు ఇదెవ్వరును బైటచెప్పుటకు సందేహపడెదరు అంతియేకాదు సిగ్గుగలిగి యుందురు అయితే రోగియందుగల లోపము వైద్యునితో చెప్పకపోయిన ఎట్లు అపాయకరమో దీనిస్థితియు ఆలాటిదే యగును గృహస్థబ్రహ్మచర్య మనుష్ఠించువారికికూడ నిక చెప్పబోయెడి దోషము గలుగుచుండగా తక్కిన బ్రహ్మచారి, వానప్రస్థ సన్న్యాసులకుగూడ నీ దోషము గలదనియే తలంచెదను అదేమనగా పవిత్రాత్ములై యుండియు, విజ్ఞానవంతులై యుండియు, రాత్రిలో దుస్స్వప్నముగలిగి బ్రహ్మచర్యమునకు భంగము గలుగును దీనివల్ల పాపము గలుగునా? బ్రహ్మచర్యవ్రతమునకు నష్టము గలుగునా? అని గొప్ప సంకల్పము బాధించుచున్నది దీని కేదైనా ఉపాయము గలదా?

